# మధురభక్తి - ముగ్ధభక్తి

## (ఆంధ్ర మహాభాగవతము - బసవ పురాణము)

రచయిత్రి

**డా॥ సురవరం పుష్పలత**

ప్రిన్సిపాల్ & కార్యదర్శి
గీతాంజలి పబ్లిక్ స్కూల్
నారాయణ్ గూడా, హైదరాబాద్



ఆంధ్ర సారస్వత పరిషత్తు

తిలక్ రోడ్, హైదరాబాద్ - 500 001.

**MADHURA BHAKTI : MUGDHA BHAKTI**
(Andhra Maha Bhagavatham & Basava Puranam)
By Dr. Suravaram Pushpalatha



ప్రథమ ముద్రణ : 1993

ప్రతులు : 500

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక
సహాయంతో ముద్రింపబడింది.

వెల : రూ. 80-00



ప్రతులకు :
ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్ రోడ్డు,
హైదరాబాదు - 500 001.

ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్,
1.1.517/బి/1, న్యూ బాకారం
గాంధీనగర్, హైదరాబాదు - 500 380
ఫోన్లు : 611413, 600547.

# అభినందన

డా॥ ఎస్. పుష్పలతగారు రచించిన ఈ గ్రంథం ఆంధ్ర సారస్వత పరిషత్తు పక్షాన ప్రకటించడానికి చాలా సంతోషిస్తున్నాము. శ్రీమతి పుష్పలతగారు మూడు, నాలుగు భాషలలో మంచి పాండిత్యం గలిగిన విదుషీమణి. తెలుగు సాహిత్యంలో ఇంతవరకు ఇటువంటి గ్రంథం వెలువడలేదు. ఈ గ్రంథాన్ని వారు పిహెచ్.డి. పట్టము కోసం చేసిన పరిశోధన. డా॥ పుష్పలతగారు ఆంధ్ర సారస్వత పరిషత్తుతో సన్నిహిత సంబంధం కలిగిన విద్వాంసురాలు. ఈ గ్రంథంలో ఆమె ఉత్తమశ్రేణికి చెందిన పరిశోధన గావించినారు.

తెలుగులో భక్తి రసప్రధానమైన గ్రంథాలలో ఆంధ్ర మహా భాగవతము, బసవపురాణము ముఖ్యమైనవి. ఈ రెండు గ్రంథాలను ఆమె కూలంకషంగా పరిశీలించినారు, భక్తి స్వరూప స్వభావాలను, విశేషించి మధుర భక్తి తెలుగులో ఏ విధముగా పోషింపబడినదో ఆమె చక్కగా విశదీకరించినారు. ఇట్టి ప్రామాణిక గ్రంథాన్ని ఆంధ్ర సారస్వత పరిషత్తు పక్షాన ప్రకటించడం పరిషత్తు నిర్వాహకులకు చాలా ఆనందం కలిగిస్తున్నది. శ్రీమతి పుష్పలతగారికి నా హృదయపూర్వక అభినందనలు, శుభాకాంక్షలు. ఆమె సురవరం కుటుంబంలో జన్మించి, తెలుగు భాష కొరకు జీవితాన్ని పూర్తిగా అంకితం చేసినారు, ఈ గ్రంథం చదివినవారికి ఆ సత్యం స్పష్టం కాగలదు.

సురవరం కుటుంబం లక్ష్మీ సరస్వతులకు నిలయం. ఇది సకలాంధ్ర దేశానికి చక్కగా తెలిసిన సత్యం. ఆమెకు ఆ వారసత్వం పూర్తిగా సంక్రమించినది. సారస్వత పరిషత్తు పక్షాన, నా పక్షాన ఆమెకు నా హృదయపూర్వకమైన శుభాకాంక్షలు. పరమేశ్వరుడు ఆమెకు, ఆమె కుటుంబానికి ఆయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించవలెనని నా ప్రార్థన.

**డా॥ దేవులపల్లి రామానుజరావు**

అధ్యక్షులు

తేది : 8-3-1993 ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు.

జ్ఞానపీఠ అవార్డు గ్రహీత
**పద్మభూషణ్ డా॥ సి. నారాయణరెడ్డి**
రాష్ట్ర ప్రభుత్వ సాంస్కృతిక, భాషా వ్యవహారాల
సలహాదారు

కళాభవన్
25-3-93

# ఆశీరభినందన

నవవిధ భక్తుల్లో హృదయావర్జకమైనవి మధుర భక్తి, ముగ్ధ భక్తి. భక్తి - భావమా రసమా అనే చర్చనటుంచితే రసస్పర్శ అధికంగా వున్న భక్తి శాఖలు ఈ రెండు. డా॥ పుష్పలత ఆంధ్ర భాగవతంలోని మధుర భక్తినీ, బసవ పురాణంలోని ముగ్ధ భక్తినీ పరిశోధనాంశాలుగా తీసుకుని ఈ సిద్ధాంత గ్రంథాన్ని రచించింది. భక్తికి పారవశ్యం మూల ధాతువు - శివుడైనా, కేశవుడైనా. శివుని పేరెత్తితే పాలకురికి సోమనాథునికీ, శ్రీకృష్ణనామం స్ఫురిస్తే బమ్మెర పోతన్నకు అక్షరాలా అనిర్వచనీయ తాదాత్మ్యమే.

డా॥ పుష్పలత ఈ గ్రంథంలో భక్తి అంటే ఏమిటో ప్రాచీన లాక్షణికుల సులోచనాలతో దర్శించి చాలా వివరంగా చర్చించింది, భక్తి భేదాలను గురించిన వివిధ పార్శ్వాలను స్పృశించి విలువైన సమాచారాన్ని సేకరించి ఈ గ్రంథ రూపంలో అందించింది. అటు ఆంధ్ర భాగవతంలోనూ, ఇటు బసవ పురాణంలోనూ తాను ప్రతిపాదించిన ఆ ఉభయ భక్తి పథాలను గురించి సోదాహరణంగా వ్యాఖ్యానించించి చూపింది. ప్రతి అంశానికి పూర్వ లాక్షణిక నేపథ్యాన్ని ప్రస్తావించడం ప్రశంసనీయ విషయం. తీసుకున్న వస్తువు ప్రాచీనమైనా ఆధునిక పాఠకులు కూడా సుఖంగా చదువుకునేటట్టు ఈ పరిశోధన కృతిని రూపొందించిన డా॥ సురవరం పుష్పలతకు నా ఆశీరభినందన.

(సం) సి. నారాయణరెడ్డి

# ఆశయము

ఇది ప్రధానముగా పోతన భాగవతములోని మధుర భక్తిని, ఔప చారికముగా పాలకుఱికి సోమనాథుని బసవ పురాణములోని ముగ్ధభక్తిని రస పరముగా అనుశీలించిన పరిశోధన గ్రంథము.

భక్తి రసము కాదని ఆలంకారిక సిద్ధాంతములున్నట్లే, రసమగునని ఆలం కారిక సిద్ధాంతములును కలవు. కాదన్న సిద్ధాంతములకు గల ప్రసిద్ధి, అగునన్న సిద్ధాంతములకు అంతగా లేదు. కారణము భక్తిరసమని ప్రతిపాదించిన అలంకార శాస్త్రములు అర్వాచీన గ్రంథములగుట కావచ్చును.

పదునారవ శతాబ్ది రూపగోస్వామి భక్తి రసామృత సింధువు, ఉజ్జ్వల నీలమణి; పదునేడవ శతాబ్ది మధుసూదన సరస్వతి భక్తి రసాయనము భక్తిరస సిద్ధాంతమును స్థాపించిన అలంకారశాస్త్ర గ్రంథములు. అవి ఈ పరిశోధన గ్రంథమునకు ప్రాతిపదికలు. వాని స్వరూప స్వభావము లిందు సంగ్రహముగ నైనను సమగ్రముగా కలవు. గ్రంథములోని సారాంశములకు, అనుబంధము లందు మూల శ్లోకములు ముదలింపబడినవి. అవి జిజ్ఞాసువులకు అత్యంతోప యోగకారులు.

ఇందలి 1. భక్తి స్వరూప స్వభావములు 2. భక్తి రసము 3. మధుర ముగ్ధభక్తులు - అనుశీలన విధానము అను మూడు అధ్యాయములు లక్షణ నైపథ్యము. 4. మధురభక్తి - భాగవతము 5. ముగ్ధభక్తి - బసవ పురాణము లక్ష్య రంగము. లక్ష్య లక్షణ సమన్వయము సమర్థముగా, శాస్త్రీయముగా సాగినది.

"మలి పలుకులు" మలచినట్లు "తెలుగు సాహిత్య విమర్శలో భక్తిరస నిరూపణము చేయుటకు లేదా పురాణములోగాని కావ్యములోగాని భక్తిరస వివేచనము చేయుటకు పూనుకొనిన గ్రంథములే తక్కువ. అందును మధుర,

ముగ్ధభక్తుల స్వరూప స్వభావములను వివేచించి, లాక్షణికముగా వాని ప్రతిపత్తిని నిరూపించి, శాస్త్రీయముగా వానిని విశ్లేషించి, ప్రసిద్ధభక్తి ప్రస్థానములను ప్రపంచించిన భాగవత బసవ పురాణముల కన్వయించి, పరిశీలించెడి కృషి విస్తృతముగా సాగలేదు " ఆ కొదవ కప్పుటకీ పరిశోధన గ్రంథము మేలుబంతి. అంతేకాదు కావ్య నాటకాద్యనేక సాహిత్య ప్రక్రియలలోని భక్తిరసాను శీలనమున కీ పరిశోధన గ్రంథము పథ ప్రదర్శకము కాగలదని ఆశయము.

—ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి

ఫ్లాట్ నెం. 2, షణ్ముఖ అపార్ట్‌మెంట్స్,
7-1-71 చిన వాల్తేరు,
విశాఖపట్టణము - 530 023.

# భక్తిరసాలోకనం

అప్పుడే రెండు దశాబ్దాలు దాటిపోయాయి, శ్రీమతి పుష్పలతగారు హైదరాబాదు సాయంకళాశాలలో విద్యార్థినిగా నాకు మొదటి పరిచయం అయి. ప్రైవేటుగా ఎం.ఏ., చదువుతున్న ఆ రోజుల్లోనే భవిష్యత్తులో పరిశోధన చేయ గలిగిన ఆసక్తిని, శక్తిని ప్రదర్శించింది ఆమె. శ్రీమతి పుష్పలతగారి భర్త శ్రీ శేఖర్‌రెడ్డిగారూ నేనూ కలిసి ఒకటి రెండు స్వచ్ఛంద సేవాసంస్థలలో పని చేయటంవలన సన్నిహితులమయ్యాం. క్రమంగా వారి కుటుంబం మా కుటుంబం స్నేహప్రవృత్తితో కలిసిపోయాం. ఆత్మీయతను, సభ్యతను, సంస్కారాన్ని మనసారా పండించుకొన్న శ్రీమతి పుష్పలతగారు నాయందు గౌరవ భావాన్ని ఎప్పుడూ భద్రంగా పోషించుకొంటూ వస్తోంది. ఆ దంపతులు సాహిత్య విషయాల్లో నన్ను సంప్రదించకుండా ఏ నిర్ణయాలూ తీసుకోరు. వారి పిల్లలూ అంతే. వారింటికి పోతే అందరినోటా ఒకే సంబోధన— 'మాస్టారూ' అని వినపడు తుంది. దానితో నాకు గురు పీఠ మెక్కినంత సంతోషం కలుగుతుంది. నా శిష్యులు చాలామంది ఇళ్లల్లో, గుండెల్లో ఇటువంటి ఆప్యాయతతో కూడుకొన్న ఆచార్య పీఠం నాకోసం భద్రంగా ఉంది. నేను చేసుకొన్న పుణ్యం అది.

శ్రీమతి పుష్పలతగారు పరిశోధన సమస్యను ఎన్నుకోవలసి వచ్చినప్పుడు కూడా నన్ను సంప్రదించారు. పరిశోధన చేసేవారి ప్రవృత్తికి, చిత్తవృత్తికి, ఆసక్తికి అనుకూలంగా ఉండే అంశాన్ని ఎంపిక చేయటానికి సదా నేను ప్రయత్నం చేస్తాను. శ్రీమతి పుష్పలతగారికి భాగవతమన్నా, అందులోనూ దశమస్కంధమన్నా, శ్రీకృష్ణతత్త్వమన్నా ఆసక్తి మెండు. శ్రీ సత్యసాయి సేవా సంస్థలవారి మానవత్వపు విలువల విద్యా విధానంలో అభిలాష అధికం. మానవీయ సంబంధాలన్నా, ఆధ్యాత్మిక చింతనమన్నా ఆసక్తిని ప్రకటించే పుష్పలతగారికి మధురభక్తి, ముగ్ధభక్తి అనే అంశాలు వెంటనే ఆకర్షించాయి. భాగవత బసవపురాణాలలో వాటిని మథించి వెలువరించే ఉత్సాహం సహజంగా ఆమెలో కెరటంలా ఉవ్వెత్తున లేచింది. సమస్య సూచించిన నాటినుండి సూదంటు రాయి లాగా ఆ పరిశోధనలో నిమగ్నురాలై పోయింది.

చేపట్టిన అంశం మీద పైకి కనపడకుండా సర్వసన్నద్ధం కావటం శ్రీమతి పుష్పలతగారి సహజ స్వభావం. గ్రంథ సేకరణం, పఠనం, సామగ్రి విశ్లేషణం ఒకటి తరువాత ఒకటి క్రమంగా సాగిపోయాయి. రూపగోస్వామి గ్రంథాలు, మధుసూదన సరస్వతి రచనలు, బసవపురాణంపైని విమర్శలు, వీరశైవ మత విశేషాలు చెప్పే గ్రంథాలు ఊపిరాడకుండా సమకూర్చుకొన్నా రామె.

ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారు ఆమెకు పరిశోధనలో పర్య వేక్షకులుగా లభించటం ఆమె అదృష్టం. పాండిత్యానికీ, పరిశోధన దీక్షకూ, సత్యాన్వేషణకూ, వాద కుశలతకూ, నిర్దుష్టతకూ, క్రమశిక్షణకూ శ్రీరామ మూర్తిగారు పెట్టింది పేరు. అటువంటి లక్షణాలే సురవరం వారి కుటుంబానికి చెందిన ఆడబడుచు అయిన పుష్పలతగారు పుట్టింటి సిరిగా పొంది ఉండటంచేత వారివద్ద పరిశోధనను చేసి వారి ఆశీస్సులను పొందగలిగారు. ఉత్తమ పర్య వేక్షకుని మార్గదర్శకత్వంలో సాగిన పరిశోధనం ఈ గ్రంథం.

ఆంధ్ర సారస్వత పరిషత్తు వారు ఈ సిద్ధాంత వ్యాసాన్ని ప్రచురించటం సంతోషింపదగిన విషయం. ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారి డాక్టరేట్ పట్టం పొందిన గ్రంథాన్ని ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రచురించటంలో ఔచిత్యం కూడా ఉంది. ఈ శుభ సంవిధానానికి డాక్టర్ పుష్పలతగారిని మనసారా అభినందిస్తున్నాను.

నేను ఈ సిద్ధాంత వ్యాసాన్ని ఆమూలాగ్రం చదివాను. శ్రీమతి పుష్పలతగారి కృషికి ఎంతో సంతోషించాను. ఎందువల్లనంటే - నాకు గూడా తెలుగులోని మధుర భక్తిని గురించీ - ముగ్ధభక్తిని గురించీ - ఆ మాటకు వస్తే భక్తిరస కావ్యాలను రచించిన కవులను గురించీ, వారి సిద్ధాంతాలను గురించీ కొన్ని స్వతంత్రమైన అభిప్రాయాలున్నాయి. కడచిన మూడు దశాబ్దాలుగా నా శిష్యులతో, మిత్రులతో నా భావాలను పంచుకుంటూనే ఉన్నాను. నా దగ్గర చదువుకొన్న విద్యార్థులు కొందరు నేను మథన పడుతున్న కొన్ని అంశాలపై గ్రంథాలనూ, వ్యాసాలనూ రచించి వెలువరిస్తున్నప్పుడు రైతు తాను స్వయంగా నాటిన విత్తులు మొలకెత్తినప్పుడు పొందే ఆనందం వంటి ఆనందాన్ని పొందుతూ ఉంటాను. శ్రీమతి పుష్పలతగారి సిద్ధాంత వ్యాసం చదివినప్పుడు కూడా అటు వంటి అనుభూతే పొందాను. మొత్తంమీద ఇది భక్తిరసాలోకనం.

స్పష్టతకూ, విశ్లేషణానికీ, సమన్వయానికీ క్రమంగా ప్రాధాన్యం కల్పిస్తూ డాక్టర్ పుష్పలతగారు వేసుకొన్న రచనా ప్రణాళిక మునుముందుగా, నాకేకాదు-అందరికీ నచ్చుతుంది. మధురభక్తిని గురించి వివరించే లక్షణగ్రంథాలు - రూప గోస్వామివి భక్తిరసామృత సింధువు, ఉజ్జ్వల నీలమణి; మధుసూదన సరస్వతిది భక్తి రసాయనం గురించి వివరంగా ఈ సిద్ధాంత వ్యాసం పరిచయం చేస్తున్నది. 16, 17 శతాబ్దులకు చెందిన ఆ లక్షణ గ్రంథాలు కొన్ని వందల యేళ్ళుగా తమిళభక్తి సాహిత్యం నుండి ప్రారంభమై బెంగాల్ భక్తి ఉద్యమం దాకా వికాసం చెందిన భక్తిరస సిద్ధాంత పరిజ్ఞానానికి అద్దం పట్టుతున్నాయి. ఆ భూమికతో 12, 15వ శతాబ్దాలకు చెందిన బసవపురాణ, ఆంధ్ర మహా భాగవతాలకు ఆ లక్షణ గ్రంథ సూత్రాలను వర్తింపజేయటంలో ఉన్న ఔచిత్యాన్ని డాక్టర్ పుష్పలతగారు సమర్థించుకున్నారు. లక్ష్యలక్షణ సమన్వయాన్ని సమర్థనీయంగా సాగించారు.

మధుర భక్తికీ, ముగ్ధ భక్తికీ ఉన్న భేద సాదృశ్యాలను వివేచించిన భాగం విమర్శనాత్మకంగా ఉంది. భావి పరిశోధకులకు ఎన్నో వెలుగులను ప్రసరిస్తున్నది. బసవపురాణంలో భక్తిరస విశేషాలను వివరించిన తీరు క్రొత్తగా, ఆసక్తిదాయకంగా అమరింది. పోతన భాగవతంలోని దశమ స్కంధంలో మధురభక్తి రసావిష్కారాన్ని అనుశీలించిన పద్ధతి ఇంతకు పూర్వం సామాన్యంగా తెలుగు విమర్శలో చవిచూడనిది. ఇన్ని క్రొత్త వెలుగులను వెదజల్లే అన్వయాలను అందించిన పరిశోధన ఎన్నో రస సమస్యలకు సముచితమైన సమాధానాల నిచ్చింది. అందుకు ఈ గ్రంథ రచయిత్రి డాక్టర్ పుష్పలతగారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

ఈ సిద్ధాంత వ్యాస పరిధి సమగ్ర ఆంధ్ర సాహిత్య పరిధిలో పరిమితమైనది మాత్రమే. అంటే - ఈ రచన మధుర ముగ్ధభక్తులను గురించిన సమస్యలను ఆంధ్ర భాగవత, బసవ పురాణాలను ఆలంబనంగా చేసికొని పరిశీలించింది. ఈ పరిశీలన ఇంకా మరికొన్ని పెద్ద ప్రశ్నలను జాగృతం చేస్తుంది- ఆలోచనాపరులలో. పన్నెండు నుండి 17 వ శతాబ్దం దాకా తెలుగులో వెలువడిన భక్తి రస ప్రధాన రచనల వెనుక ఉన్న తాత్త్విక భూమికను గురించి దార్శనికంగా సమీక్షించవలసిన అవసరం ఉంది. భక్తే కాదు, తదితర రసాలను గురించి కూడా

మౌలికమైన చింతన చేయవలసి ఉంది. శ్రీనాథుడు శృంగార రసవాది అంటే, ఆ శృంగారం నవరసాల్లో ఒకటైన శృంగారమా? భోజుడు చెప్పిన అహంకార రసం వంటి మూలరసమా? పోతనగారు నవవిధ భక్తులకు భాగవతంలో ప్రాధాన్యం ఇవ్వగా, అదే కాలంలో అన్నమాచార్యాది పదకర్తలు పంచవిధ భక్తులకు ప్రాచుర్యం ఎందుకు కలిగించారు? పరిపూర్ణరసంగా దర్శించిన భక్తిరస సిద్ధాంత వికాసదశలలో పాల్కురికి, శ్రీనాథుడు, పోతన, అన్నమాచార్యులు మొదలైన తెలుగు కవులు కావించిన ప్రయోగాత్మకమైన నిర్మాణ కృషి ఎటు వంటిది? - మొదలైన ఎన్నో ప్రశ్నలు సరైన సమాధానాల కోసం మిగిలి ఉన్నాయి.

డాక్టర్ పుష్పలతగా రన్నట్లు ఈ రోజుల్లో రసాన్ని గురించి చర్చించే వారే అరుదు. అందులోనూ వివాదాస్పదమైన భక్తిరసాన్ని గురించి నిర్ధారించి చెప్పేవారు మరీ అరుదు. విశేషించి పురాణాలలో రసచర్చను సాగించటం మరీ చెప్పుకోతగిన అంశం. అన్నీ కష్టమైనవే. అయినా, స్పష్టమైన అవగాహనతో సిద్ధాంత వ్యాసాన్ని నిర్వహించి ఒక విశేషాన్ని సాధించారు రచయిత్రి.

సిద్ధాంత వ్యాసానికి పేరు మధురంగా ఉంది. శైలి ముగ్ధమోహనంగా ఉంది. ప్రతి చిన్న విషయాన్నీ విశ్లేషించి చెప్పే ఓర్పు, నేర్పు, తీర్పులుకూడా రచనలో కనపపతాయి. వాటివలన స్పష్టత చేకూరింది. లక్షణాలను వివరించి, లక్ష్యాలను చూపించి సమన్వయించటం, సమన్వయించటానికి కూడా ఒక శాస్త్రీయమైన మార్గాన్ని అందించటం ఈ సిద్ధాంత వ్యాస రచనంలో పాటించిన ఒక క్రమం. సరళమైన గ్రాంథిక భాష శైలికి గౌరవాన్ని కలిగిస్తోంది. డాక్టర్ పుష్పలతగారు జీవితంలో అడుగడుగునా పాటించే మర్యాదే గ్రంథజీవితంలోనూ ప్రతిఫలించింది. ఆత్మీయతతో నాకీ నాలుగు మాటలు చెప్పే అవకాశం కలిగించినందుకు కృతజ్ఞతలు.

హైదరాబాదు,
24-3-1993,
శ్రీముఖ ఉగాది.

జి. వి. సుబ్రహ్మణ్యం
తెలుగు ఆచార్యులు
హైదరాబాదు విశ్వవిద్యాలయం.

# తొలిపలుకు

ఆంధ్ర సారస్వత పరిషత్తు నిర్వహిస్తున్న కార్యక్రమాలలో గ్రంథ ప్రచురణం ఒకటి. ఇప్పటికి పరిషత్తు వివిధ సారస్వత ప్రక్రియలకు చెందిన సుమారు నూరు గ్రంథాలను ప్రకటించింది. ఈ ప్రచురణలన్నీ పండితుల మన్ననలను పొందినవి.

విశ్వవిద్యాలయాల్లో జరుగుతున్న సాహిత్య పరిశోధనకు సంబంధించిన సిద్ధాంత గ్రంథాలను కూడా పండిత సారస్వత శీర్షికన ప్రచురించవలెనని పరిషత్తు తలపెట్టింది. ఆ కోవలో ప్రచురితమౌతున్న మూడో పరిశోధనగ్రంథం డా॥ ఎస్. పుష్పలతగారు రచించిన "మధురభక్తి, ముగ్ధభక్తి - శ్రీమదాంధ్ర భాగవతము - బసవపురాణము" అన్న గ్రంథం. ఆంధ్ర విశ్వవిద్యాలయం వారి పిహెచ్. డి. పట్టంకోసం సమర్పింపబడిన గ్రంథం ఇది.

డా॥ పుష్పలతగారు సారస్వత పరిషత్తుకు ఎంతో సన్నిహితులు. పరిషత్తు కార్యక్రమాలన్నింటిలోనూ, ముఖ్యంగా పండిత శిక్షణ కళాశాల నిర్వహణలో వీరు విలువైన సలహాలనిస్తూ పరిషత్తుకు ఎంతో సహకరిస్తున్నారు, ఆంధ్ర సారస్వత పరిషత్తు పక్షాన వీరి ఈ సిద్ధాంత గ్రంథాన్ని ప్రచురించడం ముదావహమైన విషయం.

డా॥ పుష్పలతగారు ఈ సిద్ధాంత గ్రంథంలో మధుర-ముగ్ధ భక్తుల స్వరూప స్వభావాలను వివేచించి, భాగవత- బసవపురాణాలకు వాటిని చక్కగా సమన్వయించినారు. తెలుగు సాహిత్యంలో భక్తిరసాన్ని గురించి జరిగిన పరిశోధన చాలా తక్కువ. ఈ లోపాన్ని ఈ పరిశోధన గ్రంథం పూరిస్తుందని భావిస్తాను.

ఈ పరిశోన గ్రంథాన్ని పరిషత్తు పక్షాన ప్రచురించడానికి అంగీకరించిన డా॥ ఎస్. పుష్పలతగారికి పరిషత్తు పక్షాన కృతజ్ఞతలు.

ఈ గ్రంథాన్ని ఆంధ్ర పాఠకలోకం ఆదరిస్తుందని ఆశిస్తాను.

**డా॥ ఆర్. శ్రీహరి**

తే. 8-3-1993

కార్యదర్శి

ఆంధ్ర సారస్వత పరిషత్తు

# అభినందన

**డా॥ ఎల్లూరి శివారెడ్డి**
ఆచార్యులు,
ఉస్మానియా విశ్వవిద్యాలయం

ప్రాచీన సాహిత్యమంతా బూజుపట్టిన భావాల కూడలి అనేది కొందరు ఆధునిక సాహిత్యవేత్తల అభిప్రాయం. మత విశ్వాసాలకు అన్వయించి చూస్తే ఈ భావం మరీ ప్రబలంగా వ్యాప్తిలో ఉంది. ప్రాచీనమైనదంతా ప్రామాణిక మని చెప్పలేం కానీ అందులో సార్వకాలిక సత్యాలు, ఉదాత్త భావాలు తరళిస్తూ ఉన్నవనే సత్యం అధ్యయనం చేసిన వారందరి అనుభవంలోనిదే. భక్తికి సంబంధించిన అంశాలను వివరించడంలో కొన్ని రచనలు సమున్నతంగా నిలబడతాయి. అలాంటి అంశాలను విశ్లేషించి, వింగడించి, సిద్ధాంతీకరించిన పరిశోధన గ్రంథం డా॥ సురవరం పుష్పలత గారి "మధుర భక్తి - ముగ్ధభక్తి: శ్రీ మదాంధ్ర భాగవతము - బసవ పురాణము."

డా॥ పుష్పలత గారు మధుర భక్తిలోని మాధుర్యాన్ని, ముగ్ధ భక్తిలోని మురిపాలను లక్ష్య లక్షణ సమన్వయ పూర్వకంగా ప్రకటించారు ఈ గ్రంథంలో. ఎంతో గహనమైవ భక్తి సిద్ధాంతాన్ని సరళతరంచేసి, పఠిత మనసుకెక్కే తీరుగా ఈ సిద్ధాంత వ్యాసాన్ని తీర్చిదిద్దడం విశేషం. భాగవతాన్ని, బసవ పురాణాన్ని సాకల్యంగా సమీక్షించి రచించిన ఈ గ్రంథంలో ఎన్నో నూత్న విషయాలు పొందుపరచబడ్డాయి. డా॥ పుష్పలత గారి పరిశ్రమశీలానికి, ఉత్తమాభిరుచికి, రచనా రీతికి ఉదాహరణంగా ఈ గ్రంథం నిలుస్తుంది. ఇంత మంచి విశ్లేషణాత్మక సిద్ధాంత వ్యాసాన్ని రచియించినందున ఆమెకు నా హార్దికాభినందనలు.

# కృతజ్ఞతలు

నా పరిశోధన కార్యక్రమము నంగీకరించి సిద్ధాంత గ్రంథమునకు అవకాశము కల్పించిన ప్రాచ్యలిఖిత భాండాగారధ్యక్షులకు, ఆంధ్ర విశ్వ కళా పరిషత్తుపాధ్యక్షులకు;

నా సిద్ధాంత వ్యాసమునకు **Ph.D.** బిరుద ప్రదానము చేయుటయే కాక ప్రచురించుటకు అనుమతించిన ఆంధ్ర విశ్వ కళా పరిషత్తుకు;

ఈ సిద్ధాంత వ్యాస రచనలో తమ అమూల్యమైన సలహాల నిచ్చి నూత్నాంశములతో లోచూపు నందించి నా పరిశోధన కార్యక్రమమునకు తమ వైదుష్యముతో పర్యవేక్షణము నందించిన సహృదయ విద్వాంసులు పరిశోధకులు ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారికి;

పరిశోధన విషయము నెన్నుకొనుటలో నాకు ప్రేరణ నిచ్చి సిద్ధాంత వ్యాసమును రూపొందించుటలో కొన్ని విలువైన సలహాల నిచ్చిన ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారికి;

విషయ సేకరణమునందు నా కెంతయు తోడ్పడిన ఉస్మానియా విశ్వ విద్యాలయ గ్రంథాలయమునకు, సంస్కృత అకాడమీ గ్రంథాలయమునకు, గుంటూరు గౌడీయ మత గ్రంథాలయమునకు, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునకు, నగర కేంద్ర గ్రంథాలయమునకు, సంస్కృత లక్షణ గ్రంథముల నుండి కొన్ని అంశములను వివరించిన పూజ్యులు శ్రీ తిరుమల రామచంద్రగారికి, ఆచార్య శ్రీమతి యశోదా రెడ్డిగారికి, శ్రీ లక్ష్మీనరసింహాచార్యులకు, కొన్ని శైవ మత ప్రాచీన గ్రంథములను నా కిచ్చి ప్రోత్సహించిన శ్రీమతి ఉమా శివప్రసాద్ గారికి;

అర్థించిన వెంటనే సౌజన్యముతో ఆర్థిక సహాయము నందించి ప్రోత్సహించిన శ్రీ తిరుమల - తిరుపతి దేవస్థానము వారికి:

ఈ సిద్ధాంత వ్యాసము ప్రచురించుటకు దయతో అంగీకరించిన ప్రసిద్ధ సాహిత్య సంస్థ ఆంధ్ర సారస్వత పరిషత్తు వారికి; విశేషించి ఈ గ్రంథానికి ఆశీస్సులనందించిన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు దీనిని ఆవిష్కరించి అభినందిస్తారని ఆశించాను. కాని ఆ అదృష్టానికి నేను నోచుకోలేదు. నాపై అపారమైన వాత్సల్యాన్ని కురిపించిన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి, సంస్థ కార్యదర్శులు ఆచార్య రవ్వా శ్రీహరిగారికి, డా॥ ఎల్లూరు శివారెడ్డిగారికి;

నా మీద అభిమానముతో ఈ గ్రంథము మీద వారి అమూల్యమైన అభిప్రాయముల నందించి ప్రోత్సహించిన-

జ్ఞానపీఠ అవార్డు గ్రహీత పద్మభూషణ్ డా॥ సి. నారాయణరెడ్డి (రాష్ట్ర ప్రభుత్వ సాంస్కృతిక భాషా వ్యవహారాల సలహాదారు) గారికి, సిద్ధాంత గ్రంథ పర్యవేక్షకులు ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారికి, అభిమానాన్ని కురిపించిన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి, శ్రేయోభిలాషులైన ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారికి, ఆచార్య రవ్వాశ్రీహరిగారికి, ముద్రణ కార్యభారము స్వీకరించి నిర్వహించిన మిత్రులు ఆచార్య ఎల్లూరి శివారెడ్డిగారికి, తప్పు ఒప్పుల పట్టిక తయారు చేయుటలో తోడ్పడిన సహృదయులు డాక్టర్ బి. జయరాములు గారికి, పరిశోధన కాలమందు నన్ను సదా ప్రోత్సహించిన మావారు వద్ది శేఖర్ రెడ్డి గారికి, మా నాన్నగారు సురవరం వెంకట్రామరెడ్డిగారికి, మా చిరంజీవులకు, నా స్నేహితురాలు విజయకు, ముచ్చటగా ముద్రించిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ వారికి—

కృతజ్ఞతాభివందనములు.

**సురవరం పుష్పలత**

రచయిత్రి

# విషయసూచిక

# మధురభక్తి - ముగ్ధభక్తి

(ఆంధ్ర మహా భాగవతము - బసవ పురాణము)

# భక్తి—స్వరూప స్వభావములు

## నిర్వచనములు:-

'అంకోలం నిజబీజ సంతతి రయస్కాంతోపలం సూచికా
సాధ్వీ నైజవిభుం లతాక్షితిరుహాం సింధుస్సరిద్వల్లభమ్
ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవిందద్వయమ్
చేతోవృత్తి రుపేత్య తిష్ఠతి సదా సా భక్తి రిత్యుచ్యతే॥'1

—శ్రీ శంకర భగవత్పాదులు.

ఊడుగు చెట్టునుండి విత్తనములు నేలపై రాలి ఉరుమురిమినప్పుడు అవి తిరిగి ఆ చెట్టునకే అంటుకొనుట యెంత సహజమో, అయస్కాంతముచే సూది యాకర్షింపబడుట యెంత నైజమో, పతివ్రత తన పతి ననుసరించుటయు, లత వృక్షముపై కెగబ్రాకుటయు, నది సముద్రమును చేరుటయు ఎట్లు సహజమో, మానవుని చిత్తము మహేశ్వరుని పాదారవిందముల కడకు చేరుటయు నంత సహజము. భగవంతుని చేరవలయునన్న చిత్తప్రవృత్తియే భక్తి.

భగవంతుని సాయుజ్యమును జెందుటకు భక్తి కంటె మిన్నయైన వ్రతము కాని, ధర్మము కాని లేదని భాగవతము నుడువుచున్నది.

క. చిక్కఁడు వ్రతములఁ గ్రతువులఁ
జిక్కఁడు దానముల శౌచశీల తపములం
జిక్కఁడు యుక్తిని భక్తినిఁ
జిక్కిన క్రియ నచ్యుతుండు సిద్ధము సుండీ॥2

ప్రహ్లాదుని నోట పలికించిన ఈ పద్యము వలన పుణ్య కర్మలన్నిటి కంటె భక్తి మిన్నయైనదనియు, పురుషోత్తముని చేరుటకు శ్రేష్ఠమైన మార్గ మనియు తెలియుచున్నది. భక్తియను శబ్దము 'భజ్' ధాతు నిష్పన్నమని కొందఱు 'భంజ్' ధాతు నిష్పన్నమని కొందఱును భావించుచున్నారు. భజ్

ధాతువు నుండి భక్తి శబ్దము నిష్పన్నము చేయుట పాణిని సంప్రదాయము.[3] ఇందు భక్తి యనగా సేవ యని యర్థము భంజ్ ధాతువు నుండి నిష్పన్నమైన భక్తి శబ్దమునకు విడిపోవుట, విడగొట్టుట, భాగము అను నర్థములు కలవు.[4] మహాకవి కాళిదాసు భక్తి శబ్దమును కూర్చుట, పెట్టుట యను నర్థములందు ప్రయోగించెను.[5]

నిఘంటువుల యందు భక్తి శబ్దమునకు విడివడుట, విడగొట్టుట, Separation, Partition, Devision; భాగము, Portion, Share, భగవద్భక్తి Devotion; మమకారము Attachment; విశ్వాసము Loyaty, Faith, Faithfullness: నమ్మకము Belief; గౌరవము Reverence; సేవ Service; ఆరాధన Worship; అమర్చుట Arrangement; అలంకరణము Decoration, Ornament, Embellishment అను నర్థములు ప్రధానముగా చెప్పబడినవి.[6]

భక్తికి సమానాంతరముగా నాంగ్లభాషలో Devotion అను పదమును వాడుచుందురు కొందరు Prayer, Worship అను పదములను కూడ భక్తికి పర్యాయ పదములుగా గ్రహించుచున్నారు.[7] నిఘంటువులలో Devotion అను పదమునకు భక్తి Devoutness piety ఉపాసన,పూజ, జపము, ప్రార్థన, Worship, Prayer, శ్రద్ధ, ఆసక్తి, నిరతి, అభినివేశము, పట్టుదల, Audour, Earnestness, అనురాగము, బద్ధత Attachment, సమర్పణ, నివేదన Consecreation అను నర్థములు కలవు. పై అర్థములు గమనించినచో భక్తి అను పదమును మూడు విధములైన స్థాయులలో గ్రహింప వచ్చును. 1. భౌతికము. 2. మానసికము. 3. ఆధ్యాత్మికము. భాగించుట విడగొట్టుట మొదలగునవి భక్తియొక్క భౌతికములైన అర్థములుగా భావింపబడు చున్నవి. సేవించుట, శ్రద్ధను, ఆసక్తిని, అభినివేశమును, పట్టుదలను, అనురాగమును ప్రకటించుట, ఈ మానసికములైన భావము లన్నియు భగవత్పరముగా ప్రసరించినచో ఆధ్యాత్మికములైన భక్తి ప్రవృత్తులు కాగలవు. భగవంతునిపై గల విశ్వాసము, గౌరవము, మమకారము, భగవత్సేవ, ఉపాసనము, పూజ, జపము, ప్రార్థన, ఆత్మార్పణ, ఆత్మనివేదనము మొదలగునవి ఆధ్యాత్మికములైనవి. వాఙ్మయ పరముగా పదమునకు పదమునకున్న సంబంధ

భక్తియని పేర్కొనుట కలదు. ఇన్నివిధములుగా వాడబడుచున్న భక్తి
ం ఆధ్యాత్మిక పరముగా గ్రహింపబడినప్పుడే నిజ తత్త్వముతో భాసించు
ది. భాగవతాదులయందు గాని తదితర మత గ్రంథముందు గాని,
షత్తుల యందుగాని పేర్కొనబడిన భక్తి భగవంతుని పరముగా మానవు
'రించెడి ఆరాధనాభావమునకే వర్తించుచున్నది. భక్తి స్వరూప స్వభావ
మ గురించి దాని తత్త్వమును గురించి ప్రాచీనులైన మహర్షుల నుండి
కులైన లాక్షణికుల వరకు వివేచించుటకును నిర్వచించుటకును, నిరూ
టకును యథాశక్తి ప్రయత్నించిరి.

'సాపరానురక్తిరీశ్వరే'[8] భగవంతుని పరానురాగమే భక్తి యని
ల్య మహర్షి, 'సాత్వస్మిన్ పరమ ప్రేమరూపా'[9] అని నారద మహర్షియు
నిర్వచించిరి. ఇట్లే భక్తిని గురించి సూత్రప్రాయముగా చెప్పిన అంశము
గమనింపవచ్చును.

'భక్తిః పరేశానుభవః'[10] - భగవంతుని అనుభవించుటే భక్తి యని
హర్షి.

'భక్తిః స్యాత్ప్రేమ లక్షణా'[11] - అధ్యాత్మ రామాయణము.

'హృత్పుండరీక మధ్యస్థం పరమ ప్రేమగోచరం'[12]-మైత్రేయోపనిషత్తు.

'పూజాదిష్వనురాగ ఇతిపారాశర్యః'[13]-భగవంతుని పూజించుట మున్నగు
యందలి అనురాగమే భక్తి - పారాశర్యమతము.

'కథాష్వితిగార్గః'-భగవత్కథలను వినుట భక్తి - గర్గమహర్షి.

'ఆత్మరత్యవిరోధేనేతి శాండిల్యః'[15] - ఆత్మానంద వీచికా పరంపరల
ం జేసి దేహముగాని, వాక్కుగాని వ్యవహరించునేని యది భక్తి లక్షణ
ని - శాండిల్య మహర్షి.

'భక్తిరస్య భజనం;
వీత దేహాముత్రోపాధి నైరాశ్యేనాముష్మిన్ మనః కల్పమ్.'[16]
- గోపాలపూర్వతాపన్యుపనిషత్తు.

భక్తి యనగా భగవత్సేవ యని భావము. ఆ సేవ యన్ననో ఇహ
'క సుఖాదుల నెవ్వాని నపేక్షింపక భగవంతుని యందు మనస్సు లీనము

'అనన్య మమతా విష్ణౌ మమతా ప్రేమ సంగతా
భక్తి రిత్యుచ్యతే భీష్మ ప్రహ్లాదోద్ధవ నారదైః॥'[17]

-నారద పంచరాత్రము.

భగవంతుడు నా వాడనెడి మమకారము భక్తి యగునని భీష్ముడు, ప్రహ్లాదోద్ధవనారదాదులు పలికిరి.

'సర్వోపాధి వినిర్ముక్తం తత్పరత్వేన నిర్మలమ్
హృషీకేణ హృషీకేశ సేవనం భక్తి రుచ్యతే॥'[18]

సర్వేంద్రియములకు నధిష్ఠానమైన భగవంతుని నిర్మలములైన ఇంద్రియ ములచేత తత్పర బుద్ధితో ఫలాభి సంధి రహితముగా సేవించుట భక్తి యగును.

'మనోగతి రవిచ్ఛిన్నా హరౌ ప్రేమ పరిప్లుతా
అభిసంధి వినిర్ముక్తా భక్తిర్విష్ణు వశంకరీ॥'[19] -నారద పాంచరాత్రము.

మనసు ప్రేమార్ద్రమై తైలధారారూపమున నిష్కామముతో భగవంతుని వంకకు నిరంతరము ప్రవహించుట భక్తి యగును.

'అన్యాభిలాషితా శూన్యం జ్ఞాన కర్మాద్యనావృతమ్
ఆనుకూల్యేన కృష్ణానుశీలనా భక్తి రుత్తమా'[20]

-భక్తి రసామృత సింధువు.

ఎట్టి ఫలమును గోరక జ్ఞాన కర్మాదుల నాశ్రయింపక అంతరాయమను మాటలేక అనుకూల పదమును త్రొక్కి శ్రీకృష్ణభగవానుని ప్రీతిపూర్వక ముగా ధ్యానించుట యను శీలమే భక్తి.

'నారదస్తుతదర్పితాఖిలా చరితా
తద్విస్మరణే పరమ వ్యాకులతేతి' (చ)[21]

సమస్తాచార వ్యవహారములును భగవంతునకు సమర్పించుటయు, భగ వంతుడు మరుపునకు వచ్చెనేని మిక్కిలి వ్యాకుల మందుటయు నారదమత ప్రకా రము భక్తి లక్షణమగును.

'ఇష్టేస్వారసికే రాగః పరమావిష్టతాభవేత్
తన్మయీ యాభవేత్ భక్తిః సాత్ర రాగాత్మికాస్మృతా'[22]

ప్రతి వ్యక్తికిని వాని యిష్ట వస్తువునందు మొట్ట మొదట నొక విధమైన యనురంజనము జనించును. అది క్రమముగా గాఢమై రాగానురూపము దాల్చును. అట్లు రాగము గాఢరూపము దాల్చినయప్పుడు మనస్సు తన్మయమగును. అట్టి మనోవృత్తిని భక్తి యందురు.

'ద్రుతస్య భగవద్ధర్మాత్ ధారావాహిక తాంగ తా
సర్వేశే మనసోవృత్తిః భక్తి రిత్యభిధీయతే॥'[23] -భక్తి రసాయనము.

అధ్యాత్మిక సిద్ధికి కొన్ని నియమములు కలవు. ఆ నియమములను భగవద్ధర్మము లందురు. తద్ధర్మానుష్ఠాన బలమున హృదయము కరిగి రసరూపము నొంది, ఎడ తెరపి లేని తైలధారవలె భగవంతుని వంకకు పరుగెత్తును. అట్టి మనోవృత్తిని భక్తి యందురు.

'స్వస్వరూపాను సంధానం భక్తి రిత్యభిధీయతే
స్వాత్మతత్త్వానుసంధానం భక్తిరిత్యపరేజగుః'[24]
-శ్రీ శంకర భగవత్పాదుల వివేకచూడామణి.

'నేను' అన్నప్పుడు 'నేను' అనుదాని స్వరూపమేమో తెలిసికొనుట కొరకై చేయబడునట్టి నిరంతర విచారము భక్తియని మరికొందరి మతము.

'తత్ర భక్తిర్నామ నిరవధికానంతానవద్య కల్యాణగుణత్వ జ్ఞానపూర్వకః
స్వస్వాత్మీయ సమస్త వస్తుభ్యః అనేక గుణాధికః అంతరాయ
సహస్రేణాప్యప్రతిబద్ధః నిరంతర ప్రేమ ప్రవాహః'[25]
-శ్రీ రామానుజుల శ్రీభాష్యము.

కల్యాణాత్మకమై బహుధా విశిష్టమై ఎన్ని ఆటంకములచేతను కట్టువడని నిరంతర ప్రేమ ప్రవాహమే భక్తియని చెప్పిరి.

'మాహాత్మ్యజ్ఞాన పూర్వస్తు సుదృఢ స్సర్వతోఽధికః
స్నేహభక్తి రితిప్రోక్తః తయాముక్తి ర్నచాన్యథా॥'[26]
-మధ్వాచార్య మహాభారత తాత్పర్య నిర్ణయ గ్రంథము.

మాహాత్మ్య జ్ఞానపూర్వకమై అన్నిటికంటె గొప్పదై మిక్కిలి బలమైన స్నేహమే భక్తి. దానివలన మాత్రమే ముక్తి కలుగు ననిరి.

'మద్గుణశ్రుతి మాత్రేణ మయి సర్వగుణాశ్రయే
మనోగతిరవిచ్ఛిన్నా యథాగంగాంభసోంబుధౌ
లక్షణం భక్తి యోగస్య నిర్గుణస్య హ్యుదాహృదమ్
అహైతుక్య వ్యవహితాయా భక్తిః పురుషోత్తమే.'27

-శ్రీమద్భాగవతమ్, తృతీయస్కంధము.

గంగాజలము సముద్రము వంకకు ప్రవహించునట్లు భక్తుడు తన భావమును అవిచ్ఛిన్నముగా భగవంతుని వంకకు ప్రవహింపజేయుట భక్తియని కపిల మహర్షి వివరించెను.

'యాప్రీతిరస్తి విషయేష్వవివేక భాజాం
సైవాచ్యుతే భవతి భక్తి పదాభిధేయా
భక్తిస్తు కామ ఇవతత్కమనీయ రూపే
తస్మాన్మునేరజని కాముక వాక్యభంగి'28

-ద్రవిడోపనిషత్సార సంగ్రహము.

అవివేకులు ఇంద్రియ సౌఖ్యంబులను బడయుటకై యెట్టి యాతురతను జూపుదురో యయ్యాతురమును భగవంతుని యెడ చూపినచో నది భక్తి యగును.

'అవిచ్ఛిన్న ధారారూపముగు దైవ విశేషణ స్వభావక్రమానుభూతియే భక్తి'-29 -అని శ్రీ నింబార్కాచార్యులు పలికిరి.

'భగవన్మహిమానుభూతి వలన కలుగు ప్రీతియే భక్తి'30

అని స్వప్నేశ్వరుడు పలికెను.

'ప్రశాంత ధ్యానమూలమున నీశ్వర సాన్నిధ్యముగాంచుటే భక్తి'

-అని రామానుజుని మతము.

'జ్ఞాన కర్మరూపావరణములను తొలగించి అనన్య కాంక్షారూపమగు భగవద్విభూతి నొందుటయే భక్తి.'

-అని రూపగోస్వామి భావించెను.

'భగవద్దర్శనమే పరభక్తియనియు పరజ్ఞానసంగమమనియు పునర్విశ్లేష భీరుత్వమే పరమభక్తి.'

-అని యామునాచార్యులు సంభావించిరి.

'భక్తి అనగా ఉపాసనకాదు ప్రేమయే.'

-డా. సర్వేపల్లి రాధాకృష్ణగారనిరి.

'నిజమునకు భక్తి ప్రేమయొక్క సారమే '[32]

-వివేకానందుని సందేశ తరంగిణి.

గుజరాత్‌లో తలెత్తిన భక్త్యుద్యమాల పూర్వాపరాలను పరిశీలించి పరిశోధించిన భారతీయ పండితుడు-

'భక్తి అంటే దేవుని సన్నిధిలో నిలిచి ఆయన్ని సేవించి మనసారా ప్రేమించి ఆయన దివ్యమైన మూర్తిమత్వాన్ని తనివితీరా అనుభవించి ఆయన స్వరాన్ని ఆలకించుట.'[33] -అని వ్యాఖ్యానించిరి.

భారతీయ సాంస్కృతిక సాంఘిక జీవన విధానాన్ని పుక్కిట బట్టిన పండితులు సెడ్జ్విక్ (L.J. Sedguick)-

'జ్ఞాన మార్గం బల్యర్పణలు, అనుష్ఠాన చర్యలద్వారా గాక సగుణ దేవునిలో స్థిర విశ్వాసాన్ని కుదుర్చుకొని, ఆయన్ని నిష్కళంకంగా, నిస్సంశయంగా ప్రేమించి, సర్వస్వాన్ని ఆయన పాదసేవాత్కైంకర్యార్థం ప్రతిష్ఠించడము ద్వారా మోక్షాన్ని పొంద ప్రయత్నించడమే భక్తి'[34] అన్నారు.

జోరాష్ట్రియను మతము ననుసరించి-

'కర్మజ్ఞానము లుత్తమ సాధనములే అయినను ప్రార్థనము భగవంతుని చేర్చగల దగ్గరదారి.'[35]

'భగవద్భక్తి యుక్తస్య తత్ప్రసాదాత్మ బోధతః
సుఖం బన్ధ విముక్తిః స్యాదితి గీతార్థ సంగ్రహః.'[36]

భగవద్భక్తి గలవానికి భగవదనుగ్రహము లభించును. భగవదనుగ్రహము కలవానికి ఆత్మజ్ఞాన ముదయించును. ఆత్మజ్ఞానము కలవానికి సులభముగా బంధవిముక్తి కలుగును. ఇదియే గీతార్థసార సంగ్రహము.

పై నిర్వచనములను గమనించినచో మానవుని ఆధ్యాత్మిక సాధనమునకు భక్తి యొక శక్తిమంతమైన సాధనముగా భావింపబడినదనియు భగవత్ గతమైన ప్రేమభావము భక్తియొక్క భావావస్థయందు అది ఉపాసనమై ఆత్మ సమర్ప

ణము వరకు సాగి మోక్షసిద్ధిని కలిగించుననియు స్పష్టమగుచున్నది. ఇట్టి భక్తి కావ్యములయందు పోషింపబడినపుడు రసశబ్ద వాచ్యమగుచున్నది. కావ్యమునకు రస మాత్మయనియు, అది సామాజికులకు రసానందముతోపాటు ఉపదేశము నందింపవలయుననియు ప్రాచీనులు భావించి యుండుట ప్రసిద్ధము. కావ్యము లందలి భక్తిరస పోషణ విధానమును గురించిగాని భక్తి రసానుభవ స్థితిని గురించికాని తెలిసికొనుటకు కావ్యము చతుర్విధ పురుషార్థముల నెట్లు ప్రబోధించెనో భక్తి తదనుగుణముగా నెట్లు పోషింపఁబడునో భక్తి రసానుభవమువలన సామాజికుడెట్టి ప్రయోజనమును సాధించునో సమీక్షింపవలసియుండును.

## చతుర్వర్గ వ్యుత్పత్తి :

'ధర్మార్థ కామ మోక్షేషు వైచక్షణ్యం కళాసుచ
కరోతి కీర్తిం ప్రీతించ సాధుకావ్యనిషేవణం॥'37

సాధుకావ్య సేవనము వలన చతుర్వర్గ వ్యుత్పత్తియు, కళా విచక్షణ జ్ఞానమును, కీర్తియు, ప్రీతియు కలుగునని భామహాచార్యుడు పేర్కొనినాడు. కావ్యముల వలన కలుగు ఈ నాలుగు ప్రయోజనములలో లాక్షణికులు చతుర్వర్గ వ్యుత్పత్తికి అగ్రతాంబూలమిచ్చుచుందురని భామహుని వాక్యము తెలుపు చున్నది. మానవుడు జన్మమెత్తినందులకు ప్రయోజన ముండవలయును. అట్టి ప్రయోజనమే అర్థము. పురుషునిచేత సాధింపబడు అర్థములు కావున ధర్మార్థ కామ మోక్షములకు పురుషార్థములని పేరు కలిగినది. నాలుగు పురుషార్థములు సాధించినచో జీవితము సమగ్రము కాగలదని భారతీయుల అభిప్రాయము. పురుషార్థములలో ధర్మము మొదటిది. విశ్వము ధరించునది, విశ్వమును నిలువ బెట్టునది, ఉంచునది అను వ్యుత్పత్త్యర్థము ధర్మ శబ్దమునకు కలదు.38 విశ్వమునకు నియతిని, మానవునకు అస్తిత్వమును, జీవితమునకు సార్థక్యమును కలిగించునది ధర్మము. సర్వ జీవ ప్రవృత్తికిని ప్రాణము చైతన్యముకాగా ధర్మము జీవించు పద్ధతి యగుచున్నది. ధర్మశబ్దము కాలక్రమమున కర్తవ్యము, సత్ప్రవర్తనము, శాసనము, నియమము, సదాచారము, దానము, మతము, వేద విహిత కర్మము మొదలగు నర్థములు యందు వ్యవహారమున ప్రాచుర్యము చెందినను ధర్మమునకు ప్రాచీనార్థము పురుషార్థపరమైనదే.

రెండవ పురుషార్థము అర్థము. అర్థమనగా ధనమనియు, ప్రయోజనమనియు, తాత్పర్యమనియు, నానాసందర్భములందు చెప్పికొనుటకు వీలున్నది. మానవుడు జీవించుటకు ధన మవసరమగుచున్నది. 'ధనమూల మిదం జగత్' అని న్యాయము. ధనము నార్జించి సుఖింపవలయును భౌతికవాంఛ మానవునికి సహజము, లేక తనకు హితమైన ప్రయోజనము నెద్దానినైనను జీవితమునందు సాధింపవలె ననెడి పురుషకారమును ప్రకటించుకొనుటయు మానవునకు నైజము. జీవించుటకును. జీవన వ్యాపారమునకు హేతుభూతమైన ఒక ప్రయోజనమును మానవు డుపలక్షించి నపుడది పురుషార్థములలో అర్థమగుచున్నది.

తృతీయ పురుషార్థము కామము. కామమనగా కోర్కె. ఆహార నిద్రా మైథునములు సర్వజంతు సామాన్యములు. 'శరీర మాద్యంఖలు ధర్మసాధనమ్.' అను ఆర్యోక్తి ననుసరించి ధర్మసాధనకు శరీరము ముఖ్యసాధనము. శరీర పోషణమునకు ఆహార మవసరము. శరీర స్వాస్థ్యమునకు నిద్ర ఆవశ్యకము.

'ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః'39 అను వేదోక్తి ననుసరించి ప్రజాతంతు కార్యమునకు కామము విహితము.

'సంతతిశ్శుద్ధ వంశ్యాహి పరత్రేహచశర్మణే' 40 అనియు

'క్రియాణాం ఖలు ధర్మ్యాణాం సత్పత్న్యో మూలకారణం'-41

అను కాళిదాసోక్తులననుసరించి సంసార సాధనమైన కామము సతీపతుల కుపాదేయమని స్పష్టమగుచున్నది. మానవ సంతతి సంతతము భూతలముపై నిలుచుటకు సతీపతులు నిర్వహించు కామ పురుషార్థము జీవితమున ఒక యజ్ఞము వంటిది. పుత్రుడు పున్నామ నరకమునుండి తల్లిదండ్రులకు విముక్తి కలిగించు వాడనియు, పుత్రిక తన శీలముచే నుభయ వంశములవారి నుద్ధరించుననియు సంతానవతులయిన దంపతులు ఇహ పర సుఖములను సాధింపగలరనియు భారతీయుల విశ్వాసము. కామ పురుషార్థమునకు సమాజముయొక్క అస్తిత్వమునకు అవినాభావ సంబంధమున్నదని భావించుటకు వీలగుచున్నది. కామము రతియే కానక్కరలేదు. రతి భిన్నమైన కామమేదయినను కామము కావచ్చును. కోరుట అను క్రియా వ్యాపార మందు ముఖ్యము. ధన కనక వస్తు వాహనాదు

లను కోరుటయే కామము. ఇట్టి ఇచ్ఛా వ్యాపారము నంతటిని ఆవరించునది కామము. కాని కామ శబ్దము రతియందు రూఢము, మోక్షమును కోరుట కూడ కామమే యని విజ్ఞులు వివేచించిరి. 'కామికాక మోక్షకామికా'డని వేమన యనుట ప్రసిద్ధమే కదా!

తురీయ పురుషార్థము మోక్షము. దీనిని పరమ పురుషార్థమనియు అందురు. పురుషార్థములలోనిది ఉత్తమమైనది మోక్ష మనగా విడివడుట. భవ బంధములనుండి, దుఃఖము నుండి, మాయనుండి, అజ్ఞానము నుండి విడివడుట. అనగా భవబంధ విమోచనము, నిత్యానందము నిర్మోహము, ఆత్మ జ్ఞానము-ఇవి మోక్షమునకు పర్యాయ పదములు. ధర్మార్థ కామములు మానవుని యొక్క భౌతిక మానసిక నైతిక జీవిత ప్రయోజనములను సాధించుటకు సాధనములుగా తోడ్పడునవికాగా మోక్షము మానవుని అధ్యాత్మిక జీవిత ప్రయోజనమును సాధించుట కుపయోగపడు ఉజ్జ్వల సాధనము. భౌతిక జీవితము త్రివర్గ సాధనము చేత పరిపూర్ణమైనట్లు కనబడును. కాని ఆధ్యాత్మి కౌన్నత్యము దానికి ధ్యేయ ముగా లేనిచో అది సమగ్రము కాదు.

చతుర్విధ పురుషార్థములలో దేనికదియే స్వతంత్ర ప్రతిపత్తి కలిగి యున్నను అన్నిటి యందును పూసలలో దారమువలె ధర్మము వ్యాపించి యుండును. ధర్మమునకు సహజముగా రెండు ధర్మస్థితులు కలవు. 1. స్వయం స్థితి. 2. ప్రేరకస్థితి. ధర్మము లోకము నందాచరించునపుడే అది రూపుకట్టును. సర్వక్రియా వ్యాపారము నందును చైతన్యమును ప్రేరణమునునైన శక్తి ధర్మము. ప్రతి జీవికిని తనదైన ధర్మమొకటిగను లోకముతో సంబంధించిన ధర్మమొకటిగను భాసించుచుండును. వీనినే ఆత్మధర్మమనియు, విశ్వధర్మమ నియు వివేకవంతులు పేర్కొందురు. వ్యక్తి స్వీయధర్మ శాసితుడై లోకవృత్త మునందు అంతస్సూత్రముగా వర్తించుచున్నాడు. పురుషార్థమైన ధర్మము కూడ నిజధర్మ పురుషార్థ వ్యక్తిత్వమును సహజముగ కలిగియుండియు మిగిలిన పురు షార్థముల లోపల శక్తి రూపముగా వ్యాపించి యుండును. అనగా ప్రథమ పురు షార్థమైన ధర్మము వ్యక్తి. మిగిలిన పురుషార్థములలో ప్రసరించు ధర్మము శక్తి. అర్థకామములు ధర్మసహితములయినపుడే శక్తిమంతము లగుచున్నవి. అట్లు కానిచో అభాస రూపములై నింద్యార్హము లగుచున్నవి. ధర్మసహితములైన అర్థ కామములే పురుషుడు సాధింపదగిన పురుషార్థములు.

'ధర్మా విరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ' అని శ్రీకృష్ణుడు గీత యందు చెప్పిన వాక్యమును గ్రహించినచో ధర్మ సహితములైన పురుషార్థములు భగవత్ స్వరూపములనియు బోధ పడుచున్నవి. లోకము నందు పురుషార్థ త్రయము ధర్మమునకు సంబంధించినవనియు, పరమ పురుషార్థమైన మోక్షము నివృత్తి ధర్మమునకు సంబంధించినదనియు ప్రాజ్ఞులు చెప్పుచున్నారు. ఇట్లగుటచే చతుర్విధ పురుషార్థ సాధన మంతయు తాత్పర్యము నందు ప్రవృత్తి నివృత్తి ధర్మ సాధన రూపమై ప్రవర్తిల్లు చున్నదని భావించుటలో విప్రతిపత్తి లేదు.

పరమ పురుషార్థమునకు పురుషార్థత్రయము సోపాన పంక్తిగ భారతీయులు భావింతురు. వేద విహితములైన కర్మలను మానవ సహజమైన ధర్మమును నిర్వహించుచు ఆ ధర్మకర్మ వలని ఫలము నాశింపక విశ్వశ్రేయో రూపమైన విశ్వధర్మమున కంకితము చేయుట కర్మమార్గప్రస్థాన ప్రయోజనము. అర్థ పురుషార్థమందలి స్వార్థ దృష్టిని పరహితార్థ దృష్టిగ మలచుకొని భగవత్ చైతన్యరతిని భజించినచో అర్థము భక్తి మార్గమునకు ప్రాపకము కాగలదు. అనిత్య సుఖము నిచ్చునట్టిదైన నింద్రియానంద స్వభావము నెరిగి, నిత్యానంద సుఖము నందించు మోక్షముపై నిచ్ఛ ప్రసరించుట వలన కామ పురుషార్థము జ్ఞాన మార్గమునకు దోహద మగుచున్నది. ధర్మము నందలి వ్యక్తి శక్తిగా మారుటయు అర్థము నందు మోహము నిర్మోహత్వమును సాధించుటయు కామము నిష్కామసిద్ధిని పొందుటయు పురుషార్థత్రయము పరమ పురుషార్థ సిద్ధి కనుకూలమైన ప్రగతిని సాధించుట యని తెలియవచ్చును. త్రివర్గ వ్యుత్పత్తి జ్ఞాన మార్గము నావిష్కరించినచో మోక్షము కొంగు బంగారమగును.

'సత్సఙ్గత్వే నిస్సఙ్గత్వం నిస్సఙ్గత్వే నిర్మోహత్వమ్
నిర్మోహత్వే నిశ్చలచిత్తం నిశ్చలచిత్తే జీవన్ముక్తిః'42

అని శంకరాచార్యులు చెప్పినట్లుగ మోక్ష పురుషార్థ సిద్ధి కనువైన ముముక్షుత్వము పురుషార్థ సాధకుల కేర్పడును. మోక్షమనగా బ్రహ్మానందస్థితి లేదా ఆత్మానందస్థితి. ఇది మానవుడు సాధించెడి ఆధ్యాత్మిక సిద్ధికి శిఖరప్రాయమైన స్థితి. దానిని సాధించినపుడే మానవ జీవితము చరితార్థము.

కర్మ మార్గము ప్రధానముగా కాయికమైనది. దీనిని కావ్యకళా సిద్ధాంతము నందు చెప్పబడిన కదళీపాకముగ పేర్కొన వచ్చును. పైతోలు తీసినచో లోని ఫలమంతయు ఆస్వాదనీయమగునట్లు కర్మ నిష్కామయమైన వ్రతదీక్షాదుల నాచరించుచు వాని తత్త్వమరసి సమాహిత చిత్త పరిపాకమును సాధించుకొని మోక్షానుగుణమైన జీవిత వర్తనము సలుపుట కర్మమార్గ ఫలము. ధర్మ సంబంధమైన కర్మాచరణ దీక్ష యనెడి తోలును తొలగించుట యనగా దాని తత్త్వము తెలిసికొని నిష్కామ కర్మాచరణము ద్వారమున సాధించు మోక్ష ప్రవృత్తిని పొందుటయే దాని స్వభావము. కావున దానిని కదళీఫలాస్వాదనము వంటిదని పేర్కొనవచ్చును. ఈ కర్మము ప్రవృత్తి రూపమైనచో త్రివిధ పురుషార్థములను, నివృత్తి రూపమైనచో మోక్ష పురుషార్థమును మానవుడు సాధింపగలడు.

**జ్ఞానమార్గము ముఖ్యముగా బుద్ధికి** సంబంధించినది. 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' (బ్రహ్మమును తెలిసికొన్నవాడు బ్రహ్మమే యగును) అను న్యాయముచే జ్ఞాని బ్రహ్మతత్త్వమును తెలిసికొని 'అహం బ్రహ్మాస్మి' అను అద్వైత స్థితిని సాధించుటయే మోక్షమార్గ తత్త్వము. దీనిని నారికేళ పాకముతో ఉపమింప వచ్చును.

నారికేళ రసస్వాదనము గావింపవలయునన్నచో పీచును తొలగించుటయు కాయను పగులగొట్టుటయు మొదలయిన క్లేశతరములైన వ్యాపారము లన్నియు గావించినగాని రససిద్ధి గలుగదు. అటులే కామ క్రోధాదులనెడి పీచును తొలగించి నేతినేతి వాదముల ద్వారా సదసత్ జ్ఞానమును సాధించి చివరకు బ్రహ్మజ్ఞానమను నారికేళమును బగులగొట్టి బ్రహ్మానంద రసమును జ్ఞాని పొందగలుగుచున్నాడు. జ్ఞానమార్గము ననుసరించి వారు బుద్ధిజీవులనియు, సాంఖ్యయోగులనియు, జ్ఞానయోగులనియు పేర్కొనబడుచుందురు.

ఈ రెండింటికంటె సులభతరమైనది సర్వజన సమాదరణీయమైనది **భక్తి మార్గము**. ఇది ప్రధానముగా **మానసికమైనది.** భగవత్‌రూప రతి చిత్తమునందు పరిణత స్థితిని పొందునో ఆ చిత్తము సహజముగ భక్తిరసాయత్త మగును.

భగవంతునిపైగల ప్రేమానురాగములే భక్తియని మహర్షులు నిర్వచించిరి.

"తదేవ కర్మిజ్ఞాని యోగిభ్య అధిక్య శబ్దాత్"43 అను శాండిల్య భక్తి సూత్రము ననుసరించి భక్తి సర్వశ్రేష్ఠము కావుననే కర్మయోగులకంటెను, జ్ఞాన యోగులకంటెను భక్తియోగి శ్రేష్ఠుడని అధిక శబ్ద ప్రయోగమువలన తెలియు చున్నది.

'సాతుకర్మ జ్ఞాన యోగేభ్యోప్యధికతరా'44 అనియు 'ఫలరూపత్వాత్'45 అనియు నారదభక్తి సూత్రములు చెప్పుటచేత భక్తి కర్మజ్ఞాన యోగములకంటే శ్రేష్ఠమైనవనియు, కర్మజ్ఞానాదులు సహజముగ భగవత్ప్రాప్తి సాధనములును, భక్తి ఫలరూపమును గావున ఫలరూపమైన భక్తియే సాధనాదులకంటె మిన్న యనియు నిరూపిత మగుచున్నది.

'జ్ఞానులచే మౌనులచే, దాసులచే యోగసంవిధానులచేతన్
బూని నిబద్ధుండగునే, శ్రీనాథుఁడు భక్తియుతుల చేతంబోలెన్.'46

భాగవతమునందు భక్తియుతులచేతనే భగవంతుడు నిబద్ధుండగునని నిరూపించబడినది. భక్తికి జ్ఞానమే సాధనమనియు, భక్తిజ్ఞానములు పరాస్పరా శ్రితములనియు కొందరు భావింపగా, నారదభక్తి సూత్రములు-

'స్వయం ఫలరూపతేతి బ్రహ్మకుమారాః'47 అను సనత్కుమారుల వాక్యముల నాశ్రయించి భక్తి స్వయముగా ఫలరూపమైనదని ప్రతిపాదించి-

"తస్మాత్ సైవగ్రాహ్యా ముముక్షుభిః'48 అని ముముక్షువులచే భక్తియే గ్రహింపదగినను తాత్పర్యమును ప్రతిపాదించినది.

కాయికమైన కర్మమార్గముకంటె బౌద్ధికమైన జ్ఞానమార్గము కంటె మాన సికమైన భక్తిమార్గము మృదులతరమైనది. కర్మతులయ్యు జ్ఞానులయ్యు భక్తులు కానిచో ఆనందానుభూతి ననుభవించు నార్ద్రత లేనివారనియే చెప్పవలెను పురాణేతిహాసములను పరిశీలించినను శంకరాచార్యుల జీవితవృత్తముల నారసినను యోగుల జ్ఞానసిద్ధి భక్తిరససిద్ధితో ఆమ్రేడితము భజించి యున్నదనుట సహృ దయ హృదయ విదితిము. కర్మజ్ఞానులకు పరిపక్వస్థితిని కలిగించునది భక్తియే. పూర్వపుణ్యమువలన భక్తిపరిపాకమలవడినచో జ్ఞాన కర్మల ప్రమేయము లేకపోయినను మానవుడు భగవంతుని చేరవచ్చును. కర్మమార్గ విశిష్టమైన భక్తి

నిర్గుణమును భజించును. అట్టి అంతరమున్నను భగవద్రతి భక్తిరసస్థాయి యగుటచే సగుణ నిర్గుణ బ్రహ్మోపాసనమునందు భాసించు రతిభావము లేనిచో కర్మజ్ఞానములకు ఫలసిద్ధి లేదని భావించిన నారదాది భక్తి సూత్రముల తాత్పర్యము సమాదరణీయమె యగుచున్నది. భక్తి యేమార్గమునందు వసించినను అది భుక్తిముక్తి ఫలమే.

భక్తిని రసమనుట లోకప్రసిద్ధము. లౌకిక రసములనియు, అలౌకిక రసములనియు లోకమున వ్యవహారము కలదు. లోక జీవితమునకు సంబంధించిన రత్యాది భావములు లౌకిక రసములని పిలువబడుచున్నవి. సాహిత్యమునందును, కళాప్రక్రియలయందును విభావాదులచే ప్రతీయమానమయ్యెడి రత్యాది స్థాయి భావములను అలౌకిక రసములని పేర్కొనుట కలదు. భక్తి రసమనుటచేత లోకులచే భగవద్రతి జీవితమునందు అనుభవింపబడినచో అది భక్తి యగును. భాగవతాది భక్తిరస ప్రధాన గ్రంథములను చదువుచున్నప్పుడు గాని, వినుచున్నప్పుడుగాని, భాగవతగాథలు రూపకములుగా ప్రదర్శింపబడినప్పుడుగాని సహృదయుడు పొందు భగవద్రతియే భక్తిరసమని పిలువబడును. భక్తి భక్తులకే సాధ్యము. భక్తిరసము భక్తులకేకాక సహృదయులకు కూడ సాధ్యము. భక్తిరసము ప్రత్యక్ష భగవద్రూప శ్రవణ కీర్తనాదులచే ఉద్బుద్ధమైన సుఖదుఃఖాత్మక భగవద్రతి భావమే స్థాయిగా కలిగినది. భక్తి రసమునందు భగవద్రూపము ప్రత్యక్షముకాదు. చింతనామయము రసవృత్తి యందు కావ్యార్థ భావనమువలన కలిగెడి మనోనేత్ర దర్శనమే ప్రధానము. తాత్పర్యమున భక్తి లౌకికమైనది. భక్తిరసము అలౌకికమైనది. కావ్యవిషయమునందు అలౌకికమైన భక్తిరసప్రస్తారమే పరిశీలింపదగియున్నది.

'భజనమంతఃకరణస్య భగవదాకారతారూపమ్ భక్తిః'49

'రతిర్దేవాది విషయః'50 అనిదేవాది విషయకమైన రతి భక్తిగా భావింపబడుచున్నది. రతిభావ స్వరూప వివేచనము చేసిన ప్రాచీనుల యభిప్రాయములను సమీక్షించిన రతిశబ్దమును మూడు విధములుగా భావించుటకు వీలగుచున్నది. తనూభోగపర్యంతమైన స్త్రీపుంస సంభోగవిషయకమైన యిచ్ఛా విశేషమును లోకులు రతి యనుచున్నారు. దీనిని సర్వజంతు సహజమైన కామ

మనుట యుచితమని విజ్ఞులు వివేచించుచున్నారు. నాయికా నాయకులమధ్య భావ రూపమైన సంయోగేచ్ఛా విశేషమును రతియని పెక్కురు సంభావించుచున్నారు. భావరూపమై వ్యాపించిన రతియే రతియని తనూసంగేచ్ఛాధీనమై క్రియారూపము భజించునది కామయనియు విశ్లేషించుట యుచితము. ఇంతియేకాక సర్వజీవుల నడుమ స్నేహరూపముగ, ప్రేమరూపముగ, భక్తి రూపముగ ప్రసరించు రతియు గలదు. ఇందు సంభోగేచ్ఛ అను స్పర్శయే లేదు. భక్తిని భగవద్రతియన్నను పరమ ప్రేమ రూపమైనదని లాక్షణికులు భావించుటచే తమోగుణ ప్రధానమైన కామము కంటెను, రజోగుణ ప్రధానమైన రతికంటెను, సత్వగుణ ప్రధానమైన ప్రేమగ భగవద్రతిని భావింపవలయునని స్పష్టమగుచున్నది.

ఆలంకారికుల సిద్ధాంతములను సమీక్షించినచో శృంగార భక్తి వత్సల ప్రేమోరసములందు సామాన్యముగా సంభావింపబడునది రతి. ఆ రతి నాయికా నాయకులకు సంబంధించినచో శృంగార మగుచున్నది. గురువుల యెడలను, దైవము నెడలను రతి ప్రసరించినచో క్రమముగా ప్రేయోరసమును, భక్తి రసమును అగుచున్నవి. పెద్దవారు పిన్నలయెడ చూపునట్టి వాత్సల్య రూపమైన రతిభావమే వత్సల రస మనబడుచున్నది. ఇట్లు రతియే తదాలంబన భేదముచేత మూడు విధము లగుచున్నది. శృంగార స్థాయియైన రతిభావమును దేవాది విషయకమైన రతిభావమును అద్వైత మధురముగా మేళవించుకొని ముక్తిసమ్ముఖ ముగా నడచు భక్తియే మధురభక్తి. ప్రేయోవత్సల రసముల స్థాయి భావము లను దేవాది విషయకమైన రతి భావముతో మేళవించి భగవత్ కైంకర్య భావము భజించినచో ముగ్ధభక్తి యనబడును. భాగవత సంప్రదాయమున భక్తి తొమ్మిది విధములుగా పేర్కొనబడుచున్నది:

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనం."51

ఈ నవవిధ భక్తిభేదములచేత భక్తునియందలి భగవద్రతి స్థాయిత్వ మును బొందుట కవకాశ మేర్పడును. సలిలమొక్కటియయ్యును బుద్బుదావర్త భేదములచే జలముయొక్క వివిధావస్థలను భావించినట్లు భగవద్విషయక రతిభావ మొక్కటేయయ్యును శ్రవణకీర్తనాది భేదములచేత అవసాంతరములను భజించు

చున్నది. సంతతభగవద్గుణ శ్రవణమువలన భగవద్రతి ఉత్కటావస్థ నొందినచో శ్రవణభక్తి యనవచ్చును. విష్ణుగుణ కీర్తనము వలన భగవద్రతి భావ ముద్దీప్తమైనచో కీర్తన భక్తియని నిరంతరరూప గుణనామ మహిమాది స్మరణము వలన భగవద్రతి స్థాయిత్వమును బొందినచో స్మరణ భక్తియని పేర్కొనవచ్చును నవవిధ భక్తులలోని మూడును భగవంతుడు పరోక్షముగ నుండగ భగవంతుడు తత్ శ్రవణ కీర్తన స్మరణముల వలన భక్తిరసస్థాయిని పరిపోషించుకొనును. పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము అనునవి భగవంతుడు ప్రత్యక్షముగ నున్నప్పుడు గాని, అతని రూపవిశేషము ఎదుటనున్నప్పుడు గాని, పచరించు భక్తిమార్గములు. ఆత్మనివేదనము వీనన్నింటిలో ఉత్తమమైనది సగుణ నిర్గుణ రూపమైన భగవంతుని భావములు రెండింటికిని సంబంధించినవి. ఆత్మనివేదనమునందు భక్తిభావ పరిపాకముతోపాటు అధ్యాత్మిక పరిణతికూడ భక్తులయందు ప్రకటితమగుచున్నది.

నారద భక్తిసూత్రములు భక్తిని పదునొకండు విధములుగా పేర్కొనెను:

### ఏకాదశవిధ భక్తులు

'గుణమాహాత్మ్యాసక్తి రూపాసక్తి పూజాసక్తి
స్మరణాసక్తి దాస్యాసక్తి కాంతాసక్తి
వాత్సల్యాసక్త్యాత్మ నివేదనాసక్తి తన్మయతాసక్తి
పరమ విరహాసక్తి రూపా ఏకధాప్యేకాదశధా భవతి'.[52]

ప్రేమ రూపమైన భక్తి తాత్పర్యరూపమున నొక విధమేయైనను ఆసక్తి భేదములనెడి ఉపాధులననుసరించి పదునొకండు విధములుగా వింగడింపబడినది. అవి:

1. గుణమాహాత్మ్యాసక్తి :- ఈ మార్గమున ప్రసిద్ధులు నారద వేదవ్యాస శుక యాజ్ఞవల్క్యకాకభుశుండిశేష సూత శౌనక శాండిల్య భీష్మార్జున పరీక్షిత్ పృథు జనమేజయాదులు.

2 రూపాసక్తి భక్తి :- ఈ భక్తి మార్గమున మిథిలానగర వాసులును, జనకుడును, దండకారణ్య ఋషులును వ్రజనారీమణులును ప్రసిద్ధులు.

3. పూజాసక్తి భక్తి:- శ్రీమహాలక్ష్మి, పృథువు, భరతుడు మొదలగువారు ఈ మార్గమున ప్రసిద్ధులు.

4. స్మరణాసక్తి భక్తి:- ప్రహ్లాద, ధ్రువ సనకాదులు ఈ భక్తిమార్గమున ప్రసిద్ధులు.

5. దాస్యాసక్తి భక్తి:- ఈ భక్తిమార్గమున హనుమంతుడు, అక్రూరుడు, విదురుడు మొదలగువారు ప్రసిద్ధులు,

6. సఖ్యాసక్తి భక్తి:- ఈ భక్తి మార్గమున ప్రసిద్ధులు అర్జునుడు, ఉద్ధవుడు, సంజయుడు, కుచేలుడు మొదలగువారు.

7. కాంతాసక్తి:- ఈ భక్తి మార్గమున ప్రసిద్ధులు అష్టమహిషులు.

8 వాత్సల్యాసక్తి భక్తి:- ఈ భక్తి మార్గమున ప్రసిద్ధులు కశ్యపుడు, అదితి దశరథుడు, కౌసల్య, నందుడు, యశోద, దేవకీ వసుదేవులు మొదలగువారు.

9. ఆత్మనివేదనాసక్తి భక్తి:- ఈ భక్తిమార్గమున ప్రసిద్ధులు హనుమంతుడు, శబరి, అంబరీషుడు, బలి, విభీషణుడు, శిబి మొదలగువారు.

10. తన్మయాసక్తి భక్తి:- ఈ భక్తి మార్గమున ప్రసిద్ధులు యాజ్ఞవల్క్యుడు, శుకుడు, సనకాదిజ్ఞానులు, కౌండిన్యుడు, సుతీక్ష్ణుడు మొదలగువారు.

11. పరమవిరహాసక్తి భక్తి:- ఈ భక్తిమార్గమున ప్రసిద్ధులు ఉద్ధవుడు, గోపికలు. మున్నగువారు.

వివేకానందుని భక్తియోగమునందు నవవిధ భక్తులకు మారుగా పంచవిధ భక్తులను పేర్కొనిరి.[53] అవి 1. శాంతభక్తి, 2. దాస్యభక్తి, 3. సఖ్యభక్తి, 4. వాత్సల్యభక్తి, 5. మాధుర్యభక్తి.

1. శాంతభక్తికి, ప్రహ్లాద అంబరీష, నారద సనక సనందాదులు ప్రసిద్ధులు.

2. దాస్యభక్తికి శబరి గుహుడు ప్రసిద్ధులు.

3. సఖ్యభక్తికి సుగ్రీవార్జునాదులు ప్రసిద్ధులు.

4. వాత్సల్యభక్తికి కౌసల్యాదశరథులు, యశోదానందాదులు,ప్రసిద్ధులు.

5 మాధుర్యభక్తికి గోపికలు ప్రసిద్ధులు.

భక్తికి రసత్వము నంగీకరించి సవిస్తరముగా ప్రతిపాదించిన వారిలో ప్రప్రథముడు 'ఉజ్జ్వల నీలమణి' కర్తయగు రూపగోస్వామి.

"పృథగేవ భక్తి రసరాట్ సవిస్తరేణోచ్యతే మధురః'[54] అని ప్రతిజ్ఞచేసి 'మధురము' 'ఉజ్జ్వలము' అను పేర్లతో విస్తరించి తెలిపెను. ఈ భక్తి శ్రీకృష్ణ గోపీ విషయకము. శృంగారమైనది. రూపగోస్వామి అవస్థాభేదముచే భక్తిని మూడు విధములుగా పేర్కొనెను.

1. సాధనభక్తి 2. భావభక్తి 3. ప్రేమభక్తి.

మనోవాక్కాయ కర్మల ద్వారా భగవంతుని హృదయమున సాక్షాత్కరింపజేసి కొనుటకు చేయు చేష్టలను సాధనయందురు. సాధింపబడువరకు దానిలో సాధ్యభావముండును. ప్రకటమైనంతనే దాని నిత్యసిద్ధత స్పష్టమగును.

'కృతి సాధ్యాభవేత్ సాధ్యభావాసాసాధనాభిదా।
నిత్యసిద్ధస్య భావస్య ప్రాకట్యం హృదిసాధతా' ॥[55]
'నిత్య సిద్ధ కృష్ణప్రేమ 'సాధ్య'క భునయ ।
శ్రవణాది శుద్ధిచిత్తే కరయే ఉదయ॥
శ్రవణాది క్రియాతార స్వరూప లక్షణ।
తటస్థలక్షణే ఉపజయ ప్రేమ ధన॥'[56]

ప్రప్రథమున సాధనభక్తి ననుష్ఠించుటచే భావోదయమగును. భావము పూర్తియైనపుడు దానిని ప్రేమ యందురు.

భాగవతమునందు నవవిధభక్తి వర్ణితమైనది. ఈ సాధన భక్తి రూప గోస్వామి వైధీరాగానుగ భేదములచే వర్ణించెను. ఆత్మలో రాగ తత్త్వోపలబ్ధి

కానివారు, శాస్త్రవిధి ననుసరించి ఉపాసనాదులను చేయుటయందనురక్తులైన వారిని వైధీభక్తులుగను, శాస్త్రవిధులను పాటించుట కిచ్ఛగించనివారు మనము నందే హరిభజనమున స్వాభావికానురాగము కలవారిని రాగానుగ భక్తులుగను పేర్కొనెను.

వైధీభక్తి నవ విధములని పేర్కొని, ఈ నవవిధ భక్తిని అంగప్రత్యంగ ములతో కలిపి అరువది నాలుగు విధములని రూపగోస్వామి వర్ణించి యున్నారు. రూపగోస్వామి 'రాగము' ఇష్ట విషయమున స్వారసిక పరమావిష్టతను రాగ మందురని నిర్వచించెను. శ్రీకృష్ణుడా రాగమున కేకైక విషయమైనచో దానిని రాగభక్తియందురని. కృష్ణభక్తి యీ రాగమయావస్థను బొందినపుడు, రాగాత్మక భక్తిగా పేర్కొనెను.

భక్తిని ముగ్ధభక్తియనియు, మధురభక్తియనియు, జ్ఞానభక్తియనియు సంభావించుటకు కవకాశము గలదు.

ముగ్ధభక్తియనగా సాకార బ్రహ్మమును మోహాదులవలన పుత్ర మిత్రాదులవలె భావించి రమించుట. ముగ్ధభక్తియందు వత్సలాది భావముల దీప్తియధికము. జీవితమునందలి సుఖదుఃఖముల భావములకు నిందు ప్రత్యక్ష ప్రతిబింబ భావముండును. ముగ్ధ భక్తివలన క్రమముగా దైవరతి, దైవ సాన్నిధ్యము, మోహారణ విచ్ఛేదము దైవసాయుజ్యము లభించును.

మధురభక్తియనగా సాకార బ్రహ్మమును పరబ్రహ్మముగా భావించు కొని తనను ప్రేయసిగా భావించుకొని పరబ్రహ్మ సాక్షాత్కారమును, సాయుజ్యమును బొందుట.

జ్ఞానభక్తి నిర్గుణోపాసనము ననుసరించి ఆత్మ జ్ఞానము నుపాసించి అహంబ్రహ్మాఽస్మి అను అద్వైతానంద సిద్ధిని సాధించెడి మార్గము.

ముగ్ధ మధురభక్తులు గుణాధికముల ననుసరించి మూడు విధములు. వానిని వరుసగా సకామత్వ, నిష్కామత్వ భేదముల చేతను, స్త్రీ పురుష భేదములచేతను విభజించుటకు వీలగుచున్నది. ఇట్లు ముగ్ధ భక్తి పంద్రెండు విధములుగను, మధుర భక్తి పంద్రెండు విధములుగను అగును.


ముగ్ధభక్తి/మధురభక్తి
సాత్త్వికము
రాజసము
తామసము
సకామము
నిష్కామము
సకామము
నిష్కామము
స్త్రైణము
పౌరుషము
స్త్రైణము
పౌరుషము
స్త్రైణము
పౌరుషము
స్త్రైణము
పౌరుషము
సకామము
నిష్కామము
స్త్రైణము
పౌరుషము
స్త్రైణము
పౌరుషము

భక్తిని భవద్రూప రతిగా భావించిన ప్రాచీనులు విభావముల నాశ్ర యించియు, అవస్థాభేదముల నాశ్రయించియు, ప్రక్రియలను, ప్రవత్తుల నాశ్ర యించియు, ఆయా మతముల కనుగుణములైన భక్తి ప్రస్థానముల ననుస రించియు భక్తిరస భేదములను పేర్కొనిరి. భేదము లన్నియు విశ్లేషణ కుపక రించునవి. కాని తత్త్వతః భక్తిరస మొక్కటియే. ఉపాధి భేదములచే వివిధ ఘట్టములలో నున్న జలములలో సూర్యబింబ మొక్కటి యయ్యును అనేక ప్రతిబింబములుగా భాసించునట్లు భక్తిరసము బహు భంగులుగా వివేచింప బడినది. భక్తిరసానుశీలమున భక్తి భేదములు రసవిచార సారములుగ రాణింపగలవు.



# భక్తి-రసము

'కాంతాది విషయావాయే రసాద్యాస్తత్రనేదృశం
రసత్వ పుష్యతే పూర్ణ సుఖాస్పర్శిత్వ కారణాత్'
'పరిపూర్ణరసా క్షుద్రరసేభ్యో భగవద్రతిః
ఖద్యోతేభ్య ఇవాదిత్య ప్రభేవ బలవత్తరా'॥[1] (భ.ర.సి. 2-77,78)

కాంతాది విషయకములైన రసములన్నియు క్షుద్ర రసము లనదగినవి. భగవద్రతిగల భక్తియే ఉత్తమరసము, పూర్ణరసము. భగవద్రతియందు వలె పూర్ణసుఖముగాని, ఆనందముకాని కాంతాదులయందలి రతియందు లేదు. కావున వానియందు రసపుష్టి లేదు. మిణుగురు పురుగుల మినుకుమినుకను కాంతికన్న సూర్యకాంతి యెట్లు తేజస్సమన్వితమో అట్లే రసములన్నిటికంటె భగవద్రతి భగవద్రతిస్థాయికమైన భక్తి బలవత్తరము, తేజస్కరము. ఈ మాటలు భక్తిని పరిపూర్ణరసముగా భావించిన మధుసూదన సరస్వతి మహితోక్తులు.

ప్రాచీనాలంకారికులలో పెక్కురు భక్తిని రసమని అంగీకరింపలేదు. భక్తి రసమా? భావమా? అను చర్చలు పలువురు చేసిరి. అధిక సంఖ్యాకులు భక్తిని భావముగనే అంగీకరించిరి గాని రసముగా మన్నింపరైరి. మమ్మటాచార్యులు కావ్యప్రకాశమునందు—

'రతిర్దేవాది విషయా వ్యభిచారీతథాంచితః భావ ప్రోక్తః' (4-48).

అని పేర్కొని దేవాది విషయకమగు రతి భావము కావున భక్తియు భావమే యగునని నిర్ణయించిరి. విశ్వనాథుడుకూడ భక్తికి రసత్వమంగీకరింప లేదు. కాని, వత్సలరసము విశేషించి ప్రతిపాదించెను. భక్తికి విభానుభావ వ్యభిచారి సామగ్రిని పేర్కొని రసత్వమును స్థాపించుటకు అనుకూలమగు వాదమును నిర్మించియు భరతాదిమునులు రసములు తొమ్మిదనియే పేర్కొనినారు. కావున భక్తిని రసముగా భావించుట ఒప్పదనినారు. ఇందు విశ్వనాథుడు భక్తిని రసముగా నంగీకరింపకుండుటకు బలమైన కారణములు చెప్పలేదని విమర్శకులు తలంచుచున్నారు.[2]

ప్రాచీనాలంకారికులలో భక్తికి రసత్వము నంగీకరించుటయే కాక దానిని సవిస్తరముగా, సశాస్త్రీయముగా ప్రతిపాదించిన వారు ఇరువురు కలరు. మొదటివారు శ్రీ రూపగోస్వామి. రెండవవారు శ్రీ మధుసూదన సరస్వతి. రూపగోస్వామి వంగదేశీయుడు; పదునారవ శతాబ్ది యందున్నవాడు. అతని భక్తిరస సిద్ధాంత గ్రంథములు రెండు. 1 భక్తిరసామృత సింధువు. 2 ఉజ్జ్వల నీలమణి. ఇతడు ప్రతిపాదించిన భక్తి శ్రీకృష్ణ గోపీ విషయకమైన మధుర శృంగార రూపమైనది. ఇతని తరువాత క్రీస్తుశకము 17వ శతాబ్దిలో నున్న మధుసూధన సరస్వతి భక్తిరసాయనమను గ్రంథమును రచించి, అందు భక్తిరసమును సంపూర్ణ రసమని ప్రతిపాదించెను. భక్తిరస స్వరూప స్వభావములను, ఇతర రసములకంటె దానికిగల ప్రత్యేకము తెలిసికొన వలయునన్నచో పైన మూడు గ్రంథములలో ప్రతిపాదింపబడిన విశేషములను పరిశీలింపవలసి యుండును ప్రత్యేకించి మధుర భక్తికి గురించి అనుశీలింప వలయుననినచో పై మూడు గ్రంథములలో విశేషించి ఉజ్జ్వలనీలమణి తెలిపెడు విలువైన అంశముల నెన్నింటినో గమనింపవలసియున్నది. కావున, ఈ గ్రంథములలోని తాత్పర్యమును సంగ్రహముగనైనను తెలియుట ముగ్ధ-మధుర భక్తి విశేషముల వివేచనకు తోడ్పడగలదు.

## భక్తిరసామృత సింధువు

భక్తి రసామృత సింధువు సార్థకనామధేయము కలిగిన లక్షణగ్రంథము. సింధువనుటచే విషయ వైశాల్యము, అమృతమనుటచే సిద్ధాంత శాశ్వతము, భక్తి రసమనుటచే భక్తి యొక్క రసత్వ సిద్ధియు ఈ గ్రంథనామమందు ధ్వనింపబడుచున్నవి. ఇందు నాలుగు విభాగములు కలవు. వానికి దిక్కుల పేర్లను పెట్టుటలో రూపగోస్వామి దాని వైశాల్యమును సూచించెను. పూర్వదక్షిణ పశ్చిమోత్తర విభాగములు క్రమముగా లహరులను పేర అంతర్విభాగమును పొందినవి. పూర్వ విభాగమునందు నాలుగు, దక్షిణ విభాగమునందు ఐదు, పశ్చిమ విభాగమునందు ఐదు, ఉత్తర విభాగమునందు తొమ్మిది లహరులు గలవు. గ్రంథమునకు సింధువను పేరుండుటచే అంతర్విభాగములకు లహరులని పేరుపెట్టుట సముచితముగా నున్నది.

రూపగోస్వామి పూర్వ విభాగమునందలి ప్రథమ లహరిలో భక్తియన నేమియో నిర్వచించి, దానికిగల యుత్తమ లక్షణములను నిర్దేశించెను. ఆపై భక్తియుదయించు విధములనుబట్టి సాధనభక్తియనియు, భావభక్తియనియు, ప్రేమ భక్తియనియు మూడు రకములను పేర్కొని, వానిని క్రమముగా మూడు లహరులలో వివరించి చెప్పెను. దక్షిణ విభాగములోని ఐదు లహరులలో క్రమముగా భక్తి రసమునకు సంబంధించిన విభానుభావ సాత్త్విక సంచారిభావములను, స్థాయి భావమును గురించి లక్షణాదులను పేర్కొనెను. రూపగోస్వామి పశ్చిమ విభాగమున భక్తిని ఐదు రకములుగా విభజించెను. వానిని ముఖ్యరసములని పిలిచెను. అవి 1. శాంత భక్తిరసము 2. ప్రీతిరసము లేదా దాస్య భక్తిరసము 3. ప్రేయోభక్తిరసము లేదా సఖ్యభక్తిరసము 4. వాత్సల్య భక్తిరసము 5. మధుర భక్తిరసము. భక్తి ప్రధానముగా నీశాఖాపంచకము నాశ్రయించి ప్రతీయమాన మగుచుండునని నిర్దేశించెను. ఇతని మతమున నవ రసములలో శృంగార శాంతములు తప్ప హాస్యాద్భుత వీర కరుణ రౌద్ర భయానక బీభత్సములను నేడును భక్తికి గౌణములని పేర్కొని, వానిని గౌణ భక్తి రసములని ప్రతిపాదించెను. ఉత్తర విభాగమున గౌణ భక్తిరస చర్చతో పాటు మిత్ర వైర రసములను గూర్చియు రసాభాసములను గూర్చియు రూపగోస్వామి వివరించెను. ఈ గ్రంథ ప్రణాళికను గమనించినచో ఉత్తమ రస సిద్ధాంత లక్షణ గ్రంథమున కుండదగిన నిర్మాణక్రమము పాటింపబడినదని స్పష్టమగుచున్నది. భక్తిరస వైశిష్ట్యము, ఉత్పత్తి విధానము, నిష్పత్తి సామగ్రి నిరూపణము, ముఖ్యరస భేదములు, గౌణరస సమన్వయము, వైరి మిత్ర రసవివేచనము, రసాభాసము, స్థితుల వ్యక్తీకరణము అనునవి రస చర్చలో లాక్షణికు లనుసరించు క్రమనిర్మాణ పద్ధతి. ఈ పద్ధతిని పాటించుట వలన భక్తి రసామృత సింధువు ఉత్తమ లక్షణ గ్రంథముల కోవలో నొకటియై యలరారుచున్నది.

రూపగోస్వామి ఉత్తమ భక్తి నిట్లు నిర్వచించెను:

అన్యాభిలాషితా శూన్యం జ్ఞానకర్మాద్యనావృతమ్
ఆనుకూల్యేన కృష్ణానుశీలనం భక్తిరుత్తమా॥ భ.ర సిం. 1-1-11.

శ్రీకృష్ణానుశీలన ప్రధానమైన చిత్తవృత్తి విశేషమే భక్తి. శ్రీకృష్ణ భక్తిని పెంపొందించుకొనవలయునన్న అభిలాష తప్ప మిగిలిన కోరికలేవియు లేకుండుట ఉత్తమ భక్తికి మొదటి లక్షణము. 'అహం బ్రహ్మాస్మి' అను అద్వైత సిద్ధిని సాధించెడి జ్ఞానముచేతను, నిత్యకర్మలు అష్టాంగయోగాదులు మొదలైన కర్మలనాచరించిన కర్మమార్గము చేతను ఆవరింపబడకుండుట రెండవ లక్షణము. శ్రీకృష్ణభక్తిని సాధించుటకు అనువుగా త్రికరణశుద్ధితో అనుకూల చిత్తవృత్తిని ఏర్పరచుకొని శ్రీకృష్ణుని నామరూపగుణ లీలలను శ్రవణ కీర్తన స్మరణాదులచే సంతత తైలధారారూపమైన రతిభావముతో శ్రీకృష్ణానుశీలనము చేయుటయే ఉత్తమ భక్తికి పరమార్థము.

భక్తిని నిర్వచించి దాని మాహాత్మ్యము నిట్లు రూపగోస్వామి ప్రశంసించెను.

'క్లేశఘ్నీ శుభదా మోక్ష లఘుతాకృత్ సుదుర్లభా
సాంద్రానంద విశేషాత్మా శ్రీకృష్ణా కర్షణీచ సా'॥ భ.ర.సిం. 1-1-13.

భక్తి వలన ప్రయోజనము లైదు సిద్ధించునని రూపగోస్వామి పై శ్లోకమునందు ప్రతిపాదించెను. 1. భక్తి క్లేశములను నాశనము చేయును. పాపము, పాపబీజము, అవిద్య అను మూడు విధములుగా క్లేశము లుండును.[3] పాపము అప్రారబ్ధమనియు, ప్రారబ్ధమనియు రెండు విధములు. కర్మ సంస్కార రూపమున జీవుని నావరించియుండెడి అనాదియైన పాపము అప్రారబ్ధము. ఫలోన్ముఖమై జీవు డనుభవించుచున్నది ప్రారబ్ధ పాపము. ఈ రెండు విధములైన పాపములను భక్తి తుదముట్టించును. పాపరాహిత్యము జీవులను పవిత్రుల నొనరించును. అధర్మ జన్య సూక్ష్మ పాప వాసనను పాప బీజమందురు. ఇది తపో దాన వ్రతములచే కాక భగవత్పాద సేవరూపమై భక్తి చేతనే నాశనమగును. మాయామూలమైన అవిద్య ఈ రెండింటికంటె దుస్తర మైనది. దానిని హరి భక్తివిద్య అడవిలోని దావానలశిఖ పామును భస్మము చేయునట్లు అవిద్యను అచిరకాలములోనే నామరూపములు లేకుండ చేయును.[4] ఇట్లు క్లేశహారిణియై భక్తి జీవులకు విశుద్ధ భక్తి ప్రవృత్తిని చిత్తమునందుద

2. భక్తి శుభములను కలిగించునని మరొక ప్రయోజనమును గ్రంథ కర్త పేర్కొనెను. సర్వజనప్రీతి, ప్రజానురాగము, సద్గుణ సమూహము, సుఖము మొదలైనవి శుభములని పండితుల యభిప్రాయము, సుఖము విషయ సుఖమనియు, బ్రహ్మ సుఖమనియు, ఈశ్వర సుఖమనియు మూడు విధములు. భోగరూపమైన విషయ సుఖము, మోక్ష రూపమైన బ్రహ్మ సుఖము. పరమా నందరూపమైన ఈశ్వర సుఖము హరిభక్తివలననే లభించునని తాత్పర్యము.

3. భక్తి మోక్షమును కూడ లఘువుగా నొనరించును. భగవద్రతి కలి గినవారికి ధర్మార్థకామ మోక్షములు సహితము అల్పములుగా తోచును. అనగా శ్రీకృష్ణుడే సర్వమని చింతించు భక్తులకు పురుషార్థసాధన రూపమైన ప్రవృత్తి అప్రధానమగుననియు, మోక్షసిద్ధికంటే ముకుంద చరణారవింద సంతత ధ్యాన రతియే మిన్నయనియు గ్రంథకర్త యభిప్రాయము.

4. భక్తి దుర్లభమైనది. అనగా శ్రీకృష్ణభక్తి యజ్ఞాది కర్మ కలాపముల వలనగాని వ్రతాది నిష్ఠలవలనగాని లేదా వేలకొలది సాధనములచేతగాని లభిం చుట దుర్లభమైనదని భావము.

5. భక్తివలన సాంద్రమైన ఆనంద విశేషము లభించుట మరియొక మహత్తర ప్రయోజనము. శ్రీకృష్ణ నామ రూప గుణ లీలాదులను స్మరించుచు అనుభవించెడి ఆనంద విశేషము బ్రహ్మానందాదులకంటె మిన్నయని రూప గోస్వామి యభిప్రాయము.

6. శ్రీకృష్ణు నాకర్షించునది భక్తి. శ్రీకృష్ణుని ప్రేమ పాత్రునిగ చేసి భక్తులు అతనిని వశీకరించుకొందురు. శ్రీకృష్ణాకర్షణ విద్యయే భక్తి. ఇట్టి భక్తి సాధన రూపమునను, భావ రూపమునను, ప్రేమ రూపమునను నుదయించును.

## సాధన భక్తి

**ద్వితీయలహరి:-** ప్రతి జీవునియందు భక్తి నిత్యసిద్ధమైన భావముగా నెలకొనియుండును. దీనిని చిద్రూపుడైన శ్రీకృష్ణ భగవానునియొక్క ఆనంద లక్షణము చిత్కణుడైన జీవునియందు సిద్ధమైయుండునని భక్తి తత్త్వజ్ఞులు పేర్కొందురు. జీవుడు మాయాబద్ధుడైనపుడు స్వానందలక్షణము లుప్తమగును.

సంతత శ్రీకృష్ణ స్మరణాదులవలన అట్టిమాయ తొలగి నిత్యసిద్ధమైన భక్తి హృదయమునందు ప్రకటము కాగలదు. నిత్యసిద్ధమైన భక్తిని హృదయమునందు ప్రకటావస్థలోనికి తీసికొని వచ్చుటయే సాధనయనియు, అది శ్రీకృష్ణుని యందు లగ్నమైనపుడు సాధనభక్తి యనియు పిలువబడును.[5] ఈ సాధనభక్తి రెండు విధములు. వైధీరాగానుగ అనునవి వానిపేర్లు.[6] స్వతస్సిద్ధముగా భగవానునిపై ఆసక్తి కలుగునపుడు శాస్త్రవిధుల నాశ్రయించి సాధన భక్తియందు ప్రవృత్తిని పెంపొందింప జేసికొనుటయే వైధీసాధన భక్తి యనబడును.[7] భక్తులకు శాస్త్రములందు గల దృఢ విశ్వాసమును, శ్రద్ధను, అభిరుచినిబట్టి ఉత్తములనియు, మధ్యములనియు, కనిష్ఠులనియు రూపగోస్వామి వర్గీకరించెను.[8] శాస్త్ర నిపుణుడు, భగవంతునియందు దృఢ నిశ్చయముగలవాడు, శ్రద్ధాపరుడు, ఉత్తమాధికారి.[9] శాస్త్రయుక్తులందు నైపుణ్యము లేనివాడు, భక్తిశ్రద్ధలు కలవాడు మధ్యమాధికారి. కోమలశ్రద్ధ గలవాడు, స్థిరసిద్ధాంతములు లేనివాడు కనిష్ఠాధికారి.[10] గీతలో భక్తులు, ఆర్తులు, జిజ్ఞాసువులు, అర్థార్థులు జ్ఞానులు అని నాలుగు విధములుగా పేర్కొనబడిరి.[11]

ఇట్టి చతుర్విధ భక్తులు భగవంతుని అనుగ్రహమువలనే గాక తద్భక్త సాంగత్య కృపాదులవలనను విషయవాసనలనుండి విడివడి శుద్ధ భక్తికధికారులగుదురనుట నిదర్శనము. గజేంద్ర శౌనకాదులు, ధ్రువ సనక సనాత సనంద సనత్కుమారాదులు.[12] భుక్తి ముక్తి స్పృహా పిశాచము మనసునందున్నంత వరకు భక్తి సుఖము కలుగదు.[13] సాలోక్యాది పంచవిధ ముక్తులను భక్తులు కోరరు. భగవద్భక్తి యను ప్రేమానందము నిర్మల హృదయమునందు మాత్రమే జనించును. అట్టి మనసు భక్తిచేత మాత్రమే ఆకర్షింప బడును.[14] శ్రీకృష్ణ చరణాంభోజ సేవ సంతప్త చిత్తులైన భక్త హృదయము లందెపుడును మోక్ష వాంఛ కలుగదు.[15] చతుర్విధ ముక్తులు భక్తికి విరోధమైనవికావు కాన అట్టి ముక్తులనుబొందినవారికి సహితము కృష్ణభక్తి కలిగినట్లు తెలియుచున్నది.[16] సుఖైశ్వర్యోత్తరమని, ప్రేమ సేవోత్తరమని సాలోక్యాది చతుర్విధ ముక్తులు రెండు విధములు. మొదటి దానియందు సుఖైశ్వర్య కాంక్షలే ప్రధానమైనవి కాన ప్రేమైక మాధుర్యము నందభిరుచి గలవారు వానిని భక్తికి విరోధములుగా తలంతురు [17] ప్రేమైక మాధుర్యము నాస్వాదించు శ్రీహరి ఏకాంతానురక్తు

లగు భక్తులు పంచవిధ ముక్తులలో దేనిని కోరరు.[18] నందనందనునిచే నపహృత చిత్తులగు భక్తులే ఉత్తములు. పురుషోత్తముని ప్రసాదము సహితము వారి మనసు నాకర్షింపదు.[19] స్వరూప సిద్ధాంతములలో శ్రీపతి శ్రీకృష్ణులయందెట్టి భేదము లేకపోయినను పరమోత్కృష్టమగు ప్రేమమయ రసవిషయమున శ్రీకృష్ణుని రూప ముత్కృష్టమైనది[20] ఇదియే రసస్థితి. 'మాఘస్నానమునకు సర్వులును అధికారులే' అని వసిష్ఠుడు రాజునకు తెలియ జేయుచు హరిభక్తి నుదాహరించుటనుబట్టి జాతిమత వివక్షతలేక భక్తికి అందరు అధికారులేనని శాస్త్రములే ధ్రువపరచుచున్నవి.[21] భక్తులు భక్త్యంగముల నను ష్ఠించకపోయినను వారికెట్టి దోషమాపాదింపబడదు. వర్ణాశ్రమ ధర్మములను పాటించకపోయినను, నిషిద్ధ కర్మలనాచరించినను వారు పునీతులే. వారి భక్తియే వారిని దోషరహితులనుగా జేయుననునది వైష్ణవ శాస్త్ర రహస్యము[22] శ్రీహరి భక్తి విలాసమునందు వర్ణించబడిన చతుష్షష్టి విధములగు భక్త్యంగము లను రూపగోస్వామి యథాతథముగా నిందు పేర్కొనెను.[23]

## సాధనభక్త్యంగములు

గురుపాద పద్మముల నాశ్రయించుట, గురుదేవునివలన కృష్ణ దీక్షాది శిక్షణను బొందుట, భక్తి విశ్వాసములతో గురుదేవుని కొలుచుట, సాధు మార్గము ననుసరించుట,[24] సద్ధర్మములను గూర్చి వారినడగుట, శ్రీకృష్ణునికై భోగములను త్యజించుట, మాధవుడు వసించిన ద్వారకాది ధామములందు, గంగాది తీరములందు వసించుట,[25] తగు మాత్రముగ (అన్ని వ్యవహారము లందు) పదార్థములను గ్రహించి నిర్మలముగా, నిరాడంబరముగా జీవితమును గడుపుట, హరివాసర మాచరించుట (ఏకాదశీ వ్రతము పాటించుట), ఉసిరిక, అశ్వత్థము మొదలగు వృక్షములను భగవదైశ్వర్యములుగా భావించి గౌర వించుట[26] అను దశవిధా భంగములు భగవద్భక్తులు తప్పక పాటించ దగిన విధులు.[27]

విధిరూపమున పాటింపదగిన భక్త్యంగములు పది కాగా నిషేధరూప మున పాటింపదగినవి మరియొక పది గలవు. అవి శ్రీకృష్ణునకు విముఖులైన వారి సాంగత్యము. శిష్యులు మొదలగు వారితో అధికమైన అనుబంధము, మఠ స్థాపనాది మహారంభములందును, ఉద్యమములందును ఆసక్తిని ప్రకటించుట,

అనేక గ్రంథములను పఠించి, వ్యాఖ్యానించి, వాదించి, విక్షేపమును పెం
కొనుట, వ్యవహారమున కృపణత్వము కలిగియుండుట అనగా కోల్పోం
వస్తువుల గురించిగాని, అలభ్యమైన వస్తువులను గురించిగాని :
రించుట, బంధు విరహమునకు దుఃఖించుట, అన్యదేవతల నగౌరవ పరచు
భూతజాలమునకు కష్టనష్టములను గలిగించుట, సేవాపరాధములను జేయు
శ్రీకృష్ణునిగాని, శ్రీకృష్ణ భక్తులనుగాని ద్వేషించుట, శ్రీకృష్ణుని తద్భక్తు
ద్వేషించెడి వారు చేసెడి నిందాదులను విని సహించుట-ఈ పది విధము
కార్యములు నిషిద్ధములని రూపగోస్వామి స్పష్టపరిచెను.[28] వీనిని నిషిద్ధ ర
మున పాలింపవలెనని లక్షణ కర్త నిర్దేశము. అనగా శ్రీకృష్ణ విముఖజన సా
త్యాదులను పరిత్యజించుట భక్తి సాధన కుపయోగపడెడి మార్గములని అ
యభిప్రాయము.

విధినిషేధములైన నీ యిరువది భక్త్యంగములు భక్తిమందిర ప్రవేశదా
రూపములైనను, గురుపాదాశ్రయాదులైన మొదటిమూడు భక్త్యంగములు ప్ర
మైనవి. వైష్ణవ చిహ్నములను ధరించుట, హరినామాక్షరములను దేహమ
ధరించుట, మాల్యాదులను ధరించుట. భగవత్సాన్నిధ్యమున నృత్యము చేయు
దండ ప్రణామంబులు ఆచరించుట, ఉత్సవ విగ్రహముల ఊరేగింపునకు
రేగుట, ఉత్సవ విగ్రహముల ఊరేగింపులో పాల్గొనుట, ప్రదక్షిణము గావిం
అర్చించుట, పరిచర్యలు చేయుట, సంకీర్తనము చేయుట, జపము చేయు
విజ్ఞాపనలు చేయుట, స్తోత్రములను పఠించుట, నైవేద్యపాదోదకములను సే
రించుట, శ్రీమూర్తి యొక్క ధూప మాల్యాదుల సౌరభ్య మాఘ్రాణించు
భగవంతుని విగ్రహము స్పృశించుట, దర్శించుట, మంగళహారతి గీతముల
ఉత్సవాది గీతములను వినుట, భగవత్కృపకై వేచియుండుట, స్మరించు
ధ్యానించుట, సేవించుట, సఖ్యభక్తి కలిగియుండుట, ఆత్మనివేదనము చేయు
నిజప్రియోపహరణము, భగవంతుని ప్రీత్యర్థము సర్వదా భగవంతుని శర
కోరుట, భగవద్భక్తులను కూడ సేవించుట, భగవంతునకు ప్రియమైన తు
పూజ చేయుట, శాస్త్ర గ్రంథ పఠనము గావించుట, శ్రీకృష్ణుని జన్మస్థలమై
మథురలో నివసించుట, వైష్ణవులను సేవించుట, శక్తికొలది భక్తులతో గ
ఉత్సవములను గావించుట, భగవంతుని జన్మదినోత్సవములను ఘనమ
జరుపుట, శ్రద్ధాభక్తులతో శ్రీమూర్తి పాదసేవనమొనరించుట, శ్రీమద్భాగవత

స్వాదనము చేయు రసికులతోను సజాతీయాశయములుగల వారితోను సాధువుల తోను కలిసి నామసంకీర్తనము చేయుట, మధురామండలమున నివాసమేర్పరచు కొనుట[29] అనునీనలుబది నాలుగు భక్త్యంగములలో చివరి యైదంగములు పూర్వము చెప్పబడినవేయైనను వాని శ్రేష్ఠత్వము బోధించుటకు మరల చెప్ప బడినవి.[30]

దేహ ఇంద్రియ అంతఃకరణము చేత సమష్టిరూపముగ వేఱువేఱుగా నుపాసించదగిన అరువదినాలుగు భక్త్యంగము లిట్లు తెలుపబడినవి[31] ఇందు కొన్నింటి ఫలములు సామాన్యమైనవి. బహిర్ముఖములైన భక్తుల ప్రవృత్తి భాగవన్ముఖముగా మరల్చుటయే భావభక్తి. మనసు భగవదర్పితము కావలెనే కాని కర్మాంగరూపమున నుండుటవలన ఎట్టి ప్రయోజనము లేదు. జ్ఞాన వైరాగ్యాదులు భక్తికి అంగములనుట యుచితము కాదు.[32] జ్ఞానవైరాగ్యములు కూడ భక్తిమందిర ప్రవేశార్హతను కలుగజేయును కాని, పండితుల యభి ప్రాయములో జ్ఞానవైరాగ్యాదులు మనస్సును కఠిన మొనర్చును భక్తి మనసును సుకుమారముగా మృదువుగా చేయును.[33] జ్ఞాన విరక్త్యాదులవలన సాధించ గలిగినది హరిభక్తియందు ఆసక్తిగల మానవులు భక్తివలన సాధించ గలరు.[34] అట్టివారు అనన్యాభిలాషులై హరిభక్తియం దనురక్తులగుదురు. వైరాగ్యము రెండు విధములుగా చెప్పబడినది. సర్వవిషయములు కృష్ణ సంబంధములుగా చేసి అనాసక్తతతో యథార్హములైన విషయములను గ్రహించుట యుక్తవైరాగ్యమని,[35] హరి సంబంధములైన వానిని ప్రాపంచిక విషయములుగా భావించి మోక్షమునకవి ప్రతిబంధకములని తలచి వానిని పరిత్యజించు ముముక్షువుల వైరాగ్యము ఫల్గువైరాగ్యమని గ్రంథ కర్త పేర్కొనెను.[36] భక్తుడు ప్రయత్నించకయే అంతశ్శుద్ధి, బహిశ్శుద్ధి, తపస్సు శమాది గుణముల నలంకరించుకొనును. రూపగోస్వామి వైధీ భక్తిలోని విభిన్న తత్త్వములను వివరించి రాగానుగ భక్తిని గూర్చి విశదీకరించెను. గోపికలకు గోపాలుని యందుండు భావమే రాగాత్మిక భక్తికి యుత్తమోత్తమమగు ఉదాహరణము కాగలదు. గోకుల మందలి గోప కాంతలు గోపాలకుని యందుగల యట్టి భక్తిని పచరించువారు రాగానుభక్తులు. రూపగోస్వామి ఇష్టవిషయమున స్వారసిక పరమావిష్టతను రాగమందురని రాగమును నిర్వచించెను కృష్ణునియందుగల ప్రేమమయ తృష్ణయే రాగాత్మిక

భక్తి.[37] ఇట్టి రాగాత్మికభక్తి 1. కామరూపమని 2. సంబంధరూపమని రెండు విధములు.[38] భక్తితో మోక్షము సాధించునటులే కామ, క్రోధ, ద్వేష, భయ, స్నేహములతో సహితము శ్రీ కృష్ణునియందు మనసు నిలిపి భగవత్సాక్షాత్కారము, సాయుజ్యము బడయవచ్చును. విషయ నిరూపణార్థము గ్రంథకర్త శ్రీ మద్భాగవము నందలి శ్లోకములను గ్రహించెను. గోపికలు కామము వలనను, కంసుడు భయము వలనను, శిశుపాలాదులు శత్రుత్వము వలనను, వృష్ణివంశీయులు (పాండవులు) సంబంధము వలనను, నారదాది మునులు భక్తి వలనను మనసు భగవంతుని యందు నిలిపి ఆయనను బొందిరి.[39] భయ ద్వేషములు భక్తికి అననుకూల భావములగుటయేగాక విపరీత ప్రతికూల భావము లగుటవలన అనుకరించుట కవి యోగ్యములు కావు. రాగాత్మిక భక్తి భేదములోని కామశబ్దము సంభోగతృష్ణను తెలియజేయుచున్నది.[40] రాగానుగ భక్తులలోనిట్టి తృష్ణకృష్ణ తృష్ణమయము ఇట్టి ప్రీతి గోపికలలో కానబడును.[41] కుబ్జరతి కామప్రాయమైనది.[42] కృష్ణునకు తాను తల్లిననియో, తండ్రిననియో తలంచుచు అట్టి అనుబంధముతో కూడిన కృష్ణభక్తి సంబంధరూప రాగానుగ భక్తి. యశోదానందులభక్తి సంబంధరూప రాగానుగ భక్తి.[43] కామరూప కృష్ణ తృష్ణకు కామానుగమనియు వ్యవహరింతురు.[44] ఇది సంభోగేచ్ఛామయ మనియు, భావేచ్ఛామయ యనియు రెండు విధములు. కేళీ. తాత్పర్యవతిని అనగా కృష్ణుడు గోపికలతో జరిపిన అప్రాకృతక్రీడను సంభోగేచ్ఛా మయ మందురు.[45] భక్తులకు హరియొక్క రూపమాధుర్యము చూచుటవలన కాని, వినుట వలనకాని, వారికికలుగు భావమాధుర్యకామితమే భావేచ్ఛామయమనిరి.[46]

**తృతీయలహరి** భావభక్తి వీచికలతో నలరారు చున్నది.

శుద్ధసత్త్వ విశేషాత్మ ప్రేమాసూర్యాంశు సామభాక్
రుచిభిశ్చిత్త మాసృణ్య కృదసౌ భావ ఉచ్యతే॥

శుద్ధ సత్త్వవిశేషాత్మకమైన సూర్య కిరణములతో సమానమైనది. తత్కిరణ కాంతిచే చిత్తమును కలిగించునది భావము. భావము హృదయమును పవిత్రముగను కోమలముగను జేయును. పైశ్లోకమునందలి రుచి శబ్దము ప్రాప్త్యాభిలాష, అనుకూల్యాభిలాష, సౌహార్ద్రాభిలాష సూచించుచున్నది. మసృణ శబ్దము హృదయము యొక్క మార్దవమును వ్యక్తము చేయుచున్నది.

ప్రేమ యొక్క ప్రారంభికావస్థయే భావము. భావోదయమైన వెంటనే అశ్రు పులకాదులైన సాత్త్విక వికారములు స్వల్పముగా ప్రకటితములగును.[47] భావము నిత్యసిద్ధులలోనొకటి. అది స్వయంసిద్ధమైయుండును. భావముయొక్క సహజ స్వభావమే శ్రీకృష్ణుని స్వరూపము అతని లీలాస్వరూపమును ప్రకటించును. రతి భావము ఆస్వాదన స్వరూపము. అది జీవునియందు కృష్ణస్వాదన హేతురూపమున శ్రీ కృష్ణ లీలాస్వాదన హేతురూపమున వ్యక్తమగుచున్నది.

భావము 1. ప్రాయికము 2. విరళోదయము అని రెండు విధములు. ఈ విభాగము ఉత్పత్తి భేదముచే నేర్పబడినది.[48] సాధనాభినివేశమున జనించిన భావము ప్రాయికము. శ్రీకృష్ణుని యొక్కయు తద్భక్తుల యొక్కయు ప్రసాదము వలన జనించిన భావము విరళము. సాధనాభి వేశము వలన కలిగిన భావము మొదట రుచిని కలిగించి ఆ తరువాత భగవంతునిపై ఆసక్తిని పెంచి రతిని ఉత్పత్తి చేయుచున్నది[49] నాట్యశాస్త్రములందు భావమునకును రతికిని ఈ భేదము పాటింపబడదు.[50] వానిని సమానార్థకములుగా ప్రయోగించుట కానబడును. శ్రీకృష్ణ ప్రసాదమువలన జనించిన భావము వాచికమనియు, ఆలోకదానమనియు, హార్దమనియు మూడు విధములు.[51] శ్రీకృష్ణ భక్తుల ప్రసాదము వలన జనించివ భావము ఆయా భక్తుల స్వభావ భేదములను బట్టి ముఖ్యముగా నైదు విధములుగా నుండును.

భావోదయమైనట్లు సూచించునవి సాధకునిలో కనబడు క్షమ, అవ్యర్థ కాలత్వము, విరక్తి, మానశూన్యత, ఆశాబంధము, సముత్కంఠత, నామసంకీర్తనయందభిరుచి, శ్రీకృష్ణుని గుణ మహిమలను గూర్చిన కథలయందాసక్తి, భగవంతుడు వసించిన దివ్యస్థలములలో నివసించుటయందు ప్రీతి అనునవి సాక్ష్యము.[52] ఇట్టి భావములన్నియు శ్రీకృష్ణునాశ్రయించినపుడు మాత్రమే రతి యనబడును. అన్యాశ్రితమైన భావము రతియనబడదు. మోక్షమును కోరి కృష్ణ భక్తిని పచరించినను అది రత్యాభాసమగునే కాని రతికాదు. అట్టి రత్యాభాసము కూడ 1. ప్రతిబింబ రత్యాభాసము 2. ఛాయారత్యాభాసము అని రెండు విధములు.[53] జ్ఞాన వైరాగ్యములకంటె భక్తితో ముక్తిని పొందుట సులభమని భగవంతుని సేవించు భక్తులలో రతిలక్షణము భాసించుచుండును. చంద్రబింబము నీటియందు ప్రతిబింబించినట్లు భగవత్కీర్తన శ్రవణాదుల

వలన అట్టి భక్తుల శరీరములలో అశ్రుపులకాది సాత్త్విక భావములు భావ మాత్రముగా జనించుటను ప్రతిబింబ రత్యాభాసమందురు.[54] భగవత్తత్త్వము తెలియనివానికి భగవత్క్రియ దేశకాలపాత్రాదుల సంబంధము వలన క్షుద్రకుతూహలముతో కూడి చంచలమయ్యు, దుఃఖహారిణియైన రతిచ్ఛాయను బోలిన భావము కలుగుటను ఛాయా రత్యాభాసమందురు.[55] భగవంతుని యొక్కయు, భక్తులయొక్కయు అనుగ్రహము వలన భావాభాసము భావమగుటయు తటస్థించును. ఒక్కొక్కరిలో సాధనానుష్ఠానము లేకపోయినను, సౌభాగ్యశాలురకు ఆకస్మికముగా భక్తిభావ ముదయించును. సామాన్యముగా లోకోత్తర చమత్కారరూపమైన అత్యంత ప్రబలభావము శ్రీకృష్ణుని కృప వలననే కలుగును. రతి ప్రబలతరమైనచో ఆనందరూపమగును. మచ్చగల చంద్రుని అంధకారము పరాభవింపలేని విధముగా దోషియైనను ఏకాగ్రచిత్తముతో భగవంతు నారాధించు భక్తుని నతని దోషములు సాధనను సమయింపజాలవు.

చతుర్థలహరి ప్రేమభక్తి వీచికలతో నిండారినది. మనసును మృదువుగా చేయు విశేషమైన మమకారము గల సాంద్రమైన భావమే ప్రేమ యని రూపగోస్వామి తెలిపెను.[56] అన్యవిషయములందు మమకారము లేక విష్ణువుపై గల మమకారమే భక్తియని భీష్మ ప్రహ్లాదోద్ధవ నారదాదులు తెలిపినట్లు నారద పాంచరాత్రమునందు గలదు.[57] భగవద్భక్తి వలన కలిగిన పరమోత్కర్షస్థితి పొందిన భావము ప్రేమ. 1. భావోత్థము 2. అతి ప్రసాదోత్థము అని రెండు విధములు.[58] అంతరంగ అంగసేవనమువలన పరమోత్కర్ష స్థితిని పొందిన భావము భావోత్థము.[95] భావోత్థము వైధీరాగానుగ భేదముచే ద్వివిధము. హరి ప్రసాద జన్యమైన ప్రేమయు రెండువిధములు.

1. మహాత్మ్యజ్ఞానయుక్తమైనది. 2 కేవలము.[60] విధిమార్గము ననుసరించు వారికి మహాత్మ్యజ్ఞాన యుక్తమైన భక్తి కలుగునట్లు రాగానురాగము వలన కేవలభక్తి కలుగునట్లును తెలియుచున్నది. సాధకుని ప్రేమభక్తి సోపానము 1. శ్రద్ధ, సాధుసంగమము 3. భజనక్రియ 4. అనర్థనివృత్తి 5. నిష్ఠ 6. రుచి 7. ఆసక్తి 8. భావము 9. ప్రేమ. ధన్యజీవుల హృదయములందిట్టి నవ ప్రేమ జనించును.[61] విద్వాంసులు కూడ అట్టివారి చిత్తము నర్థము చేసికొనలేరు. హరి భావోన్మత్తచిత్తుడు సుఖదుఃఖములను కూడ తెలిసికొనలేడు.[62]




## దక్షిణ విభాగము :

భక్తిరస నిష్పన్నమున కవసరమగు విభానుభావ సాత్త్విక వ్యభి స్థాయి భావములను గూర్చి దక్షిణ విభాగములోని ఐదు లహరులలో వివరి బడినది. భక్తుల మనసులలోని కృష్ణరతి భక్తిరసమగును. భగవద్రతి కలి వారే భక్తి రసాస్వాదయోగ్యులు. శ్రవణాదుల సహాయముతో విభావాదులవ భక్తులహృదయమున నిష్పన్నమై ఆస్వాదయోగ్యమైన భగవద్రతిని స్థా భావమందురు.[63] భక్తివలన దోషరహితులు, ప్రసన్నము, ఉజ్జ్వలము హృదయము గలవారు, భాగవతరక్తులు, రసికజన సంసర్గమందు ఆసక్తి వారు, గోవిందుని పాదారవింద భక్తిసుఖమే జీవనముగా గలవారు, ప్ర యొక్క అంతరంగ కార్యములందే నిమగ్నులునైనవారి హృదయము ఉజ్జ్వల ఆనందరూపమైన రతియే ఆస్వాదనీయమైన భక్తిరసమనియందుర విభావము 1. ఆలంబన విభావమనియు 2. ఉద్దీపన విభావమనియు రె విధములు.

విభావాదుల సామాన్య లక్షణములు :

శ్రీకృష్ణుడు, తద్భక్తులు—ఆలంబన విభావములు

మురళీనాదము—ఉద్దీపన విభావము

ఆనందానుభూతితో చిరునవ్వు నవ్వుట మొదలగునవి—అనుభావముల

స్తబ్ధత - సాత్త్విక విభావములు

నిర్వేదాదులు - సంచారిభావములు.[65]

కృష్ణరతికి హేతువులైన విభావాదులు రెండు విధములు.[66]

1. ఆలంబనములు 2. ఉద్దీపనములు. కృష్ణుడు తద్భక్తులు ఆలంబన విభావములు.[67] కృష్ణుడు 1. స్వరూప 2. అన్యరూపములతో ఆలంబన విభావము లగుచున్నాడు.[68] స్వరూపాలంబన విభావము మరల 1. ఆవృతము 2. ప్రకటనమనియు రెండు విధములు. కృష్ణుడు తన స్వరూపమునగాక అన్య రూపములలో ప్రకటితమైన ఆవృతము స్వస్వరూపముననేనున్న ప్రకటస్వరూప మందురు. రూపగోస్వామి ఈ అధ్యాయమున వివిధాశ్చర్య గుణసముద్రుడైన శ్రీకృష్ణుని గుణములు (నాయక గుణములు) దిఙ్మాత్రముగా తెలిపితినని శ్రీకృష్ణుని చతుష్షష్టి గుణములను వర్ణించెను.[69] సకల నాయక శిఖామణియైన కృష్ణుడు ముప్విధములుగా తోచును.

1. పూర్ణుడు - స్వల్ప గుణములను ప్రదర్శించువాడు - గోకులమందలి గోపాలుడు.

2. పూర్ణతరుడు - కొన్ని గుణములనే ప్రదర్శించువాడు - మధుర యందలి మాధవుడు.

3. పూర్ణతముడు - సకలగుణపూర్ణుడు-ద్వారక యందలి కృష్ణుడు.[70]

శ్రీకృష్ణునిలో ఉత్తమ నాయక లక్షణము లన్నియు కలవు. మాత్స ర్యాదులు లోకమున దోషములుగా ప్రతీతములగుచున్నవి. కాని, లీలావిశేష శాలి యగుటవలన అనఘుడు, భగవద్రూపుడైన కృష్ణుని విషయములో నవి గుణ ములుగానే పరిగణింపబడుచున్నవి.[71]

శ్రీకృష్ణుని సద్గుణము లెనిమిది. 1. శోభ 2. విలాసము 3. మాధు ర్యము 4. మాంగల్యము 5. స్థైర్యము 6. తేజస్సు 7. లాలిత్యము 8. ఔదా ర్యము.[72] శ్రీకృష్ణుని చేష్టలవలన కలుగు అనుభూతి విశేషమే మాధుర్యము. స్థిరత మొదలగు సామాన్య నాయక లక్షణములు శ్రీకృష్ణునియందు విశిష్టముగా కనిపించును.

శ్రీకృష్ణునకు సహాయకులు -
ధర్మవిషయాదులందు - గర్గాదులు
యుద్ధ విషయములందు - యుయుధానుడు
మంత్రాలోచనమున - ఉద్ధవుడు ప్రధానముగా పేర్కొనుట జరిగినది.

ఆలంబన విభావములు శ్రీకృష్ణుడు, అతని భక్తులు. కృష్ణభక్తు సద్గుణ సంపన్నులునై యుందురు. వీరు 1. సాధకులు 2. సిద్ధులని రెం విధములు. శ్రీకృష్ణ భక్తిభావము కలవారందరు కృష్ణభక్తులు.[73] శ్రీకృ సాక్షాత్కారార్థులు సాధకులు. బిల్వమంగళునితో సమానమైన భక్తిప్రపత్తు కలవారిని సాధకులందురు [74] క్లేశరహితులు సతత ప్రేమ సౌఖ్యా స్వా పరాయణులునైనవారు సిద్ధులు. సిద్ధులు మరల రెండు విధములు. 1. సంప్రా సిద్ధులు 2. నిత్యసిద్ధులు.[75] సంప్రాప్త సిద్ధులు మరల రెండు విధములు నుందురు. 1. సాధన సిద్ధులు 2. కృపాసిద్ధులు.

1. సాధన సిద్ధులు అనగా సాధనముతో సిద్ధిని బొందినవారు - మార్క డేయుడు మొదలగువారు.

2. కృపాసిద్ధులు అనగా భగవత్కృపతో సిద్ధిని బొందినవారు - య పతి, వైరోచన, శుకాదులు.

శ్రీకృష్ణునియందు తనకంటె కోటిరెట్లు ప్రేమగలవారు ముకుందునివ నిత్యానందాది గుణములు కలవారు నిత్యసిద్ధులు.[76] శ్రీకృష్ణుని 1. చేష్టలు 2 గుణములు 3. అలంకారములు అనునవి మూడు ప్రధానమైన ఉద్దీపనములుగ చెప్పబడినవి.[77] స్మితము, అంగసౌరభము, వేణువు, శృంగము, నూపురము శంఖము, పాదచిహ్నములు, మధురాది క్షేత్రములు, తులసి, భక్తగణములు జన్మాష్టమి యిత్యాది పుణ్యదినములు కూడ ఉద్దీపనములే. శ్రీకృష్ణుని గుణము ప్రధానముగా మనసును, వాచికమును, కాయికము నాశ్రయించి యుండును.7 ఆలంబన విభావములైన వయసు, సౌందర్యము, రూపము, మృదుత్వము కాయిక గుణములైనను భక్తజన కల్పనల వలన ఉద్దీపన విభావములుగ భావింపబడుచున్నవి. భూషణములు కేవలము ఉద్దీపనలు మాత్రమే.

ద్వితీయలహరి అనుభావములతో ఓలలాడుచున్నది. చిత్తస్థభావములన బహిర్గతము చేసి రసపోషణ కుపకరించు క్రియా విశేషములను అనుభావము లందురు. మనసునందలి భావములను ప్రకటితము చేయునవి అనుభావములు.7 నృత్యము విలుంఠనము (పొర్లుట), గీతాలాపన, క్రోశనము (అరచుట) తను మోటనము (దేహము త్రిప్పుట) హుంకారము, జృంభణము (ఆవులింత), దీర్ఘ

నిశ్వాసము, లోకానపేక్ష, (లోకమును లెక్కచేయకుండుట) లాలాజలస్రావము, అట్టహాసము, ఘూర్ణ (తల త్రిప్పుట), ఎక్కిళ్ళు మొదలగునవి భక్తిరసమునకు అనుభావములు. అనుభావములు 1. శీతలములు 2. క్షేపణములని రెండు విధములు.[80] గీతము, ఆవులింత యిత్యాదులు శీతలములనియు, నృత్యాదులు క్షేపణములనియు రూపగోస్వామి పేర్కొనెను.[81] అట్టహాసము హాసముకన్న భిన్నమైనది. భక్తిరసమున నిది చిత్త సంక్షోభము వలన కలుగును.[82]

## సాత్త్వికభావములు :

దక్షిణవిభాగములోని తృతీయలహరి సాత్త్విక భావవీచికలతో నిండారి యున్నది. శ్రీకృష్ణునితో సాక్షాత్తుగా గాని, కొంత వ్యవధానముతోగాని కలిగిన భావములు మనసు నాక్రమించుకొనినప్పుడు కలుగు స్థితిని సత్త్వమందురు.[82] సత్త్వమునుండి పుట్టిన భావములు కావున సాత్త్విక భావములనిరి. అనగా కృష్ణ సంబంధ భావాక్రాంత చిత్తమునుండి ఉత్పన్నములగు భావములు. ఇవి 1. స్నిగ్ధ 2. దిగ్ధ 3. రూక్షములని మూడు విధములు.[83] స్నిగ్ధ సాత్త్విక భావములు 1. ముఖ్యస్నిగ్ధ సాత్త్విక భావములు 2. గౌణస్నిగ్ధ సాత్త్విక భావములని మరల రెండు విధములు.[84]

1. సాక్షాత్తుగా కృష్ణసంబంధమగు ముఖ్యరతి మనసు నాక్రమించిన ముఖ్యస్నిగ్ధ సాత్త్వికభావము.[85]

2. కృష్ణసంబంధరతి కొంత వ్యవధానముతో గౌణరూపముగా మనసు నాక్రమించిన గౌణస్నిగ్ధ సాత్త్వికభావము.[86]

3. భక్తుని మనసులో (ముఖ్య, గౌణ) రతిద్వయములేక జనించిన భావములు దిగ్ధ సాత్త్వికభావములు. అవి రతి ననుగమించును. కంపమే దిగ్ధ సాత్త్విక భావము.[87]

శ్రీకృష్ణుని మధురతరమైనవి, ఆశ్చర్యకరమైనవియగు మాటలు వినగానే రతిశూన్యుడగు భక్తుని హృదయమున గలుగు ఆనందమే రూక్షసాత్త్విక భావము.[88] రోమాంచము రూక్షసాత్త్వికభావము.

సాధకుని మనసు సత్త్వభావముతోకూడి ప్రాణములు వికారయుక్తములై తనువు నధికముగా క్షోభింపజేయును. అట్టియెడ స్తంభాదిసాత్త్విక భావములు కలుగును. రూపగోస్వామి లక్షణ గ్రంథములందు సామాన్యముగా పేర్కొన బడు సాత్త్విక భావములను, వాని లక్షణములను వివరించుచు అశ్రువును గూర్చి యిట్లు చెప్పెను. అది హర్షము వలన కలిగిన శీతలముగను, రోషాదుల వలన కలిగిన ఉష్ణముగ నుండునని తెలిపెను.[89] సాత్త్విక భావములు సత్త్వము యొక్క తారతమ్యముల ననుసరించి 1 ధూమాయితము 2. జ్వలితము 3. దీప్తము 4. ఉద్దీప్తములని నాలుగు విధములుగా రచయిత విభజించెను.[90] దృశ్యమానములగు భావములను నాలుగు విధములుగా రూపగోస్వామి పేర్కొనెను. 1. రత్యాభాసము 2. సత్త్వాభాసము 3. నిస్సత్త్వము 4. ప్రతీపము.[91]

1. వారణాసి యందలి ముముక్షువులకు కృష్ణలీలా కథాశ్రవణము వలన కలుగు భావము రత్యాభాసము.

2. కృష్ణ కథా శ్రవణము వలన రత్యాదిరహితమైన హృదయమున కలుగు ఆనంద విస్మయాదులు సత్త్వాభాసము.

3. సహజముగనే పిచ్ఛలమగు అంతఃకరణము కొఱకుగాని, నాట్యాభినయము కొఱకుగాని, కార్యసిద్ధి కొఱకుగాని, ప్రయత్నించువారికి కలుగు అశ్రు పులకాదులను నిస్సత్త్వము లందురు.

4. అనుకూల చేష్టలవలన కృష్ణునిపట్ల కలుగు క్రోధభయాదులచే వెల్లడియగు భావాభాసాదులను ప్రతీపభావాభాస మందురు.

రూపగోస్వామి చతుర్థమగు వ్యభిచారి భావ లహరిలో స్థాయి భావమున విశేషముగా అభిముఖముగా సంచరించు నిర్వేదాది సంచారి భావములను ముప్పది మూడింటిని పేర్కొనెను. ఇవి వాగంగముల ద్వారా సూచితమై సంచారితమగును.[92] ఈ సంచారి భావములలో కొన్ని స్వతంత్రములు మరి కొన్ని పరతంత్రములు. స్థాయిభావ రూపమగు అమృత సాగరమున తరంగములవలె లేచి మరల దానిలోనే విలీనమగునవి సంచారి భావములు.[93] పరతంత్ర సంచారిభావములు వరావర భేదముచే మరల రెండు విధములు. వర తంత్ర సంచారి భావములు కూడ 1. సాక్షాత్తు 2. వ్యవహితము అని రెండు

విధములు. స్వతంత్ర సంచారి భావములు 1. రతి శూన్యములు, 2. రత్యానుస్పర్శములు 3 రతిగ్రంథములని మూడు విధములుగా చెప్పబడినవి. ఇట్టి భావములు విపక్షులయందు ప్రయుక్తము లగునపుడు 1. ప్రాతికూల్యము 2. అనౌచిత్యము అని రెండు విధములుగా చెప్పబడినది. ఈ భావములకు దశలు నాలుగు. 1 ఉత్పత్తి 2. సంధి 3. శాబల్యము 4. శాంతి.[94]

1. హర్ష అసూయాది భావోదయావస్థను ఉత్పత్తి యందురు.

2. సమాన రూపమైన లేదా విభిన్న రూపమైన రెండు భావముల కలయికను భావసంధి యందురు.

3. వివిధ భావముల పరస్పర సమర్థమును భావశాబల్యమందురు. కృష్ణుని గూర్చి వినగానే కంసునిలో గలిగిన క్రోధభయములు భావశాబల్యమునకు చక్కటి ఉదాహరణముగా రచయిత పేర్కొనెను.

4. మిక్కిలి ప్రాబల్యము పొందిన భావములు విలీన మగుటయే భావశాంతి.

వ్యభిచారి భావములు కొన్ని స్వాభావికములు మరికొన్ని ఆగంతుకములు.

## స్థాయి భావములు :

దక్షిణ విభాగములోని పంచమలహరి స్థాయి భావ తరంగములతో నిండియున్నది. విరుద్ధావిరుద్ధ భావములను తన వశము చేసికొని ఉత్తముడైన రాజువలె శోభించునదే స్థాయిభావము.[95] భక్తి శాస్త్రములో కృష్ణవిషయమైన రతియే స్థాయి భావము. ఈ స్థాయి భావము 1. ముఖ్య 2. గౌణ భేదములచే రెండు విధములు.[96] భావ భక్తియందు చెప్పబడిన శుద్ధ సత్త్వ విశేషరూపమైన రతియే ముఖ్యస్థాయి భావము. ముఖ్య రతి 1. స్వార్థ 2. పరార్థ భేదముచే రెండు విధములు.[97] సజాతీయ భావములతో పుష్టిని కలిగించు కొనుచు, విజాతీయ భావములకు లోనుకానిది స్వార్థముఖ్యరతి.[98] స్వయముగా కుంచించుకొని పోపుచు అనుకూల విరుద్ధ భావముకు పుష్టిని కలిగించునది పరార్థ ముఖ్య స్థాయి భావము.[99] స్ఫటిక జల తైలాది విభిన్న వస్తువులలో ప్రతిబింబే సూర్య బింబమువలె పాత్ర విశిష్టతనుబట్టి పరార్థ ముఖ్య రతిస్థాయి భావము మారుచుండును.

ముఖ్య రతి ఐదు విధములు. 1. శుద్ధము 2 ప్రీతి (దాస్యము) 3. సఖ్యము 4. వాత్సల్యము 5. ప్రియత (మధుర). శుద్ధ స్థాయి భావము 1. సామాన్య 2. స్వచ్ఛ 3. శాంతి భేదములచే మూడు విధములు.[100]

1. సామాన్యులకు కృష్ణుని యందుండు రతిని సామాన్య రతి యందురు.

2. భక్త జన సాంగత్యము వలన సాధకుని యందు కలుగు స్ఫటికము వంటి శుద్ధ భావమును స్వచ్ఛరతి యని యందురు. అట్టి సమయమున భక్తుడు కృష్ణుని ప్రభువుగ, మిత్రునిగ, పుత్రునిగ, ప్రియునిగ, పరమాత్మగా మనసు నందు భావించి తరించును.

3. నిర్వికల్పమైన చిత్తమునందు కలుగు రతిని శాంతరతి యని యందురు[101] శుద్ధరతి 1. కేవలమని 2 సంకులమని రెండు విధములు.

1. కేవలము ఒకే రతి, ఇతర రతుల ప్రమేయము లేకయున్న దానిని కేవల శుద్ధరతి యందురు.[102]

2. రెండుకాని అంతకంటె ఎక్కుడు రతులు కలిగియుండుటను సంకులశుద్ధ రతియందురు.

గోవిందుడు దైవమని, తాను దాసుడను ఆరాధ్యత్వరూప రతిని దాస్య రతి లేక ప్రీతిరతియందురు అట్టి ఆసక్తి గలవారికి మరియేవిషయములం దాసక్తి యుండదు. ముకుందుని సఖునిగా భావించి అతనియందు సఖ్య భావముగలవారి రతి సఖ్యరతి.[103] గురుజనులకు శ్రీకృష్ణునియందు గల అను గ్రహమయ రతిని వాత్సల్యరతియందురు.[104] వీనిలో లాలన పాలనాదులు, ఆశీస్సులు, చిబుకస్పర్శాది క్రియలుండును.[105] గోపికలకు శ్రీకృష్ణునకు మధ్య కలుగు స్మరణ దర్శనాద్యష్టవిధ సంభోగ రతిని మధుర రతి లేదా ప్రియత రతి యందురు. వీనిలో కటాక్ష, భ్రూక్షేప, ప్రియవాణీస్మితాది కార్యము లుండును.[106] విభావ ఉత్కర్షము వలన కలిగిన భావ విశేషమును సంకుచిత్త మైన రతిని పుష్టిని కలుగజేయు దానిని గౌణరతి యందురు.[107]

## గౌణ భావములు :

1. హాసము 2. విస్మయము 3. ఉత్సాహము 4. శోకము 5. క్రోధము 6. భయము 7. జుగుప్స.

కృష్ణ సంబంధమైన విషయములందు మొదట చెప్పిన ఆరు భావములు కలుగవచ్చును. కాని భక్తుల మనసులలో శుద్ధరతి కలిగిన పిమ్మట వారి శారీరక విషయములందు వారికి కలుగు జుగుప్సయే గౌణభక్తి రస చర్చలోని జుగుప్సరతి యగును.[108] వికృతభాషణ వేష చేష్టాదుల వలన చిత్తవికాసకారి యగు హాసరతి జనించును. ఈ హాస్యము భక్తునకు కృష్ణ సంబంధమగు విషయము వలన కలుగును. ఒక్కొక్కప్పుడు భక్తులు భగవల్లీలను కీర్తించు నెడ జనించు హాసాదుల వలన హాసరతి స్థాయిభావత్వము నంగీకరించుచున్నారు. హాసాదులైన గౌణస్థాయి భావములు సహజములైనను బలమైన భావములచే తిరస్కృతములై పోవును. కాన వానిని గౌణ భావములనిరి. భక్త జనుల యందుండు రతి వ్యభిచారికాదు. స్వకీయమైన ఆధారముతో స్వస్వరూపముతో అవ్యభిచారముగా భక్తజనులలో రతి స్థాయిత్వమొందును. హాసాదులు రతి లేకున్నచో స్థాయి భావత్వము నొందవు. విపక్షాదులందు క్రోధాదులు రతి శూన్యములగుటచే వ్యర్థములగును

లోకోత్తర చమత్కారము వీక్షించుట వలన కలుగు చిత్తవికారము విస్మయము. ఇది శ్రీకృష్ణ విషయకమైన విస్మయరతి. ఉత్సాహరతి యందు భళీ, వహ్వా వంటి పలుకులు శ్లాఘిత మనసాసక్తి ధైర్యత్యాగాది గుణములు ప్రకటితములగును. ఇష్ట వియోగాదుల వలన ఉత్పన్నమగు చిత్తక్లేశాధిక్యము శోకమగును. విలాపము, పతనము, నిశ్వాసము, ముఖశోష మున్నగునవి అను భావములు. కఠినత్వము, కన్నులెఱ్ఱబారుట, కనుబొమలు ముడివేయుట మున్నగు అనుభావములందు కాననగును. భయంకర దృశ్యములను తిలకించుట వలన కలుగు చిత్తచాంచల్యమును భయమందురు. పలాయనాది చేష్టలిందు ప్రసిద్ధములు. కంటక ప్రాయములైన విషయ దర్శన శ్రవణాదులు లేదా స్మరణవలన చిత్తమున కలుగు సంకుచిత్వము జుగుప్స. దీనిలో నిష్ఠీవనము, ముఖము చిట్లించుట, నిందించుట మొదలగు అనుభావములు ప్రకటితము లగును. ఇట్టివి కృష్ణానుకూలములు కాకపోయిన రతికాక మానవచిత్త వికారమే

యగును. కృష్ణసంబంధమువలన నీభావములు అప్రాకృతములై త్రిగుణాతీత ములై ప్రౌఢానందమయములగును. కృష్ణసంబంధములైన భావములు మూడు విధములు :

1. సాత్త్వికప్రధానమైనవి - లజ్జ, బోధ, ఉత్సాహాదులు.
2. రాజప్రధానమైనవి - గర్వము, హర్షము, సుప్తి, హాసాదులు.
3. తామసప్రధానమైనవి - విషాదము, దీనత, మోహము, శోకము మొ॥

ఈ భావములన్నియు శీతోష్ణభేదముచే రెండు విధములు. సుఖమయములు శీతాదులు. దుఃఖమయములు ఉష్ణాదులు [109] కృష్ణాదుల దర్శన శ్రవణాదులవలన రతి (ముఖ్యమైనను, గౌణమైనను) విభావాదులను బొంది భక్తుల మనసులలో రసరూపమును బొందును.[110] పెరుగు మొదలగు ద్రవ్యములు చక్కెర మొదలగు వాని కలయిక వలన ఆస్వాదయోగ్యమై రసాలముగా నెట్లు మారునో అభినయాదుల వలన సాక్షాత్ కృష్ణాదుల అనుభవము పొందుట వలన భక్తులకు అద్భుతమైన అపూర్వమైన, ప్రౌఢమైన, ఆనందభరితమైన చమత్కారము రసరూపములో అనుభవమునకు వచ్చును.[111] రతికి కారణభూతులు కృష్ణుడు, అతని భక్తులు. కృష్ణ సంబంధమైన మంజులమైన రతి విభావానుభావ సంచారి భావముల ద్వారా పరిపుష్టమైన రసస్థితిని బొందును. సముద్రము తన నీటితోనే మేఘములను తయారుచేసికొని వానివలన అభివృద్ధి పొందినట్లని రూపగోస్వామి చక్కని యదాహరణములతో దీనిని వివరించెను. రతికి పరమావధి కృష్ణుడే ఆలంబనముగాగల సాంద్రానంద చమత్కారము. భక్తి రసము ముఖ్య గౌణభేదములచే రెండు విధములు. ముఖ్య భక్తిరసములు ఐదు: 1. శాంత భక్తిరసము 2. ప్రీతి (దాస్య) భక్తిరసము 3. ప్రేయో (సఖ్య) భక్తిరసము. 4. వత్సల భక్తిరసము 5. మధుర భక్తిరసము. ఉత్తరోత్తరము బలీయమని రూపగోస్వామి పేర్కొనెను.[112]

గౌణభక్తి రసములు ఏడు: అవి-1. హాస్య భక్తిరసము 2. అద్భుత భక్తిరసము 3 వీరభక్తి రసము 4. కరుణభక్తి రసము 5. రౌద్ర భక్తిరసము 6. భయానక భక్తిరసము 7. బీభత్స భక్తిరసము. [113] పురాణములు ముఖ్య

క్తిరసములను భక్తి రసములుగను, గౌణ భక్తి రసములను భావములుగను ప్పినవి శ్రీరూపగోస్వామి భక్తిరసములోని ముఖ్య గౌణ రసములకు ఈక్రింది ర్ణములను నిర్దేశించెను. భరతుడు పంద్రెండు వర్ణములను వేరువేరు దేవతల న్వయించి చెప్పగా రూపగోస్వామి పంద్రెండు వర్ణములను కృష్ణుని పంద్రెం వతారముల కన్వయించి చెప్పెను.

| సము | వర్ణము | అవతారము |
|---|---|---|
| ాంతరసము | శ్వేతము | కపిలావతారము |
| ీతిరసము | చిత్రము | మాధవావతారము |
| ేయోరసము | అరుణము | ఉపేంద్రావతారము |
| త్సలరసము | శోణము | నృసింహావతారము |
| ధుర భక్తిరసము | శ్యామము | నందనందనావతారము |
| ాస్యరసము | పాండురము | బలరామావతారము |
| ద్భుతరసము | పింగలము | కూర్మావతారము |
| రరసము | గౌరము | కల్క్యవతారము |
| రుణరసము | ధూమ్రము | రాఘవావతారము |
| ౌద్రరసము | రక్తము | భార్గవావతారము |
| యానకరసము | కాలము | వరాహావతారము |
| భత్సరసము | నీలము | బుద్ధావతారము |

భక్తిరసాస్వాదనలోని చిత్తావస్థల క్రమమును రూపగోస్వామి యిట్లు ర్దేశించెను : 1. పూర్ణము 2. వికాసము 3. విస్తారము 4. విక్షేపము . క్షోభము.[114]

కృష్ణ రతితో సమానమైనది మరియొకటి లేదు. తార్కికులు మీమాంస లు భక్తి కధికారులు కారు. వ్యర్థమైన వైరాగ్యాభిమానులు భక్తి శూన్యమైన ుష్కజ్ఞానులు కేవలహేతువాదులు భక్తిరసాస్వాదనమునకు విముఖులైన ీమాంసకులు భక్తిరసవిషయమున కధికారులు కారు. రసిక భక్తులు చోరుల ండి నిధులను రక్షించుకొన్నట్లు అనధికారులనుండి కృష్ణభక్తిని రక్షించుకొన వలెను.

భక్తి దురూహమని కృష్ణ రతితో సమానమైన రతి మరియొకటి లేదని రచయిత ఉద్ఘాటించెను. భావనా మార్గము నతిక్రమించి చమత్కారమున కాకరమైన సత్త్వోజ్జ్వలమై మనసులో కలిగెడి ప్రగాఢమైన ఆనందాస్వాదనమే రసమని రూపగోస్వామి పేర్కొనెను.[115]

హృదిసత్త్వోజ్జ్వలే బాఢం స్వదతే స రసోమతః
భావనాయాః పదం యస్తు బుధేనాన్యబుద్ధినా॥
భావ్యతే గాఢ సంస్కారైశ్చిత్తే భావః కథ్యతే।

పై పద్యమునకు గల వివరములో భావమునకు రసమునకు గల భేదము యోగములో ధ్యాన సమాధులకున్న భేదము వంటిదని, ధ్యానము అంగము కాగా సమాధి యంగియగునని చెప్పబడినది.

## పశ్చిమ విభాగము

ఈ విభాగమునందు ముఖ్యభక్తి రసముల నైదింటిని గూర్చి వివరించబడినది. ముఖ్యభక్తిరసములు 1. శాంత భక్తిరసము 2. ప్రీతి భక్తిరసము 3. ప్రేయో భక్తిరసము 4. వత్సల భక్తిరసము 5. మధుర భక్తిరసము.

శాంతభక్తిరసమునకు శాంతరతియే స్థాయి భావము. ఇందు భగవత్ స్వరూపానుభవమునకే యెక్కువ ప్రాముఖ్యము కలదు. ఈ భక్తిరసమునకు చతుర్భుజుడైన హరియు, శాంతులును ఆలంబన విభావములు.[116] కృష్ణభక్తి గల తాపసులను శాంతులందురు. సనకసనందాదులు ప్రధానులగు ఆత్మారాములు (శాంతులు). ఆత్మారాముల, తాపసుల, భాగవతోత్తముల కృపవలన భక్తుల మనసులలో శాంతరూపమైన భావచంద్రికలుత్పన్నమగును.

ఉపనిషత్కథలు వినుట, ఏకాంతవాసము, అంతర్వృత్తి, కృష్ణస్ఫూర్తి, తత్త్వవివేచనము, విద్యకును శక్తికిని ప్రాధాన్యమిచ్చుట విశ్వరూప దర్శనము నందాసక్తి, భక్తుల సాంగత్యము కోరుట, భగవత్తత్త్వములను చర్చించుట యనునవిరసమునకు అసాధారణ ఉద్దీపన విభావములు. తులసీసౌరభము, శంఖధ్వని, పుణ్యక్షేత్రము ఇత్యాదులు సాధారణ ఉద్దీపన విభావములలో చేర్చబడినవి.

శాంతరసమునకు అసాధారణ విశేష-అనుభావములు, నాసాగ్రమునందు దృష్టిని నిలుపుట, అవధూత వ్యాపారమును సాగించుట, జ్ఞానముద్రా ప్రదర్శనము, హరిద్వేషులందు ద్వేషములేకయుండుట, ఇష్టమైన విషయములందు ఆసక్తిని పెంచుకొనకయుండుట, నిరపేక్షులుగను, అహంకార శూన్యులుగను నుండుట, మమత లేకయుండుట, మౌనమును పాటించుట యనునవి చెప్పబడినవి.[117] రోమాంచము, స్వేదము, కంపము అనునవీరసమునకు సాత్త్వికభావములు. ఈ సాత్త్విక భావములు జ్వలితమగునే కాని దీప్తములు కావు.

నిర్వేదము, ధృతి, హర్షము, మతి, స్మృతి, విషాదము, ఉత్కంఠము, ఆవేగము, వితర్కము అనునవి శాంతరసమునకు సంచారీ భావములు. శాంతరతి శాంతరసమునకు స్థాయిభావము. ఇది సమ, సాంద్ర భేదములచే ద్వివిధము. శాంతరసము 1. పారోక్ష్యమని 2. సాక్షాత్కారమని రెండు విధములు. శాంతరతిలేక భగవంతునియందు ఏకాగ్రత కలుగదు. అందువలన చిత్తత్వమున శాంతరసమును తప్పక గ్రహించవలెను. కేవలము శాంతరసమునుగూర్చి విష్ణుధర్మోత్తరమున వివరింపబడినది. ధర్మవీరాదులు శాంతములో చేరును.[118]

ప్రీతి భక్తిరసమునకే దాస్య భక్తిరసమని పేరు. 1. సంభ్రమప్రీతి 2. గౌరవప్రీతి యని ప్రీతిరసము రెండు విధములు.[119] 'కృష్ణదాసుడను' అను అభిమానముగల భక్తునకు కృష్ణునిపై సంభ్రమప్రీతి జనించును. కృష్ణుడు, అతని దాసులు ఈ రసమున కాలంబన విభావము. గోకుల వాసులకు ద్విభుజ రూపముననున్న కృష్ణుడుకాని, చతుర్భుజుడైనన కృష్ణుడుకాని ఆలంబన విభావములగును.[120] చతుర్విధులైన దాసులు దాస్యరతికి ఆశ్రయాలంబనములు 1. అధికృతదాసుడు 2. ఆశ్రితదాసుడు 3 పారిషదదాసుడు 4 అనుగతదాసుడు అనువారు చతుర్విధదాసులు. బ్రహ్మ, శంకరుడు, ఇంద్రుడు మున్నగు జగత్సంబంధ కార్యములందధికారము గల భగవత్సేవకులు అధికృతదాసులు.

ఆశ్రితదాసులు మరల 1. శరణాగతులు 2. జ్ఞానులు 3. సేవానిష్ఠులు మూడు విధములు. కాళీయునిచే జరాసందునిచే బంధింపబడిన వారు శరణాగతులు శౌనకాది ఋషులు జ్ఞాననిష్ఠ దాసులు. చంద్రధ్వజుడు. ఇక్ష్వాకులు మున్నగువారు సేవానిష్ఠ దాసులు.

ఉద్ధవుడు, దారకుడు, జైత్రుడు, శ్రుతదేవ, నంద, ఉపానంద భద్రాదులు పారిషద భక్తులు. వీరు నిర్వర్తించవలసిన విధులలో నెట్టి లోపము రానీయక కార్యములను నెరవేర్చుచు సమయానుసారము భగవత్సేవను చేయుదురు. కౌరవులలో భీష్ముడు, పరీక్షిత్తు, విదురుడు పారిషదదాసులు. ఉద్ధవుడు పారిషద భక్తులలో శ్రేష్ఠుడు.[121]

సర్వదా కృష్ణుని సేవలయందే అసక్తమైన చిత్తము కలవారు అనుగత దాసులు. 1. వ్రజస్థులు 2. పురస్థులు అని వీరు రెండు విధములు. సుచంద్రుడు, మండలుడు, స్తంబుడు, సుతంబుడు, మొదలగువారు ద్వారకపుర మందలి అనుగతదాసులు. రక్తకుడు, పత్రకుడు, పత్రిమధుకంఠుడు మొదలగు వారు వ్రజస్థనుగత దాసులు. వారిలో రక్తకుడు ముఖ్యుడు. వ్రజస్థనుగత దాసులలో స్త్రీ పురుషులు కలరు.[122] పారిషదులు ధుర్యులు, ధీరులు, వీరులు అని మూడు విధములుగా నుందురు.[123] ఆశ్రిత, పారిషద, అనుగత దాసులు నిత్యసిద్ధులు, సిద్ధులు, సాధకులని మూడు విధములు.[124] మురళీనాదము, శృంగధ్వని, స్మితపూర్వావలోకనము, శ్రీకృష్ణ పద్మ చరణ చిహ్నములు మొదలగునవి దాస్యరసమున కుద్దీపన విభావములు, కృష్ణ సేవలో నిమగ్న మగుట, కృష్ణ దాసుల నాదరించుట మొదలగునవి అనుభావములు. ఇవి 1. సాధారణ 2. అసాధారణ భేదముచే రెండు విధములు.[195] శాంత, మధుర భక్తిరసములు కాక తక్కిన మూడు ముఖ్యరసముల యందు స్తంభాది సాత్త్విక భావములు సామాన్యములు. హర్ష, గర్వ, ధృతి, నిర్వేదాదులు ఇరువది సంచారీభావములీ రసమునందున్నవి. మదము, శ్రమ, భయము, అపస్మారము, ఆలస్యము, ఉగ్రత, క్రోధము, అసూయ, నిద్రయను నీ సంచారీ భావములిందు ఎక్కువగా పోషింపబడవు.[126]

కృష్ణుడు భగవంతుడను జ్ఞానముతో ఆదరణముతో కూడిన చిత్తమున సంభ్రమముతో కూడిన కంపము సంభ్రమ ప్రీతిరసమునకు స్థాయిభావము.[127] ఈ సంభ్రమప్రీతి వృద్ధిపొంది ప్రేమ, స్నేహ,-రాగావస్థల వరకు విస్తృత మగును. రాగావస్థయందు కృష్ణవియోగము భరించలేక ప్రాణములు విడుచుట కైనను సిద్ధపడుదురు. కృష్ణ సంయోగము యోగమనియు కృష్ణవియోగము వియోగము లేక అయోగమనియు అందురు.

అయోగము రెండు విధములు : 1. ఉత్కంఠము 2 వియోగము.
యోగము మూడు విధములు : 1. సిద్ధి 2. తుష్టి 3. స్థితి.
ఉత్కంఠిత దశయందు కృష్ణుని చూచుట - సిద్ధి.
వియోగానంతరము కృష్ణునితో యోగము - తుష్టి.
భక్తులు కృష్ణునితో కలిసియుండుట - స్థితి.[128]

శ్రీకృష్ణుడును, అతనిచే లాలింపదగిన వారును (లాల్యులు) గౌరవప్రీతి భక్తిరసమున కాలంబన విభావములు. లాల్యులు అభిమానమునందలి కనిష్ఠత్వ పుత్రత్వముల నాశ్రయించి రెండు విధములుగా నుందురు.

సారణ, గద, సుభద్రాదులు - కనిష్ఠత్వలాల్యులు.
ప్రద్యుమ్న, చారుదేష్ణ, సాంబాది పుత్రులు - పుత్రత్వలాల్యులు.[129]

శ్రీకృష్ణుని వాత్సల్యము, స్మితము, మొదలగునవి ప్రీతిభక్తి రసమున కుద్దీపన విభావములు. శ్రీకృష్ణుని సమీపమున అతనికన్న క్రింది ఆసనమున కూర్చుండుట, గురువుల మార్గము ననుసరించుట యనునవి అనుభావములు. కృష్ణునిపట్ల చూపు తన్మయప్రీతి గౌరవప్రీతి భక్తిరసమునకు స్థాయిభావము.

ప్రేయోభక్తిరసము లేదా సఖ్యభక్తిరసమునకు ద్విభుజములుగల శ్రీకృష్ణుడు, అతని వయస్కులగు సఖులు ఆలంబనవిభావములు.[130] శ్రీకృష్ణుని సఖులు 1. పుర 2. వ్రజ సంబంధభేదములచే రెండు విధములు. పుర సంబంధ సఖులలో అర్జునుడు శ్రేష్ఠుడు. వ్రజసంబంధ సఖులు నాలుగు విధములు. వారు 1. సుహృదులు 2. సఖులు 3. ప్రియసఖులు 4. ప్రియ నర్మసఖులు. వీరు కృష్ణునితో రూప వేషగుణ సమవయస్కులుగా నుందురు.

| | | |
|---|---|---|
| 1. | బలభద్రాదులు-సుహృదులు - | వయసులో కృష్ణునికన్న పెద్దవారు. కృష్ణునియందు వాత్సల్యము గలవారు. దుష్టులబారినుండి కృష్ణుని రక్షించవలెనని ఆయుధములు ధరించువారు. |
| 2. | మరందుడు - సఖులు - కుసుమాపీడ మణిబంధుడు మొదలగువారు | వయస్సులో కృష్ణునికంటె చిన్నవారు. అల్పదాస్య భావయుక్తులు, వీరిలో శ్రేష్ఠుడు దేవప్రస్థుడు. |

| | | |
|---|---|---|
| 3. | శ్రీదామ, - ప్రియసఖులు - వసుదామ, దామ మొదలగువారు | కృష్ణునితో సమాన వయసుగలవారు. కేవలము సఖ్యభావము గలవారు. వీరిలో శ్రేష్ఠుడు శ్రీదాముడు. |
| 4. | సుబలుడు, అర్జునుడు - వసంతుడు, ఉజ్జ్వలుడు మొదలగువారు | ప్రియనర్మసఖులు - కృష్ణుని ఆంతరంగిక మిత్రులు శ్రీకృష్ణుని రహస్య కార్యములు నిర్వర్తించువాడు. సుబలుడు, ఉజ్జ్వలుడు శ్రేష్ఠులు.[131] |

సఖ్య భక్తిరసమునకు కృష్ణుని రూపము, వయసు, వేణువు, లీలలు అనునవి ఉద్దీపన విభావములు. నృత్యము, గానము, ఒకరి భుజములపై మరొకరు ఎక్కుట మున్నగునవి అనుభావములు. శరీర మర్దన, పూలమాలలు వేయుట, వింజామరలు వీచుట మొదలగు దాసులవలె సఖులు చేయు క్రియలిందు కాననగును. సమాన వయస్కులగు ఇరువురి వ్యక్తులనడుమ పరస్పరము గల సంభ్రమరహిత విస్రంభాత్మకరతి దీనికి స్థాయిభావము.[132] ఈ సఖ్యభక్తి రసమున స్థాయి భావమైన యిట్టి రతి ప్రేమ స్నేహరాగములను సంవదించుకొని ప్రణయమువరకు పరిణతి చెందును. రసములన్నింటిలోని సఖ్యరసమే ప్రియమైనదని మధుర భక్తి వాదుల మతము. దీనియందు శ్రీకృష్ణుని యొక్కయు, అతని భక్తుల యొక్కయు సజాతీయ మాధుర్య భావములు విశిష్టముగా కానబడుచుండును.

**వత్సలరసమునకు** శ్రీకృష్ణుడు, అతని గురువులు ఆలంబన విభావములు.[133] కౌమారాది వయోరూప వేషములు, శైశవ, చపలతా, స్మితలీలలు ఈ రసమునకుద్దీపన విభావములు.[134] శిరోఘ్రాణము, చేతితో తల నిమురుట, ఆశీర్వాదము, హితోపదేశము, ఆజ్ఞాపనము, లాలనపాలనాదులు అనుభావములు.[135] ఈ రసమునందు స్తంభాదులైన ఎనిమిది సాత్త్విక భావములు. స్తనముల నుండి క్షీరము స్రవించుట అను సాత్త్వికభావముతో కలిసి తొమ్మిది సాత్త్వికభావములు కలవు.[136] సంచారి భావములన్నియు నిందుకలవు. అనుకంపము చూపునాడు అనుకంప చూపదగిన వానియందు సంభ్రమమేమి లేక చూపు రతియే వాత్సల్య భక్తిరసమునకు స్థాయిభావము.[137]

1. బలదేవుని సఖ్యప్రీతి – ప్రీతి వాత్సల్య మిశ్రితము.
2. యుధిష్ఠిరుని సఖ్యప్రీతి – వాత్సల్య ప్రీతి సఖ్యతామిశ్రితము.

3. ఆహుకాదుల సఖ్యప్రీతి - ప్రీతి వాత్సల్య సఖ్యమిశ్రితము.

4. జరదాభిరికాదుల సఖ్యప్రీతి - సఖ్య ప్రీతి వాత్సల్య మిశ్రితము.

5. నకుల సహదేవ నారదుల సఖ్యప్రీతి - సఖ్యప్రీతి మిశ్రితములు.

6. రుద్రగరుడోద్ధవుల సఖ్యప్రీతి - దాస్యసఖ్య మిశ్రితములు.

ఆత్మోచితమైన విభావాదులచేత హృదయమునందెల్లప్పుడు పుష్టినొందింపబడు మధురాఖ్య భావమే మధురభక్తి రసముగా పరిణమించును.[138] మధురభక్తిరసమునకు శ్రీకృష్ణుడు, అతని ప్రేయసీజనము ఆలంబన విభావములు. శ్రీకృష్ణుని ప్రేయసీ మణులలో వృషభానుని కుమార్తె రాధ శ్రేష్ఠురాలు. మురళీగానము ఉద్దీపన విభావము. కటాక్షస్మితాదులు అనుభావములు. శరీరము పులకించుట, కన్నీరు కార్చుట, మాట తడబడుట మున్నగునవి సాత్త్విక భావములు. మధుర రతి స్థాయిభావము. ఆలస్యము, ఉగ్రత కాక మిగిలిన వ్యభిచారి భావములన్నియు ఈ రసమున వెల్లడియగును.[139] ఈ రాధామాధవ రతి సజాతీయ విజాతీయ భావముల వలన విచ్ఛిన్నము కాదు. మధుర భక్తి రసము 1. విప్రలంభము 2. సంభోగము అని రెండు విధములు.[140] మధురభక్తి రసమును గూర్చి రూపగోస్వామి ఉజ్జ్వలనీలమణి గ్రంథమునందు సవిస్తరముగా వివరించెను.

## ఉత్తర విభాగము - గౌణభక్తిరసములు

ఈ విభాగము నవ లహరులచే నలరారుచున్నది. గౌణభక్తి రసములు హాస్యాద్భుత వీర కరుణ రౌద్ర భయానక బీభత్సములని పూర్వమే వివేచించబడినవి. హాస్య భక్తి రసమునకు శ్రీకృష్ణుడు విషయాలంబన విభావము. అతని సంబంధులు ఆశ్రయాలంబనములు. శ్రీకృష్ణుని వంటి వేషము ధరించుట, చరిత్ర భాషాదుల ననుకరించుట అనునవి ఉద్దీపన విభావములు. ముక్కు కదలించుట, చెక్కిళ్ళు కదలించుట మున్నగున వీరసమునకు అనుభావములు. హర్షాదులు సంచారి భావములు. హాసరతి స్థాయి భావము. హాస మారు విధములుగా చెప్పబడినది.[141]

అద్భుత భక్తి రసమునకు విస్మయ రతి స్థాయి భావము. కృష్ణుడు ఆలంబన విభావము. చేష్టాదులు ఉద్దీపన విభావములు. నేత్ర విస్తారము, స్తంభము, అశ్రుపులకాదులు అనుభావములు. ఆవేగహర్ష జాడ్యాదులు వ్యభిచారి భావములు.[142] ఈ విస్మయరతి రెండు విధములు. 1. సాక్షాత్తు. 2. అనుమితము. కృష్ణుని అద్భుత లీలలు సాక్షాత్తుగ చూచినవి సాక్షాత్తు. జరిగిన విషయములను, సంకీర్తనాదులను విని ఊహించునది అనుమితము.[143]

వీర భక్తి రసమునకు ఉత్సాహరతి స్థాయి భావము. భక్తులందరు వీర భక్తి రసమునకు ఆలంబన విభావములు.[144] ఈ వీరము యుద్ధ దాన, దయా ధర్మములని నాలుగు విధములు.[145] శ్రీకృష్ణుని పరాక్రమాతిశయములు చెప్పుకొనుట, భుజము కొట్టుకొనుట మున్నగునవి ఉద్దీపన విభావములు.

కరుణ భక్తి రసమునకు శోకరతి స్థాయి భావము. శ్రీకృష్ణుడు, అతనికై తపించు ప్రియులు ఆలంబన విభావములు. శ్రీకృష్ణుని చేష్టలు, రూప గుణములు ఉద్దీపన విభావములు. ముఖశోష, విలాపము, శ్వాస రోష భూపాతము ఎదపై కొట్టుకొనుట అనునవి రసమునకు అనుభావములు. ఆలస్యము, అపస్మృతి యనునవి రసమునకు సంచారిభావములు.[146]

రౌద్ర భక్తి రసమునకు క్రోధరతి స్థాయిభావము. శ్రీకృష్ణుడు మిక్కిలి అహిత కార్యములను చేసినపుడు సఖులకు కలుగు క్రోధమే రౌద్రమునకు రతి. ఒక్కొక్కమారు సఖిపై సఖులపై కూడ కోపము కలుగును.[147]

భయానక భక్తి రసమునకు భయరతి స్థాయి భావము. శ్రీకృష్ణుడు ఆలంబన విభావము. ఇవి రెండు విధములు 1. కృష్ణుడు, 2. దారుణుడు. కనుబొమలు కదలించుట మొదలగునవి అనుభావములు. రోషము, అశ్రువులు సాత్త్విక భావములు. విషాదాదులు సంచారి భావములు.[148]

బీభత్స రసమునకు జుగుప్సరతి స్థాయి భావము. ఆశ్రిత శాంతాదులు ఆలంబన విభావములు. నిష్ఠీవనము, ముఖము ముడుచుట, ముక్కు మూసికొనుట అనుభావములు. ఈ జుగుప్స రెండు విధములు. 1. వివేకజము, 2. ప్రాయికము. కృష్ణ భక్తి కలుగుటతో స్వదేహముపై పుట్టిన జుగుప్స వివేకజము. అపవిత్రము రక్తమాంసముతో కూడిన జుగుప్స ప్రాయికము.[149]



గౌణ భక్తి రసములు బలీయమగుట వలన ముఖ్య రస భావముల నాక్రమించి రస రూపము నొందును. ఈ భావము స్థాయి భావమై విభావాదులచే పుష్టమై రసములగును.

ముఖ్య గౌణ భక్తి రసములకు గల మిత్రత్వ శత్రుత్వ సంబంధములను గూర్చి రూపగోస్వామి యీ విధముగా వివరించెను:

1. శాంత రసమునకు :
ప్రీతి బీభత్స ధర్మ వీరాద్భుత రసములు - మిత్రములు
యుద్ధవీర, రౌద్ర, భయానక రసములు - శత్రువులు.

2. ప్రీతి రసమునకు :
బీభత్స, శాంత, ధర్మవీర దానవీర రసములు - మిత్రములు
యుద్ధవీర, రౌద్రరసములు - శత్రువులు

3. ప్రేయోరసమునకు :
హాస్య, యుద్ధవీర రసములు - మిత్రములు
వాత్సల్య, బీభత్స, రౌద్ర, భయానక రసములు - శత్రువులు

4. వాత్సల్య రసమునకు :
హాస్య, కరుణ భయానకములు - మిత్రములు
మధుర, యుద్ధవీర. దాస్య రౌద్రములు - శత్రువులు

5. మధుర రసమునకు :
హాస్య, సఖ్య రసములు - మిత్రములు
వాత్సల్య,బీభత్స, శాంతరౌద్ర, భయానకములు - శత్రువులు

6. హాస్యరసమునకు :
బీభత్స, కరుణ, సఖ్య, వాత్సల్యరసములు - మిత్రములు
కరుణ, భయానక రసములు - శత్రువులు

7. అద్భుతరసమునకు :
వీర, శాంతాదులైన ఐదు ముఖ్యరసములు - మిత్రములు
రౌద్ర బీభత్సాది రసములు - శత్రువులు

8. వీరరసమునకు :
అద్భుత, హాస్య, సఖ్య, దాస్యరసములు - మిత్రములు
భయానకరసము, కొందరికి శాంతముకూడ - శత్రువులు

కరుణరసమునకు :

| | |
|---|---|
| రౌద్ర, వాత్సల్య రసములు | - మిత్రములు |
| హాస్య, సంభోగ శృంగార, అద్భుతరసములు | - శత్రువులు |

రౌద్రరసమునకు :

| | |
|---|---|
| కరుణ వీరరసములు | - మిత్రములు |
| హాస్య శృంగార భయానకములు | - శత్రువులు |

భయానకరసమునకు :

| | |
|---|---|
| బీభత్స కరుణరసములు | - మిత్రములు |
| వీర, శృంగార, హాస్య రౌద్రములు | - శత్రువులు |

బీభత్స రసమునకు :

| | |
|---|---|
| శాంత హాస్య ప్రీతిరసములు | - మిత్రములు |
| మధుర సఖ్యరసములు | - శత్రువులు.150 |

గౌణ రసము ముఖ్య రసముల వలన పుష్టమై విభావాధిక్యము వలన మును బొందును. ముఖ్యరసము అంగత్వమును బొంది తన వైభవ గూఢ పరచి, ఉపేంద్రుడు ఇంద్రుని పోషించినట్లు గౌణ రసమును ోరించును.151

్రతురసములు కలియుటవలన విరసత్వముత్పన్నమగుటను రసాభాస దురు. కాని ఒకొక్కొక్కప్పుడు అచింత్య మహాశక్తియుక్త మహా ేఖరుడగు కవి ఒకేమా రొకే సమయమున ననేక విరుద్ధ రసములను జనక చమత్కారమునకు మిశ్రితము చేయును. రెండు విరోధ రస ుయిక వలన విరసత్వము జనించును.152

స మంగహీనమైన రసాభాస మందురు. ఈ రసాభాసము 1. ఉప 2. అనురసము, 3. అపరసము అని మూడు విధములు.

. విరూపత్వమును బొందిన స్థాయి భావము ఉపరసము. విభావాను క్తములైన శాంతాది ద్వాదశ రసములు ఉపరసములు.

కృష్ణ సంబంధములు కాని హాస్యాది రసములు అనురసములు. ములు, శాంతరసము అనురసములు.

కృష్ణ విరోధముల నాశ్రయించిన హాస్యాదిరసములు అపరసములు. మ తదాభాసములనియు, రసాభాసములనియు అందురు.

ఈ భావములన్నియు ఆస్వాద్యమానములయినపుడు రస స్వరూపమును బొందునని శ్రీ రూపగోస్వామి భక్తిరసామృత సింధువునందు వివరించెను.[153]

## ఉజ్జ్వలనీలమణి :

శ్రీరూపగోస్వామి రచించిన రెండవ లక్షణ గ్రంథము ఉజ్జ్వలనీలమణి. భక్తిరసామృత సింధువునందు ముఖ్య భక్తిరసములను గూర్చియు, గౌణ భక్తి రసములను గూర్చియు వివరించి ఆ లక్షణకర్త మధుర రసమును గూర్చి విపులముగా నిందు వివరించెను. మధుసూదనుడు మధుర రసామృతమూర్తియనియు, అతనికి సంబంధించిన రసము మధుర రసమనియు, అదియే ఉజ్జ్వల రసమని పిలువదగినదనియు రూపగోస్వామి యిందు ప్రతిపాదించెను. ఒకవిధముగా నీ గ్రంథము భక్తిరసామృత సింధువునకు అనుబంధ గ్రంథమని పేర్కొనదగినది. భక్తిరసామృతము రత్నాకరమైనచో అందలి ఉజ్జ్వలమగు నీలమణి మధుర భక్తి.

ఉజ్జ్వలనీలమణి పదునైదు ప్రకరణములుగా విభజింపబడినది. ఆ ప్రకరణములు. 1. నాయకభేద ప్రకరణము 2. నాయక సహాయభేద ప్రకరణము 3. శ్రీహరిప్రియా ప్రకరణము 4. శ్రీరాధా ప్రకరణము 5. నాయికాభేద ప్రకరణము 6. శ్రీయూథేశ్వరీ భేద ప్రకరణము 8. దూతీ భేద ప్రకరణము 8. సఖీ ప్రకరణము 9. శ్రీహరివల్లభా ప్రకరణము 10. ఉద్దీపన విభావ ప్రకరణము 11. అనుభావ ప్రకరణము 12. సాత్త్వికభావ ప్రకరణము 13. వ్యభిచారి భావ ప్రకరణను 14. స్థాయిభావ ప్రకరణము 15. శృంగారభేద ప్రకరణము.

ఈ ప్రకరణ విభాగమును స్థూలముగా పరిశీలించిన రసమీమాంస కనువుగా నేర్పరచినట్లు స్పష్టము కాగలదు. మొదటి తొమ్మిది ప్రకరణములును ఆలంబన విభావములైన నాయకుని, నాయికలను, తత్సహాయులను, వారి భేదములను వివరించుట కేర్పడినవి. పదియవ ప్రకరణము ఉద్దీపన విభావములను వివరించినది. రసోత్పాదకములైన విభావములను విస్తృతముగా వర్ణించుట ఈ గ్రంథప్రణాళికలోని విశేషము. గమ్యమైన రసమును తెలియుటకు తోడ్పడు అనుభావ సాత్త్విక భావములకు క్రమముగా రెండు ప్రకరణములను, రసపోషకములైన వ్యభిచారి భావములకు మరియొక ప్రకరణము నేర్పరచుట

సముచితముగా నున్నది. 'స్థాయీభావో రసస్మృతః' అను లాక్షణిక సంప్రదాయము ననుసరించి మధుర రస స్థాయిభావము పదునాలుగవ ప్రకరణములో పేర్కొనుట సముచితముగా నున్నది. రసభేదములను పేర్కొని గ్రంథమును ముగించుట రసవిమర్శకుల నిపుణమైన నిర్వహణముగా నొప్పారుచున్నది.

ఉజ్జ్వల నీలమణి గ్రంథము నారంభించుచు శ్రీరూపగోస్వామి మధుర రసప్రధానమును గూర్చియు,దానిని విస్తరించుటకుగల అవసరమునుగురించియు, దానిని విస్తరించుటకుగల అవసరమును గురించియు నిట్లు పేర్కొనెను:

## మధురభక్తి - రసరాజము

"ముఖ్యరసేమ పురాయః సంక్షేపేణోదితో రహస్యత్వాత్
పృథగేవ భక్తిరసరాట్ సవిస్తరేణోచ్యతే మధురః" (1-2)

పూర్వ గ్రంథమైన భక్తిరసామృత సింధువునందు శాంతప్రీతి ప్రేయో వత్సలోజ్జ్వలాదులైన ముఖ్యరసములందు సంక్షేపముగా చెప్పబడిన భక్తి రస రాజమైన మధురభక్తిని ఉజ్జ్వలనీలమణియందు సవిస్తరముగా నుడువుచున్నా నని లక్షణకర్త పేర్కొనిన పైశ్లోకమునుబట్టి మధురభక్తిని రసరాజముగా స్థాపించుట కేర్పడిన లక్షణగ్రంథమే ఉజ్జ్వలనీలమణి యని స్పష్టమగుచున్నది.

మదురరసమునకు ఆలంబన విభావములు గోపికాకృష్ణులు. శ్రీకృష్ణుడు సర్వలక్షణ సమన్వితుడు. రూపగోస్వామి వారి సమగ్రభావ లక్షణ విస్ఫూర్తిని విశేషించి వర్ణించెను. మధుర రసమునకు విషయమైన శ్రీకృష్ణుడు సురమ్యుడు, నవయౌవనుడు, మదురభాషి, ప్రియంవదుడు, ధీమంతుడు, ప్రతిభా సమన్వితుడు, ధీరుడు, విదగ్దుడు, చతురుడు, సుఖి, కృతజ్ఞుడు, దక్షిణుడు, ప్రేమవశ్యుడు, సాగరగంభీరుడు, శ్రేష్ఠుడు, కీర్తిమంతుడు, నారీమోహనుడు, నిత్యనూతనుడు, అతులకేళీసౌందర్యశాలి, ప్రీతిపాత్రుడు, వంశీగానలోలుడు అని ఉత్తమ నాయక లక్షణములనన్నింటిని పేర్కొని, యట్టి పురుషోత్తముడే మదుర రసమునకు విషయమైనవాడని వక్కాణించెను.154 చతుర్విధ నాయక భేదములను పేర్కొని, ఆ గుణములన్నియు శ్రీకృష్ణునియందు సంవదింప బడినవని అన్వయించెను. అంతేకాక పతి, ఉపపతి భేదములుకూడ శ్రీకృష్ణునకు వర్తించునని పేర్కొనెను. లక్షణగ్రంథములందు చెప్పబడిన నాయకభేదము లన్నింటిని శ్రీకృష్ణునియందు అన్వయింపజేసెడు నిష్ఠ రూపగోస్వామియందు

కానబడును. లేనిచో పతియగువాడు ఉపపతియగుట దుర్లభము.[155] శాస్త్రవిధి ననుసరించి కన్యను పాణిగ్రహణము చేసికొనినవాడు పతి. పరకీయను రాగాతిశయముచే ధర్మము నుల్లంఘించి గ్రహించువాడు ఉపపతి. ఈ రెండు లక్షణములును శ్రీకృష్ణునియందు కలవని సమన్వయించిన విధము ఈ గ్రంథమునందలి విశేషము. ద్వారకయందు పతిభావముతోను, వ్రజమునందు ఉపపతి భావముతోను శ్రీకృష్ణుడు చరించినట్లు లక్షణకర్త సమన్వయము. విరుద్ధ లక్షణములు కలిగిన విభావస్వభావములు సహితము పరిపూర్ణుడైన శ్రీకృష్ణుని యందు వివిధావస్థలలో సమన్వయించునవి రూపగోస్వామి ప్రతిపాదనము.[156] అట్లే చతుర్విధ శృంగార నాయకలక్షణములను సహితము శ్రీకృష్ణునియందు సంవదించుటయైనది. స్వీయ నాయకయందు గాఢానురాగము గలవాడు అనుకూలుడు. రాధికయందు బద్ధానురాగుడగుటచే శ్రీకృష్ణు డనుకూలుడగుచున్నాడు. పూర్వ నాయికయందు ప్రేమను వీడకయే అభినవ నాయికయందు చిత్తమును సత్తము చేయువాడు దక్షిణుడు. గోపికా జన హృదయలోలుడైన శ్రీకృష్ణుడు దక్షిణుడు. అట్లే నాయిక పట్ల గూఢాపరాధము నొనరించు శఠుని లక్షణములును, అన్యకాంత భోగ చిహ్నములతో నాయికను నిర్భయముగా చేరి అనృతములాడి ఆమెను అలరింపచేసెడి ధృష్టుడును శృంగార కావ్యములందు ప్రసిద్ధులు. గోపికావిహార చతురుడైన శ్రీకృష్ణునియందు మధురభావోచితముగానీ శృంగార నాయక లక్షణములను రూపగోస్వామి సమన్వయించి ఔచిత్యము పాటించినాడు.[157]

చతుర్విధ నాయకులను పూర్ణతమాది భేదములచే (కృష్ణుడు ద్వారకలో పూర్ణుడుగను, మధురలో పూర్ణతరుడుగను, (వ్రజములో పూర్ణతముడగును నుండునని) మూడు విధములుగా విభజించుటవలన $(4 \times 3 = 12)$ వారిని పతి ఉపపతి భేదములచే పునర్విభజించుట వలన $12 \times 2 = 24$ వీరిని అనుకూలాది చతుర్విధ భేదములచే పునర్విశ్లేషించుటవలన, $24 \times 4 = 96$ రూపగోస్వామి నాయక భేదములను మొత్తము తొంబదియారుగా నిరూపించెను.[158] ఈ భేదములన్నియు శ్రీకృష్ణునియందు అవస్థలననుసరించి భాసించుచుండునని లక్షణకర్త సమన్వయించెను. ప్రథమ ప్రకరణమునందలి యిట్టి విభాగము శ్రీకృష్ణుని పరిపూర్ణ ప్రేమరస స్వరూపునిగా సంభావించిన రూపగోస్వామి మధుర రస ప్రతిపాదన ప్రతిభను ప్రదర్శించుచున్నది.

రెండవ ప్రకరణమునందు రూపగోస్వామి నాయకసహాయకులను ఐదు విధములుగా పేర్కొనెను. వారు 1. చేటుడు 2. విటుడు 3 విదూషకుడు 4. పీఠమర్దుడు 5. ప్రియనర్మసఖుడు.[159] ఆపై దూతికాభేదములను గూడ వివరించెను. సంధాన కార్యచతురులు, గూఢకర్మానువర్తులు, ప్రగల్భవచనులు అగు భంగుర భృంగారాదులు చేటుల లక్షణములు కలిగి గోకులమున శ్రీకృష్ణునకు సహాయకులుగా నుందురు.[160] వేషోపచార కుశలురు, ధూర్తులు, గోష్ఠి విశారదులు, వశీకరణాది క్రియా సమర్థులును నగు కడార భారతీ బంధ్వాదులు కృష్ణవిటులుగా ప్రసిద్ధులు [161] శ్రీకృష్ణునకు విదూషకులైన వసంతాది గోపకులు మధు మండలాదులు భోజనప్రియులు, కలహప్రియులు, వికృతాంగ వచన వేషాదుల వలన హాస్యరసమును పుట్టించువారుగా నుండిరి.[162] గుణమునందు నాయకునితో తుల్యుడైనవాడు, శ్రీకృష్ణుని పట్ల అత్యంత ప్రేమ కలవాడు, శ్రీకృష్ణునాజ్ఞానువర్తియగు శ్రీదాముడు పీఠమర్దుడు.[163] ఆత్యంతిక రహస్యజ్ఞులు, స్నేహభావము కలవారు, ఆశ్రితులునగు సుబలార్జునాదులు శ్రీకృష్ణుని ప్రియనర్మఖులు.[164] రూపగోస్వామి నాయక సహాయకులకు అనువైన రసములను గూడ నిర్దేశించెను. చేటులందు దాస్యభక్తియు, పీఠ మర్దులయందు వీరరసము, ప్రియనర్మసఖాదులయందు సఖ్యరసము గోచరించు చుండునని పేర్కొనెను. శ్రీకృష్ణ సహాయకులలో స్త్రీలుకూడ నున్నారు. వారిని దూతికలందురు. స్వయందూతికలని, ఆప్తదూతికలని దూతికలు రెండు విధములు. స్వయందూతికలు కటాక్ష వంశీధ్వనులు. ఆప్తదూతికలు వీరబృందలు. వీరుకాక లింగిని మొదలగు సాధారణ దూతికలు కూడ కలరు.[165]

కృష్ణవల్లభ లక్షణములను గూర్చియు తద్భేదములను గూర్చియు శ్రీహరి ప్రియా ప్రకరణమునందు రూపగోస్వామి వివరించెను. హరివల్లభగణములు స్వకీయలనియు, పరకీయలనియు ప్రధానముగా రెండు విధములు.[166] పాణి గ్రహణ విధిచే ప్రాప్తించిన పతి యొక్క ఆదేశములను పాలించుటయందు తత్పరత కలిగియుండు సతి స్వకీయ. శ్రీకృష్ణుని భార్యలైన రుక్మిణీ సత్యలు స్వకీయలు.[167] లోకధర్మము నుపేక్షించి స్వీయధర్మములను స్వీక రింపక, అనురాగముతో శ్రీకృష్ణునకు ఆత్మార్పణచేసికొను కాంతలు పరకీయలు. వ్రజవనితలు పరకీయలకు చక్కని నిదర్శనములు. శ్రీరూపగోస్వామి

స్వకీయ పరకీయ భేదములను నిరూపించి అన్యలాక్షిణికులవలె వారి అంతర్భేదములను గూడ ప్రపంచించెను. కృష్ణవల్లభలైన స్వకీయులలో అవాంతర భేదములు లేవు.[168] పరకీయలలో కన్యలనియు, పరోఢలనియు రెండు విధములను రూపగోస్వామి నిరూపించెను.[169] ఈ విభాగము లక్షణ గ్రంథములలో సామాన్యముగా కానవచ్చు నాయక విభాగము కంటె విలక్షణమైనది. వ్రజమునందలి గోపికలందరును పరకీయలే. వారిలో కన్యలు, పరోఢలు గూడ నుందురని వివేచనము. అవివాహితులయ్యును, శ్రీకృష్ణునియందు అనురక్తులై రాసలీలయందు పాల్గొను గోపికలు పరకీయలైన పరోఢలు. రూపగోస్వామి యీ లక్షణములను గోపికలకు మాత్రమే వర్తింపచేయక భక్తులందరికిని వర్తింప చేసెను. భక్తునకు తనకుతాను పరోఢగ భావించుకొనినపుడె రసోదయమగును. సాధకులైన భక్తులు తమనుతాము రాసలీలలోని గోపికలవలెనే భావించుకొన వలెనుగాని కృష్ణునిగా తలంపరాదని రూపగోస్వామి నిర్దేశించెను. రాసలీలా సమయమున పలువురు గోపికలకు పలు రూపములతో శ్రీకృష్ణుడు తోచినట్లు భక్తులకు కూడ శ్రీకృష్ణ సాక్షాత్కారమగునని వచించెను.[170] పరకీయలైన పరోఢలు గోపికలని చెప్పునపుడు వారి శీలముల పట్ల నేర్పడు అనౌచిత్యమును తొలగించి భక్తిపరముగా వారి ప్రవృత్తులను రూపగోస్వామి విశేషించి నిరూపించెను. వ్రజమునందలి గోపికలకు యోగమాయవలన వారి పతులతో నెప్పుడు సంగమము కలుగలేదనియు, యోగమాయ గోపికలవంటి స్త్రీ మూర్తులను సృష్టించి వారివారి గృహములందు ఉంచుట వలన గోపికలు రాసలీలా నిమగ్నులై యున్నప్పుడు గోపాలురు తమ తమ సతులు ఇళ్ళయందే యున్నారని తలంచుచుండిరి. పరోఢలగు గోపికలకు తమ మనసులు సంభోగేచ్ఛామయములగునపుడు సర్వాతిశాయి యగు శోభతోను, సద్గుణవైభవముతోను శోభిల్లుచుందురనియు, అత్యంత ప్రేమ మాధుర్యాభరణ భూషితులైయుందురని రూపగోస్వామి వర్ణించెను. అట్లగుటచే గోపికలు శృంగార నాయికలకంటె విశిష్టలై భక్తిరస విభావములుగా గోచరించుచుందురు.[171]

పరోఢలను శ్రీరూపగోస్వామి మరల మూడు విధములుగా విభజించెను. 1. సాధనపర, 2. దేవులు, 3. నిత్యప్రియులు అని వారిపేర్లు.[172] సాధనపరలు మరల రెండు విధములు. 1. యౌథికి, 2. అయౌథికి. భక్తిరస సాధనము కొఱకై వ్రజమునందు యూథములుగా (గుంపులు గుంపులుగా)

జన్మించినవారిని యౌథికి యని యందురు. వారిలో మునిగణము, ఉప నిషద్గణము అను రెండు విధములైన గణములుందురు.[173] రామావతార సమయమున రాముని దివ్యమంగళ సౌందర్యమును వీక్షించి యతని పరిష్వంగము నర్థించిన మునిగణమే వ్రజమున గోపికాజనముగా జన్మించెను. అట్టివారిని యౌథికిలోని మునిగణమని పరిగణింతురు [174] గోపికల సౌభాగ్యము నెంచి తత్సౌభాగ్యమును బొందుట కొఱకై కఠోర తపస్సులను గావించి వ్రజమునందు గోపికలుగా జన్మించినవారు ఉపనిషద్గణము.[175] రూప గోస్వామి అయౌథికిని గూడ రెండు విధములుగా పేర్కొనెను. అవి 1. ప్రాచీనము 2. నవీనము. గోపికాభావము నందు అత్యంతనురక్తులై శ్రీకృష్ణుని పట్ల సహజముగా నున్న ప్రేమభావమును పెంచుకొని భక్తిరస సిద్ధికై సాధన చేయువారు అయౌథికి గణము. ఈవిధముగా సాధన చేయువారు ఒక్కొక్కరుగను, లేదా ఇద్దరు ముగ్గురుగను లేదా పెక్కురుగను జన్మించు చుందురు. శ్రీకృష్ణుడు స్వర్గలోకమున స్వీయాంశతో దేవయోనులయందు జన్మించినపుడు వీరును తమ తమ యంశములతో దేవతలరూపమున జన్మించు చుందురు. వీరిని నిత్యప్రియులనియు పిలుతురు. శ్రీకృష్ణుడు భూతలముపై అవతరించిన సమయమున వారును గోపికలుగా జన్మించి అతనికి నిత్య ప్రియ లకు ప్రాణసఖులైరి. అట్టి నిత్య ప్రియలలో రాధయు, చంద్రావళియు కడు ముఖ్యులు. వారు శ్రీకృష్ణునివలె నిత్య సౌందర్య వైదగ్ధాది గుణముల నాశ్ర యించి యుందురు.[176] ఆనందచిన్మయ రసరూపుడైన గోవిందుని పరమ పురుషునిగా భావించి సంతతము భజించుచుందురు. స్కాందపురాణము, ప్రహ్లాద సంహిత మున్నగు గ్రంథములు శ్రీకృష్ణుని నిత్యప్రియలను మరికొందరిని పేర్కొనియున్నవి. వాని కథనము ననుసరించి రాధా చంద్రావళులు కాక విశాఖ, లలిత, శ్యామ, పద్మ, శైబ్య, భద్రిక, తార, విచిత్ర, గోపాలి, ధనిష్ఠ, పాలిక మున్నగు పేర్లు వినవచ్చుచున్నవి.[177] చంద్రావళికి సోమాభ యనియు, రాధకు గాంధర్వయనియు నామాంతరములు కలవు [178] ఇట్లు పెక్కు గ్రంథములు ఆయా గోపికల పట్టీలిచ్చుటకు యత్నించినను ఆ గోపి కల యూథములు వందలకొలదిగా యున్నట్లు తెలియుచున్నది. తాత్పర్యమున తేలిన యంశమేమనగా - శ్రీకృష్ణ పరబ్రహ్మమును భక్తియనెడి సాధనతో పొందవలయుననెడి ఆకాంక్షతో పుడమిపై జన్మించిన పుణ్యజీవులే గోపికలు. వారి యవస్థలనుబట్టి స్వీయలు కావచ్చును, పరకీయలు కావచ్చును.

పరకీయా విభాగమునందును పరోఢ విభాగము తద్భేదములను శ్రీకృష్ణ రక్తులైన భక్తులకు అత్యంత సన్నిహితలై యుండుటచేత ఆ పాత్రల యందు వారు తాదాత్మ్యమును బొంది భక్తిరసానందమును బొందుటకు వీలగునని శ్రీ రూపగోస్వామి యీ ప్రకరణమునందు ప్రపంచి యుండుట విశేషము. సర్వయూధేశ్వరులలో రాధ ప్రధానురాలు. అందువలన రూప గోస్వామి ఆమెను గురించి ప్రత్యేకముగా ఒక అధ్యాయమునే రచించెను. రాధకును చంద్రావళికిని కోట్లకొలది యూథములున్నట్లు పేర్కొనెను. భగవంతుని సర్వశక్తులలో హ్లాదిని మహాశక్తి రాధ. హ్లాదినీ శక్తి సర్వశక్తులలో శ్రేష్ఠమైనది. తత్సారభావ రూపమే రాధయని తంత్ర శాస్త్ర సంప్రదాయము.[179]

రాధ సుష్ఠుకాంత స్వరూపముతో నొప్పారుచుండును. సుష్ఠుకాంత స్వరూపమనగా భూషణముల నలంకరించుకొనకయే సౌందర్యాతిశయముతో శోభిల్లుట. అయినను షోడశ శృంగారములతోను, ద్వాదశాభరణములతోను, రాధ అలంకృతియై యుండునని వర్ణింపబడినది. మాధవునికి వలెనె రాధకు అసంఖ్యాకములగు సుగుణములున్నను రాధను చారుసౌభాగ్య రేఖాఢ్య గంధోన్మాదిత మాధవ సంగీత ప్రసరాభిజ్ఞ, రమ్యవాక్, ధర్మపండితగ పేర్కొనెను.[180] యూథములన్నింటిలోను రాధాదేవి యూథమే సర్వశ్రేష్ఠమైనది. ఆ యూథమునందలి నారీమణులు సర్వసద్గుణ మండితలు, విలాసాదులతో శ్రీకృష్ణు నాకర్షింపగలవారు.[181] రాధ సఖులును ఐదు విధములుగా నుందురని రూపగోస్వామి తెలిపెను. ఆ సఖులందరు శ్రీకృష్ణునియందేకాక రాధా కృష్ణులందును పరమప్రేమను ప్రదర్శించి వారినానందింప చేయుదురు. వారు 1. సఖులు 2. నిత్యసఖులు 3. ప్రాణసఖులు 4. ప్రియసఖులు 5. పరమ శ్రేష్ఠసఖులు.

ఈ గ్రంథమునందలి ఐదవ ప్రకరణము నాయికా భేదములను నిరూపించునది. వ్రజవాసులు శ్రీకృష్ణుని నంద నందనుని రూపముననే భజింతురు. అట్టి నిష్ఠవలన జనించు భావములు ముద్రలు భక్తులకు గూడ దుర్లభములు.[182] విరహవేదన నొందుచున్న గోపికలకు శ్రీకృష్ణుడు చతుర్భుజుడై దర్శన మీయగా వారాతనిని ఆదరింపలేదు. బృందావనేశ్వరి సన్నిధిలో శ్రీకృష్ణుడు ద్విభుజములు కలవాడై ప్రసన్నుడాయెనట.[183] ఇట్లు గోపికలకును శ్రీకృష్ణునకును

నాయికా నాయక (భావము) సంబంధమును ప్రతిష్ఠితము. దీని నాధారముగా గొని శ్రీరూపగోస్వామి సామాన్యముగా లక్షణ గ్రంథములందు కాననగు నాయికా విభాగమును ఈ ప్రకరణమునందు వివరించెను. సామాన్యముగా నితర లక్షణ గ్రంథములలో నాయికలు మూడు విధములుగా పేర్కొనబడు దురు. వారు స్వకీయ, పరకీయ, సామాన్య. రూపగోస్వామి సామాన్య విభాగ మును గ్రహింపక నాయికలు స్వకీయలనియు పరకీయలనియు రెండు విధము లుగా నిర్దేశించెను. స్వభావముల ననుసరించి ఆ నాయికలను ముగ్ధ, మధ్య, ప్రగల్భ భేదములచే మూడు విధములుగా పేర్కొనెను.[184] కన్యయైన నాయిక కేవలము ముగ్ధగానే యుండును. కాని మధ్యా ప్రగల్భలు ధీర, అధీర, ధీరాధీర అను భేదములచే క్రమముగా మూడు విధము లయ్యెదరు. ఇట్లు కన్య 1. మధ్య (ధీర, అధీర, ధీరాధీర) 2. ప్రగల్భ (ధీర, అధీర, ధీరాధీర) 3. ముగ్ధ, మధ్య, ప్రగల్భ $1+3+3=7$. కన్య-1 పరకీయలు 7 స్వకీయలు 7 మొత్తము పదునేను భేదములగుచున్నవి.[185] అవస్థా భేదముననుసరించి శృంగార నాయి కలు ఎనిమిది విధములుగా చెప్పబడుట లక్షణశాస్త్ర ప్రసిద్ధము. వానిని రూప గోస్వామి గ్రహించి గోపికల కన్వయించెను. శ్రీకృష్ణుని అభిసరింపబోవు గోపికలను అభిసారికలుగా పేర్కొని, వారియందు జ్యోత్స్నాభిసారికలను, తమోభిసారికలను గూడ పేర్కొనెను పైపేర్కొనబడిన నాయికలందరు అష్టవిధావస్థలకు పాత్రములైనచో $15\times8=120$ భేదములుగా పరిగణింప బడుదురు. నాయకుని ప్రణయానుసారము మధ్యప్రగల్భ నాయికలను ఉత్తమ మధ్యమ కనిష్ఠ భేదములచే భాసింతురని రూపగోస్వామి నిరూపిం చెను [186] అట్లగుటచే మొత్తము నాయికావిభాగము $120\times3=360$ అగు చున్నది. ఈనాయికలందరును సచ్చిదానందుడగు శ్రీకృష్ణుడే పురుషుడని భావించి భక్తిభావముతో నాయికాత్వమును భజించువారు. శ్రీకృష్ణప్రేమ చిన్మ యానంద రూపము. దానిననుభవించు నాయికలు తత్తదావస్థాభేదములచే పలు రకములుగా గోచరించినను శృంగార నాయికలకంటె ఉదాత్తలు, ఉజ్జ్వలలు.

హరివల్లభలలో యూథేశ్వరీగణములకు విశిష్టస్థానము కలదు. అందు వలన శ్రీరూపగోస్వామి ఆరవ ప్రకరణమునంతటిని శ్రీ యూథేశ్వరీ భేద వివరణమున కుపయోగించెను. సౌభాగ్య తారతమ్యమునుబట్టి యూథేశ్వరులు అలఘులనియు. సమలనియు, లఘ్వలనియు మూడు విధములుగా నుందురు.

వారు మరల ప్రఖర, మధ్య, మృద్వీ భేదములచే క్రమముగా మూడు విధము లగుదురు. ప్రగల్భములైన పలుకులతో తన దుఃఖమును వెల్లడించునది ప్రఖర. మృదువుగా పలుకు కోమలి మృద్వీ. నాతిప్రగల్భయు నాతి మృద్వియునైనది మధ్య.[187] అధికావిభాగమునకు చెందిన యూథేశ్వరి ఆత్యంతికి, అపేక్షికి భేదములచే ద్వివిధము. ఆత్యంతాధికయైన యూథేశ్వరియే రాధిక. ఆమెతో తుల్యమైన స్త్రీ వ్రజమున కానరాదు.[188] శ్రీరూపగోస్వామి యూథేశ్వరీ భేద నిరూపణానంతరము దూతీభేద ప్రకరణమును రచించెను. శ్రీకృష్ణ సంగమమును ఉత్కంఠతో కోరు నాయికలకు దూతికల సహాయ మవసరమనియు, అందువలన దూతికాభేద నిరూపణము సమర్థనీయమని రూపగోస్వామి యభిప్రాయము. స్వయందూతికలనియు, ఆప్తదూతికలనియు దూతికలు రెండు విధములు. అనురాగ మోహితయైన నాయిక ప్రేమాతిశయముచే అత్యౌత్సుక్యతను ప్రకటించుచు లజ్జ నధిగమించి నాయకునితో తన రాగాతిశయమును ప్రకటించునది స్వయందూతిక. స్వయందూతిక స్వయముగా నాయికయే. ఆప్తదూతికయే నిజమునకు దూతిక. ప్రాణములు పోయినను గోప్యములను బయటపెట్టక స్నేహవతులై సంభాషణ చతురులై సర్వగుణ సంపన్నులై నాయికను నాయకునితో కూర్చు యువతులు వ్రజసుందరీమణులకు ఆప్తదూతికలుగా నుందురు.[189] స్వయందూతిక యొక్క అభియోగ ప్రకాశము కాయిక వాచిక చాక్షుష భేదముచే మూడు విధములుగా నుండును. వాచికాభియోగము శబ్దార్థభేదముచే నొప్పు వ్యంగ్యము నాశ్రయించి యుండును[190] అట్లే కాయకా చాక్షుష భేదములనుగూడ రూపగోస్వామి వివరించెను. ఆప్తదూతికలు మూడు విధములనియు, వారు అమితార్థ, నిసృష్టార్థ, పత్రహారి యను పేర్ల నొప్పుదురనియు వివేచించెను. ఇంగితమునెఱిగి నాయికానాయకులను సంయోగపరచు దూతికలు అమితార్థలనియు, యుక్తులతో కలుపు దూతికలు నిసృష్టార్థలనియు, సందేశమును మాత్రము తీసికొనిపోవు వారు పత్రహారికలనియు నిర్దేశించెను. వారేకాక శిల్పకారి, దైవజ్ఞ, లింగిని, పరిచారిక, దాది, వనదేవి, సఖియను దూతికాభేదములను గూడ నీప్రకరణమునందు వివరించెను.

ఎనిమిదవది సఖీ ప్రకరణము. వ్రజమునందలి గోపికలే ప్రేమలీలలను విస్తరింపచేయువారు. శ్రీకృష్ణునియందును, తమ తమ యూథేశ్వరుల యందును స్నేహభావము నెరపువారు సఖులని పిలువబడుదురు. ఈ సఖునుల

గూర్చి శ్రీ రూపగోస్వామి పూర్వ ప్రకరణములయందు కొంత వివరించిన ఈ ప్రకరణమునందు మరికొంత విస్తరించి రచించెను. ప్రేమ సౌభాగ్యాధి చేతను సద్గుణాధిక్యత చేతను సఖులలో కొందరు అధికలనియు, గుణ స నత్వము వలన కొందరు సమలనియు, ఆ గుణములలోని లఘుత్వము వ లఘువులనియు పిలువబడెదరని రూపగోస్వామి విభజనము గావించెను.[1] పూర్వప్రకరణములయందు యూథేశ్వరులను గూర్చి చెప్పిన సందర్భమ ఆత్యంతికాధికత్వాది భేదములు చెప్పబడినవి. యూథేశ్వరులు మాత్ర ఆత్యంతికాధికులు, ఆత్యంత ప్రఖరలు లేదా మృద్వులగుట కవకాశము కలద సఖ్యులు మాత్రము ఆపేక్షికాధిక, ఆపేక్షికసమ, ఆపేక్షిక లఘ్వియని మూ విధములుగా కానవత్తురు. ఈ విభాగము ననుసరించి సఖులు తొమ్మిది విధ లగుచున్నారు.

1. ఆపేక్షికాధిక ప్రఖర 2. ఆపేక్షికాధిక మధ్య 3. ఆపేక్షికాధిక మృద్వి
1. ఆపేక్షిక సమ ప్రఖర 2. ఆపేక్షిక సమ మధ్య 3. ఆపేక్షిక సమ మృద్వి
1. ఆపేక్షిక లఘుప్రఖర 2. ఆపేక్షిక లఘు మధ్య 3. ఆపేక్షిక లఘు మృద

ఆత్యంతిక లఘువులైన సఖులు కూడ ఆత్యంతిక లఘువు, ఆత్యంతి సమా లఘువు అని రెండు విధములు. యూథేశ్వరితో కూడ కలిసి పం పన్రెండు విధములుగా నుందురు లలితాది సఖులు ప్రఖరలనియు విశాఖా సఖులు ఆపేక్షికాధిక మధ్యలనియు, చిత్రామాధురికాదులు ఆపేక్షికాధి మృద్వులనియు పిలువబడుదురు.[192] లఘు ప్రఖరలు కూడ వామదక్షిణ భే ములచే రెండు విధములగుచున్నారు.[193] సఖులు ప్రాయికముగా దూరము నున్న నాయికా నాయకులను కలుపుట కొఱకై దూత కార్యములను నిర హించుచుందురు. యూథేశ్వరులు నిత్య నాయికలు. వారు తమకత్యంత ప్రి మైన సఖులను దూతికలుగా నియమించుచుందురు. ఒక్కొక్కప్పుడు యూ శ్వరులు కూడ గౌణముగా దూతకార్యము నిర్వర్తింతురని రూపగోస్వా పేర్కొనెను. ఇట్టి దూతకార్యము శ్రీకృష్ణుని సమక్షమందును, పరోక్షమందున నిర్వహించుటను బట్టి రెండు విధములగుచున్నవి. సమక్ష దౌత్యము సంకే మనియు, వాచిక మనియు మరల రెండు విధములుగా చెప్పబడినది.[194] ఇట్ల సఖులలోనంతర్విభాగములను లక్షణ లక్ష్య సమన్వితముగా వివరించి, వార నిర్వహించు కార్యములను పదునాలు విధములుగా పేర్కొనెను. నాయిక

నాయకుల గుణములను పరస్పరము వర్ణించి చెప్పుట, ఒకరిపైనొకరికి ఆసక్తిని పెంచుట, వారు పరస్పరము అభిసరించునట్లు చేయుట, తమ సఖిని శ్రీకృష్ణునకు సమర్పించుట, పరిహాసము, సాంత్వనము, ఆహార్యము మొదలగునవి సమకూర్చుట, హృదయోద్ఘాటపాటవము, దోషాదులను కప్పిపుచ్చి గుణములను ప్రశంసించుట సందేశాదుల నందించుట, నాయికాప్రాణరక్షా ప్రయత్నము చేయుట మొదలైన చమత్కారపూర్ణకార్యములు సఖులు నిర్వర్తించు ధర్మములు.

శ్రీకృష్ణునియందును తమ యూథేశ్వరియందును ప్రకటించు స్నేహభావమునుబట్టి సఖులు రెండు విధములుగా వర్గీకరింపబడినారు. ఉభయలయందును సమమైన ప్రేమవల్ల వారు సమస్నేహసఖులు. రాధాకృష్ణులను సమముగా ప్రేమించునట్టి ఉత్తమ సఖులను ప్రియసఖులని, పరమశ్రేష్ఠసఖులని పిలిచెదరని రూపగోస్వామి ఈ ప్రకరణమునందు పేర్కొనెను.[195]

తొమ్మిదవ ప్రకరణము శ్రీహరివల్లభ ప్రకరణము. హరివల్లభలైన గోపికలను రూపగోస్వామి నాలుగు విధములుగా వర్గీకరించెను. వారు 1. స్వపక్ష 2. సుహృత్పక్ష 3. తటస్థ 4. ప్రతిపక్ష భేదములచే నొప్పారుచుందురు. స్వపక్ష వల్లభలను గూర్చి పూర్వ ప్రకరణములందే చెప్పబడినది. సుహృత్పక్షమందలి హరివల్లభలు ఇష్టసాధకులు అనిష్టబాధకులునై యుందురు. పరస్పరము విద్వేషము గలవారు విపక్షులు. విపక్షమునకు సుహృత్పక్షమైనవారు తటస్థులు. వీరిలో సుహృత్పక్ష తటస్థ వర్గమువారు ప్రాసంగికులు. స్వపక్ష ప్రతిపక్ష భేదములకు చెందినవారే రసప్రదులు. అనిష్టమును, ఇష్టహానిని కల్పించుచు పరస్పర విద్వేషము వలన విరోధ భావముతో నుండువారు విపక్షులు. చలము, ఈర్ష్య, చాపల్యము, మత్సరము, దుఃఖము, గర్వము, అహంకారము, అభిమానము మొదలైన గుణములతో నుండెడివారు విపక్ష వర్గమునకు చెందిన గోపికలు. విజాతీయ భావములు స్వల్పముగను, సజాతీయ భావములు అధికముగను నుండువారు సుహృత్పక్షమునకు చెందినవారు. విజాతీయ గుణము లధికముగను, సజాతీయ గుణము లల్పముగ నున్నవారు తటస్థులు. స్వపక్ష, విపక్ష, సుహృత్పక్ష, తటస్థ భావములన్నియు మాధుర్యరసాస్వాదన కత్యంతము తోడ్పడునని రూపగోస్వామి యీ ప్రకరణమున ప్రపంచించెను

పై తొమ్మిది ప్రకరణములలో ఉజ్జ్వల నీలమణికర్త విభావ నిరూపణము సవిస్తరముగా నొనర్చినట్లైనది. వైష్ణవ భక్తి గ్రంథములందు మధుర రస పోషణము జరుగనెడ సర్వనాయక భేదసమన్వయ రూపుడైన శ్రీకృష్ణ పరబ్రహ్మమును భగవద్రతి నాశ్రయించి సేవించి తరించెడి హరిప్రియలను ప్రధానముగా ఆలంబన విభావములని గ్రహింపదగును. యూథేశ్వరీభేదములు మాధుర్యరస పోషణమునకు తోడుపడు నాయికల యొక్క అవస్థాభేదములు. అట్టి యవస్థలన్నియు ఆలంబన విభావ పోషకములై మధురరసమున మహిమాన్వితములై యుజ్జ్వలత్వమును బొందును. దూతికలు, సఖులు, హరి వల్లభలు అనువారు రాధాది నాయికలకును మధురరస స్వరూపుడైన శ్రీకృష్ణునకును, రసానుకూలమైన విభావ విస్ఫూర్తిని వెలార్చుటకు సహాయకారులగు అనుబంధ విభావములు. సఖులందరును ఒక విధముగా నాయికా నాయకుల విభావత్వమును పోషించువారే. ఇట్టి విస్తృత విభావ విభాగ ప్రకరణములను రచించి ఆపై పదియవ ప్రకరణమున ఉద్దీపన విభావములను వివరించి చెప్పెను.

మధుర రసమున శ్రీకృష్ణుడును శ్రీకృష్ణవల్లభగణములును ఆలంబన విభావములు కాగా వారి గుణనామచరిత మండనాదులకు సంబంధించినవి ఉద్దీపన విభావములు.[196] ఉద్దీపన విభావములతోపాటు శ్రీరూపగోస్వామి తటస్థ విభావములను గూడ పదియవ ప్రకరణమునందు పేర్కొనెను. శ్రీకృష్ణుని యొక్కయు అతని వల్లభ గుణములయొక్కయు గుణములు ముఖ్యముగా మూడు విధములు. అవి 1. మానసికములు 2. వాచికములు 3. కాయికములు. కృతజ్ఞత, క్షమ, కరుణ మున్నగునవి మానసిక గుణములు.[197] శ్రవణానందకరములగు వాక్కులే వాచిక గుణములు. వయోరూప లావణ్య సౌందర్యాభి రూపత్వ మాధుర్య మార్దవాదులు కాయిక గుణములు. వయసునకు సంబంధించిన బాల్య, యౌవన, నవ యౌవన, వ్యక్త యౌవన, పూర్ణయౌవనావస్థలు రూపమునకు వైభవము చేర్చును. భూషణములు లేకున్నను అందముగా కానబడురూపము ముత్యములకాంతివలె అవయవములందు ప్రకాశించు లావణ్యమునకు రంగభూమియగును. లావణ్యము నుద్దీప్తమొనర్చునది శరీరమునందు కాననగు యొకానొక అనిర్వచనీయమైన రూపమాధుర్యము. వీనినన్నింటి నతిశయింపజేయునది కోమలమగు వస్తువుల స్పర్శను సహితము సహింపజాలని

మార్దవము. కాయికములైన నీ గుణములు వాచికములైన సరసవాక్కులకు పోషకములు. వాచికము మానసిక గుణములకు బహిరభివ్యక్తి. వాచికాదులు మానసిక గుణములకు ఉద్దీపనములు. ఇట్లు పై గుణత్రయ విభావము పరస్పర పోషకములై ఆలంబన విభావముల నుద్దీప్తమొనర్చును. కావున ఉద్దీపన విభావములని పిలువడుచున్నవి. సంతత శ్రీకృష్ణనామ స్మరణమే నామపరమైన ఉద్దీపన విభావము. శ్రీకృష్ణుని యొక్కయు, అతని ప్రియగణములయొక్కయు లీలలు మొదలగునవి చరితములుగా చెప్పబడినవి. మహిమాన్వితములైనవి లీలలు. అందువలన అనుభావములను లీలలనియు చరితములనియు భావించ వచ్చునని విశేషించి శ్రీ రూపగోస్వామి పేర్కొనెను. వానిని వివరించుచు సుందరక్రీడలు, నృత్యము, వేణుగానము, గోదోహనము, పర్వతాగ్రముల నుండి గోవులను పిలుచుట, వానిని లెక్కించుట మున్నగునవి లీలలనియు; రాసక్రీడ, కందుకక్రీడ, పశు పక్ష్యాదుల రవములను చేయుట మున్నగునవి చారుక్రీడలనియు రూపగోస్వామి పేర్కొనెను.

మండనములు నాలుగు విధములు. అవి: 1. వస్త్రములు 2. భూషణములు 3. మాలలు 4 అనులేపనములు. శ్రీ రూపగోస్వామి శ్రీకృష్ణుని శరీరమునకు లగ్నమైయుండెడి అంశములను కొన్నింటిని ఉద్దీపన విభావములుగా పేర్కొనెను. సన్నిహిత లగ్నము, సంబంధి లగ్నములని రెండు రకములుగా విభజింపబడి వివరించబడినది. వంశీరవము, శృంగధ్వని, గీతము, సౌరభము, అలంకారము (భూషణము) ఝుంకారము, పదాంకములు, వీణానాదము, శిల్పకౌశలము మొదలగునవి సంబంధి లగ్నములుగా నిందు పేర్కొనబడినవి. ఇట్టి ఉద్దీపన విభావము లన్నింటిలో సన్నిహితలు మిన్నలు. అందును శ్రీకృష్ణుని అధరము నుండి వెలువడు మురళీనాదామృతము ఉద్దీపన విభావము లన్నింటిలో శ్రేష్ఠమైనది.[198] తటస్థములయ్యు విభావాదులను ఉద్దీపనము చేయగల ప్రకృతి సహజ వస్తుజాలము తటస్థ విభావములని పేర్కొనుట లాక్షణిక సంప్రదాయము. చంద్రిక, మేఘము, విద్యుత్తు, వసంతము, శరత్తు, పూర్ణచంద్రుడు, మలయానిలము, మయూరాది పక్షిగణములు తటస్థ విభావములని శ్రీ రూపగోస్వామి యీ ప్రకరణమునందు పేర్కొనెను.[199]

పదునాకొండవ ప్రకరణము అనుభావములను గురించి వివరించునది. భావములు గమ్యమానములగుటకు తోడ్పడు చేష్టాదికములు అనుభావములు. అనుభావములు ప్రధానముగా మూడు విధములు: 1. అలంకారములు, 2. ఉద్భాస్వరములు, 3. వాచికములు.[200] గోపికలయందు యౌవనాద్య వస్థలలో జనించు సత్త్వజములైన ఇరువది విధములైన అద్భుత రూపములుగా నుదితములగునవి యలంకారములు, అనుభావములగునని రూపగోస్వామి పేర్కొనెను. వాని స్వభావములనుబట్టి అంగజములనియు, అయత్నము లనియు, స్వభావజములనియు మూడు శ్రేణులుగా నాతడు విభజించెను.

అంగజములు మూడు విధములు. అవి : 1. భావము, 2. హావము, 3. హేల. అయత్నజములు ఏడు విధ విధములు. అవి: 1 శోభ, 2. కాంతి, 3. దీప్తి, 4. మాధుర్యము, 5. ప్రగల్భత, 6. ఔదార్యము, 7, ధైర్యము. స్వభావజములు పది విధములు. అవి: 1. లీల, 2. విలాసము, 3. విచ్ఛిత్తి 4. విభ్రమము 5. కిలకించితము 6. మోట్టాయితము 7. కుట్టమితము 8. బిబ్బోకము 9. లలితము 10. వికృతము.

ఈ ఇరువది యలంకారములనేకాక మౌగ్ధ్యము, చకితము అను మరి రెండలంకారములనుగూడ కొందఱు గణింతురని రూపగోస్వామి పేర్కొనెను. వీనినన్నింటికి లక్షణముల నొసంగెను. హృదయమందలి భావములు శరీరముపై ప్రకటితములగుట ఉద్భాస్వరమనబడును.

ఉద్భాస్వరానుభావములను పేర్కొనుచు రూపగోస్వామి కోకముడి యూడుట, పైటజారుట, జుట్టుముడి విడివడుట, ఒడలు విరుచుట, ఆవులింతలు పెట్టుట, నిట్టూర్పులు నిగిడించుట, క్రిందదొరలుట, పాడుట, ఆత్మదూషణము చేసికొనుట మొదలగు వానిని లక్షణసహితముగా వివరించెను.[201] ఇక వాచిక ములు పంద్రెండు విధములని రూపగోస్వామి పేర్కొని, వానిని 1. ఆలాపము 2. విలాపము 3. సంలాపము 4. అనులాపము 5. అపలాపము 6. ప్రలా పము 7 సందేశము 8. అతిదేశము 9. అపదేశము 10. ఉపదేశము. 11. వ్యపదేశము 12. నిర్దేశమని తెలిపెను. సర్వరసములందు ఈ అనుభావ ములున్నను ఉజ్జ్వలరస మధిక మాధుర్య పోషక మగుటవలన ఈ గ్రంథము నందు వర్ణితములైనవని లక్షణకర్త పేర్కొనెను.[202]

**సాత్త్వికభావములు:** పండ్రెండవ ప్రకరణమునందు శ్రీరూపగోస్వామి సాత్త్విక భావములను వివరించెను. స్తంభస్వేదాదులైన నెనిమిది యష్టవిధ సాత్త్విక భావములను నిరూపించెను. హర్ష భయాశ్చర్య విషాదామర్షములవలన స్తంభముదయించుననియు, హర్షభయక్రోధములవలన స్వేదము జనించుననియు, ఆశ్చర్య హర్ష భయములవలన రోమాంచము కలుగుననియు, విషాద విస్మయా మర్ష భీతివలన స్వరభంగము సంభవించుననియు, భయ హర్షామర్షమువలన కంపముదయించు ననియు, విషాద రోష భయములవలన అశ్రువులు జనించు ననియు, సుఖదుఃఖములవలన ప్రళయమును కలుగుననియు నీప్రకరణమున లక్ష్యలక్షణ యుక్తముగా పేర్కొనుటయైనది.

పదమూడవ ప్రకరణము వ్యభిచారిభావములను వివరించునది. ఇందు నిర్వేదాది ముప్పదిమూడు వ్యభిచారి భావములను గూర్చియు, ఉత్పత్తి, సంధి, శబలత, శాంతి యను నాలుగు దశలనుగూర్చియు, భావసంధి, భిన్నసంధి, భావశాంతిని గూర్చియు వివరించబడినది. మధురభక్తి రసమునందు ఉగ్రత, ఆలస్యము అను నీరెండు భావములు తప్ప తక్కిన సంచారి భావములన్నియు కలవు.[203] సఖులకు కృష్ణునిపైగల ప్రేమ మధుర రసమునందు సంచారిభావము నొందును. మధుర రసమున సంచారిభావములు సాక్షాదంగజములుగా గ్రహింప బడవు. ఆర్తి విప్రియేర్షా విషాదవిపత్స్వ్యపరాధములవలన నిర్వేదము, దుఃఖము వలన భయాపరాధములవలన దైన్యము, శమాధిరతులవలన గ్లాని, అతిగా తిరుగుటువలన, నృత్యమువలన, రతివలన శ్రమ, మధుపానము చేయుటవలన మదము, సౌభాగ్యరూపగుణమువలన, సర్వశ్రేష్ఠాశ్రయమువలనను, ఇష్ట వస్తువులు లభించుటవలన గర్వము, చౌర్యాపరాధములవలన, క్రూరకర్మల వలన విద్యుత్తు, భయంకరజంతుదర్శన శబ్ద శ్రవణములవలన శంక, ప్రియా ప్రియ దర్శనశ్రవణములవలన ఆవేగము, ప్రౌఢమైన ఆనందమువలన, విరహ బాధవలన ఉన్మాదము, దుఃఖాతిశయమువలన అపస్మారము, చింత ఉద్వేగాదుల వలన వ్యాధియు కలుగును. హర్షవిశ్లేషవిషాదములవలన హృదయమున గలుగు మూఢత్వమే మోహమని, మృత్యుచేష్టవలెనుండునది మృతియని యందురు.[204] శ్రీకృష్ణభక్తియందు ఆలస్యమునకు స్థానములేదు. ఇష్టాయిష్ట దర్శన శ్రవణ విరహాదులవలన జాడ్యము, నూతన సాంగత్యము వలనను, అకార్యము మొదలగువాని వలనను లజ్జ, దాక్షిణ్యాదుల వలన అవహిత్థ, తుల్యావస్తు

దర్శనాదులవలన స్మృతి, విమర్శ సంశయమువలన వితర్కము కలుగును. ఇష్టవస్తుప్రాప్తి వలన, అనిష్టశంక వలన కలుగునది చింత. మనసు యొక్క స్థిరభావము ధృతి. అభీష్ట దర్శనము వలన, అభీష్ట ప్రాప్తి వలన కలుగు ప్రసన్నతను హర్షమందురు. ఇష్టసిద్ధి వలన కలుగు తీవ్రమగు నుత్కంఠయే ఔత్సుక్యము- మధురరసము నందు ఉగ్రతకు చోటులేదు. నిందావమానముల అసహిష్ణుతయే అమర్షము. అన్యుల అదృష్టముపట్లకలుగు విద్వేషమే అసూయ. రాగద్వేషముల వలన కలుగు చిత్తలాఘవము చాపల్యము. అలసట వలన కలుగునది నిద్ర. సుప్తియన స్వప్నము. నిద్ర తొలగుటయే బోధ.

ఉత్పత్తి, సంధి, శబలత, శాంతి యనునవి నాలుగుదశలు. మనసునందు భావము పుట్టుటయే భావోత్పత్తి. రెండు భావము లొకచోట కలియుట భావ సంధి యందురు. ఒకే విధముగానున్న రెండు స్వరూపముల సంధిని స్వరూప సంధి యందురు. వేరువేరు స్వరూపముల సంధిని భిన్న సంధియని, వివిధములు పెక్కులగు భావముల కలయిక భావశబలతయని, భావలయము భావశాంతి యని యందురు.

స్థాయి భావమునుగూర్చి చర్చించినది పదునాలుగవ ప్రకరణము. శృంగారమునందలి మధుర రతియే మధుర రసమునకు స్థాయి భావము.205 మధుర రతి అభియోగము, విషయము, సంబంధము, అభిమానము, తదీయ విశేషము, ఉపమ, స్వభావము మున్నగు వానివలన కలుగును.206 ఉత్తరోత్తరములు శ్రేష్ఠములగుటవలన స్వభావమువలన కలుగురతి ఉత్తమోత్తమైనది. అభియోగమనగా భావ ప్రకాశము. ఇది 1. స్వకర్తృకమని 2. పరకర్తృకమని రెండు విధములు. విషయము- 1. శబ్ద 2. స్పర్శ 3. రూప 4. రస 5. గంధములనుభేదములచే నైదు విధములు. కులరూప శౌర్య సౌశీల్యాదుల సామగ్రియొక్క గౌరవమే సంబంధము. పెక్కు విధములగు సుందర తర వస్తువులున్నను ఒకానొక ప్రధానమగు వస్తువునే గ్రహించవలెనను నిశ్చితమగు అభిప్రాయమే అభిమానము. తదీయ విశేషము లనగా శ్రీకృష్ణుని పదచిహ్నములు, గోష్ఠము, కృష్ణప్రియ జనము, ఒక వస్తువునకు మరొక వస్తువునకు కొన్ని యంశములలో సాదృశ్యము, ఉపమ, ఆత్మధర్మ మితరకారణముల నపేక్షింపక స్వయముగా ప్రకాశించుదానిని స్వభావమని పిలుతురు. స్వభావము 1. నిసర్గమని 2. స్వరూపమని రెండు విధములు. దృఢమైన అభ్యాసము

వలన కలుగు సంస్కారము నిసర్గము. అట్టివానికి శ్రీకృష్ణ గుణరూపాదులను గూర్చి వినగానే అకస్మాత్తుగా కృష్ణ భక్త్యుద్భోధమగును. స్వతఃసిద్ధమగు భావమును స్వరూపమందురు. ఇది మూడు విధములు. 1. కృష్ణనిష్ఠము 2. లలనానిష్ఠము 3. ఉభయనిష్ఠము.[208] దైవస్వభావము కలవారికే కృష్ణనిష్ఠ స్వభావమలవడును. లలనానిష్ఠము స్వయంప్రకాశితము. కృష్ణనిష్ఠ లలనానిష్ఠ స్వరూపము లెండు ప్రకాశితములగునో యది ఉభయనిష్ఠ స్వరూపము. గోకుల మందలి గోపకాంతలకు కృష్ణరతి తరచుగా స్వభావజము. రతి మూడు విధ ములు. 1. సాధారణ రతి 2. సమంజస రతి 3. సమర్థ రతి. కేవలము సంభో గేచ్ఛామయమైన రతి సాధారణ రతి. కుబ్జ రతి సాధారణ రతి. ద్వారకలోని కృష్ణుని అష్టభార్యల రతి సమంజస రతి కుదాహరణముగా గ్రహింపబడినది. లోకధర్మము నతిక్రమించి కృష్ణభక్తుని సలుపు గోకుల రతి సమర్థ రతి. సాధారణ పిక రతి మణివంటిది.సమంజస రతి చింతామణి వంటిది కాగా సమర్థ రతి కౌస్తుభమణివలె దుర్లభమైనది.[209] అభియోగాదువలన సమర్థ రతి యుత్ప న్నమైన కుల ధర్మాది సర్వవిధ విఘ్న బాధలు వారు విస్మరింతురు. ఇట్టిది మిగుల గాఢమైనదిగా నుండును. ఇట్టి రతిమిగులప్రౌఢభావమును బొంది మహా భావ దశను బొందును. విముక్తులగు భక్తులందరిట్టి దశనే అన్వేషింతురు. మధుర రతి దృఢమైననదియైన నది ప్రేమయగును. క్రమముగా నది స్నేహ మాన ప్రణయ, రాగానుగ భావమున వెల్లడియగును. ఇక్షుదండ బీజము ఇక్షు రసముగా, గుడముగా, ఖండశర్కరగా,కలకండగా మారినట్లు రతి ప్రేమగా, స్నేహముగా, మానముగా, ప్రణయముగా, రాగముగా, అనురాగముగా, భావ ముగా మారును. ఇవన్నియు ప్రేమయొక్క క్రమోన్నత దశలు.[210] ఎవరి యందెట్టి కృష్ణప్రేమ కలుగునో వారిపట్ల కృష్ణునకు గూడ నట్టి ప్రేమ కలు గును.[211] ప్రేమ ధ్వంస కారణమున్నను ధ్వంస రహితమగును. అది యువతీ యువకులకు భావబంధము కలిగించును.

ప్రేమ ప్రౌఢ మనియు మధ్యమనియు,మందమనియ మూడు విధములు. కలుసుకొనుటలో ఆలస్యము జరిగిన ప్రియజన హృదయమున క్లేశము కలుగు నని దానిని నివారించుటకు ప్రేమికుని చిత్తమునందు కలుగు వ్యాకులత ప్రౌఢ ప్రేమ. ఇతరానుభవాపేక్షను సహించునది మధ్యమప్రేమ. అహర్నిశలు కలసిమెలసి యుండుటవలన ఉపేక్షాపేక్షలు లేక యుండునది మందప్రేమ. వియోగము సహించలేనిది ప్రౌఢప్రేమ; కష్టముతో సహించునది మధ్యమ ప్రేమ; విస్మరించగలిగినది మందప్రేమ.[212]

స్నేహము హృదయమును ద్రవింపజేయును. స్నేహమందలి తారతమ్యమునుబట్టి 1. ఉత్తమ 2. మధ్యమ 3. కనిష్ఠ భేదములున్నవి. ప్రియ వ్యక్తి అంగ స్పర్శన వలన మనసు ద్రవించినచో కనిష్ఠము, సందర్శన మాత్రమున చిత్తము ద్రవించిన మధ్యమము, శ్రవణ మాత్రముననే మనసు ద్రవించిన ఉత్తమ స్నేహము.[213] స్నేహము 1. ఘృత స్నేహమనియు, 2. మధు స్నేహమనియు రెండు విధములు. ప్రియమగు వానిని తన వానినిగా భావించు అతిశయమగు స్నేహము మధుస్నేహము. శర్కరాదులవంటి ద్రవ్యములతో కలిసి ఘృతము ఆస్వాదయోగ్యమగునట్లు గర్వాసూయాది భావములతో కలిసి ఘృత స్నేహము పరమాస్వాదయోగ్యమగును. మధుస్నేహమితర భావముల నపేక్షించదు. స్వయముగా మాధుర్యమయము. తాను ప్రియునకు సంబంధించిన దానను భావన కలిగియుండునది ఘృతస్నేహము.[214] వారు తనవారను భావన కలిగియుండునది మధుస్నేహము. చంద్రావళియందు ఘృతస్నేహము, రాధికయందు మధుస్నేహము కాననగును.

మానమనగా ఉత్కృష్టతా వాప్త్యా మాధుర్య స్నేహమని చెప్పబడినది. మానమును 1. ఉదాత్తమని 2. లలితమని రెండు విధములుగా పేర్కొనిరి. ప్రియుని గూర్చిన అభేద మనన రూప విస్రంభ యుక్తమైనమానమే ప్రణయ మనిరి. ప్రణయ స్వరూపమే విస్రంభము. 1. మిత్ర 2. సఖ్య భేదములచే విస్రంభము రెండు విధములు. వినయముతో కూడినది మిత్రవిస్రంభమని సాధ్వసము వలన ఉన్ముక్తమై స్వవశము చేసికొనునది విస్రంభ సఖ్యమని రూపగోస్వామి పేర్కొనెను.

స్నేహమువలన ప్రణయము జనించి మానస్థితిని బొందును. ఒక్కొక్కమారు స్నేహమునుండి మానము, మానమువలన ప్రణయము కలుగును. మానప్రణయముల యన్యోన్యకారణత్వమువలన విస్రంభము భిన్నవిధములుగా అభివర్ణింపబడినది. ప్రణయోత్కర్షావస్థయందు అత్యధికమైన దుఃఖముకూడ సుఖమువలె ప్రతీయమానమైనచో దానిని రాగమందురు. రాగము 1. నీలిమరాగమని 2. రక్తిమరాగమని రెండు విధములు. నీలిమరాగము 1. నీలిరాగమని 2. శ్యామరాగమని రెండు విధములు. రక్తిమరాగము 1. కుసుంభరాగమనియు 2. మాంజిష్ఠరాగమనియు రెండు విధములు. ఆధార విశేషమునుబట్టి స్థిరమగునది కుసుంభరాగము. ఎల్లప్పుడు స్థిరముగానుండునట మాంజిష్ఠరాగము. రాధామాధవులయందిది ద్యోతకమగును.

చంద్రావళిలో, రుక్మిణిలో- ఘృతస్నేహము, ఉదాత్తము, మైత్రి, సుమైత్రి. నీలిమ, అను పూర్వోక్తభావములు.

సత్యభామలో- మధుస్నేహము, లలితము, సఖ్యము, రక్తిమ యను ఉత్తరోత్తర భావములు లక్షితము లైనవి.

నిత్యనూతన భావములతో ప్రియుని ప్రతి క్షణము నవ్యానురాగునిగ చేయుటను అనురాగమందురు. పరస్పర వశీభావము, ప్రేమ వైచిత్ర్యము ఒకరిపై నొకరికి జనింపవలెననెడి లాలసతో కూడినది అనురాగము. శ్రీకృష్ణుడు అనురాగమునకు విషయముగను, శృంగార విషయ తత్త్వమునకు పరమసీమ గను, రాధిక అనురాగాశ్రయ తత్త్వమునకు అవధిగను చెప్పబడినది.[215] రాధా కృష్ణుల యనురాగమే స్థాయిభావము. అష్టమహిషులందును నిట్టిభావ మతి దుర్లభము. ఇట్టి మహాభావము గోపికలలో మాత్రమే అనుభూతమైనది.[216] మహానుభావము 1. రూఢమని 2. అధి రూఢమని రెండు విధములు. సాత్త్విక భావము లుద్దీప్తములగుటను రూఢ మహాభావమందురు. అనుభావములు దృఢ మహారూపమున వ్యక్తమగుచున్నను వానికంటె అధికాశ్చర్య, విశిష్టతను బొందుటను అధిమహారూఢమని యందురు.[217] అధిరూఢము 1. మోదనమని 2. మాదనమని రెండు విధములు. సాత్త్వికభావము లధిక రూపమున నుద్దీప్త మగుటను మోదనమని, ఉల్లాసముతోకూడిన పరాత్పరభావము మాదనమనియు అందురు. అనిర్వచనీయమైన మోహభావముయొక్క వైచిత్రి దివ్యోన్మాదము.[218] ఉద్ఘూర్ణము, చిత్రజల్పము వంటి భేదములనేకములు దివ్యోన్మాదమునందు కలవు. నానావిధములగు వివశత్వముతో కూడిన చేష్టలు దివ్యోన్మాదమున ప్రకటితమగును. దానినే ఉద్ఘూర్ణ మందురు.

చిత్ర జల్పమందలి దశంగములు- ప్రజల్పము, పరిజల్పితము, విజల్పము, ఉజ్జల్పము, సంజల్పము, అవజల్పము, అభిజల్పితము, ఆజల్పము, ప్రతిజల్పము, సుజల్పము అనునవి. భాగవతమందలి దశమ స్కంధమున భ్రమరగీతములందిట్టివి వర్ణింపబడినవి.[219] శ్రీకృష్ణునిగూర్చి తెలిసికొనుటవలె మాదనగతినిగూర్చి తెలిసికొనుటకూడ మునులకు దుర్గమమైనదియని రూప గోస్వామి తెలిపెను. గోపికలలో కలుగు భావములు అలౌకికములగు వాని కంటెను, తర్కముకంటెను పరముగానుండును.[220]

**శృంగార రస భేదములు:** పదునేనవ ప్రకరణమునందు రూపగోస్వామి శృంగార రస భేదములను లక్ష్యలక్షణ సమన్వితముగా నిరూపించెను శృంగారము విప్రలంభ సంభోగ భేదముచే రెండు విధములని ప్రధాన విభాగము గావించెను. శృంగారాది కావ్యములందు కానబడు సంభోగ విప్రలంభాదుల కంటె రూపగోస్వామి ప్రతిపాదించిన ఈ భేదములు విశిష్టములు. శ్రీకృష్ణ దేవుని లీలలు 1. ప్రకటములనియు 2. అప్రకటములనియు రెండు విధములు. శ్రీ కృష్ణునకును, గోపికలను వస్తుతః వియోగమన్నది కలుగదు. బృందావనము నందు కాని గోలోకమునందు కాని వివిధ లీలారస వినోదమున సంతతము విహరించు శ్రీహరితో వ్రజవనితలకు దూర ప్రవాసగత విరహత్వము లేదు. అచట సంభోగమే నిత్యము. ఇది అప్రకటిత లీల. విప్రలంభరసమున వర్ణిత మైన విరహావస్థాదులు ప్రకట లీలలకు సంబంధించినవి. ఇట్టి మౌలికమైన తత్త్వమును ఉజ్జ్వల నీలమణి యందలి శృంగార రస సమన్వయ విషయమున సమన్వయించుకొనవలెను. శృంగార రస భేదములు కావ్య నాయికా నాయకులకు సంబంధించినవైన్నట్లు కనబడినను నివి మధుర రసమూర్తియైన శ్రీహరి ప్రియులకును, శ్రీకృష్ణునకును వర్తించునవగుటచేత ఉదాత్తములు ఉజ్జ్వలములు నగుచున్నవి.

సంభోగము నాయికానాయకులకు పరస్పర దర్శన స్పర్శాదుల వలన కలుగు సుఖ విశేషమూలమైన ఉల్లాస భావమే. అట్టి సంభోగము 1. ముఖ్యమనియు 2. అముఖ్య (గౌణ) మనియు రెండు విధములు. జాగృత దశలో కలుగు సంభోగము ముఖ్యమనియు, స్వప్నాదులయందు పొందెడిది గౌణమనియు రూప గోస్వామి విశ్లేషించెను. ముఖ్య సంభోగమునకు నాలుగు అవాంతర భేదములను పేర్కొనెను. 1. సంక్షిప్త సంభోగము (పూర్వ రాగానంతరము కలుగున) 2. సంకీర్ణ సంభోగము (మానానంతరము కలుగునది) 3. సంపన్న సంభోగము (కించిద్దూర ప్రవాసానంతరము కలుగునది) 4. సమృద్ధిమత్ సంభోగము (సుదూర ప్రవాసానంతరము కలుగునది). రూపగోస్వామి వీనిని గౌణ సంభోగమునకు కూడ వర్తింపచేసెను. స్వప్నములు జాగరాయమాన స్వప్నములని స్వప్నాయమాన జాగరములని రెండు విధములుగా నుండునని వివరించెను.

'న వినా విప్రలంభేన సంభోగః పుష్టిమశ్నుతే
కషాయితేహి వస్త్రాదౌ భూయాన్ రాగోవివర్ధతే॥ (ఉ.నీ. 15.3)

రంగుబట్టలకు ఆదేరంగు మరల వేసినచో వాని యజ్జ్వలత్వము అభివృద్ధి చెందును. అట్లే విప్రలంభమువలన సంభోగమునకు పుష్టి కలుగును. విప్రలంభము లేకుండ సంభోగము పుష్టిచెందదను అభిప్రాయము శ్రీ రూపగోస్వామి పేర్కొనెను. విప్రలంభము పూర్వరాగ విప్రలంభమనియు, మానవిప్రలంభమనియు, ప్రేమ వైచిత్ర్య విప్రలంభమనియు, ప్రవాస విప్రలంభమనియు నాలుగు విధములు. పూర్వరాగము దర్శన శ్రవణాదుల వలన కలుగు రతిచే పోషింపబడును. శ్రీకృష్ణుని సాక్షాత్తుగాకాని, చిత్ర పటమునందు కాని, స్వప్న మునందుకాని దర్శించుట దర్శనము. వందిమాగధులు, దూతలు, సఖులు చేసెడి స్తుతుల వలన కాని, పాడెడి గీతముల వలనకాని శ్రీకృష్ణ చరితము విని శ్రవణానందము పొంది తద్రతిని భజించుట శ్రవణము. శృంగారమునందు నాయిక పూర్వానురాగ విప్రలంభము భజించినటులే భక్తుడు భగవద్రూపమైన రతిని భజించుచు పూర్వరాగము భజించును.

పూర్వరాగమును ప్రౌఢమనియు, సమంజసమనియు, సాధారణమనియు రూపగోస్వామి మరల మూడు విధములుగా విభజించెను. సమర్థ రతికి పూర్వరూపమైనదే ప్రౌఢ పూర్వరాగము. ఇందు లాలసాది దశవిధావస్థలు భాసించును. లాలస, ఉద్వేగము, జాగరము, తానవము, జడత్వము, వ్యగ్రత, వ్యాధి, ఉన్మాదము, మోహము, మృత్యువు అనునవి దశవిధావస్థలు. సమంజసరతికి పూర్వమున నుండునది సమంజస పూర్వరాగము. అందులో అభిలాష, చింత, స్మృతి, గుణకీర్తనము, ఉద్వేగము, విలాపము, ఉన్మాదము, వ్యాధి, జడత్వము, మరణము - అను పది దశలు క్రమముగా ప్రకటమగును. సాధారణ పూర్వరాగమునందు విలాపాంత దశలు ఆరు (కోమలములైనవి) చెప్పబడినవి.

పరస్పరానురాగ బద్ధులగు నాయికనాయకు లొకే చోటయున్నను వారికభీష్టములగు ఆలింగన దర్శనాదులకు ప్రతిబంధకమయ్యెడి భావము మానమని పేర్కొనెను. మానవిప్రలంభము సహేతువనియు, నిర్హేతువనియు రెండు విధములు. నాయకుడు విపక్షనాయికయందుకాని, తటస్థనాయికయందుగాని ప్రీతిని ప్రకటించినట్లు నాయిక చూచినను, వినినను, నాయిక హృదయమున కలుగు ప్రణయమూలమైన ఈర్ష్య సహేతుమాన విప్రలంభము. పారిజాతాపహరణ కావ్యకథార్థములందు సత్యభామ ప్రకటించెడి మానవిప్రలంభము దీనికి

చక్కని యుదాహరణము. నాయికానాయకుల నడుమ చెప్పదగిన కారణమేమి లేకపోయినను ప్రణయలీలలో భాగమైన ఒక కారణాభాసము నాశ్రయించి యుద్భవించు ప్రణయము నిర్హేతుక మానవిప్రలంభము. దీనినే ప్రణయమాన విప్రలంభమనియు కొందరందురు. సర్పగతివలె ప్రేమగతికూడ వక్రమైనది. అందువలన హేతువున్నను లేకపోయినను నాయికానాయకులయందు గోచరించు నది మానవిప్రలంభము. నిర్హేతుకమానము తనంతటతానే శాంతించును. సహేతుకమానము ఉపాయాంతరములచే శాంతించును.

మానదశలో గోపికలు శ్రీకృష్ణుని నుపాలంభించుచు సంబోధించుటలో ముఖ్యముగా కాననగునవి వామ, దుర్లీలశేఖర, కితవేంద్ర, మహాధూర్త, నిర్లజ్జాఢ, అతిదుర్లలితుఢ, గోపీభుజంగ, స్త్రీచోరుఢ, గోవధర్మ విధ్వంసక, గోపసతీవిడంబక, కాముకేశ, ప్రగాఢాంధ కారశ్యామాత్మ, గోపీవస్త్రచోర ఇత్యాదులు.

విప్రలంభ భేదములలో మూడవది ప్రేమవైచిత్ర్యము. నాయకుడు కట్టెదుటయున్నను ప్రేమోత్కర్ష భావముచే నొకవిధమగు విరహము కలుగు నేమోయను ఆర్తినే ప్రేమవైచిత్ర్య మందురు. గోపికలు శ్రీకృష్ణు డెచట నున్నను ప్రేమపారవశ్యముతో ననుభవించెడి చిత్రమైన వియోగావస్థ దీనికి చక్కటి యుదాహరణము.

నాలుగవది ప్రవాసవిప్రలంభము. సంభోగానంతరము నాయికానాయ కుల నడుమ దేశాంతరాదుల వలన కలిగెడి వ్యవధానమే ప్రవాసము. ప్రవాసము బుద్ధిపూర్వక మనియు, అబుద్ధిపూర్వక మనియు రెండు విధములు. కార్య వశమున దూరదేశముల కేగిన దానిని బుద్ధిపూర్వక ప్రవాస మని పేర్కొం దురు. పారతంత్ర్యము వలన కలుగు సుదూర ప్రవాసము అబుద్ధిపూర్వక ప్రవాస మని పేర్కొందురు. బుద్ధిపూర్వక ప్రవాసమును కించిద్దూర, సుదూర భేదములచేతను, భూత వర్తమాన భవిష్య భేదముల చేతను విభజిం చుట యైనది. అబుద్ధిపూర్వక ప్రవాస మందలి పారతంత్ర్యము దివ్యాదివ్య భేదములచే పలువిధములు. ఈ విప్రలంభమునందు దశవిధావస్థలు వర్ణింప బడినవి. ప్రవాస విప్రలంభము నందు శ్రీకృష్ణుని యందు కూడ నీదశలు భాసించునని శ్రీరూపగోస్వామి పేర్కొనెను.

ఈ విధముగా రతిస్థాయియైన శృంగారమే భగవద్రతిస్థాయి యైన భక్తిరసము నందు ముత్యము నందలి నీరువలె భాసించుచు, అంతర్విలాపము అంతశ్శక్తిని పోషించుచుండును. శృంగారాదుల యందలి రతికంటె భక్తి యందలి రతి ఉజ్జ్వలమని శ్రీ రూపగోస్వామి ఉజ్జ్వలనీలమణి యందు నిరూపించెను.

## భక్తిరసాయనము

**భక్తి నిర్వచనము:-**

శ్రీ మధుసూదన సరస్వతి రచించిన భక్తిరసాయనము మూడు ఉల్లాసముల లక్షణగ్రంథము. దానినారంభించుచు మానవులు సాధించు పురుషార్థములవలన కలుగు సుఖమే పరమ పురుషార్థమనియు, అదియే భక్తిసుఖమనియు, భక్తిసుఖము స్వతంత్ర పురుషార్థమనియు, బలీయములైన సంసార రాగములచే పీడింపబడుచున్న జనులకు భక్తిరసాయనాస్వాదనచే కర్మబంధములు తొలగుననియు పేర్కొని భక్తి ప్రాముఖ్యమును ప్రవచించెను.

'ద్రుతస్య భగవద్ధర్మాద్ధారావాహికతాంగతా
సర్వేశే మనసోవృత్తి ర్భక్తిరిత్యభిధీయతే' భ. ర. (1-3)

అని మధుసూదన సరస్వతి భక్తిని నిర్వచించెను. చిత్తము ద్రవీభూతము కాగా అందు భగవదాకారతతో సర్వేశవిషయకమై ధారావాహికముగా అనుభూయమానమయ్యెడి మానసవృత్తియే భక్తియని పేర్కొనెను. చిత్తము ద్రవీభూతమగుటయనగానేమియో తదుపరి వివరించెను. చిత్తము సహజముగా ద్రవావస్థలో నుండదు. దాని నిజస్థితిని మధుసూదన సరస్వతి లక్కతో పోల్చి చెప్పెను. లక్కను కరగించుటకు తాపకద్రవ్యము లెట్లుండునో యట్లే చిత్తము ద్రవీభావమగుటకు కామక్రోధ భయస్నేహ హర్షశోకాది భావములు సహజముగా నమరియున్నవని అన్వయసుందరముగా నిరూపించెను.[221] భగవద్గుణ శ్రవణాదులవలన సామాజికుని హృదయమున కామక్రోధాది భావము లుద్దీపితమగుననియు అట్లుద్దీపితములైన భావములచే చిత్తము కరుగుననియు, అట్టికామాది భావములు తిరోభావము చెందినపుడు మరల చిత్తము తన స్వభావమైన కాఠిన్యమును భజించుననియు లక్షణకర్త వివరించెను ద్రవీభావమనగా విషయముతో నత్యంత సన్నిహిత సంబంధము కలిగియుండుట యనియు దానివలన ననన్య

చిత్తవృత్తి జనించుననియు అది వస్తువుల యొక్క ఆకారమునే దాల్చుననియు మధుమాదన సరస్వతి పేర్కొనెను. అనుభవములన్నియు వాసనారూపమున పరిణమించుచు సంతత ధారా రూపమైన యనుభవ విశేషమగు చిత్తవృత్తి యందు భావనా మార్గమున వస్తువుయొక్క ఆకారమును నిరంతరాయముగా గ్రహించుచుండును. అనగా సర్వద్రవ్యములందును సర్వభూతములయందును భగవద్భావన చేయు సంతత చిత్తవృత్తి సహృదయుడు సాధించినచో నతనిది సంపూర్ణ చిత్త ద్రవావస్థయనియు, అతడుత్తమ సంసారి యనియు మధు సూదన సరస్వతి పేర్కొనెను.[222] చిత్త ద్రవావస్థను ప్రణయము, అనురాగము, స్నేహము మొదలగు శబ్దములతో పిలువవచ్చుననియు వివేచించెను. ద్రవా వస్థలో మూడు విధములను పేర్కొనెను. అవి 1. ప్రాకృత ద్రవావస్థ 2. మధ్యమ ద్రవావస్థ 3. ఉత్తమ ద్రవావస్థ. ప్రపంచము సత్యమను భావముతో కూడిన ఆధ్యాత్మిక తత్త్వము చిత్తమునందు ప్రతీయమానమైనచో దానిని ప్రాకృత ద్రవావస్థయనియు, ప్రపంచము మిధ్యయను భావముతో కూడిన ఆధ్యాత్మిక తత్త్వ సహితమైన చిత్తావస్థ మధ్యమ ద్రవావస్థ యనియు, ప్రపంచము సత్యమనికాని మిధ్యయనికాని చిత్తమున భావింపక కేవలము తత్త్వమే ప్రతీయమానమైనచో దానిని ఉత్తమ ద్రవావస్థయనియు విశ్లేషించి వివరించెను.

స్థాయి భావమను పేరు వచ్చుటకు గల కారణములు పేర్కొనుచు మధు సూదన సరస్వతి యిట్లనెను:

**స్థాయి భావము :**

'స్థాయిభావ గిరాఽతోఽసౌ వస్త్వాకారోఽభిధీయతే
వ్యక్తశ్చరసతామేతి పరానంద తయా పునః (1-9)
భగవాన్ పరమానంద స్వరూపః స్వయమేవహి
మనోగత స్తదాకర రసతామేతి పుష్కలమ్' (1-10)

చిత్తము ద్రవావస్థలో నున్నప్పుడు దానియందు ప్రవేశించిన వస్తువు యొక్క ఆకారము స్థిరముగా నుండిపోవును కావున దానిని స్థాయియని పిలుచుట సార్థకము. ద్రవించిన చిత్తమునందు స్థాయిగా నిలుచునది భగవదాకారమే. అట్టి భగవంతుడు స్వయముగా పరమానంద స్వరూపుడు. అద్దమునందు బింబము ప్రతిబింబముగా భాసించి బింబలక్షణములనన్నింటిని కలిగియుండు

నట్లు ద్రుతచిత్తమునందు ప్రతిబింబితమైన పరమానంద రూపమైన భగవదాకారముకూడ పరమానంద సాక్షాత్కార రూపముగానుండి స్థాయిభావముగా నిలిచి రసముగా పరిణమించును. అనగా పరమానంద స్వరూపమే భక్తిరసమని స్పష్టమగుచున్నది. ఆలంబన విభావముగానుండు భగవంతుడు బింబము వంటివాడు. సహృదయ ద్రవీభూత చిత్తమునందు ప్రతిబింబించెడి భగవంతుడు స్థాయివంటివాడని మధుసూదన సరస్వతి గాఢవివేచనము గావించెను.

ఈ యంశమునుగూర్చి డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తిగారు శ్రీమదాంధ్ర భాగవతానుశీలనమను సిద్ధాంత గ్రంథమున నీక్రింది విధముగా సమాలోచన చేసి సమన్వయించెను :

a. 1. 'మధుసూదనుని సిద్ధాంతమునుబట్టి భక్తిరసమునందొక వైచిత్రికలదు. అది "భక్తిరసమునకు భగవంతుఁడే స్థాయిభావ" మన్నది. అనగా భగవద్విషయకమైన రతి భగవద్రూపమేయని యర్థము. ఇందుచేత నాలంబన విభావమే భక్తి రసమునందు స్థాయిత్వము నొందుచున్నది. శృంగారాది రసములందు జన్మాంతరీయక వాసనా రూపములగు రత్యాదుల కాలంబనములైన కాంతాది విభావముల కిట్టియోగ్యతలేదు. భగవంతుఁడు పరమానంద స్వరూపుఁడగుట వలన నాయనకు స్థాయిత్వము కుదురుచున్నదని మధుసూదనుని భావన.

b. 2. మధుసూదనుని యీ సిద్ధాంత ప్రతిపాదన వైఖరి పరమ గంభీరమై దురవగాహమైనట్టిది. ఇందు దురవగాహనమైన యంశములు మూఁడు. ఒకటి-స్థాయిభావములు (రత్యాదులు). మనః ప్రవిష్టములైన విషయములకు శాస్త్రము విభావానుభావ సంజ్ఞ చేయుచున్నది. విభావరూపమైన భగవదాకారమునకుఁ దదాలంబనమైన రతికిని నభేదమెట్లు కుదురునని. మూఁడు-రత్యాదులకు రసత్వము చెప్పవలసియుండగా భగవద్రూపమునకే రసత్వము చెప్పుట యెట్లని.

c. 3. ఆలంకారికులు చెప్పిన రత్యాది భావములు మధుసూదనుఁడు చిత్త తాపకములుగా గ్రహించినాఁడు చిత్తతాపకములుగా గ్రహించినాఁడు. స్థాయి భావమనఁగాఁ జిత్తమందుఁ బ్రతిబింబించిన వస్త్వాకారమన్నాఁడు. అందుచేతనే మనోగతమైన భగవదాకారము భక్తిరసమునకు స్థాయిభావ

మన్నాఁడు. ఈ సరణి యాలంకారికుల పద్ధతికంటె విలక్షణమైనది. ఆలంకారికులు జన్మాంతరీయకములైన వాసనలు చిత్తమునందు స్థిరములై యుండి యుచితమైన వ్యంజక సామగ్రినిఁ బొందినపుడు వ్యక్తములగు చుండునని చెప్పినారు. కాని, యీ వాసనలు వస్త్వాకారముగా నుండునని చెప్పలేదు.

d. 4. భగవద్రతి యాత్మరతియే. భగవద్రతి భగవద్రూపమే యని చెప్పుటచేఁ దత్త్వావగతినిఁ జెప్పినట్లేయయినది. ఆత్మరతి యన్నట్లు భగవద్రతి వైరాగ్యమునకు విరోధి కాదు. భక్తి జ్ఞాన వైరాగ్యములు పరస్పర సహాయకములు. ఒకదాని వలన నొకటి పరిపుష్టమగునట్టివి. భక్తి రసమునందాత్మమీశ్వర స్వరూపముగను, శాంతమునందు స్వస్వరూపముగను ప్రతీయమానమగుట తప్ప మఱియొక భేదమీ రెంటికిని లేదు. ఈ భేదమును బురస్కరించుకొని యిది పదవ రసముగా మధుసూదనుఁడు చెప్పినాఁడు.[223]

ఈ వివరణము మధుసూదన సరస్వతి భక్తిరస స్వరూపమును తత్స్థాయిని ప్రతిపాదించుటలోని కొన్ని గాఢమైన యంశములను వెలికితీయు చున్నవి. భక్తిరసాయనము నందలి ప్రథమోల్లాసముమంతయు భక్తిస్వరూప వివరణమునకు వెచ్చింపబడినది.

ద్వితీయోల్లాసము భక్తి విశేష నిరూపణమున కంకితమైనది.

"ద్రుతచిత్తే ప్రవిష్టాయా గోవిందాకారతాస్థిరా
సాభక్తిరిత్యభిహితా; విశేషస్త్వధునోచ్యతే" (2-1)

అని యారంభించుటలో నా విషయము స్పష్టము కాగలదు. ద్రుతచిత్తమునందు ప్రవేశించిన గోవిందాకారత యనెడి స్థాయినే భక్తియందురు అని ప్రథమోల్లాసమునందు ప్రతిపాదించిన విషయమును మొదట ధ్రువీకరించి ఆపై విశేషాంశములను పేర్కొనుట యైనది. చిత్తద్రుతికి మూలములైన కారణములననుసరించి భక్తి కూడ బహురూపములుగా భాసించునని మధుసూదన సరస్వతి యిందు ప్రతిపాదించెను.

**చిత్తద్రుతికి కారణములు :**

చిత్తద్రవీ భావమునకు కారణములైన వానిలో మొదటిది కామము. 'కామః శరీర సంబంధ విశేష స్పృహయానుతా'యని కామమునునిర్వచించెను. అది సన్నిధాన అసన్నిధాన భేదములచే రెండు విధములని నిర్దేశించెను. శ్రీకృష్ణ నిష్ఠమైన కామముచే చిత్తము ద్రవీభూతమైనపుడు శ్రీకృష్ణ సాన్నిధ్యమున సంభోగముగను, శ్రీకృష్ణుని యొక్క అసాన్నిధ్యమున విప్రలంభముగను వరుసగా నేర్పడునని విశ్లేషించెను.[224] ఇక రెండవ కారణము క్రోధము. ఈర్ష్యవలన జనించు క్రోధము చిత్తమును జ్వలింప జేయును. క్రోధము వలన కలుగు చిత్తద్రుతియందు భగవదాకారత భాసించినచో దానిని ద్వేషమందురు.[225] ద్వేషము వలన చిత్త విక్షేపము కలుగును. ద్వేషమునందు శ్రీకృష్ణాది దర్శనము ఉపద్రావక దర్శనమగును. ద్వేషము నశింపవలెననినచో ఆ ఉపద్రావక విషయము కూడ నశింపవలయును. తత్ విషయ నాశనముచే మనఃప్రీతి కలుగును. క్రోధమునకును రతికినిగల భేదమును మధుసూదన సరస్వతి యిచట నిపుణముగా నిరూపించెను. ఉపద్రావక నాశమును లక్షించి వెలువడు క్రోధమును ద్వేషమనవచ్చుననియు, ప్రీత్యర్థకమైన క్రోధమును రతియనవలయుననియు వివేచించెను.[226] ఇట్టి రతిని విప్రలంభముగా గ్రహింపవలెనని పేర్కొనెను.మూడవ కారణము భయము. ద్వేషము హేతువుగా కలిగినది. నిజాపరాధముచే స్వయముగా నుద్ధితమైన చిత్త వైక్లబ్య రూపమైనదియైన కారణముచే చిత్తద్రుతి కలిగినచో దానిని భయమందురని మధుసూదన సరస్వతి పేర్కొనెను.[227] నాలుగవది స్నేహము. ఇది మూడు విధములు. 1. పుత్రాది విషయకము 2. పాల్యపాలక లక్షణ విశిష్టము. 3. సేవ్యసేవక భావసమన్వితము.[228] భగవంతుని దాస్యబుద్ధితోడను సఖ్యబుద్ధితోడను భజింపవచ్చును. దాస్యము సఖ్యము కలిసినచో సేవ్యసేవక భావము కాగలదు. ప్రీతి స్థాయి భావముగా కలిగినది సఖ్యరూపమగు ప్రేయోరసమని పూర్వులు పేర్కొనినారు. మధుసూదన సరస్వతి పాల్యపాలక భావము వలన వత్సలరతి యేర్పడుననియు సేవ్యసేవక భావము వలన ప్రేయోరతి కలుగుననియు ప్రతిపాదించెను.[229]

ఐదవకారణము హర్షము. 'హర్షశ్చిత్తసముల్లాసః కథ్యతే'-చిత్తసముల్లాసమే హర్షము. అది నాలుగు విధములు. మొదటిది పరమానందమయము. నిరతిశయానందరూపమైన ఈ హర్షము విష్ణుమాహాత్మ్యానుభవ జన్యమైనదిగానుండును. ఇట్టి హర్షమువలన జనించు భగవద్విషయకమైన చిత్తద్రుతి శుద్ధమని మధుసూదన విశేషించి పేర్కొనెను.[230] 'తజ్జన్యాయాం ద్రుతౌ శుద్ధా రతిర్గోవింద గోచరా' యని పేర్కొనుట గమనింపదగినది. మిగిలిన మూడు హర్షములకంటే యిదియే ఉత్తమమైనది. క్రీడావికృత వాగ్వేషచేష్టాది జనితమైన హర్షము రెండవ విధము. ఇట్టి హర్షము వలన కలుగు చిత్తద్రుతి యందు వికాసరూపమైన హాసము భాసించును.[231] లోకోత్తర చమత్కారి వస్తు దర్శనము వలన జనించు హర్షము మూడవది. దీని వలన కలుగు చిత్తద్రుతి యందు చేతోవికాసరూపమైన విస్మయము భాసించును.[232] యుద్ధాదితావ భావములచేత వీరులయందు ప్రజ్వలన రూపముగా జనించు హర్షము నాలుగవది. యుద్ధమునందు జనించువాని చిత్తము ద్రవీభూతమైనపుడు గోచరించు చిత్తవిస్తారరూపమగు ఉత్సాహముగా నిది భాసించును.[233]

ఆరవ కారణము శోకము. ఇష్టవిచ్ఛేద జనితమైన చిత్తవ్యాకులత్వము శోకము. ఇట్టి శోకమువలన ద్రవీభవించిన చిత్తమునందు ప్రవేశించిన రతి భావమే శోకముగా మధుసూదన సరస్వతి నిర్దేశించెను.[234] శోకము తరువాత గణింపదగిన చిత్తద్రావకము దయ.[235] విషయములన్నియు క్షుద్రములనెడి జ్ఞానము కలిగినయెడ దయ యుదయించునని మధుసూదన సరస్వతి పేర్కొనుచు దానినుండి జనించునది జుగుప్సయనెను. ద్రుతచిత్తమున జనించు జుగుప్సను గురించి తెలుపునదియు మూడు విధములుగా నుండుననెను. అది ఉద్వేజకత్వ, క్షోభకత్వ, వివేకానాస్పదత్వ రూపములతో నొప్పారునని పేర్కొనెను. మొదటిది ఉద్వేగినియైన జుగుప్స. ఇది దుర్గంధములు, వ్రణములు మొదలైన విషయములు చూచుటవలన కలుగునది. రెండవది క్షోభిణీరూపమైన జుగుప్స. శ్మశానములో పిశాచములు మొదలగువానిని గాంచుటవలన నది సంభవించును. దేహేంద్రియాది దుఃఖమువలన కలిగిన జుగుప్స అవిచారమూలము కావున నది వివేకనాస్పదత్వరూపమైన జుగుప్స యనబడును. దీనికి బాహ్యోపాధి సంపర్కము లేకపోవుటచే శుద్ధమైన దయ యని మధుసూదన సరస్వతి నిర్దేశించెను.[236]

ఆతరువాత భక్తి రసాయనకర్త దయా, దాన, ధర్మోత్సాహములను వివేచించెను. దయ నీయములైన విషయములను రక్షించుటకొఱకై పూనుకొను వానియందు జనించు అనుకంపాసమేతమైన ప్రవృత్తివలన చిత్తముద్రవీభూతముకాగా నందుండి దయోత్సాహ ముద్భవించును.[237] అర్థులు స్వాయాభీష్ట వస్తువుల నర్థించగా దాతయగు వీరునియందు అర్థికొఱకు తన సర్వస్వమును దానము చేయవలెనను మహోత్సాహము కలిగినపుడు ద్రుతచిత్తము నుండి సముద్భవించునది దానోత్సాహమనబడును.[238] స్వీయ ధర్మరక్షణార్థమై ప్రయత్న పూర్వకముగా నొనరించు నుద్యమమందు భాసించు ప్రవృత్తి వలన చిత్తము ద్రవీభూతమైనపుడు జనించునది ధర్మోత్సాహము.[239]

ఉత్సాహ భావ భేదములను చెప్పి లక్షణకర్త శమభావమును నిర్వచించెను. కామనాస్పృహలేని వశీకారనామకమైన వైరాగ్యము మూలముగా ద్రవీభూతమైన చిత్తమునందు ప్రకాశించునది శమభావము.[240] ఇట్లు కామ క్రోధ భయ స్నేహ హర్ష శోక దయా శమములను భావములు మాత్రమే చిత్తద్రుతికి కారణములగు చున్నవి. వీనికంటె భిన్నములైనవానికి చిత్త ద్రవీకరణ మొనరించు శక్తి లేదు. వీనినే స్థాయి భావములుగా నెంచవలెను. విభావాదులను సమాశ్రయించి యీ స్థాయి భావములు రసత్వమును బొందును.[241]

పైస్థాయి భావములతో నొప్పారు నాయారసములలో భక్తి రసమును బొందనివాని నారింటిని శ్రీమధుసూదన సరస్వతి పేర్కొనెను

"ధర్మవీరో దయావీరో బీభత్సః శాంత ఇత్యమీ
అతోన భక్తి రసతాం యాతి భిన్నాస్పదత్వతః" (2-28)

అని సరస్వతి నిర్దేశము. అనగా ఉత్సాహము స్థాయికములైన ధర్మ దయావీరములు, జుగుప్సాస్థాయికమైన త్రివిధ బీభత్సరసము, శమస్థాయికమైన శాంతమనునవి భగవద్విషయకమైన ఆలంబన విభావముల నాశ్రయించి యుండమిచే నవి భక్తిరసత్వము పొందుశక్తిని కలిగియుండవని భావము. ఇంతియేకాక ఈర్ష్యవలన భయమువలన జనించు ద్వేషభావములకు ఆలంబనమగునది భగవంతుడేయైనను, అవి చిత్తద్రుతికి సాక్షాద్విరోధులగుటచేత భక్తి రసమునందు పర్యవసించలేవని మధుసూదన సరస్వతి నిర్దేశించెను. అట్లే

శుద్ధ రౌద్రరసముగాని, సంకీర్ణమైన రౌద్ర భయానక రసముగాని భక్తిరసము నందు పర్యవసింపచాలవు. భగవద్విషయక ప్రీతి యారసమునందు లేక పోవుటయే దానికి కారణమని లక్షణకర్త పేర్కొనెను. ఇక భగవద్విషయ కములైన స్థాయి భావముల నిట్లు పేర్కొనెను :

'కామ జేద్వేరతీశోకః ప్రీతి భయ విస్మయస్తథా
ఉత్సాహోయది దానేచ భగవద్విషయా అమీ' (2-31)

కామమువలన జనించు సంభోగ విప్రలంభాత్మకమైన రతియు, శోకము, ప్రీతి, భయము, విస్మయము, దానము, ఉత్సాహము అను భావములు మాత్రమే భగవద్విషయకములని నిర్దేశించెను. ఆ భావములు నీరక్షీర సంయోగమువలె విభావానుభావ సంచారులతో వ్యామిశ్రభావము చెంది భగవద్విషయకములై భక్తిరసములని పిలువబడును.[242]

మధుసూదన సరస్వతి రతిభావమును మూడువిధములుగా వింగడించెను. 1. శుద్ధరతి 2. వత్సలరతి 3. ప్రేయోరతి యని వానిని పేర్కొనెను. ఈ మూడువిధములైన రతిభావములు నితర భావములతో వ్యామిశ్రితములు కావనియు, అందువలన నట్టి రతిభావములను 'అమిశ్రితరతు'లని పిలువవలెనని పేర్కొనెను.[243] రతిభేదత్రయము ననుసరించి భక్తియు మూడు విధములుగా నొప్పారును. శుద్ధరతిస్థాయి యైనది విశుద్ధరసము. వత్సల రతిస్థాయిగా వెలయునది వత్సలరసము. ప్రేయోరతిస్థాయి యైనది ప్రేయోరసము. ఇవి భక్తిరస భేదములు. పై మూడు స్థాయి భావములను అన్యభావములతో మిశ్రిత ములు కానట్లే, పై మూడు విధములైన రసములును అన్యరసములతో మిశ్రిత ములు కావు. అట్టి వైలక్షణ్యము ననుసరించి వానిని పరిపుష్కల రసములని పేర్కొనదగి యున్నవి.[244]

**రసములు:**

భక్తిరసాయన కర్త రసములను చతుర్విధములుగా విభజించి పేర్కొనెను. అవి 1. కేవలసంకీర్ణములు, 2. సంకీర్ణమిశ్రితములు, 3. కేవలమిశ్రిత ములు, 4. శుద్ధములు. క్రోధభయోత్సాహజుగుప్సానిర్వేదము లన్యభావము లతో సంకీర్ణములైనపుడు రౌద్రము, రౌద్రభయానకము, ధర్మదానవీరములు, బీభత్సము, శాంతమనెడు రసములు విషయములగును. కావున నీ రసములను

కేవలసంకీర్ణము లనవచ్చును. ఇవి భగవద్భిన్నమైన ఆలంబనముల నాశ్రయించినపుడు సంకీర్ణమిశ్రితరసము లనఁబడును. భగవదాలంబనమును గూడ గ్రహించినప్పుడు కేవలమిశ్రితములగును. అవియే భావాంతర సంకీర్ణమును పొందక భగవదాలంబనత్వమును గ్రహించినచో శుద్ధము లనబడును.[245]

భక్తి :

ఇట్లు సంకీర్ణాది భేదములను పేర్కొనిన తరువాత మధుసూదన సరస్వతి గుణభేదము ననుసరించి భక్తిని నాలుగు విధములుగా విభజించెను. అవి 1. రాజసీభక్తి, 2. తామసీభక్తి, 3. శుద్ధసాత్వికభక్తి, 4. మిశ్రభక్తి. ఈర్ష్య నుండి జనించెడి ద్వేషము మూలమైనది రాజసీభక్తి. భయమునుండి పుట్టెడి ద్వేషమువలన కలుగునది తామసీభక్తి. హర్షభావజనితమైనది శుద్ధసాత్వికీభక్తి కామశోకాది భావజనితమైనది మిశ్రభక్తి[246] ఈ నాలుగు రకములైన భక్తులను సుఖత్వదృష్టితో భక్తిరసాయనకర్త రెండు వర్గములుగా చేసెను. రాజసీ తామసీభక్తులు ద్వేషాదులచే కూడియుండుట వలన సుఖవిరోధులనియు మిగిలిన రెండును సత్త్వప్రధానములగుటచే సుఖమయములనియు సంభావించెను.[247]

అపై ఫలము ననుసరించి భక్తిని మూడువిధములుగా లక్షణకర్త నిర్దేశించెను. 1. దృష్టాదృష్టోభయఫలా 2. దృష్టైకఫలా 3. అదృష్టైకఫలా యని వానిని పేర్కొనెను. రాజసీ తామసీభక్తులు అదృష్టైక ఫలములనియు, మిశ్ర భక్తి దృష్టాదృష్టోభయఫలయనియు, శుద్ధసత్త్వభక్తి దృష్టైకఫలయనియు వర్గీకరించెను. భక్తివలన సుఖాభివ్యక్తి ప్రత్యక్షముగా ననుభవింపబడినచో నది దృష్టఫలరూపమగు భక్తియనబడును. ఇందలి సుఖము నిదాఘతాపముచే బాధ పడుదేహమునకు గంగాస్నానము విధముగా సుఖశాంతులనిచ్చునని మధుసూదన సరస్వతి పేర్కొనుట గమనింపదగినది.[248] దృష్టాదృష్టోభయ ఫలరూపమైన భక్తియు దృష్టమాత్రఫలరూపముగా పరిణమించుటకు వీలుకలదనికూడ లక్షణ కర్త పేర్కొనియున్నాడు. రజస్తమోభక్తులయందు సుఖాభివ్యక్తి వాయుతాడిత మైన దీపశిఖవోలె కొట్టుమిట్టాడునని పేర్కొనెను.[249] రజస్తమోరహితమై భగవద్విషయకమైన మతి సుఖాభివ్యంజకమగుననియు అదియే రతి యనబడు నని నిర్ధారించెను.

'రజస్తమో విహీనాతు భగవద్విషయామతిః
సుఖాభివ్యంజకత్వేనరతి రిత్యభిధీయతే॥' (2 58)

రతి భావ లక్షణము నిర్దేశించునది విరహాసహిష్ణుతాత్మక ప్రీతి విశేషమని పేర్కొనెను. విరహమెంత తీవ్రముగా నుండునో రతియు నంత గాఢముగా నుండునని పేర్కొనుచు విరహ తీవ్రతను మూడు రకములుగా నిరూపించెను. 1 మృదు తీవ్ర విరహము 2. మధ్య తీవ్ర విరహము 3. తీవ్ర తీవ్ర విరహమునని. వైకుంఠమునందు మృదు తీవ్ర విరహము, ద్వారకయందు మధ్య తీవ్ర విరహము శ్రీమత్ బృందావనమునందు తీవ్ర తీవ్ర విరహము భాసించునని పేర్కొనెను.[250]

## భక్తిరసము పరిపూర్ణ రసము

ద్వితీయోల్లాసమున భక్తిరసమును నిర్వచించుచు కాంతాది విషయకములైన క్షుద్రరసములకంటె నది పరిపూర్ణమని వక్కాణించుచు,

'రతిర్దేవాది విషయా వ్యభిచారీతథోర్జితః
భావః ప్రోక్తా రసోనేతి యదుక్తం రస కోవిదైః' (2-75)

"పరిపూర్ణ రసాక్షుద్ర రసేభ్యో భగవద్రతిః
ఖద్యోతేభ్య ఇవాదిత్య ప్రభేద బలవత్తరా' (2-78)

అన్యరసములు మిణుగురు పురుగుల వెలుగుల వంటివి. భక్తిరసము సూర్యునివంటిది అని భక్తిరస ప్రాముఖ్యమును శ్రీ మధుసూదన సరస్వతి ప్రతిపాదించెను.

తృతీయోల్లాసమున మధుసూదన సరస్వతి భక్తిరసత్వమును స్థాపించెను. ఈ ఉల్లాసము నారంభించుచు నాలుగు ప్రశ్నలు వేసికొని వానికి సమాధానములు చెప్పుట ద్వారా భక్తిరసత్వ స్థితిని నిరూపించెను.

'నను కేయం రసోనామ? కిం నిష్ఠోవాభవేదసౌ
అస్య ప్రత్యాయకః కోవా? వతీతి రపికీ దృశీ?' (3-1)

అనునవి ఆ ప్రశ్నలు. రసమనగానేమి? ఆ రసము యన్నిష్ఠము? ఆ రసమెట్లు ప్రతీయమానమగును? అసలు రస ప్రతీతియనగానేమి? ఈ ప్రశ్న

చతుష్టయము భక్తి రసస్థితికి నాలుగు పాదముల వంటివి. ఈ నాలుగింటికి సమాధాన రూపములైన శ్లోకములివి.

1. రసమనగానేమి?

'విభావై రనుభావైశ్చ వ్యభిచారిభి రప్యత
స్థాయి భావః సుఖత్వేన వ్యజ్యమానోరసః స్మృతః' (3-2)

2. రసము కింనిష్ఠము?

'బోధ్యనిష్ఠాయథాస్వంతే సుఖదుఃఖాది హేతవః
బోద్ధృనిష్ఠాస్తు సర్వేఽపి సుఖమ త్రైక హేతవః' (3-5)

3. రసమెట్లు ప్రతీయమానమగును?

'గుణాలంకార రీతీనాంభావానాంచనివేదకః
తస్య ప్రత్యాయకః శబ్దోవృత్త్యా వ్యంజనరూపయా' (3-20)

4. రసప్రతీతియనగానేమి?

నిత్యం సుఖమభివ్యక్తం 'రసోవైస' ఇతిశ్రుతేః
ప్రతీతిః స్వప్రకాశస్య నిర్వికల్ప సుఖాత్మికా' (3-22)

విభావానుభావ వ్యభిచారి భావముల సంయోగమువలన నేర్పడు స్థాయి భావము సుఖరూపముగా వ్యజ్యమానమైనచో రసము నిష్పన్నమగును. మధుసూదన సరస్వతి స్థాయిభావము సుఖరూపముగా నున్నపుడు మాత్రమే రసముగా నభివ్యక్తమగునని పేర్కొనుట గమనింపదగినది. పూర్వ ప్రకరణములో సుఖరూపములగు రసములను సుఖవిరోధులగు రసములను పేర్కొని సుఖాభివ్యంజకమగు రతియే రసముగా పరిణమించునని నిరూపించుట ఈ రస నిర్వచనమునకు అనుగుణమైన విధానమే. రసము సామాజిక కనిష్ఠమని మధుసూదన సరస్వతియు ప్రతిపాదించెను. అతని మాటలలో రసము బోద్ధృనిష్ఠము.[251] భోజ్యమైన విషయమును గ్రహించువాడు బోద్ధ. కావున నిచట బోద్ధృనిష్ఠమనగా సామాజిక నిష్ఠమనియే భావము. సుఖదుఃఖాలను కలిగించు భావములన్నియు రసాస్వాదన సమయమునందు సామాజికులకు కేవలసుఖమునే కలుగజేయునని మధుసూదన సరస్వతి సహృదయ నిష్ఠమైన రసానుభము సుఖాత్మకమని పేర్కొనెను.

కావ్యమునందు రసమెట్లు ప్రతీయమానమగునో వివరించుచు మధుసూదన సరస్వతి గుణాలంకార రీతులకును భావములకును నివేదకమైన శబ్దము

వ్యంజనా వ్యాపారముననుసరించి రసమును ప్రతీయమాన మొనర్చునని పేర్కొనెను. ఇంతవరకు ఆనందవర్ధనాదులు ప్రతిపాదించునట్లు భక్తిరసాయనకర్తయు వ్యంజనావృత్తివలన రసము అభివ్యక్తమగునని పేర్కొనెను.[252] అంతటితో నాగక-

'వృత్తిః కార్యాఽపరోక్షాఽస్యశబ్దస్య సుఖగర్భిణీ
దశమస్త్వ మసీత్యాది వాక్యోత్థ మతివృత్తివత్' (3.21)

ఇందు రసప్రతీతిని అపరోక్షానుభూతియని చెప్పెను. అపరోక్షానుభూతి యనగా పరోక్షము గాని ప్రత్యక్షమైన యనుభూతియని భావము రసమును ప్రతీయమానమొనర్చు శబ్దమునకు అపరోక్షవృత్తిని అంగీకరింపవలయుననియు అది సుఖగర్భిణియనియు నిర్దేశించుచు దాని కుదాహరణముగా 'దశమస్త్వమ్' అను వాక్యము నుటంకించెను. ఇది పరమానందయ్య శిష్యుని వంటి వాడొకడనిన వాక్యము వంటిది. ఉన్న పదిమందిని లెక్కింపుమనగా తనను లెక్కించుకొనక పదియవవాడు తప్పిపోయెనని వాపోవు శిష్యునిగాంచి దారిన బోవువాడొకడు పదియవ వాడవు నీవేయని చెప్పిన వాక్యము వంటిది యీ వాక్యము. ఆ మాట విని యా శిష్యుడు పదియవ వానినిగా తనను తాను సాక్షాత్కరింప జేసికొని ప్రత్యక్షానుభవమును బొందును. ఆ అర్థమును స్ఫురింపచేసినది శబ్దమేయైనను అనుభవము మాత్రము ప్రత్యక్షమే. ఇట్లు శబ్దవ్యంజితమైన రసము సాక్షాత్తుగా ననుభవించునట్లు గ్రహించుటయే రసప్రతీతికి ముఖ్య లక్షణమని మధుసూదన సరస్వతి పేర్కొనుట విశిష్టము. భక్తిరసమందు భగవదాకార రూపమైన రతి అపరోక్షానుభవ శక్తివలననే సుఖరూపమైన అనుభవ స్థితి నందించునని మధుసూదనుని మతము. రసప్రతీతియననేమియో తెలుపుచు 'రసోవైసః' అను తైత్తిరీయోపనిషత్తు వాక్యము నుటంకించుచు ఆనందరూపుడైన బ్రహ్మయే రసమను ఉపనిషత్ తాత్పర్యమును గ్రహించుచు లోకోత్తర సుఖానుభవము నందించు రసము నిత్యమనియు, స్వయం ప్రకాశమనియు, నిర్వికల్పమనియు, సుఖాత్మకమనియు పేర్కొని, రసప్రతీతిని నిరూపించెను.

'కార్యజ్ఞాప్యాదివైధర్మ్యం యత్తుకైశ్చిన్నిరూపితమ్
తదప్యే తేన మార్గేణ యోజ్యం శాస్త్ర విరోధతః' (3.23)

అని తన సమన్వయమును ప్రతిపాదించుట భక్తి రసాయనకర్త ప్రత్యేకత. ఈ శ్లోకార్థమును వివరించుచు శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి గారి మాటలు గమనించదగినవి:

'మట్టినుండి కుమ్మరికుండలు చేయునట్లు విభావాదులనుండి జన్మించునది రసమను వాదమ్మొకటి కలదు. చీకటిలోనున్న వస్తువును దీపము

బహిర్గతము చేయునట్లు విభావాదులచే జ్ఞాప్యమగునది రసమని మరియొక వాదము కలదు. విభావాదులను రసకారణములుగా గ్రహించవీలులేదు. కారణమే కార్యరూపమున పరిణమించుటచే కారణత్వ స్వభావము. కారణమున కన్పించుటయే గాక కార్యముత్పన్నముకాగా కారణరూపముతో కారణముండజాలదు. పాలనుండి పెరుగు రాగా, పాలయొక్క స్వభావము పెరుగున కలదు. పాలు పాలుగా నిలుచుట లేదు. కాని రస ప్రతీతిలో విభావములు నశించుటలేదు. రసమునాత్మగా నంగీకరించవలెనని సిద్ధాంతీకరించితిమి. ఈ ఆత్మ కారణ జన్యము కాదని స్పష్టము. రసమును జ్ఞాప్యముగా కూడ నెంచవీలులేదు. దీపమునకు తదభివ్యక్త వస్తువునకు విషయసత్తాకస్థితి లేనిదే ఇచట జ్ఞాప్యత్వము సిద్ధించదు. జ్ఞాప్యమగు వస్తువు వేరు. జ్ఞాపకమగు దీపము వేరు. ఇట్లు స్థాయిభావము వేరు, స్థాయి భావముతో సంయోగమందని విభావాదులు వేరు అని చెప్ప జాలము. విభావాదులకు స్థాయితో సమసత్తాకత్వము కలదు.[253]

ఇట్లగుటచే పరమానందరూపమగు ఆత్మయే రసముగా అనుభూయమగుచున్నపుడు విభావాదులన్నియు అందు లయమైపోవును. భగవద్రూపరతి స్థాయికమైన భక్తిరసమునందు భగవద్రూపత్వము తద్భావత్వము, ఆత్మత్వము అను కారణకార్య విరహితమైన అపరోక్షానుభవస్థితి భాసించునని మధుసూదన సరస్వతి భక్తి రసాయనమున భక్తిని రసముగా స్థాపించెను.

భారతీయ భక్తిరస ప్రస్థానమునందు భక్తిరసామృత సింధువు, ఉజ్జ్వల నీలమణి, భక్తి రసాయనము అను నీ మూడు గ్రంథములును భక్తిరసస్థితిని ప్రతిపాదించు ప్రామాణిక లక్షణగ్రంథముగా ప్రసిద్ధిగాంచినవి. భక్తిని రసముగా నంగీకరించినచో నీ గ్రంథములలోని సమన్వయమును గూడ నంగీకరింపవలసియుండును. శ్రీరూపగోస్వామి రచన భక్తి దీయమునే ప్రతిపాదించినది. భక్తి రసాయనము దానిని అద్వైత సాంఖ్యముల కనుగుణముగా సమన్వయించినది. రూపగోస్వామి భక్తి రస తత్త్వముతోపాటు విశ్లేషణము కూడ విస్తారముగా చేసెను మధుసూదన సరస్వతి భక్తిరస చర్చను విశ్లేషణము నుండి వివేచనమువైపు మరలించెను. ఆంధ్ర సాహిత్యమునందలి భక్తిరసమును గూర్చి- విశేషించి మధుర ముగ్ధ భక్తులను గురించి పరిశీలింప వలయునన్నచో ఈ లక్షణకర్తల వివేచనములు పరమ ప్రమాణములు కాగలవని భావించుటలో విప్రతిపత్తి యుండబోదు

# మధుర మగ్ధ భక్తులు
# అనుశీలన విధానము

'ఆనంద చిన్మయ రస ప్రతిభావితాభి
స్తాభిర్య ఏవ నిజరూపతయా కలాభిః
గోలోక ఏవ నివసత్యఖిలాత్మభూతో
గోవిన్దమాదిపురుషం తమహం భజామి' (ఉ. నీ. 3-53)

పూర్వాధ్యాయములలో చేసిన భక్తిరస సమాలోచనము దృష్టియందుంచు కొనిచో ఈ క్రింది విషయములు స్పష్టము కాగలవు:

1. భక్తిరసవిచారమున భరతాదుల సంప్రదాయ మొకటి, రూపగోస్వామి, మదుసూదన సరస్వతి మొదలగువారు ప్రవర్తింపజేసిన వైష్ణవభక్తి సంప్రదాయము మరొకటి. వీరశైవాది భక్తి సంప్రదాయములు మరికొన్నియు కలవు. వీనిలో భరత సంప్రదాయవాదులు భక్తి అలౌకిక రసము కాదని భావింతురు. వంగదేశ లాక్షణికులు భక్తిరసమనియు, అందును మధురభక్తి పరిపూర్ణరసమనియు ప్రతిపాదించిరి. వీరశైవాది మతస్థులు మధురభక్తికంటె విశిష్టములైన స్నేహవత్సలాదులను వీరోత్సాహముతో ప్రకటించెడి ప్రవృత్తిని సమాదరించిరి.

2 సంస్కృత భాగవత సంప్రదాయమునందు నవవిధ భక్తుల ప్రసక్తి కలదుకాని మధురభక్తి ప్రసక్తిలేదు. మధురభక్తి లాక్షణికులు ప్రతిపాదించిన విశిష్టభక్తిమార్గము. కాని, అది భాగవతములోని గోపికా తత్త్వమును రాధా మాధవ తత్త్వముగా వ్యాఖ్యానించిన వైఖరి. దానికి ప్రాతిపదిక భాగవతమే. అనగా భాగవత కాలమునాటికి లేని పారిభాషిక పదమైన మధురభక్తి రూపగోస్వామ్యాదులు విశ్లేషించి కల్పించినారని భావము. అనగా మధురభక్తి వివేచనము భాగవతముకంటె అధునాతనమయినను అనుశీలనమునందు సమాదరణీయమే.

3. భక్తిరస భేదములన్నింటిని పరిగణించినచో వాని స్వభావమునుబట్టి భక్తిరసమును మూడు విధములుగా భావించుటకు వీలున్నది. భగవద్రతి యందు మాధురీ భావమనదగు ఉదాత్తరతి భావమునకు ప్రాధాన్యము కలిగినది మధురభక్తి, ఉత్సాహ రౌద్రాది భావములకు ప్రాధాన్యము కలిగినది ముగ్ధభక్తి, శమమునకు ఆత్మజ్ఞానమునకు ప్రాధాన్యము కలిగినది జ్ఞానభక్తియని సంభావించుటకు వీలగుచున్నది. ఈ మూడింటిలో భక్తిరస పరిపూర్ణతను ప్రతిపాదించినది మధురభక్తియే. ముగ్ధభక్తి భేదములన్నియు దైవరతి ప్రాధాన్యములయ్యు ఆసక్తి ప్రేమ, అనురాగము మొదలైన మధుర భావములకంటె ప్రీతి, సేవాభావము, వత్సలాది భావములతో విశేషముగా ప్రకాశించుచుండును. జ్ఞాన భక్తి శాంతరస సాధనముగా రాణించినంతగా భగవద్రతిరూపమైన మధుర రసముగా రాణించదు. దానికి కారణము ఈ భక్తి శాఖలో ఉపాస్యుడైన భగవంతుడు సాకారుడుకాడు; తత్త్వరూపుడు లేదా ఆత్మానందరూపుడు. ఇట్లగుటచే మధురభక్తి భక్తిరసము యొక్క పరిపూర్ణ స్వరూపమును వ్యక్తీకరించునదిగను, ఈ మూడింటిలో శిఖరప్రాయమైనట్టిదిగను నిర్ణయింపదగి యున్నది.

**అనుశీలన మార్గము :** భక్తిరస సిద్ధాంతములను గురించియు వానిని కావ్యాదుల కన్వయించి అనుశీలించెడి విధానములను గురించియు ఆధునికులు కొన్ని ప్రమాణములను ముందుగ నిశ్చయించుకొని అనువర్తిత విమర్శను వెలయింపవలసిన అవసరము కలదు అందుకు ఈ సిద్ధాంత వ్యాసమును నిర్వహించుటకు అట్టి ప్రణాళిక మున్ముందుగా నేర్పరచుకొనవలసియున్నది. దానిని సంప్రదాయమునకు విరుద్ధముగాకుండ అనుశీలనమునకు అనువుగా నుండునట్లు మలచుకొనుటలో ఒక నూతన సమన్వయదృక్పథమును ప్రతిపాదించుట ప్రధానమగుచున్నది. ఇది కొంత సాహసముతో కూడిన పనియే కావచ్చును. కాని, ప్రవాహరూపముగా ముందుకు సాగుచున్న భక్తిరస వివేచనానుశీలనములను అభినవ దృక్పథముతో సమాలోచించుటను సహృదయులు మన్నించెదరని భావించుచున్నాను.

ఈ సిద్ధాంత వ్యాసమున అనుశీలనమునకు గ్రహించిన యంశములు మధురభక్తి-ముగ్ధభక్తి. వీనిని ప్రధానముగా శ్రీమదాంధ్ర మహాభాగవతమును, బసవపురాణమును ఆలంబనముగా చేసికొని వివేచించుట ఈ వ్యాసతాత్పర్యము.

భాగవతమనగానే నవవిధభక్తులు సహృదయమనోలోకమునందు స్ఫురించును. నవవిధభక్తులను భాగవతమునందనుశీలించినచో భాగవత భక్తి తాత్పర్యము సమీక్షింపబడినట్లు భావింప వీలగుచున్నది. కాని ఉత్తర భారతమున చైతన్య వల్లభాచార్యాదులు మధురభక్తి మార్గమును ప్రపంచించి భాగవతమునందలి దశమస్కంధమునగల శ్రీకృష్ణలీలా వైభవమునకు ప్రాధాన్యము కల్పించిరి. దానితో మధురభక్తి సంప్రదాయమునకు సంబంధించిన సమాలోచనలు శాస్త్ర గ్రంథ రచనలు అనుశీలన విధానము ప్రారంభమయ్యెను.

ముందుగా నిచ్చట నొక విషయమును స్పష్టము చేయవలసి యున్నది. ఆచార్య నిడదవోలు వెంకట్రావుగారు ఆంధ్రభాగవత వైశిష్ట్యమును ఉగ్గడించుచు వంగదేశమున చైతన్యుడు ప్రవర్తిల్లచేసిన రాధావల్లభ మతమునకు వల్లభాచార్యులు ప్రచారమునకు తెచ్చిన శుద్ధాద్వైత మార్గమునకు మార్గము చూపినది ఆంధ్ర భాగవతమే[1]యని ప్రతిపాదించి యుండిరి. కాని, చారిత్రక దృష్టి కలిగిన విమర్శకులు దీనినంగీకరించుటలేదు. కాగా మధురభక్తి సంప్రదాయమునకు తమిళ సాహిత్యమునందు క్రీ.శ. రెండు, ఏడు శతాబ్దముల మధ్యనున్న ఆళ్వారుల దివ్య ప్రబంధములే ప్రాతిపదికలని భావించుచున్నారు. ఆళ్వారుల భక్తి రచనలను గురించి వ్రాయుచు శ్రీ ఎ. శ్రీనివాస రాఘవన్‌గారు-

'There are in the works of the Alwars a number o- exquisite lyrics in the madhura - bhava of the nayikaf nayaka - bhava, that is to say, lyrics that all illustrate the path of bridal mysticism.'[2]

అని పేర్కొనుట గమనింపదగినది. ఆళ్వారులలో పెరియాళ్వారు వాత్సల్య భావమును, కులశేఖరాళ్వారులు దాస్యభావమును, అండాళ్ మధుర భక్తి భావమును విశేషముగా తమ రచనలలో వ్యక్తీకరించిరని వారు వివరించిరి.

ఆళ్వారులు స్వయముగా మధురభక్తియందు తాదాత్మ్యము ననుభవించుచు తాము నాయికలుగా భావించుకొని కీర్తించిన వారి భక్తి రచనలలో ప్రధానముగా మూడవస్థలు కానవచ్చుచున్నవని విమర్శకులు భావించుచున్నారు. అవి :

1. తోళిమార్ (సఖి) అవస్థ. 2. తాయ్‌మార్ (జనని) అవస్థ. 3. మకళ్ (నాయిక) అవస్థ.[3] ఈ మూడింటిలో మూడవది మధురభక్తికి మణిదీపమువంటిది.

ఆళ్వారుల సాహిత్యమునందు నమ్మాళ్వారుల (తిరువాయ్‌మొళి) రచనలలోను, గోదాదేవి (తిరుప్పావై) పాశురములలో మధురభక్తి దివ్య దీప్తులలో భాసించు చున్నది. ఈ భక్తి మార్గమునకు వీరిరువురు రెండు కన్నులవంటివారు. ఆళ్వారుల సంప్రదాయము ఆ తరువాత వచ్చిన శ్రీ సంప్రదాయమునకు, హంస సంప్రదాయమునకు, బ్రహ్మ సంప్రదాయమును, రుద్ర సంప్రదాయమునకు పునాదులు వేసినది. శ్రీ సంప్రదాయమునకు ప్రవక్త శ్రీరామానుజులు, హంస సంప్రదాయమునకు నింబార్కులు. వీరు రాధాకృష్ణ ఆరాధనమునకు బృందావన పావిత్ర్యమును చాటినారు. వీరి మార్గము ద్వైతాద్వైతము. కృష్ణభక్తికి వీరి సంప్రదాయము అధికబలమును చేకూర్చినది బ్రహ్మ సంప్రదాయమునకు ప్రవర్తకులు మాధవాచార్యులు. రుద్ర సంప్రదాయమునకు వల్లభుడు ప్రవర్తకుడు. దీనిని స్థాపించినది విష్ణుస్వామి యైనను పుష్టిని చేకూర్చినది మాత్రము వల్లభుడే. వారిది శుద్ధాద్వైతము. వీనిలో ఉత్తర భారతమున బహుళ ప్రాచుర్యము చెందినవి చైతన్య వల్లభ సంప్రదాయములేయని చెప్పవచ్చును. చైతన్యుల సంప్రదాయమే గౌడీయుల సంప్రదాయము. చైతన్యుడు కర్మకాండలను ఖండించినాడు. హరిస్మరణ కీర్తనలను భక్తిగా భావించినాడు. శ్రీకృష్ణుని పరమ తత్త్వముగా భావించి రసరూపునిగా ప్రపంచించెను. ఆయనది రాగాను రాగభక్తి. చైతన్యుని శిష్యులు ఆ భక్తి మార్గమును బహుళ ప్రచారము చేసినారు. ఈ మార్గమునకు చెందినవే భక్తిరసామృతసింధువు, ఉజ్జ్వల నీలమణి యనెడి లక్షణ గ్రంథములు. చైతన్యమతము మధురభక్తిని మహోన్నతమైన దిగా ప్రతిపాదించినది. మధురరతి భావనకు మూడుస్థాయిలు కలవని పేర్కొనినది. అవి 1. కుబ్జ ప్రేమను పోలిన సాధారణ రతి. 2. రుక్మిణ్యాదుల ప్రేమను పోలిన సమంజస రతి 3. పరకీయలైన రాధాగోపికలను పోలిన సమర్థ రతి.

సమర్థ రతియందును రాధ ప్రేమయే ఉత్తమమైనదిగా చైతన్యుడు భావించినాడు. తానే స్వయముగా రాధగా భావించుకొని కృష్ణ ప్రేమానుభూతి ననుభవించినాడు అందులకే ఆయనను రాధావతారముగా చైతన్య సంప్రదాయజ్ఞులు నమ్మెదరు.

చైతన్య సంప్రదాయము ననుసరించువారే హరేకృష్ణ సంప్రదాయమునకు సంబంధించినవారు. 'రసోవైసః' అను వాక్యమునందలి 'సః' శ్రీకృష్ణుడే

ఆ రస జగత్తుకు ఈశ్వరి రాధాదేవి ఆనంద స్వరూపుడైన పరమాత్ముని పొంద వలయునన్నచో హ్లాదినీశక్తియైన రాధ ననుకరించవలయునని మధురభక్తి వాదులు భావింతురు. ఈ మధురభక్తి సంప్రదాయము నాశ్రయించి రచింప బడిన లక్షణ గ్రంథములను అందలి వివేచనను ఆధారముగా చేసికొని భాగ వతమునందుగల మధుర భక్తి భావ విశేషముల ననుశీలించుటయే ఈ పరి శోధన మార్గమునకు ఉపాదేయమగుచున్నది.

సంస్కృతాంధ్ర భాగవతములను గురించి పర్యాలోచించిన విమర్శకులు కొందరు మధురభక్తి సంప్రదాయము నాశ్రయించి వివేచించుటయు కలదు. కాని, వారి విమర్శలయందు మధురభక్తి లక్షణ సంప్రదాయము సలక్షణముగా సంవదించినట్లు కానరాదు. ఒండు రెండు ఉదాహరణముల నిచ్చట నిచ్చుట సమంజసము కాగలదు.

1. ఆంధ్రమహా భాగవతముపై పరిశోధనచేసిన డా॥ ప్రసాదరాయ కులపతి భక్తిరస భేదములన్నింటిలో మధురభక్తి సర్వోత్తమమైనదని భావించి యిట్లు వివేచించినారు:

> 'తల్లిగా తండ్రిగా బిడ్డగా ప్రభువుగా అనేక భావములతో భగవంతుని భావించినట్లే ప్రియునిగా కూడ భావించి ఆరాధింపవచ్చును. స్త్రీయైనను పురుషుడైనను తనను స్త్రీగానే భావించుకొని భగవంతుని పురుషునిగా భావించి తత్సాధనతో ముక్తినందవచ్చును. ఇతర విధములగు భక్తి మార్గము లన్నింటిలోను లభించుట కష్టమగు సాయుజ్యముక్తి దీనిచే సులభముగా లభించును. జీవికిగల సర్వభావములలోను రతిభావ మత్యుత్కటమైనది. సాధ్యసిద్ధికై దానిలో కలిగెడు నంత వాంఛాతీవ్రత ప్రాణికోటికి మరిదేనియందును కలుగదు. తానారాధించెడి వ్యక్తిలో సంపూర్ణ సంయోగము శృంగార భావములోనే సంభవింపగలదు. తల్లి దండ్రులు పుత్రీపుత్రులతోగాని మిత్రులు పరస్పరముగాని సన్నిహిత భావస్పందులగుట లోకమున సహజమే. ఐనను ఆ సాన్నిహిత్యము ప్రేయసీప్రియులకువలె ఐక్యము కలిగింపజాలదు. దాస్యవాత్సల్యాదు లన్నింటిలోను పరమాత్మ జీవాత్మల మధ్య కొంత ఎడమొనగుచునే యుండును. ప్రియభావముతో ఈశ్వరు నారాధించిన జీవి ప్రియుని పరిష్వంగములో ఆత్మార్పణ చేసికొను ప్రేయసి వలె భగవదైక్యము

నొందగలడు. దీనినే మధుర భక్తియందురు. భాగవతమున గోపికలది ఇట్టి మధుర భావమున సిద్ధిపొందిన భక్తియగుటచే సర్వోత్తమమైనది.[4]

డా॥ ప్రసాదరాయ కులపతి భాగవతముకంటె అర్వాచీనమైన మధుర భక్తి వివేచనమును దశమ స్కంధమునకు వర్తింపజేసి అనుశీలించినారు. అయినను ఉజ్జ్వల నీలమణి మొదలైన లక్షణ గ్రంథములలోని సూక్ష్మాంశములను తమ అనుశీలనము నందంతగా పాటించినవారుకారు. వారిది తాత్పర్య దృష్టి మాత్రమే.

ఆంధ్ర మహాభాగవతముపై పరిశోధన చేసిన డా॥ ధూళిపాళ శ్రీరామ మూర్తిగారు, డా॥ ప్రసాదరాయ కులపతి కంటె విశిష్టముగా భాగవతము నందు పోషింపబడిన భక్తిరసమును సమన్వయించినారు. వారి మాటలివి:

> భాగవతమునందు భక్తిరసము ప్రధానమైనను దానితోఁబాటు తక్కిన రసములనుఁ జక్కగాఁ బోషింపబడినవి. భాగవతమునందుఁ బ్రతిపాదిత మైనది భక్తి వియోగము. నిర్గుణ భక్తియే భక్తియోగమని భక్తియోగ మును గురించి చర్చించు సందర్భమున నిరూపించితిని. ఇదియే భక్తి రసము. ఈ భక్తిరసము భాగవతమున మొదటినుండి తుదివరకు నత్యుత్కటముగా వ్యక్తమగుచుండును. ప్రథమ స్కంధమున నారద కథ, కుంతీస్తుతీ, భీష్మస్తుతి, సప్తమస్కంధమునఁ బ్రహ్లాద చరిత్రను; అష్టమ స్కంధమున గజేంద్రమోక్షణము, నవమస్కంధమున నంబరీ షోపాఖ్యానము, దశమస్కంధమున నక్రూరస్తుతి, ఇత్యాదులయందు నిర్గుణభక్తి ప్రతీయమాన మగుచున్నది. చతుర్థ స్కంధమునందు ధ్రువోపాఖ్యానము; దశమస్కంధమునందలి గోపికావృత్తాంతము, కుబ్జా వృత్తాంతము, రుక్మిణీ కళ్యాణము ఇత్యాదులు సగుణభక్తి కుదా హార్యములు. ఇందు గోపికాదులభక్తి కామమిశితము, చైద్యాదులభక్తి క్రోధమిశితము, యశోదానంద, దేవకీ వసుదేవాదుల భక్తి వాత్సల్య మిశితము. గోపాలాదుల భక్తి ప్రేయోమిశితము అర్జునాదుల భక్తి మైత్రీమిశితము, కంసాదుల భక్తి భయమిశితము. ఇట్లన్యభావ మిశిత మైన భక్తికి దశమ స్కంధమునఁ బ్రపంచితమైన శ్రీకృష్ణ చరిత్రము మానవ జీవితమునందెంత భావవైవిధ్యముండునో, ఎన్ని సంబంధము లుండునో, యన్ని భావముల ముఖమున నన్ని సంబంధములనుబట్టి

భక్తి ప్రతీయమానమగుచుండును. సర్వసంబంధములును, సర్వభావములును బరమేశ్వర విషయములగునపుడు మోక్షహేతువులగునని నిరూపించుటయే శ్రీకృష్ణ చరిత్రమునందలి రహస్యము. వివిధ ప్రదేశములందుఁ గురిసిన వర్షము బహుమార్గములఁ బ్రవహించి సముద్రములోఁ జేరినట్లు సర్వసంబంధములు సర్వభావములును వివిధ మార్గములను బ్రసరించుచున్న జీవునివేదన పరమేశ్వరముఖమై ప్రవహించుట దశమస్కంధమునందలి రసనీయతా లక్షణము. అది యే భావమైనను గానిండు, అది భక్తియందుఁ బర్యవసన్నమగును. ఆ భావమునకు భక్తి స్వరూపమై యనుభూయమానమగును. ఈ విషయమే సప్తమస్కంధమున—

కామాద్ద్వేషాద్భయాత్స్నేహాద్యథా భక్త్యేశ్వరేమనః
ఆవేశ్యతదఘం హిత్వా మహవస్తద్గతిం గతాః॥
గోప్యః కామాద్భయాత్కంసోద్వేషా చ్చైద్యాదయోనృపాః
సంబన్ధాద్వృష్ణయః స్నేహాద్యూయం భక్త్యావయం విభో॥

(8-1-29,30)

అలకనైనఁజెలిమినైనఁగామంబున
నైన బాంధవముననైన భీతి
నైనఁదవిలి దలపనఖిలాత్ముఁడగు హరిఁ
జేర వచ్చువేఱు సేయఁడతడు.

శా॥ కామోత్కంఠత గోపికల్ భయనన్ గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాలముఖ్య నృపతుల్ సంబంధులై వృష్ణులున్
బ్రేమన్మీరలు భక్తినేము నిటు చక్రింగంటి మెట్లైనను
ధ్దామధ్యానగరిష్ఠుఁడైన హరిఁజెందన్ వచ్చు ధాత్రీశ్వరా! (7-17)

అనిచెప్పబడినది. కావున నే భావముచేతనైనను బరమేశ్వరధ్యానము సేయుట భక్తియని తేలుచున్నది. ఏ భావోద్రేకము చేతనైనను బరమేశ్వర భావమునందు మునిగిపోవుట భక్తిరసమని తేలుచున్నది. కామక్రోధాది సంపృష్టమైన భగవద్భావము సంసారులమగు మనకందుఁబాటులో నుండునట్టిది. ప్రహ్లాదనారదాదుల కనుభూయమానమగు నిర్గుణభక్తి యందు మనకుఁ గ్రమముగాఁగాని తన్మయత్వము కుదరదు అందుచేత

> మనకు శ్రీకృష్ణ చరితమునందు, ముఖ్యముగా గోపికాభక్తియందుఁ దన్మయతాధిక్యము, రస్యమానతాధిక్యము; పరమేశ్వరభావము మానవ లక్షణము లనుసరించి రస్యమానవతావస్థకు వచ్చుటచేత దశమస్కంధ మున కంతటి బహుళప్రచారము లభించినది.[5]

డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తిగారి సమన్వయము ననుసరించి భక్తి యోగమే భాగవతమునందలి భక్తిరసముగా అనుభూయమానమగునని స్పష్టమగు చున్నది. కామక్రోధాది భావములన్నియు భగవత్ భావమునందు యోగరూప మును భజించి భక్తిరసముగా పరిణమించునని వారియభిప్రాయము. కామభావ సంప్లుతమైన భగవద్భావమే గోపికల నాశ్రయించి భాగవతమునందు రస్య మానమగు చున్నదని శ్రీరామమూర్తిగారి సమన్వయము. ఒకవేళ మధురభక్తి అనవలసి వచ్చినచో గోపికలభక్తియోగమే ఆ పేరుకు తగియున్నది. కాని, నవ విధభక్తులలో మధురభక్తి యను వివేచనము లేకపోవుటచేత శ్రీరామమూర్తిగారు అట్టి సమన్వయముచు తన సిద్ధాంత గ్రంథమునందు సూచించలేదు భాగవతము నందలి నవవిధ భక్తి సంప్రదాయములను పేర్కొను విమర్శకులు కూడ గోపికా భక్తిని ఆతొమ్మిది విధములలో సూచింపకుండుటయు కాననగుచున్నది. దీనికి ప్రసిద్ధ సంప్రదాయ శ్లోకమునుకూడ విర్శకులు ఉదాహరించుచున్నారు:

> "శ్రీవిష్ణోః శ్రవణే పరీక్షిదభవద్వ్యైయాసకిః కీర్తనే
> ప్రహ్లాదః స్మరణే తదంఘ్రిభజనే లక్ష్మీః పృథుః పూజనే
> అక్రూర స్త్వభివందనే కపిపతిర్దాస్యేచ సఖ్యేఽర్జునః
> సర్వస్వాత్మ సమర్పణే బలిరభూత్ కృష్ణాప్తిరేవం విధా॥"[6]

ఈ శ్లోకము నాధారముగా గొనినచో గోపికలభక్తి నవవిధ భక్తులలో నేయొక్క దానికి మాత్రమే పరిమితమైనదని చెప్పుటకు వీలులేనట్లున్నది. ఒక విధముగా గోపికలయందు నవవిధ భక్తులన్నియు ఏకోన్ముఖమై సమగ్రతను సాధించుచున్నవని భావించుటకు వీలున్నది. కాని, శ్రీకృష్ణుని నాథునిగా భావించి ప్రసరించు కామభావ సంభూతమైన భక్తియోగ రూపమైన గోపికా భక్తిని పైనవవిధ భక్తులలో నొక్క పేరుతో విడిగా పిలుచుటకు వీలులేకపోగా అట్టి భక్తికి పేరు పెట్టవలయునన్నచో మధురభక్తి యనుటకంటె సార్థక్య ముండబోదని భావించుటకు వీలున్నది. ఏమయినను ఆత్మసమర్పణ భక్తి అనెడి భక్తి శాఖలో గోపికాభక్తిని చేర్చి చెప్పెదమన్నను బలిచక్రవర్తి

గజేంద్రాదుల భక్తులను గోపికలవలె పరిగణించుటకు వీలులేకపోవును. కావున "నవవిధ భక్తులు పరిచ్ఛిన్నములు. గోపికాభక్తి యనదగు మధురభక్తి పరిపూర్ణము" అని తలంచుటయే మహాభాగవతా భక్తిరస సమన్వయమునకు ఒక సౌలభ్యమగు మార్గమని స్పష్టమగుచున్నది.

నారద భక్తి సూత్రములు భక్తి పదునొకండు విధములుగా విభజించుటయు, ప్రేమరూపమైన భక్తి తాత్పర్యమున నొక్కటే యయ్యును ఆసక్తి భేదములనెడి ఉపాధుల నాశ్రయించి పదునొకండు విధములుగా నేర్పడునని వివరించుటయందు గోపికాగతమైన భక్తికి ఒక ప్రత్యేక శాఖను ఏర్పరుపవలెననెడి విశిష్ట ప్రయత్నము కానబడుచున్నది. నారదభక్తి సూత్రములలో పేర్కొనబడిన పదునొకండవ భక్తి పరమ విరహాసక్తి భక్తి. ఆ మార్గమున గోపికలు ఉద్ధవుడు మొదలగువారు పరమాత్మను బొందినట్లు చెప్పబడుచున్నది. ఉపనిషత్తులు కూడ 'హృత్పుండరీక మధ్యస్థం పరమ ప్రేమగోచరం'[7] అని నప్పుడు 'భక్తిః స్యాత్ ప్రేమలక్షణా'[8] అని అధ్యాత్మరామాయణము నుడివినప్పుడు భక్తి యందలి మాధుర్య స్ఫూర్తిని వారు సంభావించినట్లు స్పష్టమగుచున్నది. ఆధునికులు కూడ ఈ ప్రేమ తత్త్వమునే గ్రహించినట్లు 'నిజమునకు భక్తి ప్రేమ యొక్క సారాంశము'[9] అను వివేకానందుని సందేశము, 'భక్తి యనగా ఉపాసనకాదు ప్రేమయే'[10] అను డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ గారి వాక్కులు తార్కాణము.

పై సమాలోచనము ననుసరించి ఉపనిషత్ సంప్రదాయమునందును, రామాయణ సంప్రదాయము నందును, భాగవత సంప్రదాయమునందును మధురభక్తి భావనకలదు కాని, దానినొక భక్తి భేదముగా పరిగణించలేదని స్పష్టమగుచున్నది. భక్తి భేదము కానంత మాత్రమున అది భక్తి కాజాలక పోలేదు. నారదభక్తి సూత్రములు దానినొక భేదముగా పాటించినను స్వభావము చేతను, తత్త్వముచేతను గోపికాభక్తి పరిపూర్ణతను వ్యంజింప జేయుచున్నదని ప్రాచీన సంప్రదాయము వలన తెలియుచున్నది.

శ్రీ రూపగోస్వామి భక్తి రస వివేచనమునందు ఒక క్రొత్త మార్గము ననుసరించినారు. ఆయన భక్తిని ముఖ్య గౌణ రసవిభాగములచే విశ్లేషించినారు. అందు ముఖ్య రసములు శాంత ప్రీతి ప్రేయోవత్సల మాధుర్యాదులని వివేచించి, అందు మధురభక్తియే ఉజ్జ్వలమైనదని ప్రతిపాదించినారు.

ఈలాక్షణికుని విభజనము ననుసరించి భాగవతమునందుగాని మరియేయితర భక్తి గ్రంథమునందుగాని రసవిచారము చేయవలెనన్నచో పై పంచవిధ ముఖ్యరస సమన్వయము గావింపవలయు నన్నమాట. అట్లయ్యు భాగవతమునందు ప్రత్యేకించి దశమస్కంధమునందు గోపికల నాలంబనముగా జేసికొని పోషించిన మధురభక్తి 'రసరాట్' అని ఆయన నిర్దేశించెను. అనగా ముఖ్య రసములలో మధురరసము మూర్ధన్యమన్నమాట.

భక్తి రసానుశీలనమునకు రూపగోస్వామి లక్షణచర్చ ఒక ఉజ్జ్వల మార్గమును ప్రతిపాదించినది. నవ విధ భక్తులయొక్క సారభూతములయిన ప్రవృత్తులను రూపగోస్వామి నాలుగు విభాగముల క్రింద సంవదించి, సంగ్రహీకరించి, సంపుటీకరించెను. ఆ నాలుగింటికంటే మిన్నయై ఉజ్జ్వల నీలమణి వలె భాసించు మధురభక్తిని రసరాజముగా నిర్దేశించెను. నవరస భావ మిశ్రితములైన భక్తిభేదములను గౌణ రసములుగా సంభావించెను. ఇతని ఉజ్జ్వల నీలమణి మధుర భక్తికి పట్టము కట్టినది. ఆ గ్రంథ తాత్పర్యమును గ్రహించినచో మధుర భక్తియే రస రాజమనెడి తాత్పర్యము తేటపడుచున్నది.

రూపగోస్వామి సిద్ధాంతము ననుసరించి శ్రీకృష్ణానుశీలన ప్రధానమైన చిత్తవృత్తి విశేషమే భక్తి. ఆ చిత్తవృత్తికి అభిలాష స్థాయి. అట్టి స్థాయితో కూడిన శ్రీకృష్ణరతియే ఉత్తమభక్తి. దీనికి శృంగారాది రసములలో శృంగార శాకుంతలములు ప్రధాన పోషకములు. మిగిలినవి గౌణముగా నుండెడివి. ఈ విభాగము నాశ్రయించి రూపగోస్వామి పంచవిధ ముఖ్యభక్తిరస భేదములను వివేచించెను. స్థాయిభావ విచారమునందుకూడ ముఖ్య గౌణభేదముచే రతిని రెండు విధములుగా భావించవచ్చును. శుద్ధసత్త్వ విశేషరూపమైన రతియే ముఖ్యస్థాయి భావమని పేర్కొనెను. ముఖ్యరతి శుద్ధప్రీతి సఖ్యవాత్సల్య ప్రియతత భేదములచే నైదువిధములని వర్గీకరించి ముఖ్యభక్తి భేద పంచకము సాధించెను. ఆ తరువాత మధుసూదనుడు మధుర రసమూర్తియనియు అతనికి సంబంధించిన రసము మధుర రసమనియు అదియే ఉజ్జ్వల రసమని పిలువ దగినదనియు రూపగోస్వామి మధురరసమునకు అగ్రతాంబూలమందించెను.

ఉజ్జ్వలనీలమణియందలి మధుర రసము సాత్త్విక శృంగార రసాను ప్రాణితముగా రాణించుచుండును. నాయక నాయికా భేదములనుగాని ఆలంబ నోద్దీపన విభావములనుగాని అనుభావ సాత్త్విక భావములనుగాని వ్యభిచార్యాది భావములనుగాని నిరూపించునెడ శృంగారరస వివేచనముపట్ల పాటించు విధాన మునే అనుసరించియుండుట గమనింపదగినది. ముఖ్యభక్తి భేదములలోకూడ మధురభక్తి శృంగార పరిపుష్టమైనట్టిదిగను తదితర భక్తిభేదములు శాంత పరిపుష్టమైనట్టివిగను రూపగోస్వామి సంభావించెను. మధురభక్తికిని శృంగా రమునకును అవినాభావ సంబంధముండుట నిర్వివాదాంశము భక్తియందలి భగవద్రతిని శృంగారస్థాయియైన రతిభావము నాధారముగా చేసికొనియే రూపగోస్వామి వివేచించినాడు. రాగానురూపమైన భక్తికామప్రాయమై సంభో గేచ్ఛామయముగను ప్రసరింపవచ్చుననియు, ఆ రెండును మధురభక్తి యన బడుననియు అతడు వివేచించెను. శ్రీకృష్ణుడు గోపికలతో జరిపిన అప్రాకృత క్రీడ సంభోగేచ్ఛామయమనియు, వ్రజాంగనలకు శ్రీకృష్ణునియందుగల మధుర భావము భావేచ్ఛామయమనియు వివేచించినారు. సంభోగేచ్ఛకంటె భావేచ్ఛ సాత్త్వికమైనది, ఉత్తమమైనది. కామరూపమైన రాగానుగభక్తికంటె భిన్న మైనది. సంబంధరూపభక్తి పితృపుత్ర మిత్రాది సంబంధములచే శ్రీకృష్ణుని యందు గలిగెడి యనుబంధముతో కూడిన కృష్ణభక్తి ముఖ్య భక్తి భేదములలో చెప్పబడినను మధురభక్తియంత ఉత్తమమైనదికానట్లు రూపగోస్వామి వివే చనమువలన స్పష్టమగుచున్నది. ఈ భావము 'భక్తిరసామృత సింధువు' రచనాకాలముకంటె 'ఉజ్జ్వలనీలమణి' గ్రంథ రచనాకాలమున రూపగోస్వామి యందు స్థిరపడినట్లు ఆ గ్రంథతాత్పర్యములే చెప్పక చెప్పుచున్నవి. ఉజ్జ్వల నీలమణి రూపగోస్వామి ఉత్తర రచనయేకాక ఉత్తమ రచనకూడ. అతని సిద్ధాంతముల ననుసరించి ఉజ్జ్వలరసములైన మధురభక్తి ప్రధాన రసములలో ప్రముఖమైనది, తురీయమైనది. మోక్షభావముకంటె మధురభావమే భక్తి రససిద్ధికి ప్రధాన మార్గమని ఆయన నిర్దేశము. దీనిని స్వీకరించినచో భక్తిరస వివేచనమునందు మన మొక వినూత్నమైన అనుశీలన మార్గమును ఏర్పరచు కొనవచ్చును.

1. భక్తిరసము.

2. భక్తిరసము శృంగారాది రసములకంటె విశిష్టము.

3. శృంగారాదులు అలౌకిక రసములు. శాంతము ఆత్మరసము లేక అధ్యాత్మికరసము. భక్తి అలౌకిక అధ్యాత్మిక రసములయొక్క మిశ్రస్థితిగల రసము.

4. భక్తికి స్థాయియైన భగవద్రతి అలౌకికములైన రతిశోకాదులచే పోషింపబడినచో దానిని ముగ్ధభక్తి యనవచ్చును. ఇందు వత్సలాదులు (భావములైనను, రసములైనను) కూడ భగవద్రతిని పోషించినచో ముగ్ధభక్తిగనే గ్రహింపవచ్చును.

5. భగవద్రతి అలౌకిక ప్రవృత్తికంటె విలక్షణమైనది. అధ్యాత్మిక ప్రవృత్తిని ఆశ్రయించి శృంగార స్థాయియైన రతిచేత పోషింపబడినచో అది మధురభక్తి యనవచ్చును.

6. భగవద్రతి అలౌకికమైన శమముచేతగాని అధ్యాత్మికమైన శమముచేతగాని పరిపోషింపబడినచో దానిని జ్ఞానభక్తి యనవచ్చును. ఇందు శమమునకు భక్తి పోషకమైనచో భక్తిశాంతముగా పరిణమించును శాంతమే భక్తికి పోషకమైనచో జ్ఞానభక్తి అనుభూయమానమగును. ప్రహ్లాదులవంటి జ్ఞానులయందు శమముచేత పోషింపబడిన భక్తి జ్ఞానభక్తిరూపమున భాసించుచుండును.

7. రూపగోస్వామి విభాగముననుసరించి రాగానువిభాగమునకు సంబంధించిన సంబంధమయమైన భక్తి విశేషములన్నియు తాత్పర్యమున శృంగార కరుణ వత్సలాది రసభావ సంప్లుతములై కనబడుచుండును. వీనియందు అలౌకిక రసస్ఫూర్తి యున్నంతగా అధ్యాత్మిక భావ ముండదు. సంబంధమయమైన శ్రీకృష్ణ భక్తిలో సాత్త్విక ప్రవృత్తి యున్నను అది మోహావృతమై యుండుటచేత ముగ్ధభక్తియని యనుటయే సార్థకమగుచున్నది.

8. గోపికలుగాని, వ్రజాంగనలుగాని, రాధాదులు గాని, అష్టమహిషులు గాని, శ్రీకృష్ణునిపట్ల పచరించు ఆసక్తిరూపమైన సాత్త్విక రతిభావ ప్రవృత్తిలో శృంగార నాయికాభావము ఉన్నను అది ఇంద్రియానుభోగ పరిమితముకాక దివ్య రాగాత్మకమైన శ్రీకృష్ణ ప్రేమాస్వాదముగా పరిణమించుటచే అధ్యాత్మిక స్థితిని బొంది అలౌకికరసముకంటే అతీతమైన మానసిక స్థితిని సహృదయమునకు కలిగించి చిద్రూపఘనమైన

ఆనంద స్థితిని అనుభవింపజేయును. ఇట్టి భక్తిరస స్థితి శాంతరసస్థితి వలె ఆత్మరతి కాదు. శృంగారాదులందువలె అలౌకిక రతికాదు. ఈ రెండింటికి భిన్నమైన భగవద్రతి. ఇట్టి భగవద్రతియొక్క పరిపూర్ణాను భవస్థితియే మధురభక్తి కావున భక్తి యన్నచో ముఖ్యముగా గ్రహించ దగిన మధురభక్తియని తాత్పర్యము.

9. ఉజ్జ్వలనీలమణిలోని శృంగార భక్తిరస సమన్వయమంతయు భక్తిని శృంగారముగా నిరూపించుటకు కాదు. శృంగారము భగవద్రతి రూపమైన భక్తియందు ఉజ్జ్వలముగా భాసించెడి విధమును నిరూపించుటకొరకే.

10. రూపగోస్వామి మతమున భగవంతుడన శ్రీ కృష్ణుడు. అతడు మధుర రస స్వరూపుడు. తచ్చింతన స్మరణాది సంతత ప్రేమ భావముచే గోపిక లనుభవించెడు స్థాయి భగవద్రతి లేక ప్రేమరతి. దానిని తన్మయీభవన యోగ్యతతో సహృదయుడు చర్వణరూపమున గ్రహించినచో దానిని మధురభక్తి యనవలెను. ఒక విధముగా గోపిక లనుభవించెడి గోవిందరూప తత్త్వాను భవమే సహృదయులందు స్థాయియై చర్వ్యమాణమగుచున్నది. మధుసూదన సరస్వతి యీ తత్త్వమునే గ్రహించి భక్తిరసాయనమునందు భగవద్రూపరతి యని పేర్కొని అద్వైత పరముగా వ్యాఖ్యానించెను.

11. మధుసూదన సరస్వతి భక్తి రసస్థాయి భావమును నిరూపించిన విధ మును గమనించినచో రూపగోస్వామి భక్తి తత్త్వమును నిర్దుష్టముగా లక్షణీ కరించినట్లు స్పష్టము కాగలదు.

'స్థాయి భావగిరాఽతోఽసౌ వస్త్వాకారోఽభిధీయతే
వ్యక్తశ్చ రసతా మేతి పరానందతయా పునః ॥
భగవాన్ పరమానంద స్వరూపః స్వయమేవహి
మనోగతస్తదాకార రసతామేతి పుష్కలమ్॥'11

12. మధుసూదనసరస్వతి సిద్ధాంతము ననుసరించి భాగవతమునందు సహృదయుడు పొందెడి రసానుభూతిని గురించి డా. జి. వి. సుబ్రహ్మణ్యం గారు వివేచించిన ఈ క్రింది విషయము లిచట ప్రస్తా వింపదగినవి.

i. సహృదయు డిందులో అలౌకికార్థాల వెనుక అధ్యాత్మిక భావనం చేస్తున్నాడు.

ii పాత్రల్లో తాదాత్మ్యాన్ని భజించి రసానందాన్ని పొందుతున్నా ప్రాతి భాసికమైన ఆ స్థితికంటె అతీతమైన ఆత్మానంద స్థితిని అందుకోవాలని అవ్యక్తంగా ప్రయత్నిస్తున్నాడు.

iii. గోపికల రతిభావం సాధారణీకరణాన్ని పొందుతున్నా భగవద్వి భావాలకు సంబంధించిన భావాలు సహృదయునికి అసాధారణాలై ఆశ్చర్య జనకాలై ఆలోచనాన్ని రేకెత్తిస్తున్నవే కాని తాదాత్మ్యాన్ని కలిగించుటలేదు. అంటే సహృదయుడు భక్తి పాత్రల్లో తాదాత్మాన్ని పొందగలడు. కాని, భగవంతుని పాత్రలో పొందలేడు. అందువల్ల భాగవతంలోని ప్రధాన పాత్రయైన భగవంతుడు అలౌకిక విభావ స్ఫూర్తితో వెలుగొందినా ఆధ్యాత్మిక విభావంగానే అనుగమ్య మౌను డౌతున్నాడు.

iv. దీనికితోడు భాగవతంలో భగవతత్త్వం సగుణ నిరుణ మార్గాల ననుస రించి నిరూపితం కావటంచేత సహృదయుడు సగుణరూపంతో సహాను భూతి పొందలేకపోతున్నాడు. నిర్గుణతత్త్వాన్ని హృదయంలో సాధించ లేకపోతున్నాడు. అందువల్ల భగవద్విషయంలో బుద్ధి నాశ్రయించ వలసి వస్తున్నది. అలౌకికం హృదయ గమ్యం, ఆధ్యాత్మికం బుద్ధి గమ్యం కావటంచేత భాగవతంలో సహృదయుడు పొందే రసానుభూతి సగం అలౌకికం సగం ఆధ్యాత్మికం.

v. భాగవత పాత్రల్లో భగవద్రూపభావనం చేసేవికొన్ని, భగవతత్త్వ భావనం చేసేవి కొన్ని ఉన్నాయి. అందులో భగవద్రూపభావనం భగవ ద్రతి. తత్త్వభావనం చేయటం తత్త్వజ్ఞానం. లాక్షణిక మతాన్ననుస రించి భగవద్రతి స్థాయిగా కలిగింది భక్తి. తత్త్వజ్ఞానం స్థాయిభావంగా నిలచేది శాంతం. అయితే ఈ రెండు అలౌకికాదులైన శృంగారాదుల కంటె విశిష్టములైనవనే చెప్పాలి. భక్తి శాంతరసాలు రసనామవాచ్యా లైనా రసాతీతాలని సంభావించాలి. భక్తి రసమని అంగీకరించిన వారందరు దాని స్థితి నంగీకరించారు. అంగీకరించనివారే భక్తిని భావమని భావించినారు.

vi సహృదయుడు భగవద్రూప భావనం చేసే పాత్రలతో సహానుభూతిని పొంది భగవద్రతిని చర్వణం చేయటం వల్ల కలిగే రసమే భక్తి. తదానందమే భక్తిరసానుభూతి.

vii భగవత్తత్త్వభావనం చేసే భాగవత పాత్రలు జ్ఞానులై ఉంటారు. వారికా తత్త్వం ఆత్మజ్ఞానరూపమైన మోక్ష స్థితికి సాధనమౌతుంది. స్వస్వరూపానుసంధానరూపమైన ఆత్మరతియే అప్పటి స్థాయి. అభినవగుప్తుడన్నట్లు అది స్థాయితమము. దాన్ని రసమని పిలవటం ఔపచారికమే. సహృదయుడు భాగవతంలోని భగవత్తత్త్వాన్ని స్థాయిగా గ్రహించి సగుణ తత్త్వం వెనుకనున్న సచ్చిదానందాత్మక పరబ్రహ్మతత్త్వమే నిత్యమని తెలిపి అద్వైత స్థితిని సాధించి ఆత్మానందం పొందుటయే రసానుభూతి.

viii దీనినిబట్టి విచారిస్తే భాగవత పఠితయైన సహృదయుడు ఆస్తికుడై ఉండాలి. ఆపైన ఆధ్యాత్మిక చింతనాపరుడై యుండాలి. భాగవతంలో రమణీయార్థం కోసమేకాక పరమార్థంకోసంకూడ వెదకాలి. ఇటువంటి చిత్తపరిపాకం ఉంటేనే భగవద్రతి ప్రకాశిస్తుంది. లేకపోతే ఆభాస యెదురౌతుంది.

భాగవతంలోని అవతారకథా బాహుళ్యం భగవద్భక్తుల గాథాప్రపంచం. ఆ గ్రంథములోని భగవద్రతికి ప్రాచుర్యాన్ని కల్పిస్తున్నాయి నిర్గుణ బ్రహ్మన్ని సగుణోపాసన ద్వారా సాధించే సాత్త్విక భక్తియోగం భాగవత ప్రతిపాదిత పరమ తాత్పర్యం. భక్తి ఎన్ని భావాలతో మిశ్రితమై మెలగడానికి వీలుందో ఎన్ని విధాల ప్రవృత్తుల్లో ఎన్నెన్ని అవస్థలను పొందడానికి అవకాశముందో భాగవత కథా ప్రపంచం విశ్వరూపంగా ప్రదర్శించినది. నవ విధ భక్తులు పెద్ద నామాలు పెట్టుకొన్న పెరుమాళ్ళు మాత్రమే. వాటిలో అవాంతర భేదాలు శత సంఖ్యల మీద విశ్లేషించవచ్చు. భాగవతం చదివిన సహృదయులు శృంగారాది వికృతి రసాలుగాని ప్రకృతిరసంగా పరిగణింపబడిన శాంతంగాని భక్తి భావోద్దీప్తాలై ఎలా భగవద్రతిగా పరిఢవిల్లుతాయో అనుభవించి చూడవచ్చు, తత్త్వజ్ఞాన స్థాయియైన శాంతం యోగిజన గమ్యమైతే భగవద్రతి స్థాయియైన భక్తి సంస్కార

వంతులైన సహృదయులందరికి సాధ్యమన్నట్లు భాగవతం నిరూపించింది. 'భక్తిః ఏవ ఏకోరసః' అన్నమాట అనలేదు కాని 'భక్తి ఏవ పరిపూర్ణోరసః' అని మధుసూదన సరస్వతి దర్శనాన్ననుసరించి ప్రపంచించ వచ్చునని భాగవత రసానుభూతి సహృదయులకు ప్రేరణ కలిగిస్తుంది. పోతన భక్తికి ఆవేశాన్నీ ఆలోచననూ రెండు రెక్కలుగా తీర్చిదిద్ది భక్త్యానందాన్ని ఆత్మానందాన్ని అందించే సవ్యసాచిత్వాన్ని సుసంపన్నం చేశాడు.[12]"

పై విమర్శకుల వివేచనములను గమనించినచో భక్తిరసమును గురించి అనుశీలనమార్గమున విశ్లేషించుకొనుటకు కొన్ని సూత్రములు నిర్మించుకొనవచ్చును. వానిని స్థూలముగా నీ క్రింది విధముగా పేర్కొనవచ్చును:

1. భగవద్రతికి ఆలంబనములైన భక్తుల పాత్రలే భక్తిరస సమాలోచనమునందు ఉపాదేయములు. భక్తులలో స్థాయిగా పోషింపబడు రతి అవిచ్ఛిన్న ప్రవాహరూపమైనది.

మద్గుణ శ్రుతి మాత్రేణమయి గుణాశ్రయే
మనోగతి రవిచ్ఛిన్నా యథాగంగాంబసోఽబుధౌ॥[13]

గంగాప్రవాహము సముద్రమునందు కలియునట్లు భగవద్రతి రూపమైన మనోగతి అవిచ్ఛిన్నమైన ప్రవాహరూపముగా ప్రసరించి ఆ దేవదేవునియందు లీనమగుటయే భక్తి స్వభావము. భక్తజనులయందలి యిటువంటి రతి సంచారిగా నుండదని స్పష్టపరచినాడు. స్వకీయమైన ఆధారముతో స్వస్వరూపముతో అవ్యభిచారముగా భక్తులలో స్థాయిత్వమును బొందునని స్ఫుటీకరించినాడు. కావున, భక్తిరస గ్రంథములలో సహజ భగవద్రతిని ప్రవాహరూపమున చిత్తవృత్తి యందు పండించుకొనిన పాత్రలకే ప్రాముఖ్యముండుననియు, ఆ పాత్రల నాశ్రయించియే స్థాయి ప్రతీయమానమగుననియు మొదట స్పష్టముగా నెఱుగవలయును

2. అయినచో భక్తులలోకూడ సాధకులు సిద్ధులు అని రెండు తెగలుండెదరు కదా! వారిలోనేమైన భేదముండునా? యను శంక కలుగవచ్చును. వీరిలో సిద్ధులైన భక్తుల చిత్తములయందు మాత్రమే భగవద్రతి స్థాయికత్వమును భజించును సాధకులయందు అవిచ్ఛిన్నత కొరవడినచో స్థాయి సంచారిగా

పరిణమించును వారిలో భక్తి స్థిరముగా నేర్పడిన తరువాత స్థాయిత్వమును పొందును. సాధనలో ఆ పాత్రలయందు కలిగెడు విక్షేపములు సంచారులై స్థాయిని పోషింపవచ్చును కూడ. 'కలఁడు కలండనెడువాఁడు కలఁడోలేఁడో' అనెడి శంకాది భావములు గజేంద్రునిలో శరణాగతభక్తి చిత్తవృత్తిని క్రమముగా పోషించి 'నీవేతప్ప నితఃపరంబెఱుగ' యను స్థాయిని పోషించుట భాగవతమునందు ప్రసిద్ధమే.

3. భక్తిరసము భక్తుల చిత్తములలో ప్రవాహ రూపమైన భగవద్రతిగా ప్రతీయమాన మగుటకు వాహికలను గ్రహించుట అవసరము. ఈ వాహికలను నిర్దేశించు ప్రయత్నము చేయుటలోనే రూపగోస్వామి ముఖ్యగౌణ రతిభేద విచారము కావించినాడు. భక్తిరసాను శీలనమునందు వీనిని సమన్వయించుకొనినచో కొన్ని సౌలభ్యము లేర్పడగలవు. దాస్య, సఖ్య, వత్సలాదులు రతికి వాహికలు. ప్రియత లేదా మధుర భావముకూడ రతికి వాహికమే. మధుర భావమునందు శృంగార శాంత రసభావచ్ఛాయలు భాసించును. ఆ రెండింటి యొక్క స్పర్శ దాస్యాదులలో లేదు. అందువలన దాస్యాదుల కంటే మధురభక్తి మిన్నయని భక్తిరసవాదుల మతము. దీనినే మరియొక విధముగా చెప్పినచో మధురభావ వాహికనాశ్రయించి శృంగార శాంతాదులతో పరిపుష్టమైన భక్తిరసము మధుర భక్తిరసమనియు, దాస్య సఖ్యవత్సలాది భావములు ఉత్సాహాది రసభావములచే పరిపుష్టములైనచో ముగ్ధ భక్తి రసమనియు, శుద్ధరతి శాంతరస భావములచే పరిపోషింపబడినచో జ్ఞానభక్తియనియు నిర్దేశింపవచ్చును. ఇక గౌణ భావములైన హాస్య విస్మయాదులు సంచారులవలె మధురముగ్ధ జ్ఞానభక్తులను పోషించుచుండునని గ్రహింపదగును. ఇట్లు గ్రహింపనిచో భక్తిరసానుశీలనమునందు కొంత సాంకర్యమో లేదా సంశ్లిష్టతయో ఏర్పడక తప్పుటలేదు.

4. ఈ వివేచనము ప్రకారము నిరంతర స్థాయిత్వమును భజించు భగవద్రతి భావము మధురభక్తియందు ఉజ్జ్వలముగా భాసించునట్లు తదితర భక్తి భేదములయందు ప్రకాశింపదు. దానికి కారణము భగవంతునిలో లీనమయ్యెడి ఉదాత్తస్థితి మధుర భక్తికి సహజముగా నుండుటయే. వత్సలాదులు సామీప్యము నందించినంతగా సాయుజ్యమును అనుభవమునకు తేలేవు. శమాదులు ఆత్మస్థితిని కలిగించినంతగా భగవద్రూపరతిని అందింపలేవు. అందువలన సగుణ భావనలోని మాధుర్యముతోపాటు ఇంద్రియాతీత భావస్థితిలోని ఆనంద చిన్మయావస్థను మధురభక్తిలోనే భక్తుడు సాధింపగలడు.

5. మధురభక్తిలో మరొక లక్షణము విశేషముగా కానవచ్చును. ఇందు కావ్యార్థములలోని రమణీయార్థ శక్తికి ఎంతటి ప్రాధాన్యముండునో పరమార్థ స్ఫూర్తికి అంతటి ప్రాముఖ్యముండును. వ్యంజనాశక్తి నాశ్రయించి రమణీయార్థములనేకాక తాత్త్వికార్థములను కూడ పఠితలు గ్రహించినప్పుడు మధుర భక్తి రసస్థితిని పొందగలదు. గోపికాకృష్ణుల తత్త్వమునందుగాని రాధామాధవ తత్త్వమునందుగాని లేదా అట్టి సజాతీయ సన్నివేశములందుగాని యీ లక్షణ మును తప్పక పాటింపవలసి యుండును.

ఇట్టి తత్త్వమును 'అంతరార్థ భాగవతం'లో డాక్టరు వేదుల సత్య నారాయణ శర్మగారు వ్యక్తీకరించినారు. ఉదాహరణకు దశమ స్కంధములోని రాసక్రీడా ఘట్టమునందలి యొక శ్లోకమును గ్రహింప వచ్చును.

'ప్రణత దేహినాం పాపకర్మనం
తృణ చ రానురాగం శ్రీనికేతనం
ఫణి ఫణార్పితం తేపదాంబుజం
కృణు కుచే షునః కృంధిహృచ్ఛయమ్'

ఈ శ్లోకములో గోపికలు శ్రీ కృష్ణుని పాదపద్మమును తమ స్తనములపై నుంచి మన్మథ తాపమును పోగొట్టుమని ప్రార్థించుట కలదు. ఇది మధుర భావ మునకు సంబంధించినదని వేరుగా చెప్పనవసరము లేదు. ఇందలి రమణీయా ర్థము శృంగార సంబంధియైన రతివలె స్ఫురించును. కాని దాని యందలి తాత్త్వికార్థము అంతకంటె విశిష్టమైనది. దానిని వాఖ్యానించుచు శ్రీ శర్మగారు-

నః = మా యొక్క, కుచేషు = 'కుంచతి ఇతి కుచః' అనగా అణచి వుంచేవి అనగా ద్వంద్వ గుణములు సాధకుని ముక్తి కాంక్షను అణచి వేస్తూంటాయి కాన కుచేషు = ద్వంద్వములయందు, కృణు = చేయుమా లేక ఉంచుమా, నీ శక్తినొసగి మాద్వంద్వతాపం చల్లార్చుమా! అని అర్థం. హృచ్ఛయం = హృదయమందున్న మాయను కృంధి = అణచి వేయుమా.[14]

అని వివరించారు. మధుర భక్తిలోని భగవద్రతిని శృంగారశాంతములు పోషించుచుండుననుటలోని తాత్పర్యమిదియే. గోపికా మధురభావము తాత్త్వి కార్థమునందు యోగి భావముగా మారినను, అది గోపికా భావపోషణమేకాని

తన్నిరాకరణముకాదు. రతికి ఆలంబనము గోపిక, గోపిక వాక్కులలో ధ్వన్యంతరము తాత్త్వికార్థము. ఈ రెండును కలిసి విశ్వజనీనమైన జీవానుభవముగా పరిణమించుట మధురస వైశిష్ట్యము.

6. ముగ్ధభక్తిలో మధురభక్తి యందలి తాత్వికార్థ స్ఫూర్తికున్న ప్రాముఖ్యము కానరాదు. లౌకికభావ సలవలితములైన భగవద్రతియే యిందు ఉపాదేయము. అందువలన ముగ్ధభక్తికంటె మధురభక్తి అర్థస్ఫూర్తిలోను, భావశక్తిలోను సమగ్రమైనది, పరిపూర్ణమైనది.

7. మధురభక్తిలో భక్తిరస లక్షణమైన అలౌకిక ఆధ్యాత్మిక రసస్థితి భాసించినంతగా తదితర భక్తిభేదములందు భాసింపదు. అందువలన మధుర భక్తికి తదితర భక్తిరసములు గౌణములనుటయే సమంజసము. వాత్సల్యాదులను వత్సలాది రసములకు స్థాయి భావములుగా గ్రహించుటయు ఈ సమన్వయమును బలపరచుచున్నది

8. ముఖ్య రతి భేదములలో సఖ్యాదులు కలవు కదా! వానిని గౌణములుగా భావించుట సమంజసమా యను శంక యొకటి కలుగవచ్చును. దానినిట్లు సమన్వయించుకొనవలెను. మధురభక్తియందు దాత్సల్యాదులు పోషకములు కావచ్చును.

'చలసియత్ ప్రజాచ్చారయన్ పశూన్
నలినసుందరం నాథతే పదం
శిలతృణాం కురైః సేదతీతి, నః
కలిలతాం మనః కాంచగచ్ఛతి.'15

అనుశ్లోకము నందు మధురభక్తికి వాత్సల్యము పోషకము.

'మధురయాగిరా వల్గు వాక్యయా
బుధ మనోజ్ఞయా పుష్కరేక్షణ
విధి కరీరి మావీర! ముహ్యతీః
అధర సేధువాఽఽప్యాయ యస్వనః.'16

ఇందు మధురభక్తికి దాస్యము పోషకముగుచున్నది.

'ప్రవాసితం ప్రియప్రేమ వీక్షణం
విహరణం చ తే ధ్యానమంగళం
రహసి సంపదోయా హృది స్పృశః
కుహక। నోమనః క్షోభయంతి హి'17

ఇందు మధుర భక్తికి స్నేహము పోషణమైనది. ఇట్లు దాస్యసఖ్య వాత్సల్యాదులు మధురతరములైనప్పుడే వానికి సంపూర్ణత సంభవించెడిది. మాధుర్య భావములేని దాస్య సఖ్య వత్సలాదులు భగవద్రతి పోషకములయ్యు ఉజ్జ్వలములు సమగ్రములు కావు.

9. శుద్ధ సాత్త్విక చిత్తవృత్తి మధురభక్తియందు ప్రతిబింబించినట్లు మిగిలిన వానియందు కానరాదు. మధురభక్తియందు అహంకార వర్జనము అయినపట్టు. గోపికలకు దేహస్మృతి కోల్పోయి గోవిందుని అనుగమించుట రాసక్రీడలోని రమణీయ భావము; సాత్త్విక సంభావనము. అట్టి చిత్తవృత్తి మిగిలిన వానియందు పరిపూర్ణముగా ప్రదర్శింపబడుటకు అవకాశములేదు.

ఈ విధముగా సమాలోచించినచో తాత్పర్యమిట్లు తేలును. భక్తిరస సమగ్రానుభవము మధురభక్తియందు లభించును. వాహికలనుబట్టి భక్తిరసము దాస్య సఖ్య వాత్సల్య మధురమార్గములలో ప్రధానముగా ప్రవహించినను మధురభక్తికున్న సమగ్రత వానికిలేదు. కావున భక్తి రసానుశీలనమునందు మధురభక్తి వివేచనము సమగ్రరసానుశీలనము దాస్యాదులు తత్పోషకముగా నిలిచినచో నవియు పూర్ణములోని పూర్ణమువలె భాసింపగలవు. మధుర భావమునకు పోషకములుగాక సంపోషింపబడెడి తదితర భక్తి భావములన్నింటిని కలిపి ముగ్ధభక్తి రసములని పేర్కొనవచ్చును. ముగ్ధభక్తి మధురభక్తివలె మిశ్రానుభవస్థితిని చేర్పలేవు. జ్ఞానభక్తి రమణీయార్థము కంటె పరమార్థ చింతనమునకు పెద్దపీట వేయునది.

మధురభక్తి — పూర్ణరసము, అలౌకికాధ్యాత్మిక మిశ్రస్థితి
ముగ్ధభక్తి — అలౌకికరసము
జ్ఞానభక్తి — ఆధ్యాత్మిక స్థితి ప్రధానము శాంతరసపోషకము

ఈ ముప్పేధములైన భక్తులలో మధుర ముగ్ధభక్తి భేదముల నధికరించి భాగవత బసవపురాణాదులయందలి కావ్యార్థముల ననుశీలించుటయే యిక ముందు జరుగవలసిన వివేచనము.

## శ్రీమద్భాగవతము భక్తిరససుధార్ణవము :

ఉ. ఇంచుక మాయలేక మది నెప్పుడుఁ బాయని భక్తితోడ వ
ర్తించుచు నెవ్వఁడేని హరి దివ్య పదాంబుజగంధరాశి సే
వించు నతం డెఱుంగు నరవింద భవాదులకైన దుర్లభో
దంచితమైన యాహరియుదార మహాద్భుత కర్మమార్గముల్.

(భాగ. 1-69)

శ్రీమద్భాగవతము భక్తిరస సుధార్ణవము. అందు ప్రతిపాదింపబడిన విష్ణుతత్త్వము 'రసోవైసః' అను సూక్తికి ఉజ్జ్వల ఉదాహరణము. భాగవత పఠనమువలన భక్తునకు లభించునది మోక్షఫలసిద్ధి. భాగవత ప్రాశస్త్యము నుగ్గడించుచు కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్యుల వాక్యములివి :

'భాగవతమనగా భగవంతునిగూర్చి చెప్పునది. భగవద్భక్తులను భాగవతులందురు. భగవంతుడు భాగవతులలో వ్యక్తమగుచున్నది ఈ పవిత్ర గ్రంథమునకు పునాది. కనుక భక్తుల గుణకీర్తనము వలన అనుభూతి కలిగినట్లు సాధనవలనను, శాస్త్రాభ్యాసమువలనను కలుగదు. ఈ సత్యమునుగూడ భాగవతముదాహరణ పూర్వకముగా తెలుపును. జీవులలో దేవుడుండును గనుక భూతదయవలన జీవులరూపమున దేవుడు మెచ్చుకొనును. తత్ఫలితముగా దేవుని పాదముల సాన్నిధ్యమెఱిగిన గురువులతో పొత్తు కుదురును. దానివలన దేవుని అనుభూతి కలుగును. దేవుని పాదము లెఱిగిన వారి జీవిత చరిత్రములను చదువుచున్నప్పుడు మనసు దేవునిపైకి ఆకర్షింపబడును. ఈ ఆకర్షణ సమయమున సమస్యలతోనున్న మనస్స్థితినుండి సమస్యలులేని "తన" స్థితికి జీవుడు మారును దీనినే సముద్ధరణమనియు, సంసారమును తరించుట యనియు, మోక్షమనియు చెప్పుదురు. ఈ అనుభవము నిరంతరము దుఃఖాదులు లేని స్థితిని ప్రసాదించును. దేహమునకు సంబంధించిన

జీవన మరణములుకూడ తనకులేని స్థితిని ప్రసాదించును. దీని ననుభవమునకు తెచ్చుటకు రచింపబడిన గ్రంథమే భాగవతము'[1]

పండ్రెండు స్కంధముల భాగవతమునందు ఉజ్జ్వలనీలమణి వంటిది దశమస్కంధము. "ముఖారవిందమ్ దశమమ్ ప్రఫుల్లమ్" అని ప్రసిద్ధియు కలది. దానికంతటి ప్రఖ్యాతి కలుగుటకు కారణము అందు శ్రీకృష్ణలీలలు, రాసలీలలు అభివర్ణింపబడియుండుట. భాగవత తత్త్వజ్ఞులు రాసశబ్దమునకు మూలముగా రసశబ్దమును భావింతురు. రసము స్వయముగా శ్రీకృష్ణ భగవానుడే యని ప్రతిపాదింతురు. శ్రీ జన్నాభట్ల వాసుదేవశాస్త్రిగారి మాటలలో,

'రాస శబ్దమునకు మూలము రసము. రసము స్వయముగా శ్రీకృష్ణ భగవానుడే "రసోవై సః". ఏ దివ్యక్రీడలో అనేక రసములు ఒకే రసముగ మారి అనంతానంతరసములను ఆస్వాదించునో, ఒకే రసము రససమూహరూపమున ప్రకటమై ఆస్వాద్య ఆస్వాదక లీలాధామముల రూపమున విభిన్నములైన ఆలంబనోద్దీపనముల రూపమున క్రీడించునో అదియే రసము........ఈ రహస్యమును తెలిసికొనుచు దీనిలో ప్రవృత్తు డగు వాడే దీనిలోని నిజమైన ఆనందమును అనుభవింపగలడు. భగవానుడు తన మధురమైన ఆహ్వానముతో ప్రతి వ్యక్తిని రాసమునకు ఆహ్వానించుచున్నాడు. అహంభావమును విడిచి ఈ వైపు వెడలువాడే ఈ ఆనందమును పొందగలడు.'[2]

మధుర భక్తి సంప్రదాయమున శ్రీకృష్ణలీల నిరోధలీల యని పేర్కొనబడినది. మనస్సును నిరోధించుట జగత్తును విస్మరించుట భగవంతుని యందు ఆసక్తిని కలిగియుండుట నిరోధమని పేర్కొందురు.[3] సంసార సంబంధములైన బంధములను త్రెంచుకొనుటవలన భగవత్సంబంధము తేర్పడుననియు అప్పుడే నిజమైన ఆనందము వెల్లడియగుననియు, అదియే కృష్ణ కథలోనున్న మహిమయనియు, మధురభక్తి సంప్రదాయజ్ఞులు పేర్కొందురు. భాగవత కథలో విష్ణుమాహాత్మ్య ప్రతిపాదకములైన వానియందు వీర శృంగార కరుణ హాస్యాదిరసములు అనేకములు అనుభవమునకు రావచ్చును కాని రసస్వరూపుడైన శ్రీకృష్ణునియందే అవి లయించి తన్మధురానుభూతియే పఠిత చిత్తమునందు నిలుచుట భాగవత రస రహస్యము. భాగవత రసము భక్తియనుటలో విప్రతిపత్తిలేదు. అది భగవద్రసమనుట ఈ పురాణ విశేషము. అనగా సర్వ రస

ములకు మూలమైనది గమ్యమైనది భక్తి యనియే భాగవత తాత్పర్యము. భాగవత పురాణ నిర్మాణము ఈ మౌలికమైన తత్వముపై ఆధారపడియున్నది. అష్టాదశ పురాణములలో శ్రీమద్భాగవతము ఉత్తమమని ఘోషింపబడినది.

'ఈ పదునెనిమిది పురాణంబుల మధ్యంబున నదులయందు భాగీరధి విధంబున, దేవతలయందుఁ బద్మ గర్భునిమాడ్కిఁ, దారకలందుఁ గళానిధిగరిమ, సాగరంబులందు దుగ్ధార్ణవంబు చందంబున. నగంబులను హేమనగంబు భాతి, గ్రహంబుల విభావనుకరణి, దైత్యులందుఁ బ్రహ్లాదుని భంగి. మణులయందు, బద్మరాగంబు రేఖ, వృక్షంబులందు హరిచందన తరువురీతి, ఋషులందు నారదుమాడ్కి, ధేనువులందు గామధేనువు పోల్కి, సూక్ష్మంబులందు జీవుని తెఱంగున, దుర్జయంబులందు మనంబు చొప్పున, వసువులందు హవ్యవాహనుని పోఁడిమి, నాదిత్యులందు విష్ణువు కరణి, రుద్రులయందు నీలలోహితుని రీతిని, బ్రహ్మలందు భృగువు సొబగున, సిద్ధులయందుఁ గపిలుని లీల, నశ్వంబులందు నుచ్చైశ్రవంబులాగున, దర్వీకరంబులందు వాసుకి రూపమున, మృగములందు గేసరిచెలువున, నాశ్రమంబులందు గృహస్థాశ్రమంబుక్రియ, వర్ణంబులలో నోంకారంబునిరవున, నాయుధంబుల గార్ముకంబు సోయగంబున, యజ్ఞంబుల జపయజ్ఞంబు చాడ్పున వ్రతంబులం దహింస కరణి, యోగంబులం దాత్మ యోగంబురమణ, నోషధులయందు యవనసొబగున, భాషణంబులందు సత్యంబు తేవ, ఋతువులందు వసంతంబు ప్రౌఢి, మాసంబులందు మార్గ శీర్షంబు మహిమ, యుగంబులందు గృతయుగంబు నోజఁ దేజరిల్లు; నిట్టిభాగవత పురాణంబు పఠియించి విష్ణుసాయుజ్యంబు జెందుదురు.'

(భాగ. ద్వాదశ. స్కం. 48)

పురాణములన్నియు పంచలక్షణములతో కూడి యుండగ భాగవతము మహా పురాణమునకు దశ లక్షణములుండ వలయుననియు, పంచ లక్షణములు కలిగినవి ఉప పురాణములు మాత్రమేయనియు పేర్కొనెను.

పురాణ లక్షణం ప్రహ్మన్ బ్రహ్మర్షి భిర్నిరూపితమ్
శ్రుణుష్య బుద్ధి మాశ్రిత్య వేదశాస్త్రానుసారతః.

సర్గోఽస్యాథ విసర్గశ్చ వృత్తి రక్షాంత రాణిచ
వంశో వంశాను చరితం సంస్థా హేతుర పాశ్రయః॥
దశభిర్లక్షణైర్యుక్తం పురాణం తద్విదోవిదుః
కేచిత్పంచవిధం బ్రహ్మన్ మహదల్ప వ్యవస్థయా॥

(భాగ. XII 7-8-10)

సర్గము, విసర్గము, వృత్తి, రక్ష, మన్వంతరములు, వంశము, వంశాను చరితము, అపాశ్రయము, సంస్థలు, హేతువు - అనునవి భాగవతమునందు చెప్పబడిన పురాణ దశ లక్షణములు. వీని వైశిష్ట్యమును పేర్కొనుచు ప్రథమాంధ్ర మహా పురాణ కర్త యిట్లు పేర్కొనెను :

'భాగవత పురాణము పంచలక్షణములతోపాటు వృత్తి, రక్ష, సంస్థ, హేతువు, అపాశ్రయము, అను నైదు లక్షణములు క్రొత్తగా - ప్రతిపాదించెను. భగవత్తత్త్వ ప్రతిపాదకమైన యీ పురాణము దశలక్షణ సూత్రమును, పరబ్రహ్మానుసంధాన దృష్టితో నిర్మించినది. ఘటాది పదార్థములందు మృదాది ద్రవ్యమెట్లు భాసించునో యట్లే పరమాత్మ రూపనామములందును అజన్మమరణాంతములైన యవస్థలయందును అన్వితానన్వితమై యొప్పుచుండుననియుఁ జిత్తము తనంతట తానుగాని యనిష్ఠిత యోగమువలనఁగాని వృత్తిత్రయమును బరిహరించి విరతి నొందునప్పుడు సంసార ప్రవృత్తి నివృత్తుఁడై యతఁ డాత్మ సాక్షాత్కారము గాంచునను పరమ తాత్పర్యము పురాణము బోధింపవలెనని భాగవత మతము. తదనుగుణముగాఁబై పది లక్షణముల నాపురాణము నిర్దేశించినది. మన్వంతర వంశ వంశాను చరితములు కూడ తత్పరమార్థమును ప్రబోధించు చుండవలెనని యాపురాణ తాత్పర్యము కానోపును. ఇతర పురాణములందీ యాధ్యాత్మిక సమన్వయమంతగాఁ గానరాదు. భాగవతమునందలి ప్రధాన ప్రతిపాద్య వస్తువు ఇతర పురాణములందు కొన్ని యెడలఁ బ్రాసంగికవస్తు వగుచున్నది. అట్లగుటచే భాగవత దశలక్షణ సూత్రము తదితర మహాపురాణములకు సర్వత్ర వర్తించుటలేదు '4

భాగవత పురాణమున రసస్వరూపుడే శ్రీకృష్ణుడు. నిర్గుణమైన పరబ్రహ్మమైనచో తాత్త్వికులకు తదుపాసనవలన బ్రహ్మానంద మనుభూయ మాన

మగును. సగుణమైన విష్ణుతత్త్వభావనమే మధురభక్తి రసానుభవ ప్రకారము అట్టి భక్తి రసమును ఆస్వాదించుట కనువైన ప్రణాళిక భాగవతముతో నేర్పరచుకొనుటకై ఆ పురాణము దశ లక్షణములను ప్రపంచినది. భాగవత పంచ లక్షణములను ప్రపంచించినది. భాగవత పంచలక్షణములు కూడ మిగిలిన పురాణములలోని పంచలక్షణముల వంటివికావు భాగవత తత్త్వ ప్రతిపాదనకు తోడ్పడు నట్టివి.

భాగవత తత్త్వమను పదమునకు మూడు విధములైన అర్థములను పేర్కొనవచ్చును.

1. 'భాగవతోత్తమానాం రూపగుణ ప్రవర్తనాదిభిః ప్రకటితం తత్త్వం' భాగవతోత్తముల స్వరూప స్వభావములచేతను ప్రవర్తనచేతను ప్రకటింపబడు తత్త్వము.
2. 'భాగవతోత్తమైః ప్రబోధితం తత్త్వం' - భాగవతులచే ప్రబోధింపబడిన అనగా భాగవతులచే స్వయముగా చెప్పబడిన తత్త్వము.
3. 'భాగవత నామ సామ్యేన శ్రీమహాభాగవతే ప్రపంచితం తత్త్వం', శ్రీమద్భాగవతమునందు ప్రపంచింపబడిన తత్త్వము.

భాగవతమునందలి భక్తులు ప్రధానముగా నాలుగు రకములు: వారు 1. సాధకులు 2. భక్తులు 3. తాత్త్వికులు 4. ముక్తులు.

## చతుర్విధభక్తులు :

1. సాధకులు - గజేంద్రాదులు
భక్తులు - గోపికలు
తాత్త్వికులు - ప్రహ్లాదులు
ముక్తులు - శుకాదులు.

వీరిలో సాధకులు, భక్తులు వారి స్వరూప స్వభావములచేతను ప్రవర్తనలచేతను భాగవత తత్త్వమును ప్రకటించుచుందురు. తాత్త్వికులు ముక్తులు, స్వయముగా భాగవత తత్త్వమనుభవించి లోకమునకు ప్రకటించుచుందురు. భాగవతము వీరందరి తత్త్వములను రసరూపమైన విష్ణుతత్త్వమునందు లయింపజేయుచు తాత్పర్యమున రసోవైసః యను అనుభూతినందించుచుండును.

అనగా భాగవతము భక్తిరససిద్ధికొఱకై ప్రభవించిన మహాపురాణము. భాగవతము నందలి భక్తులనగా భాగవతులే. **భాగవతుల లక్షణములను** స్థూలముగా నీ క్రింది విధముగా పేర్కొనవచ్చును:

'నచలతి నిజ ధర్మ వర్ణతోయ
స్స మమతిరాత్మ సుహృద్విపక్ష పక్షే
న హరతి నచహంతి కించిదుచ్చై
స్సిత మనసంత మవేహి విష్ణుభక్తమ్'.

తనకుల ధర్మములను విడువక జనులందరియందును సమబుద్ధితో ప్రవర్తించుచు పరద్రవ్యాపహరణమును గాని, పరహింసనుగాని చేయక నిర్మలమైన మనసుకలిగి యుండువాడు విష్ణుభక్తుడు లేదా భాగవతుడు. అనగా ధర్మనిరతి, సమబుద్ధి, అహింస, ఆశారాహిత్యము, మొదలగు గుణములు భాగవత లక్షణములని పై శ్లోకము వలన స్పష్టమగుచున్నది.

'కలికలుషమలేన యస్యనాత్మా
విమల మతేర్మలినీకృత స్తమేనమ్
మనసి కృత జనార్దనం మనుష్యం
సతత మవేహి హరేరతీవ భక్తిమ్'.

కలికాల ప్రభావముచే మోహితుడుకాక, కల్మషబుద్ధిలేక, (స్వచ్ఛమైన) నిర్మలమైన మనసునందు భగవద్భావన కలిగినవాడే హరిభక్తుడని భావించ నగును. అనగా మోహరాహిత్యము, చిత్తనైర్మల్యము, భగవద్భావన యనునవి హరిభక్తుడైన భాగవతుని లక్షణములని స్పష్టము.

'కనక మపి రహస్యవేక్ష్యబుద్ధ్యా
తృణమివయస్య మవైతి వై పరస్వమ్
భగవతిచ భగవత్య నన్యచేతాః
పురుషవరం తమనేహి విష్ణుభక్తమ్.'

పరుల ధనమును, రహస్య స్థలమునందున్న బంగారమునైనను గడ్డి పోచగా భావించుచు భగవదాసక్త మనస్కుడైనట్టివాడే భగవద్భక్తుడు. అనగా నిరీహయు, సమలోష్ఠకాంచన దృష్టియు, భగవద్రతియు భాగవతుని గుణములు.

వైష్ణవ సంప్రదాయమునందు భాగవతులను పది విధములుగా వర్గీకరింతురు. ప్రపన్న ధర్మసారసముచ్చయమునందు దశవిధవైష్ణవులను లేదా భాగవతుల నీక్రింది విధముగా పేర్కొనుటయైనది:

## దశవిధ వైష్ణవులు

'అద్వేషశ్చానుకూలశ్చ దివ్యనామధర స్తథా
చక్రాంకి మంత్ర పాఠీచ పరంతప
శ్రీవైష్ణవః ప్రసన్నశ్చ ఏకాంతీ పరంతప
పరమైకాంతి విఖ్యాతోదశై వైష్ణవాస్మృతాః.'

ద్వేషము లేనివాడు, అనుకూలుడు, దివ్యనామధరుడు, చక్రాంకితుడు, మంత్రపాఠకుడు, వైష్ణవుడు, శ్రీవైష్ణవుడు, ప్రసన్నుడు, ఏకాంతి, పరమైకాంతి, అని వైష్ణవులు లేదా భాగవతులు పది విధములు. వీరి లక్షణము లీక్రింది విధముగా నుండును:

**అద్వేషి:-**

'విష్ణుం లోకనియంతారం వైష్ణవం లోకపావనం
దృష్ట్వానద్వేష్టి యోమర్త్యః సోఽద్వేషః పరికీర్తితః'

లోకనియంతయైన విష్ణువును, అతని భక్తులగు వైష్ణవులను చూచి యెవడు ద్వేషింపడో అత డద్వేషి. శ్రీమద్భాగతమునందు అంబరీషుడు, అక్రూరుడు, విదురుడు మొదలైనవారు అద్వేషులుగా పరిగణింపదగినవారు. అందు పోతన అంబరీషుని చిత్రించిన విధము ఈ భాగవత ధర్మమునకు సరిపోలుచున్నది.

సీ. చిత్తంబు మధురిపు శ్రీపాదములయంద
పలుకులు హరిగుణ పఠనమంద
కరములు విష్ణుమందిర మార్జనములంద
శ్రవములు హరికథా శ్రవణమంద
చూపులు గోవిందరూప వీక్షణమంద
శిరము గేశవ నమస్కృతుల యంద
పదము లీశ్వర గేహ పరిసర్పణములంద
కామంబు చక్రి కైంకర్యమంద

తే.గీ. సంగ మచ్యుతజన తను సంగమంద
ఘ్రాణ మసురారి భక్తాంఘ్రి కమలమంద
రసన దులసీదళములంద రతులు పుణ్య
సంగతులయందు యా రాజచంద్రమునకు. —భాగ. నవమ. 82.

భాగవతులకుండదగిన భాగవదాసక్తియు ఈ పద్యమునందు వర్ణింపబడినది. ఇంద్రియములన్నియు విష్ణు సంస్మరణమునందే నిమగ్నమైయుండుటచే నతనియందు భాగవతత్త్వము భక్తిరస స్థితిని పొందినది. పోతన అంబరీషుని మహాభాగవతునిగా పేర్కొనినాడు. దానిని సమర్థించుచు,

సీ. ఘనవై భవంబునఁ గల్మషదూరుడై యజ్ఞేశు నీశు నబ్జాక్షుఁగూర్చి
మొనసి వసిష్ఠాదిముని వల్లభుల తోడఁ దగిలి సరస్వతీ తటమునందు
మేధతో బహువాజి మేధంబు లొనరించె గణుతింపరాని దక్షిణలు వెట్టి
సమలోష్ట హేముఁడై సర్వకర్మంబులు హరిపరంబులుగాఁగ నవనియేలె

ఆ. విష్ణుభక్తులందు విష్ణువునందుఁ గలంక మెడల మనసు లంకెపెట్టి
విహిత రాజ్యవృత్తి విడువనివాఁడునై యతఁడు రాచతపసి యనఁగ
నొప్పె -భాగ. న. 84.

అని విష్ణువునందును, విష్ణు భక్తులందును నిర్మలమైన మనసుతో అద్వేషియై మెలంగెనని యభివర్ణించెను. తనపై కృత్యను ప్రయోగించి రౌద్రమును ప్రకటించిన దుర్వాసునియందు సహితము ద్వేషబుద్ధి వూనక యతని యందును హరినే స్మరించి నిఖిలాత్మమయుడైన హరిని స్మరించి సేవించి ప్రేమించు భక్తునిగా చూపట్టినాడు.

కం 'అఖిల గుణాశ్రయుఁడగు హరి
సుఖియై నాకొలువు వలనఁజొక్కెడినేనిన్
నిఖిలాత్మమయుండగుటకు
సుఖమందుంగాక భూమిసురుఁడివ్వేళన్.' —భాగ. 9.138.

సర్వజీవులయందును హరిని దర్శించినప్పుడే భాగవతు డద్వేషియై యలరాలగలడు.

**అనుకూలుడు :-**

'వాసుదేవోత్సవాంశ్చైవ మహాభాగవతాం స్తథా
అనువర్తేత యోనిత్యం అనుకూలి ఉదాహృతః'

వాసుదేవుని ఉత్సవములకును భగవద్భక్తులకును అనుకూలముగా ప్రవర్తించువాడు అనుకూలుడు. అనుకూలుడైన భాగవతోత్తముని లక్షణములు స్మరించినంత మాత్రముననే మన స్మృతిపథమునందు నిలిచెడివాడు నారద మహర్షి. మహాభారత ప్రథమస్కంధమునందు చింతాక్రాంతుడైన వ్యాసమహర్షి చెంతకు నారదుడరుదెంచి బహుపురాణకర్తయైన వ్యాసుడు విష్ణుకథ లేర్పడ చెప్పక పోవుటవలననే అతనికి మనశ్శాంతి లేదని ప్రబోధించెను.

ఉ. అంచితమైన ధర్మచయ మంతయుఁజెప్పితి, వందులోన నిం
చించుక గాని విష్ణుకథ లేర్పడఁజెప్పవు; ధర్మముల్ ప్రపం
చించిన మెచ్చునే గుణవిశేషము లెన్నినఁగాక నీకు నీ
కొంచెము వచ్చుటెల్ల హరిఁగోరి నుతింపమి నార్యపూజితా —భా. 1-95

మ. 'హరినామస్తుతి సేయుకావ్యము సువర్ణాంభోజ హంసావళీ
సురుచిభ్రాజితమైన మానససరస్స్ఫూర్తిన్ వెలుగొందు, శ్రీ
హరినామస్తుతి లేనికావ్యము విచిత్రార్థాన్వితం బయ్యుశ్రీ
కరమైయుండ; దయోగ్యదుర్మలినవత్కాకోలగర్తాకృతిన్.'
(భాగ. 1.96)

భాగవత రచనకంటె ఉత్తమమైన వాసుదేవుని ఉత్సవముగాని భగవద్భక్తులకు ఆనుకూల్యముగాని మరొండు కానరాదు. భగవన్నామ స్మరణమునకును భగవదుత్సవ ప్రేరణమునకును భగవద్భక్తుల హితము నభిలషించి వారికి భగవదానుకూల్యము కలుగునట్లు బోధించుటకును నారద మహర్షి పాత్ర పెట్టినది పేరు. భాగవతమునందు ప్రతి స్కంధమునందును దాదాపు ఈ మహర్షి ప్రశంస వచ్చుచునేయున్నది. ద్వితీయ స్కంధమునందు శ్రీమన్నారాయణుని లీలావతారముల యభివర్ణనమునకు ప్రేరకమైన ప్రపంచ ప్రకారమును గురించి నారదుడు బ్రహ్మనడిగిన యంశము కలదు. చతుర్థస్కంధమున ధ్రువునకు నారదుడు భక్తియోగము నాశ్రయించి మోక్షమును పొందెడి మార్గము నుపదేశించి భాగవత మార్గదర్శిగా గోచరించెను. షష్ఠ స్కంధము

నందు నారదుడు శబళాస్యులకు నివృత్తి మార్గము నుపదేశించెను. సప్తమ స్కంధమున గర్భస్థుడైన ప్రహ్లాదునకు తత్త్వోపదేశము చేసిన గురుడు నారదుడే. ధర్మజునకు వర్ణాశ్రమ ధర్మములు తెలిపిన మహర్షియు నారదుడే. దశమ స్కంధమునందు శ్రీకృష్ణుడు అష్టమహిషులను వివాహమాడిన తరువాత నారదాది మహర్షులు అతనిని దర్శించి వసుదేవునిచేత క్రతువు సేయించిన వృత్తాంతము కలదు. వాసుదేవుని ఉత్సవములకును భగవద్భక్తులకును అనుకూలముగా వర్తించుటకిది చక్కని యుదాహరణము. ఏకాదశ స్కంధమున నారదమహర్షి వసుదేవునకు పురాతనమైన విదేహర్షభ సంవాదమును తెలుపుట యాతని భాగవతానుకూల్యమునకు మరియొక చక్కని యుదాహరణము. ఇట్లు స్వయముగా భాగవతోత్తముడై విష్ణు భక్తులలో మిన్నయైనవాడై వైష్ణవలీలా వైభవమునకు పతాకవంటివాడై భాగవతోత్తములను సదా ప్రోత్సహించెడి యనుకూలుడై సదా మసలిన నారద మహర్షి అనుకూలుడైన భాగవతోత్తముడు.

**దివ్యనామధరుడు :-**

'స్మృత్యుచ్చారణ మాత్రేణ సర్వపాప ప్రణాశనమ్
విష్ణునామధరః పుణ్యో నామధారి సఉచ్యతే',

ఎవని నామము స్మరించుట మాత్రముచేతనే, ఉచ్చరించుట మాత్రముననే సర్వపాపములు నశించునో యట్టి పుణ్యుడు విష్ణునామమును ధరించువాడు ఊర్ధ్వపుండ్రములను దాల్చువాడు దివ్యనామధరుడైన భాగవతుడని చెప్పబడుచున్నది. ధ్రువ, అంబరీష, ప్రహ్లాద, నారదాది మహాభక్తుల నామస్మరణమున మాత్రముననే జనులకు పుణ్యము కలుగునని సంప్రదాయము చెప్పుచున్నది.

**ప్రపన్నుడు :-**

'శబ్దాదీన్ విషయాంశ్చైవ దేహోపాదిక బాంధవాన్
త్యక్త్వ హరౌన్యస్త భరస్స ప్రసన్న ఉదాహృతః',

శబ్ద స్పర్శ రూపరస గంధాదులయందు ప్రీతియు, బంధువులయందు ప్రేమయు, వారు తనను రక్షింతురను విశ్వాసము వీనినన్నింటిని వదలి పరమాత్మయందే తన యోగ క్షేమ భారమును వైచియుండువాడే ప్రపన్నుడు. ఇందులకు చక్కని యుదాహరణము ప్రహ్లాదుడు.

శా. 'పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్ భాషించుచున్ హాసలీ
లానిద్రాదులు సేయుచుం దిరుగుచున్ లక్షించుచున్ సంతత
శ్రీనారాయణ పాదపద్మ యుగళీ చింతామృతాస్వాదసం
ధానుండై మఱచెన్ సురారిసుతుఁ డేతద్విశ్వమున్ భూవరా'
-భాగ. 7-123.

అను ప్రహ్లాద వర్ణనము శబ్ద స్పర్శ రూప రస గంధాదులయందు ప్రీతి లేని లక్షణమును వ్యక్తము చేయుచున్నది.

సీ. 'శ్రీవల్లభుఁడు దన్నుఁ జేరిన యట్లైన
జెలికాండ్ర నెవ్వరిఁ జేరమఱచు
నసురారి దన్నెమ్మోల నాడినయట్లైన
నసుర బాలుర తోడ నాడ మఱచు
భక్తవత్సలుండు సంభాషించినట్లైనఁ
బరభాషలకు మాఱుపలుక మఱచు
సురవంద్యుఁ దనలోనఁ జూచినయట్లైన
జొక్కి సమస్తంబుఁ జూడ మఱచు

తే. హరిపదాంభోజయుగ చింతనామృతమున
నంతరంగంబు నిండినట్లైన నతఁడు
నిత్యపరిపూర్ణుఁడగుచు నన్నియును మఱచి
జడతలేకయుండు జడునిభంగి —(భాగ. 7-122)

అను వర్ణమునందు ప్రహ్లాదుడు బంధుప్రీతిని వీడి భగవంతునియందే లగ్నమనస్కుడై తన యోగక్షేమ భారములనన్నింటిని యాతనియందే నిలిపి నిర్లిప్తుడై తన్మయతను భజించిన లక్షణము గోచరమగుచున్నది.

**ఏకాంతి :-**

'హరే రాజ్ఞాను రూపేణ కర్మజ్ఞానాది యోనరః
స ఏకాంతీ భవేద్విప్రః సహి భాగవత స్మృతః॥'

కర్మ జ్ఞానాది యోగములు భగవదాజ్ఞా రూపములు కావున ఆ యోగములను యథావిధిగా నిష్కామముగా నిర్వర్తించువాడు ఏకాంతియనియు, భాగవతుడనియు చెప్పబడును.

కర్దమ ప్రజాపతి కథ యిట్టి భాగవత లక్షణములకు చక్కని యుదాహరణము. ఈ యంశము తృతీయ స్కంధమునందు వివరింపబడినది. ఈ పంచవిధ భాగవతోత్తములు విశిష్టాద్వైతమునందేకాక అద్వైతమునందుకూడ గోచరింపదగినవారు. ఇక చక్రాంకుడు, మంత్రపాఠకుడు, వైష్ణవుడు మొదలైనవారు విశిష్టాద్వైతమునకు మాత్రమే వర్తించినవారగుచున్నారు. కావున పైన పేర్కొన్న భాగవత లక్షణములు సర్వభాగవత సామాన్య లక్షణములుగా భావించుటకు వీలగుచున్నది భాగవతమునందలి భాగవతులు విష్ణుభక్తులె కాని ద్వైత విశిష్టాద్వైత మార్గానుయాయులని నిర్దిష్టముగా చెప్పలేము. శివకేశవాభేదము పాటించెడి అద్వైతవిష్ణుభక్తులుకూడ నిందున్నారు. పై లక్షణములు రామానుజ మతానుకూలములు. వానిని భాగవతమున కనుకూలముగా మనము భావింపవలెను. ఆ దృష్టితోడనే పై యుదాహరణములు గ్రహింపబడినవి.

భాగవతము భక్తిరసప్రధానమైన పురాణము. సామాన్యముగా కావ్యములు రసప్రధానములనియు, పురాణములు అర్థ ప్రధానములనియు భావింపబడుచున్నవి. కాని, భాగవతము భక్తి ప్రధానమనుటకు విప్రతిపత్తి యుండదు. కావ్యపురాణములందు రసవివేచనము చేయువిధమును పేర్కొనుచు డా. జి.వి. సుబ్రహ్మణ్యం గారు ఈ విధముగా వివేచించిరి :

> "ఒక మహాకావ్యము నందలి రసమును గూర్చి విచారించు పద్ధతికిని, పురాణమునందలి రస విమర్శ మెనర్చు విధమునకును దప్పక భేదము కలదు. కావ్యములందును వస్తు రసప్రాధాన్య వివక్షచే రెండు విధములు ప్రధానముగాఁ గనవచ్చు చున్నవి. కావ్యశరీర మితివృత్తము; అది నాయక చరితము. కొన్ని యెడల నది పంచసంధియుతము. సర్వత్ర కార్యారంభ ఫలాగమపర్యంత పరివ్యాప్తము. కావ్యమున నంగి నాయకుఁడొకడే. ఫలసాధనమున నాతనికి సహాయులనేకు లుండవచ్చును. ప్రతి నాయకులు నంతియ. ఇట్టిది రసవత్తరముగా నిర్వహింపఁబడినచో నది రసవత్కావ్య మనఁబడును. దీనికి భిన్నములైనవి వస్తుకావ్యములు. వస్తు నిర్మాణ వైవిధ్యమును బట్టి వీనియందును అనేక భేదములు పొడగట్టుచున్నవి. పురాణము లట్టి భేదములలో నెన్నఁదగినవి. వేద ప్రతిపాదిత నిగూఢార్థములను ఉపాఖ్యానముల ద్వారమున వివరించుచు మిత్రునివలెఁ బురాణములు సామాజికునకు ధర్మ ప్రబోధ

మొనర్చును. అందేక నాయక నియమము లేదు. ఒకని గాథయే చెప్పబడదు. వ్యంగ్యప్రధానములగు రస భావములకన్న విజ్ఞాన దాయకములగు ధర్మార్థములకే అందు ప్రాధాన్యము హెచ్చు. వస్తువెల్లను ఉపాఖ్యానముల కూర్పు. అవియన్నియుఁ గలసి యేదైననొక మహా ధర్మమునుగాని మహాతత్త్వమునుగాని, మహాసత్యమునుగాని, మహా ప్రయోజనమునుగాని, వ్యంగ్యముగా బోధింప వచ్చును. కావ్య మున వస్త్వైక్యము భాసించుచుండగా పురాణమున నొకయేకవాక్యతయో లేక సమన్వయమో సంతరింపబడి యుండవచ్చును. పురాణములలో కొన్ని విష్ణ్వాది దైవప్రాధాన్య ప్రతిపాదనార్థము జన్మించినవి కలవు. అందలి కథలన్నియు నాదైవ మాహాత్మ్య ప్రతిపాదనకై సూత్రబద్ధ ములై యొక యేకవాక్యత నందగించుకొనియుండును కొన్ని చతుర్వర్గ వ్యుత్పత్తి ప్రతిపాదన ప్రధానములు కలవు. తదర్థ ప్రతిపాదకాంశ ములు గల కథల నాదృష్టితో సమన్వయించుకొనవలెను. పరమ పురు షార్థబోధ వాని ధ్యేయమగుచో త్రివర్గవ్యుత్పత్తిని చతుర్వర్గవ్యుత్పత్తి కుపాంగముగను పోషకముగను గ్రహించి యన్వయించుకొనవలెను.... ........పురాణ కథార్థముల సమన్వయము సాధింపవలెనన్న తత్కథా స్వభావములను బరిశీలింపవలెను. కథాస్వభావము పృచ్ఛకుని యొక్కయు, కథకుని యొక్కయు స్వభావము మీద కొంత ఆధార పడి యుండును. పృచ్ఛకుని సంశయ నివారణము చేయుట కథకుని కర్తవ్యము. శ్రోత చిత్తవృత్తి నెఱింగి కథలను ప్రపంచించుట యతని నైపుణ్యము.'6

మహాభాగవత శ్రోత పరీక్షిత్తు, కథకుడు శుకమహర్షి. పరీక్షిత్తు 'చెప్పవే తండ్రి ముక్తికిఁ జేరు తెరువు' (1. 525) అని ప్రశ్నింపగా శుక యోగీంద్రుడు ద్వితీయ స్కంధమునందు ముక్తిమార్గములలో భక్తి సులభ తరమని పేర్కొనెను. 'సంసార ప్రవిష్టుండయిన వానికిఁ దపోయోగాదులైన మోక్షమార్గంబులు పెక్కులు గలవందు భక్తిమార్గంబుకంటె సులభంబులేదు' అని భక్తి ప్రాధాన్యమును గూర్చి వివరించెను. తృతీయ స్కంధమునందు కపిలుడు దేవహూతికి భక్తియోగమును గురించి వివరించిన ఘట్టము ప్రత్యేక ముగా పేర్కొనదగినది. ఇందు భక్తి 'తామస రాజస సాత్త్విక భేదంబులం ద్రివిధంబై యుండునని' ప్రతిపాదించి వానిని వివరించెను.

చ. మనుసుత మద్గుణ శ్రవణమాత్ర లభించిన యట్టి భక్తిచే
ననఘుఁడ సర్వశోభన గుణాశ్రయుఁడం బరమేశ్వరుండనై
తనరిన నన్నుఁజెందిన యుదాత్తమనోగతు లవ్యయంబులై
వననిధి గామియైన సురవాహినిఁ బోలె ఫలించు నిమ్ములన్.'
(భాగ. 3.956)

అని భగవంతుడే పేర్కొనెను. మరియు,

'నిష్కాములయిన మదీయ భక్తులకు నట్టి భక్తియోగంబు సాలోక్య స్పార్షి సామీప్య సారూప్య సాయుజ్యంబులకు సాధనంబు; కావున మహాత్ము లగు వారు నిజమనోరథ ఫలదాయకంబు లయినను మదీయ సేవావిరహితంబు లయిన యితర కర్మంబు లాచరింప నొల్లరు; దీని నాత్యంతిక భక్తి యోగంబని చెప్పుదురు; సత్త్వరజస్తమోగుణ హీనుండయిన జనుండు మత్సమానాకారంబుఁ బొందునని' (భాగ. 3.958) వివరించెను. త్రిగుణ రహితుడైన భక్తుడే భగవత్సమానుడని భాగవతమిందు ప్రతిపాదించుచున్నది.

**తామస భక్తియోగము :-**

తే. సతత హింసాతి దంభమాత్సర్యరోష
తమములను జేయుచును భేదదర్శి యగుచుఁ
బరఁగ నాయందుఁ గావించుభక్తిదలఁపఁ
దామసంబనఁదగు; వాఁడు తామసుండు.' (భాగ 3.953)

ఎల్లప్పుడు హింసను గావించుచు దంభము, మాత్సర్యము, రోషము మొదలైన గుణములను అతిశయముగా ప్రకటించుచు భేదదృష్టి కలవాడై భగవంతునియందు భక్తిని ప్రసరించినచో నతడు తామస భక్తుడనియు నతనిభక్తి తామస భక్తి యోగమని భాగవతము నిర్దేశించినది.

**రాజస భక్తియోగము :-**

కం. 'ఘనవిషయ ప్రావీణ్యము
లను సుమహైశ్వర్య యశములను బూజాద్య
ర్థుని నను నర్థి భజించుట
ఛన్ను రాజసయోగ మనఁగ సౌజన్యనిధీ!' (భాగ 3.954)

గొప్పవైన విషయ ప్రావీణ్యములచేతను ఐశ్వర్య యశములచేతను పూజార్హుడైన భగవంతుని సేవైన కోరికల నర్థించి భజించుట రాజస యోగమన బడును.

**సాత్త్విక భక్తి యోగము :-**

చ. 'అనుపమ పాపకర్మ పరిహారముకై భజనీయుఁడైన శో
భన చరితుం డితండనుచు భావమునం దలపోసి భక్తిచే
ననితరయోగ్యతన్ భగవదర్పణ బుద్ధి నొనర్చి కర్మముల్
జనహితకారియై నెగడ సాత్త్వికయోగ మనంగఁ జొప్పడున్.'

(భాగ 3-955)

పాపకర్మ పరిహారమునకై పూజనీయుడైన భగవంతుడే శరణని నమ్మి భగవదర్పణబుద్ధితో అనితరభక్తితో లోకహితము నాశించి కర్మలు చేయుట సాత్త్వికయోగ మనబడును.

తామస యోగమునకు హిరణ్యకశిపాదులను, రాజసయోగమునకు పాండవాదులను, సాత్తిక యోగమునకు ధ్రువాంబరీషాదులను పేర్కొనవచ్చును. మూలమునందు ఈ భాగమున కపిలుడు దేవహూతికి భక్తి లక్షణములను విశదము గావించుచు తామస రాజస సాత్త్విక భక్తులు ఒక్కొక్కటియు మూడు విధములుగా నుండునని పేర్కొనబడినది.

'భక్తియోగో బహువిధోమార్గైర్భామిని భావ్యతే,
స్వభావ గుణమార్గేణ పుంసాంభావోవిభిద్యతే.
అభిసంధాయ యద్ధిం సాం దంభం మాత్సర్యమేవచ,
సంరభీ భిన్న దృగ్భావం మయి కుర్యాత్సతామసః.

విషయానభిసంధాయయశ ఐశ్వర్యమేవచ,
అర్చాద్యావర్చయే ద్యోమాం పృథగ్భావః సరాజసః.

కర్మనిర్హార ముద్దిశ్య పరస్మిన్వా తదర్పణం,
యజే ద్యష్టవ్య మితివా పృథగ్భావః ససాత్త్వికః.

మద్గుణ శ్రుతి మాత్రేణమయి సర్వగుహాశ్రయే,
మనోగతి రవిచ్ఛిన్నా యథాగంగాంభసోఽంబుధౌ.

లక్షణం భక్తియోగస్య నిర్గుణస్యహ్యుదాహృతం,
అహైతుక్యవ్యవహితా యాభక్తిః పురుషోత్తమే.
సాలోక్య సార్ష్టి సామీప్య సారూప్యైకత్వమిత్యుత,
దీయమానం నగృహ్ణంతి జనామత్సేవనం వినా.
సఏవ భక్తియోగాఖ్య ఆత్యంతిక ఉదాహృత,
యేనాతి వ్రజ్యత్రిగుణాన్ మద్భావాయోపపద్యతే.'7

భక్తుని ఆశించెడి ఫలసంకల్పములను బట్టి ఈ భేదము లేర్పడుచున్నవి. తామసభక్తియందు భక్తుడు క్రోధస్వభావుడై హింసాఫలమును గాని, దంభ ఫలమునుగాని, మాత్సర్యఫలమునుగాని అభిసంధించి భేదదృష్టితో భగవంతునికి అర్చాదులను చేయుచుండును.

రాజసభక్తుడు విషయములనుద్దేశించియు, ఐశ్వర్యమునుద్దేశించియు, యశమునుద్దేశించియు భేదదృష్టితో భగవంతు నర్పించుచుండును.

సాత్త్వికభక్తుడు పాపక్షయమునుద్దేశించియు, పరమేశ్వరార్పణ భావము తోను, విధియగుటచేతను భేదదృష్టియై భగవంతుని నర్పించుచుండును.

ఈ తొమ్మిది విధములైన భక్తులు సగుణభక్తులు. వీనిలో ఉత్తరోత్తర ములు బలీయములు. ఈ నవవిధభేదములను -

'శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్.'8

నవ విధ భక్తి భేదములను ఒక్కొక్కదానియందు పరిగణించినచో మొత్తము సగుణ భక్తి ఎనుబది యొక్క విధము కాగలదు. నిర్గుణ భక్తి మాత్రమొక్కటియే. దీనినే (3-956 భాగ.) ఆత్యంతిక భక్తి యోగముగా భాగవతకర్త పేర్కొనియుండెను.

ఇట్టి భక్తి యోగమే మోక్షమనియు గంగా ప్రవాహము సముద్రము నందు కలిసినట్లు భగవంతునియందు భక్తుని చిత్తవృత్తి అవిచ్ఛిన్న ప్రవాహ ముగా ప్రసరించి లీనమగుటయే భక్తియోగము. అదియే ముక్తి.

ఇట్టి తత్త్వమును ప్రతిపాదించునదే భాగవతము. భక్తియోగము భక్తుల ఆధ్యాత్మిక జీవితమునకు సంబంధించినది. అనగా భక్తుల లౌకిక జీవితము

నందు ఆధ్యాత్మిక మార్గము ననుసరించి పొందెడి లౌకిక భావములకు రసముల కును సంబంధించిన అవస్థలుగా పేర్కొనవచ్చును. భక్తియోగముకంటె భక్తి రసము భిన్నముగా భావింపబడుచున్నది. రస స్వరూపుడైన భగవంతుని వర్ణించినపుడును భగవద్భక్తుల యొక్క భక్తిసాధనలను సహృదయ హృదయ వేద్యములుగా వివరింపబడినపుడును వానియందు తాదాత్మ్యతను భజించియు సామాజికులనుభవించెడి అలౌకికానుభవమే భక్తిరసము రూపగోస్వామ్యాదులు భక్తిరసమును నిరూపించుచు తదనుగుణములైన రసభావములను వివేచించుచు వానిని గూడ సాత్త్విక రాజస తామస భేదములచే మూడు విధములుగా సంభా వించిరి. రూపగోస్వామి మతము ననుసరించి లజ్జాబోధోత్సాహాదులు సాత్త్విక ప్రధానములైన శ్రీకృష్ణ సంబంధి భావములు. గర్వము, హర్షము, సుప్తి, హాసము మొదలైనవి రాజసప్రధానమైన భావములు. విషాదము, దైన్యము, మోహము, శోకము మొదలైనవి తామస ప్రధానమైన భావములు.

## ఆంధ్రమహాభాగవతము - మధురభక్తి

భాగవతము భక్తిరసమునకు విశ్వరూపము. అందు నవవిధభక్తులు ప్రధానముగా చెప్పబడియున్నను భక్తిరస ప్రవృత్తులు ఆర్ద్రముగా ప్రసరించుట కెన్ని మార్గములు కలవో అన్నింటిని భాగవతము తనయందు ప్రపంచించి యున్నది. భక్తిభేదములలో ప్రవత్తుల నాశ్రయించిన భేదములు కొన్నియు, ప్రక్రియల నాశ్రయించిన భేదములు కొన్నియు వివేచించుటకు వీలగుచున్నది.

శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వంద నము, దాస్యము, సఖ్యము మొదలగునవి ప్రక్రియలకు సంబంధించినవి. జ్ఞాన ముగ్ధ, మధుర భక్తిమార్గములు ప్రధానముగా భక్తుల ప్రవృత్తులకు సంబంధిం చినవి. ప్రక్రియలు సర్వభక్తులకు సామాన్యములయ్యును ప్రవృత్తి భేదముల చేత వానిని విశేషముగా భావించుటకు వీలగుచున్నది. ఉదాహరణమునకు కీర్తన రూపమైన భక్తిప్రక్రియా భేదమును భావించినచో జ్ఞానియైన ప్రహ్లాదుడు స్మరించు విధమునకును, మధురభక్తి సమేతలైన గోపికలు గోవింద గుణ కీర్తనము చేయు విధానమునకును, తామస ప్రవృత్తులైన వైరభక్తులు భగవం తుని స్మరించు విధానమునకును సహృదయులు భేదమును కనిపెట్టుట అత్యంత సులభము. జ్ఞానభక్తులు చేసెడి నామస్మరణము జిజ్ఞాసాప్రవృత్తి ముద్రితమై

తాత్త్వికానుభవ వ్యాఖ్యానరూపముగ సాగుచుండును. మధుర భక్తులు చేసెడి భగవన్నామస్మరణము బాహిరముగా శృంగార రసానుగుణమైన విప్రలంభ విస్ఫూర్తిని వెలార్చుచు నాయక సమాగమోన్ముఖమైన ఆర్తితో నాలపించుచు నామరూపగుణ కీర్తనముగ భాసించినను అది ఆధ్యాత్మిక భావముద్రిత మగుటచే దేహ స్పృహ లేచి జీవుని వేదనగా భాసించును. నాయికా నాయక భావగతమైన రతిభావ మాధుర్యము ఆధాత్మిక భావనాబంధురమై జీవాత్మ పరమాత్మ సంయోగాకాంక్షగా ఆ నామస్మరణమునందు రతి దీపించును. భక్తికి శృంగారము పోషకమై శృంగారమునకులేని పరిపూర్ణత్వము సంతరించి పెట్టును. అందువలన మధురభక్తి సర్వజీవ సామాన్యమైనది. దైవభక్తి విరోధమూలమై వైరభక్తునిచేత అహంకార ముద్రితమైన చిత్తవృత్తితో భగవంతుని స్మరించు ప్రవృత్తిని ప్రకటింపచేయుచున్నది. వైరుడైనను, మధురభక్తియుక్తుడైనను, జ్ఞానభక్తుడైనను స్మరణరూప భక్తి ప్రక్రియద్వారా పరమేశ్వరుని పొంద గలడని భాగవతము ప్రతిపాదించుచున్నది.

భాగవతమునందు గోపికలు మధురభక్తికి ఆలవాలములు. దశమ స్కంధమునందు గోపికలు శ్రీకృష్ణుని శరదాద్రులయందు అన్వేషించు ఘట్టమునందు గోపికాగీతములయందును, రాసక్రీడ, జలక్రీడాభి వర్ణనములందును మధురభక్తి మహనీయముగా దర్శింప వీలగుచున్నది. శ్రీకృష్ణుడు అవతారపురుషుడయిన సగుణ బ్రహ్మముగ గోపికలు భావించిరి. పరమాత్మాంశ పురుషాకారమును భజించి భూతలమునందు విహరించుచు తన దైవ విభూతిని ప్రకటించుటయే శ్రీకృష్ణావతార తత్త్వము. పరమాత్మ తేజస్సు అవతార మూర్తియందు తేజోమయముగా వెలుగుచుండుటచే ఆ రూపము చూపరులకు హృదయాకర్షకముగ నుండుట సహజము శ్రీకృష్ణుని రూపము భౌతికముగా మోహనము. ఆధ్యాత్మికముగా ఆత్మానంద సంధాయకము. లోకమున అందమైన ఆకృతులుండవచ్చును. అవి చూపరుల హృదయములకు అహ్లాదము కలిగింపవచ్చును. ఆ అహ్లాదము ఇంద్రియముల కొరక ఉత్తేజమును కలిగించి అనుభవముకొఱకై వానిని అర్రులు సాచునట్లుగా చేయవచ్చును. అందమును భౌతికముగా ననుభవించెడి కోర్కె చూపరుల హృదయము లందు రేకెత్తింపజేయునది మోహన సౌందర్యము. సౌందర్యము నందలి భగవదంశము భావించిన పారవశ్యముతో భజించునట్లు చేయునది కళాసౌందర్యము. సౌందర్య

మునే భగద్విభూతిగ భావించి ఆత్మోన్నత్యమునకు అనువైన సోపానముగా మలచుకొనునట్లు చేయునది ఆధ్యాత్మిక సౌందర్యము ఇట్లు సౌందర్యము మూడు విధములై క్రమముగా ఇంద్రియానందము, రసానందము, బ్రహ్మా నందము కలిగించునట్టివి యగుచున్నది. శ్రీకృష్ణావతారమునందు గోపికలు సౌందర్యమునే సాక్షాత్ బ్రహ్మముగ భావించు నాధ్యాత్మిక రతిని ప్రపంచించుట భాగవతమునందు సహృదయ హృదయైకవేద్యము.

భాగవతమున జ్ఞానులైన యోగులు భగవంతునియందు పచరించు రతి భావమునకును, గోపికలు శ్రీకృష్ణునిపట్ల పచరించెడి భక్తిభావమునకును తత్త్వ పరమైన తాత్పర్య మొక్కటియే యైనను ఆయా పాత్రల యవస్థలనుబట్టి భేదము కానవచ్చును. గోపికలు స్త్రీలు. అందును గృహిణులు. కృష్ణుడు పురుషుడు, భగవదవతారమూర్తి. గోపికలు శ్రీకృష్ణుని యందు పచరించునది భౌతిక రతిభావమైనచో దానివలన కలుగునది శృంగార రసము కాకపోగా రసభంగమగును. అధర్మ శృంగారమందలి అనౌచిత్యమే యట్టి రసభంగము నకు హేతువు. కాని, భాగవతమందట్టి రసభంగ ప్రసక్తి లేదు.

ఉ. 'అంగజునైనఁజూడ హృదయంగముఁడై కరఁగించువాఁడు శ్రీ
రంగదురంబువాఁడు మధురంబగు వేణురవంబువాఁడుమ
మ్మంగజుపువ్వుఁదూపులకు నగ్గము సేసి లవంగలుంగ నా
రంగములార! మీకడకురాఁడు గదా! కృపనున్న జూపరే!'

(భాగ.ద. పూ. 112)

ఈ పద్యమునందు ఒక వనిత గోపికలను శ్రీకృష్ణుడు మన్మథ పుష్ప బాణముల కగ్గము చేసెనని లవంగలుంగాది వృక్షములతో మొరపెట్టుకొనినది. మన్మథబాణ ప్రేరితమైనది భౌతిక రతియే కావలెను. అట్టి రతిభావముతో తనను సమీపించిన గోపికలను శ్రీకృష్ణుడు అది ధర్మము కాదని వారించును. అప్పుడు గోపికలిచ్చిన సమాధానము కూడ గమనింపదగినది:

మ. 'పతులన్ బిడ్డల బంధులన్ సతులకుం బాటించుటే ధర్మప
ద్ధతి యౌనంటివి; దేహధారిణులకున్ ధర్మజ్ఞ! చింతింపుమా
పతి పుత్త్రాదిక నామమూర్తి వగుచున్ భాసిల్లు నీ యందుఁద
త్పతి పుత్త్రాదిక వాంఛలన్ సలిపి సంభావించుటన్యాయమే'

(భాగ.ద.పూ. 988)

త్తకోకిలము. 'సీపయిన్ రతి సేయుచుందురు నేర్పరుల్; సతతప్రియో
ద్దీపకుండవు; గాన నెవ్వగఁదెచ్చు నాథసుతాదులం
జూప నేటికి: మన్మహాశలు సుట్టి నీకడనుండఁగాఁ
బాపనేల? మదీయ తాపముఁ బాపఁబోలుఁ గృపానిధీ! (భాగ.పూ. 989)

ఈ పద్యములలో గోపికల రతి స్వభావము వ్యాఖ్యానింపబడుచున్నది. ి పుత్త్రి బంధు సతులను వారికుచితమైన ధర్మము ననుసరించి సేవించుట ిక ధర్మము. వారిపట్ల పచరించు రతిభావము లౌకికము, హార్దికము. రందరి యందును జీవతేజముగ వెలుగొందు పరమాత్మ భౌతికాకారముతో వతరించి యున్నపుడు అతనియందు పచరించు రతి వత్సల ప్రేయో భావా ులు భౌతికములయ్యు భౌతిక స్వభావములేని ఆధ్యాత్మికతను భజించుచున్నవి. ి తారతమ్యమును సూచించుచు రెండవ పద్యమునందు గోపికలు భౌతికము గు రత్యాదిభావములు సుఖ దుఃఖాత్మకములైన అనుభవముల నందించి ిపమును పెంచునని శ్రీకృష్ణ గతమైన ఆధ్యాత్మిక రతి ఆనందవర్షిణియై త్త తాపోపశాంతిని కలిగించుననియు నిర్దేశించిరి. ఈ భేదము తెలియనిచో ిపికలు అభిసారికల వలెను శ్రీకృష్ణుడు విటుని వలెను భాసించు నవకాశము లదు. గోపికలకు సంసారము ఇంద్రియానుభవ కేంద్రము. సుఖదుఃఖములు ినికి ఫలములు. తాపము కలిగించుట దాని స్వభావము. తాపము దేహ క్షణము కాదు. ఆత్మవేదనము విషయ సుఖాగ్నిచే కరిగి ద్రవించిన హృదయ ావము తాపము. ఈ తాపమును చల్లార్చు కరుణా వర్షమును కురిపింపగల వ్యసిలాభ్రము శ్రీకృష్ణుడు. మానవాకృతిలోనున్న మాధవుని గూర్చి ఆత్మా ందము నర్థించుచున్న మానవతులయిన గోపికలు యోగులవలె తపము చేసిన ిరు కారు. ఆర్తితో భగవంతు నన్వేషించినవారు గోపికలు. వారి హృదయ మతియే ఆర్తి, గృహిణులైన గోపికలు తనువును మనమును పతికర్పించెడి తి భావమును గార్హస్థ్య జీవితమునందు సాధించినవారు. ధర్మనిష్ఠమైన ంపతి ప్రణయము వారి ఆధ్యాత్మిక రతికి అడ్డము రాదు; రాలేదు. గార్హస్థ్య ర్మమునందు సతీపతులు ధర్మార్థకామములను కలసి నిర్వహింతురు. కాని, ాక్షప్రాప్తియందు ఎవరిత్రోవ వారిదే. గోపికలు శ్రీ కృష్ణునినుండి అర్థించి ది ధర్మార్థకామములు కావు. మోక్షమే వారి చిరవాంఛితము. సంసారసంగ రిత్యాగమే మోక్షమునకు హేతువు. అనవరత భగవత్ చింతనమే మోక్ష

సాధన ప్రవృత్తి. సగుణ బ్రహ్మమునందు నిర్గుణబ్రహ్మమును తెలిసికొనుటయే జ్ఞానరూపమైన మోక్షసిద్ధి. గోపికలు శ్రీ కృష్ణుని వేణుగానము వినినపుడు వారిలో జాగృతమైన భగవద్రతి మోక్షోన్ముఖమైన పుణ్యవాసనల ప్రకృష్టస్థితి. శ్రీకృష్ణుని కొరకై అన్వేషించుచు యమునానదీతీర వనవాటికలయందు హవిరించుట ప్రకృతియందు ప్రకృతికంటే భిన్నుడైన పరమాత్మను గురించిన సంతత చింతనము. శ్రీకృష్ణుని గురించిన ఆర్తి మోక్షమును గురించిన నిర్వేదము వంటిది. ఇట్టి నిర్వేదము సగుణబ్రహ్మము నాశ్రయించుటచే శ్రీకృష్ణుని యొక్క రూపనామ గుణవైభవములను రమించినది. నిర్గుణ బ్రహ్మమునందు కొనబోవు జీవాత్మ సగుణబ్రహ్మమును జూచి రమించుటయందే మాధుర్యముట్టిపడుచున్నది. తత్త్వజ్ఞానముకంటే క్రిందిమెట్టు రూపారాధనము. గోపికలు శ్రీకృష్ణుని రూపమునందలి భౌతికత్వమును వరించుటలేదు. కాని, భౌతికమైన ఆకృతిని భజించిన భగవతత్త్వము నారాధించుచున్నారు. చూచెడిది, కీర్తించెడిది, అర్పించెడిది, క్రీడించెడిది శ్రీకృష్ణుని భౌతికమైన ఆకృతివలె భాసించినను గోపికలకు శరీర స్పృహలేదు. మమత్వములేని మమకారము యొక్క స్వరూపమటువంటిది. శరీరములతో తిరుగుచున్నను శరీరాభిమానము లేనివారు గోపికలు. ఇంద్రియములతో అన్వేషించుచున్నను అంతఃకరణ చైతన్యమే ప్రధానముగా గలవారు గోపికలు. కోర్కెతో శ్రీకృష్ణుని వేడుచున్నను కోర్కెలనన్నింటిని పోగొట్టు కోర్కెకలవారు. శ్రీకృష్ణుని ఉనికిగూర్చి చెట్లను గుట్టలను అడిగిన గోపికలు ప్రకృతిలో లీనమైయున్న పరమాత్మ తేజమును అన్వేషించు అంతరాత్మలు. శ్రీకృష్ణునితో జలక్రీడలాడిన గోపికలు భక్తిరసానుభవమును భగవద్రూప ముద్రితముగ పొందిన భక్త చిత్తములు. శ్రీకృష్ణునితో క్రీడించిన గోపికలు విషయాతీతముగ పరమాత్మతో మధురాద్వైతమును బొందిన యోగసిద్ధులు. ఈ భక్తిలోని మాధుర్యము జీవాత్మ పరమాత్మల అద్వైతసిద్ధి. స్త్రీ పుంసయోగ రూపమైన లౌకిక రతికి ప్రతిబింబముగనే భావించుచు ఇంద్రియాతీతమైన ఆధ్యాత్మిక రతి యనుభవించుట యని చెప్పవచ్చును. ఒక్కమాటలో చెప్పవలసినచో భగవ ద్రతిలోని రతియే మధురము. దానియందలి శృంగార స్పర్శ దివ్యానుభూతికి సోపానము. ఇట్లు చిత్రించెడి యీ విచిత్రమైన మార్గము వనితలైన గోపికలకే కాదు వారి చిత్తవృత్తులందు సంవదించెడి భక్తులెల్లరికి స్త్రీ పురుషభేదములేకయే మధురభక్తి రసానుభూతి విశ్వజనీనముగా అనుభవైకవేద్య మగుచున్నది.

శ్రవణాది భక్తిభేదములన్నియు మధురభక్తియందు ప్రవర్తిల్లును :

మధురభక్తి ప్రవృత్తినిబట్టి పెట్టిన పేరంటిమి. శ్రవణాది ప్రక్రియలన్నియు దీనియందు ప్రవర్తిల్లుచు భగవద్రతిభావస్థాయికి పోషకములగుచున్నవి.

భాగవత కథారంభమునందు శ్రోతలైన శౌనకాది మహామునులు విష్ణుకథాకర్ణనము సేయుటయందాసక్తులై శ్రవణమహాత్మ్యము నుగ్గడించినారు. శ్రోతృ చిత్తవృత్తి యందలి శ్రవణాసక్తి భాగవత కథాశ్రవణమందంతటను వ్యాపించియుండుటచే పురాణశ్రవణమంతయు శ్రవణభక్తి కుదాహరణమగుచున్నది. శ్రవణభక్తియందు మాధుర్యమంతఃసూత్రముగా ప్రవహించు ననుటకి క్రింది పద్యము సాక్ష్యము.

ఆ. 'అనఘ విను రసజ్ఞులై వినువారికి
మాటమాట కధిక మధురమైన
యట్టి కృష్ణుకథన మా కర్ణనముసేయఁ
దలఁపుగలదు మాకుఁ దనివిలేదు.' (భాగ 1-48.)

ఇందు 'రసజ్ఞులై వినువారికి' యని యనుట గమనింపదగినది. భాగవతము వినెడి శ్రోతలు రసజ్ఞులై యుండవలయుననియు వినువారికి రసము ఫలమనియు పై మాటల తాత్పర్యము. అనగా భాగవతశ్రవణఫలము భక్తిరసానుభవమేయనియు ఆ భక్తిరసమును గుర్తించెడి విధమును శ్రోతలు తెలిసియుండవలయుననియు పై పదముల భావము. కృష్ణగాథాప్రపంచము మాటమాటకును అధిక మధురమైనదని పైపద్యమున మరియొక వాక్యము కలదు. సూక్ష్మముగా నాలోచించినచో శ్రవణమునకు ఫలము కృష్ణవృత్తాంతమునందలి మాధుర్యము. అనగా శ్రవణభక్తి శాఖ మాధుర్యమునందు లయించుననుమాట. ఇట్లు లయించుటకు కృష్ణకథాశ్రవణాసక్తియే స్థాయి. 'ఆకర్ణనముసేయ తలపుగలదు మాకుఁ దనివిలేదు' అను వాక్యమునందు భాగవత శ్రోతృచిత్తమునందలి ఆసక్తిమూలమైన చిత్తరతి తనివితీరని ఉత్కటావస్థను వహించి స్థాయియై మధుర రసానుభవమును కలిగించునని తేటపడుచున్నది. శ్రవణప్రక్రియ నాశ్రయించి మధురప్రవృత్తి రసత్వమును భజించుట శ్రవణభక్తి రసానుభూతి.

శ్రవణ భక్తితత్త్వమునిట్లు ప్రవచించి దాని మాహాత్మ్యమును మరిరెండు పద్యములలో విస్తరించుట శ్రవణ భక్త్యంకురమును నాటి పల్లవింపజేయుట.

మ. 'వరగోవింద కథా సుధారస మహా వర్షోరు ధారాపరం
పరలం గాక బుధేంద్ర చంద్ర! యితరోపాయానురక్తిం బ్రవి
స్తర దుర్దాంత దురంత దుస్సహజ సుస్సంభావితానేకదు
స్తర గంభీర కఠోర కల్మషకన ద్దావానలం బాఱునే?' (భాగ 1-49)

సీ. 'హరినామకథన దావానల జ్వాలచేఁ
గాలవే ఘోరాఘ కాననములు
వైకుంఠ దర్శనవాయు సంఘంబుచేఁ
దొలఁగవే భవ దుఃఖ తోయదములు
కమలనాభ ధ్యాన కంఠీరవంబుచేఁ
గూలవే సంతాపకుంజరములు
నారాయణ స్మరణ ప్రభాకర దీప్తిఁ
దీఱవే షడ్వర్గతిమిరతతులు

ఆ. నలిన నయన భక్తి నావచేఁగాక సం
సార జలధి దాఁటి చనఁగ రాదు
వేయునేల మాకు విష్ణు ప్రభావంబు
దెలుపవయ్య సూత! ధీసమేత!' (భాగ 1-50)

ఆలంకారికమైన యభివ్యక్తియందు రచింపబడిన పై రెండు పద్యములలో కథాసుధారసము మహావర్షధారావరంపరలుగా రూపించుట యొక విశేషము. భాగవతమునందు భక్తిరసవర్ష ప్రసక్తి పైరూపకాలంకార ముదాహరణము. రసరూపమైన భక్తి అనురక్తిచే ప్రవృద్ధమై కల్మష దావానలము నార్పి, పుణ్యమును, శాంతిని కలిగించునని పై మత్తేభవిక్రీడితము వ్యాఖ్యానించుచున్నది. సీస పద్యమునందు నామశ్రవణము, దర్శనము, ధ్యానము, స్మరణము అనునవి భవసాగర జలధిని దాటించు విష్ణుభక్తి విశేషములని వ్యాఖ్యానించు చున్నది. శ్రవణమునుండి దర్శనము, అపై ధ్యానము, అపై నిత్యస్మరణము కలిగి, శ్రవణము అవస్థాంతరాత్మకమై రసస్థితి నందుననియు పై పద్యమువలన స్ఫుటమగుచున్నది. వీనియందు ప్రవచింపబడిన భక్తిమాహాత్మ్యము రూపగోస్వామి నిర్వహించిన భక్తిస్వరూపమును తలపింప చేయుచున్నది.

'క్లేశఘ్నీ శుభదా మోక్షలఘుతాకృత్ సుదుర్లభా
సాంద్రానంద విశేషాత్మా శ్రీకృష్ణాకర్షణీచసా॥'

(భ. ర. సిం. 1.1.13)

ద్వితీయ స్కంధమున శుకుడు పరీక్షిత్తునకు భక్తిమార్గ ప్రాముఖ్యము తెలుపుచు మోక్షమార్గములన్నిటికంటె భక్తి మార్గము సులభతరమనియు అందును శ్రవణము మోక్షానుకూలమైన మృదు మార్గమనియు పేర్కొనుట భాగవత కథాశ్రవణ ఫలమును వ్యంజింప జేయుచున్నది.

సీ. 'అఖిల భూతములందు నాత్మరూపంబున
నీశుండు హరియుండు నెల్లప్రొద్దు
బుద్ధ్యాది లక్షణంబులఁగానఁబడును
మహాత్మేవనీయుఁ డహర్నిశంబు
వందనీయుఁడు భక్తవత్సలుం డత్యంత
నియతుఁడై సతతంబు నియతబుద్ధి
నాత్మరూపకుఁడగు హరికథామృతమును
గర్ణపుటంబులఁ గాంక్ష దీరఁ

తే. గ్రోలుచుండెడు ధన్యులు కుటిలబహుళ
విషయ మలినీకృతాంగముల్ వేగవిడిచి
విష్ణుదేవుని చరణారవింద యుగము
కడకుఁజనుదురు సిద్ధంబు కౌరవేంద్ర!' (భాగ 2-36)

హరికథా శ్రవణ సమయమునందు శ్రోతలు సాకారుడైన శ్రీకృష్ణ బ్రహ్మమును అతని లీలలను విని, భావించి, అనుభవించుట భక్తిరసమగును. అందు మాధుర్యదీప్తికి అవకాశ మధికముగా నుండును. అఖిల భూతములందు ఆత్మరూపమున వ్యాపించియున్న విష్ణువు నిర్గుణుడయ్యును తద్విభూతిచే వివిధా కృతులయందు భాసించును. రూపవిభూతిని భావించి హరికథామృతమును సేవించుట జ్ఞానగమ్యమైన విషయము. సూతుడు చెప్పిన శ్రవణము సగుణ భక్తికి నిదర్శనము. శుకుడు పేర్కొనిన శ్రవణము నిర్గుణభక్తికి ఉపాదేయము. శ్రవణభక్తి యీ రెండు మార్గముల నాశ్రయించి హరిని పొందుచున్నది. హరిని పొందుటయందలి భక్తచిత్తప్రవృత్తి మధురమై భాసించుచున్నది. ఇట్లు శ్రవణము మధురానుభూతికి సాధనమనుట నిర్వివాదాంశము.

శ్రవణమునందు సాక్షాత్ భగవత్ దివ్యకథా శ్రవణమువలన కలిగెడి యనుభవము మరియొక యెత్తు. భాగవత తృతీయ స్కంధమునందు 'వనజోదర పాదభక్తివశ మానసుడై' విదురుడు మైత్రేయునితో స్వాయంభువ మను వృత్తాంతము వినిపింప వేడుకొనెను. అతని మతము వలన 'ముకుందుని పద కమల మరంద పానపరవశులై పెంపొందవిను వారి చరిత్రము సదమలమతి వినిన భవము సఫలముకాదే' (భాగ 3-392) యనియు-

—'శ్రుతిశాస్త్ర పాఠకలితాత్మకుఁడైన నరుండు పద్మలో
చనచరణారవిందయుగసంగము గల్గిన సజ్జనుండు వొం
దిన ఫలమొందు భాగవత దివ్యకథాశ్రవణానురక్తిచేన్'

(భాగ 3-393)

అని వివరింపబడినది. విదురుని మాటలకు మైత్రేయుడు పులకాంకిత గాత్రుడును, ఆనందబాష్పసమేతుడునునై సాత్త్వికభావసంపదను వెలార్చెను.

కం. 'అనిచెప్పి మునికులాగ్రణి
దనుజారి కథాసుధాప్లుతస్వాంతుండై
తనువునఁబులకాంకురములు
మొనయఁగ నానంద బాష్పములు జడి గురియన్' (భాగ 3-394)

వినిపింప దొడగెనట!

ఈ ఘట్టమునందు ఒక విశేషము కలదు. విష్ణుకథలు చెప్పువానికిని, వినువానికిని అనుభవము సమానమగుట సామాన్యము. కాని, కథకునియందు స్మరణరూపమున మనోవీథియందు మొదట శ్రుతమగును. తత్కథా భావభావనమునందు అతడు తన్మయత్వమును భజించును. కథకుడా తన్మయముతో శ్రోతకనురక్తిని క్రమముగా ఆసక్తిని ఆపైన తాదాత్మ్యమును కలుగునట్లు కథలు చెప్పును. ఈ ఘట్టమున విదురునియందు భాగవత కథాశ్రవణానురక్తి ఘోటమరించినది. దానిని వర్ణించి చెప్పినాడు. దానిని వినిన కథకునకు సాత్త్విక భావోదయమైనది. ఇదియొక విధముగా శ్రవణానురక్తి కలిగిన శ్రోతను గాంచిన కథకునికి విభావానుజన్యమైన సాత్త్విక భావముగా పరిగణింప వచ్చును. శ్రీ రూపగోస్వామి సాత్త్వికభావములను వివరించుచు రోమాంచాదులను రూక్షసాత్త్విక భావములుగా పేర్కొనెను. మైత్రేయుని తనువున మొల

చిన పులకాంకురములు కన్నులయందు జాలువారిన ఆనందబాష్పములు ఆట్టి రూక్ష సాత్త్వికభావములకు ఉదాహరణము. శ్రీకృష్ణుని గూర్చి మధురము లయినవియును ఆశ్చర్యకరములయినవియును మాటలు వినగానే భక్తుని హృదయమున కలుగు ఆనందమే రూక్షసాత్త్విక భావమని రూపగోస్వామి వివరించి యున్నాడు. అది భగవత్ కథాశ్రవణము నందెంత సత్యమో భాగవత కథా శ్రవణమునందును అంత సత్యమే యగునని ఈ సన్నివేశము వ్యంజింపజేయు చున్నది.

**రుక్మిణీ కల్యాణము :-** శ్రీమద్భాగవతమునందు శ్రీకృష్ణ గుణ శ్రవణమువలన నతనియందు అనన్యాభిలాష జనించి అతనినే పతిగా పొంద వలయుననెడి రతిభావమును భజించి తద్రతిని భక్తిని పోషకముగా నను సంధించుకొని రాక్షస వివాహ ధర్మము నాశ్రయించి శ్రీకృష్ణుని పొందిన రుక్మిణీదేవియొక్క చరిత్రము శ్రవణభక్తితో మొదలై మధురభక్తిగా పరిణ మించిన మహనీయగాథ. రూపగోస్వామి 'అన్యాభిలాషితా శూన్యం' అని భక్తికి మొదటి లక్షణమును పేర్కొనెను. శ్రీకృష్ణునియందు తప్ప అన్య విషయములందు దేనియందును అభిలాషలేకుండుట భక్తికి ప్రథమ లక్షణము. దీనిని పోతన రుక్మిణి శ్రీకృష్ణున కంపిన సందేశమునందలి మొదటి పద్యము నందు మధురభక్తి దీపకముగా వర్ణించెను.

సీ. ఏనీగుణములు కర్ణేంద్రియంబులు సోఁక
దేహతాపంబులు దీఱిపోవు
నేనీశుభాకార మీక్షింపఁ గన్నుల
కఖిలార్థలాభంబు గలుగుచుండు
నే నీచరణసేవలే ప్రొద్దుఁ జేసిన
భువనోన్నతత్వంబుఁ బొందగలుగు
నే నీలసన్నామ మేప్రొద్దు భక్తితోఁ
దడవిన బంధసంతతులువాయు
తే. నట్టి నీయందునా చిత్త మనవరతము
నచ్చియున్నది నీయాన నానలేదు
కరుణఁ జూడుము కంసారి! ఖలవిదారి!
శ్రీయుతాకార! మానినీ చిత్తచోర! (భాగ. ద. పూ. 1703)

ఃపద్యమునందు 'నీయందు నా చిత్తమనవరతము నచ్చియున్నది' క్యము రుక్మిణీహృదయగత అభిలాషను వ్యంజింపజేయుచున్నది. లాష శ్రీకృష్ణరతికి ఆయుస్సూత్రము. ఇది 'అతిథి జనులవలనఁ హపబలగుణాదులు' వినుటవలన నేర్పడినది. 'కృష్ణుడు దనకుఁ దగిన తలచుటచే స్థిరపడినది. అనగా అభిలాషా మూలకమైన శ్రీకృష్ణరతి ్యాణ వృత్తాంతమునందు స్థాయిభావమని స్పష్టమగుచున్నది. సీస ందలి నాలుగుచరణములందు క్రమముగా శ్రవణము, వీక్షణము, , నామస్మరణము-అనునవి పేర్కొనబడుటయేగాక యవి భక్తి రసము పవర్తిల్లునపుడు ప్రసాదించెడి పుణ్యఫలములను కూడ నిర్దేశించు ఇట్టి వర్ణనము శ్రీకృష్ణాయత్తమైన రతి మధురస్వభావమును సంత శ్రవణాది భక్తి ప్రవృత్తులలో అంతర్లీనముగా ప్రవహించి రసస్థితిని ెడి తత్త్వమును వ్యాఖ్యానించుచున్నది.

ద్రుతచిత్తే ప్రవిష్టాయా గోవిందాకారతాస్థిరా
ంభక్తి రిత్యభిహితా'[9]

ుసూదన సరస్వతి నిర్వచనము ప్రకారము రుక్మిణీదేవి ముునందు ప్రవేశించిన శ్రీకృష్ణాకారతయే స్థాయిగా రుక్మిణీ కల్యాణ ందు భావించుట సుకరమము. చిత్త ద్రవీభావమునకు అనేక కారణము పేర్కొనుచు భక్తి రసాయనకర్త కామము ప్రధానమైనదిగా పేర్కొ

కామః శరీర సంబంధ విశేష స్పృహయాలుతా'[10] యని నిర్వచించెను ్ధాన, అసన్నిధాన భేదములచే రెండు విధములనియు-

తజ్జ న్యాయాం ద్రుతౌ చిత్తే యాస్యా త్ప్రీ కృష్ణనిష్ఠతా
ంభోగ విప్రయోగాఖ్య రతిః సాసాక్రమాద్భవేత్"[11]

ర్కొనుట వలన శ్రీకృష్ణనిష్ఠమైన కామముచే చిత్తము ద్రవీ పుడు శ్రీకృష్ణ సాన్నిధ్యమే సంభోగమనుగను, శ్రీకృష్ణుని అసాన్ని వలంభముగను వివేచింప వీలగుచున్నది.

శా. 'ధన్యున్ లోకమనోభిరాము, గులవిద్యారూప తారుణ్యసౌ
జన్యశ్రీ బలదాన శౌర్య కరుణా సంశోభితున్ నిన్నునే
కన్యల్ గోరరు కోరెదేమును రమాకాంతాలలామంబురా
జన్యానేకపసింహ! నావలననే జన్మించెనే మోహముల్'

(భాగ. ద.పూ. 1704)

శ్రీ కృష్ణ గుణరూప విభావాదులను విని యాతనిని విభునిగా నిశ్చయించుకొని అతని యందలి రతిచే అనగా మధుసూదనాది లాక్షణికుల పరిభాషలో కామముచే ఆమె చిత్తము ద్రుతస్థితిని భజించినది. అట్టి ద్రవస్థితికి కారణమైన కామమును 'నా వలననే జన్మించెనే మోహముల్' అను వాక్యమున పోతన పతాకగా నిల్పినాడు. రూపగోస్వామి పూర్వరాగమునకు సంబంధించిన వివేచనము రుక్మిణీ కథార్థములందు అనువుగా అన్వయించుచున్నది. వందులు దూతలు, సఖులు చేసెడి స్తుతులవలనగాని, పాడెడి గీతముల వలనగాని శ్రీ కృష్ణుని గుణగణములను విని శ్రవణానందము పొంది తద్రతిని భజించుట శ్రవణము. శృంగారము నందు నాయిక పూర్వానురాగ విప్రలంభము భజించినట్లే భక్తుడు భగవద్రూపమైన రతిని భజించునని రూపగోస్వామి వివరించెను. ఈ వివేచనము భాగవతము నందలి రుక్మిణి వెలువరచిన పూర్వరాగావస్థకు సమన్వయింపవచ్చును.

సీ. 'ప్రాణేశ! నీ మంజుభాషలు వినలేని
కర్ణరంధ్రంబుల కలిమియేల
పురుషరత్నమ! నీవు భోగింపగాలేని
తనులతవలని సౌందర్యమేల
భువనమోహన! నిన్నుఁ బొడగానఁగాలేని
చక్షురింద్రియముల సత్త్వమేల
దయిత! నీ యధరామృతం బానఁగాలేని
జిహ్వకు ఫలరససిద్ధి యేల

ఆ. నీరజాతనయన! నీ వనమాలికా
గంధ మబ్బలేని ఘ్రాణమేల
ధన్యచరిత! నీకు దాస్యంబు సేయని
జన్మమేల? యెన్ని జన్మములకు?' (భాగ. ద. పూ. 1710)

అను సీసపద్యమునందు రుక్మిణీదేవి నాయకుని తనూభాగ్యమును వాంఛించుచుండుట స్పష్టము. జ్ఞానేంద్రియ కర్మేంద్రియాదుల తృప్తి శ్రీకృష్ణ సంయోగము వలననే కలుగునని యెంచుట ఈ పద్యములోని తాత్పర్యము. అనగా కామము వలన ద్రవించిన చిత్తమునందు భగవద్రూపమైన రతిసంయోగాకాంక్షియై ప్రవర్తిల్లుటచేత రూపగోస్వామి చెప్పిన శ్రవణ జన్యమైన పూర్వ రాగమునకు మధుసూదన సరస్వతి చెప్పిన కామజన్యమైన చిత్తద్రుతికి ఉదాహరణముగా నిలుచున్నది. ఇందు శ్రవణము పూర్వరాగమును ఉదయింపించి పెంపొందింపజేయునను లాక్షణికవచనము రుక్మిణీపాత్రయందు అనువర్తత మగుచున్నది. మరికొంత విశ్లేషించి చూచినచో రుక్మిణి పూర్వరాగము ఉజ్జ్వల నీలమణి కర్తచెప్పినట్లు సమంజస పూర్వరాగముగా సమన్వయించుటకు వీలుగా నున్నది.

పై సీసపద్యమునందు మరియొక విశేషము గమనింపదగియున్నది. శ్రవణము, కీర్తనము, సేవనము, అర్చనము, దాస్యము మొదలైన భక్తి చిత్త వృత్తులు పైవాక్యములలో ధ్వన్యమానములగుచున్నవి. అనగా శ్రవణాది భేదములన్నియు శ్రీకృష్ణ దివ్యరూప రతియందు మాధుర్యమును సంతరించుకొని మాధుర్యమును సంతరించుకొని మధురభక్తిని పోషించుచున్నవన్నమాట. రుక్మిణీ కల్యాణమునందు శ్రవణము రతికి ప్రేరణము. తదితరములైన భక్తులు రతికి పోషకములు. మధురభక్తి రసము.

రూపగోస్వామి 'స్థాయి భావోఽత్ర శృంగారే కథ్యతే మధురారతి' శృంగారమునందలి మధుర రతియే మధుర రసమునకు స్థాయియని పేర్కొనుచు మధురరతి అభియోగము, విషయము, సంబంధము, అభిమానము, ఉపమ, స్వభావము మున్నగువానివలన కలుగుననియు వానిలో ఉత్తరోత్తరములు శ్రేష్ఠములనియు స్వభావమువలన కలుగు రతి ఉత్తమోత్తమమని పేర్కొనిన యంశములు గమనించినచో రుక్మిణీ పాత్రయందలి మధురరతియే మధురభక్తికి స్థాయిభావము ఆమెయందలి మధురరతి స్వభావమువలన కలిగినది కావున ఉత్తమోత్తమము. ఇతర కారణముల నపేక్షింపక స్వయముగా ప్రకాశించు ఆత్మ ధర్మము స్వభావమని రూపగోస్వామి నిర్వచించెను. రుక్మిణియందు ఇట్టి స్వభావము ఉజ్జ్వలనీలమణివలె సహజముగా ప్రకాశించినది. రుక్మిణీకల్యాణ కథయందు మధుర రతి నాయికానిష్ఠమేకాక నాయకుని యందును పరిపోషింపబడుట్క విశేషము-

ఉ. 'కన్నియమీఁద నాతలఁపు గాఢము; కూరుకురాదు రేయినా
కెన్నఁడు; నా వివాహము సహింపక రుక్మిదలంచుకీడు; నే
మున్నె యెఱుంగుదుం; బరులమూఁక వధించికుమారిఁదెత్తువి
ద్వన్నుత! ప్రమానుద్రచ్చినవవహ్నిశిఖన్ వడిఁదెచ్చుకైవడిన్'
(భాగ.ద.పూ. 1715)

యస్యాయా దృశజాతీయః కృష్ణే ప్రేమాభ్యుదంచతి
తస్యాం తాదృశ జాతీయః సకృష్ణ స్యాప్యుదీయతే॥ (ఉ.నీ. 14.56)

అని రూపగోస్వామి నిర్దేశించిన ఉభయనిష్ఠమైన యనురాగము రుక్మిణీ శ్రీకృష్ణులకు అన్వర్థము. రుక్మిణిది మధుసూదన సరస్వతి పేర్కొనిన ప్రౌఢ ప్రేమ, ఉత్తమస్నేహప్రేమ. వియోగమును సహించలేనిది ప్రౌఢప్రేమ. శ్రవణమాత్రముననే మనసు ద్రవించునని ఉత్తమ స్నేహప్రవృత్తి.

రూపగోస్వామి సమంజస పూర్వరాగమునందు నాయిక దశావస్థలను పొందినట్లు వర్ణింప వచ్చునని పేర్కొనెను. అభిలాష, చింత, స్మృతి, గుణ కీర్తనము, ఉద్వేగము, విలాపము, ఉన్మాదము, వ్యాధి, జడత్వము, మరణము అనునవి దశవిధావస్థలుగా పేర్కొనెను. పూర్వరాగమునందు దశవిధావస్థల ప్రవృత్తికి ఒక విశేషము కలదు. నాయిక నాయకుని చూడకపూర్వమే యామె పొందెడు విరహావస్థ పూర్వరాగమందు వర్ణితమగుచుండును. ఇది సమాగమా నంతర విప్రలంభముకంటె విశిష్టమైనది. శ్రీకృష్ణుని వివాహమాడగోరిన రుక్మిణి అమె అన్నచే శిశుపాలునికి దత్తమైనది. వివాహయత్నములు సాగు చుండినవి. రుక్మిణి తన మనోగత భావములను అగ్నిద్యోతనుడను బ్రాహ్మ ణుని ద్వారమున శ్రీకృష్ణునకు రాయబార మంపెను. లగ్నము సమీపించు చుండెను. బ్రాహ్మణుడింకను తిరిగిరాడాయెను. ఇట్టి తరుణమున రుక్మిణి యందు శ్రీకృష్ణుని చూడవలయుననియు, అతనిని పొందవలెననియు అభిలాష మిక్కుటమై అట్టి యదృష్టము కలుగునో కలుగదోయను చింతాక్రాంతచిత్త మయ్యెను. పూర్వరాగ విప్రలంభమునకు తగిన సన్నివేశమంతయు సన్నద్ధ మైన ఈ తరుణమున రుక్మిణియందు యథావకాశముగా పోతన యీ యవస్థ లను వర్ణించుట పూర్వరాగవిప్రలంభ పోషణార్థమే. ఇప్పట్టున పోతనగారి రచన వ్యంగ్యబంధురముగను, భావమధురముగను అత్యంత రమణీయముగా సాగినది.

రుక్మిణి యందు మొదట యంకురించినది శంక. దానికి యభిలాష మూలము.

'ఆలోకలోచనుఁడు హరియాలోకము చేసి కదియఁడని శంకితయై'

(ద. 1724)

అని పోతన యీ ఘట్టము నారంభించెను. అనగా హరి యామెను ఆలోకించుననియు, కదియుననియు నామె యభిలాషపడినదని భావము. ఆ యభిలాష వమ్మగునేమోయని యామె శంక. శంకవలన యభిలాష చింతగా మారినది.

'లగ్నంబెల్లి వివాహముం గదిసె నేలారాఁడు గోవిందుడు'

(భాగ. ద. పూ. 1025)

ఈ పద్యము చింతకు చక్కని యుదాహరణము. శంకించిన ఆమె హృదయము చింతాముద్రితమయ్యు శంకాసంకులితమైనట్లు చిత్రించుట ఈ పద్యములోని విశేషము. 'వినెనో వృత్తాంతమున్,' 'ఏటికిందడసె,' 'నా యత్నంబు సిద్ధించునో భగ్నంబైచనునో' మొదలగు వాక్యములన్నియు శంకానుప్రాణితమైన చింతను చెప్పక చెప్పుచున్నవి. 'విరించికృత మెబ్బంగిన్ ప్రవర్తించునో?' అను వాక్యము చింతావస్థకు పతాకగా నిలిచినది. 'ఉద్విగ్నం బయ్యెడి మానసంబు'[12] అనుటచే రుక్మిణియందు ఉద్వేగము వ్యంగ్యముగా సూచింపబడుచున్నది.

'ఘనుఁడా భూసురుఁడేఁగెనో'[13] యను ప్రసిద్ధ పద్యము శంకాముద్రితమైన చింతలో స్మృతి చివురు దొడిగినట్లున్నది. ఈ స్మృతికి పోషకము గాఢమైన అభిలాష. ఈ పద్యమునందు బ్రాహ్మణుడేగి శ్రీకృష్ణునికి తన మనవి వినిపించి ఆతడనుకూలుడగునట్లుగ సంధింపవలయుననియు; ఆ ప్రయత్నమునకు ఆర్యా మహాదేవి యనుగ్రహ ముండవలయుననియు, ఆమె యభిలాష. ఆ ఘట్టమునంతయు స్మృతి రూపమున శంకాముద్రితముగా తలపోయుట యీ పద్య వాక్యములోని భావశిల్పము. 'అని వితర్కించుచు' అను వచనము అభిలాష చింతాస్మృతులను ధ్వనింపజేయుచున్నది. 'పోఁడను బ్రాహ్మణుండు' అను పద్యము విలాపమను అవస్థకు విశిష్టమైన యుదాహరణము. శంకచే నేర్పడిన నిరాశవలన బ్రాహ్మణుడు యదుపీటికి పోడనియు,

వాసుదేవుడు రాడనియు, ఇకపై శ్రీకృష్ణుని పిలుచు బంధువు లేడనియు, రుక్మికి తగవు లేదనియు, గౌరికి కృప లేదనియు పల్కెడి వాక్యము లన్నియు విలాపముద్రితములైనవి. నిస్సహాస్థితిని వ్యక్తము చేయుచున్నవి. "చెప్పదు తల్లికిం .... తుడువదు కన్నులన్ వెడలు తోయ కణంబులు.... మృగనాభియలందదు....'[14] అను పద్యములలో వరుసగా రుక్మిణీ యొక్క జడత్వమును పరిణామ సుందరముగా పోతన చిత్రించెను. ఈ పద్యములు 'మలఁగున్ మెల్లనిగాలికిం' అను పద్యమునందు వ్యక్తీకరించిన ఉన్మాద ఉద్వేగావస్థలకు శ్రేణికలుగా నమరినవి. ఉత్పలమాలకంటె చంపకమాల ద్రుతగతి గలది. సీసము దీర్ఘమగు మానసికావస్థను వ్యక్తము చేయుచున్నది. ఆమెయందలి విప్రలంభము ద్రుతగతిని దీర్ఘతరమైనదని ఛందశ్శిల్పముచే పోతన ధ్వనింపచేసినాడు. ఉన్మాదావస్థను వ్యంజింపచేసి'కొమ్మ మనోభవానల శిఖాదోదూయమానాంగియై'[15] యని వర్ణించి మరణావస్థను కడు సుకుమారముగా పోతన సూచించినాడు. ఇట్లు పూర్వరాగ విప్రలంభమునందు ప్రవర్తిం చెడి దశవిధములైన యవస్థలలో దాదాపు ఎనిమిదింటిని సందర్భోచితముగా పోతన వర్ణించి శృంగారరసోన్నిద్రమైన మధురభక్తిని పఠితల హృదయము లందు పాదుకొనునట్లు చేసినాడు. 'నమ్మితి నా మనంబున సనాతనులైన'[16] అను ప్రసిద్ధ పద్యము రుక్మిణీకల్యాణఘట్టమున నొక ఉజ్జ్వల నీలమణి. రుక్మిణియందలి శ్రీకృష్ణగతమైన రాగమంతయు గౌరీదేవియందలి పరమభక్తి యందు లయించుట అనురాగసిద్ధికి భక్తియే మూలకందమని ధ్వనించుట ఈ పద్య సార్థక్యము. రుక్మిణియందలి రాగము భగవద్రూపరతిగాని భౌతిక సమాగమానులక్షితరతికాదనియు అందుచే నది ఉజ్జ్వలమైనదనియు, పతిని భక్తి ద్వారమున సాధించిన రుక్మిణి వృత్తాంతము చాటుచున్నది.

మధుర శృంగారమూర్తియైన శ్రీకృష్ణుని నాయకునిగా నిర్దేశించుచు రూపగోస్వామి అతని కష్టవిధ సద్గుణములుండుననియు, ఏకవిశంతి సామాన్య లక్షణములుండుననియు తన లక్షణ గ్రంథమున నిర్దేశించియుండెను. రుక్మిణీ కల్యాణ కథా ఘట్టమునందు ఆ లక్షణములన్నియు సూచ్యములై శోభించుచున్నవి. రుక్మిణి శ్రీ కృష్ణునియందు లగ్నమనస్కురాలగుటకు కారణము అతని రూప బల గుణాదుల శ్రవణము. రూపగోస్వామి పేర్కొనిన సద్గుణము లన్నియు గుణాదులలోనే అంతర్భవించును.

శా: ధన్యున్ లోకమనోభిరాము, గులవిద్యారూపతారుణ్యసౌ
జన్యశ్రీబలదాన శౌర్యకరుణా సంశోభితున్ నిన్ను నే
కన్యల్ గోరరు' (భా గ. పూ. ద. ప 1704).

అని సందేశమునందు పేర్కొనిన వాక్యములనుబట్టి శ్రీకృష్ణునియందు నాయకోచిత సాధారణ గుణములనియు ప్రకాశించుచుండుటవలన అతడు నారీమోహనునివలె రాణించుచున్నాడని స్పష్టమగుచున్నది. లోకమనోభిరాము డనుటచే మాధుర్యమును, ధన్యున్ అనుటచే అతనియందలి మాంగల్యలక్షణ మును, రూపతారుణ్యసౌజన్యశ్రీలచే విలాస తేజోలాలిత్యములను, విద్యాదులచే శోభయు, బలదాలచే స్థైర్యము, కరణాసంశోభితుడనుటచే ఔదార్యము శ్రీకృష్ణునియందు సహజగుణములుగా నొప్పారుచున్నవని స్పష్టమగుచున్నది. పై మాటలవలన నాయక సామాన్య గుణములలో శ్రీకృష్ణుడు సురముఖ్యు డనియు, నవయౌవనుడనియు, ధీరుడనియు, నారీమోహనుడనియు, అతుల కేళిసౌంధర్య రాశియనియు, ప్రీతి పాత్రుడనియు సూచింపబడుచున్నది.

'ఆ యధమాధముండెఱుగఁ డద్భుతమైన భవత్ప్రతాపమున్'17

అను మాటలచే శ్రేష్ఠుడని స్పష్టమగుచున్నది. 'కన్నియ మీఁద నా తలఁపుగాఢము'18 అను పద్యమునందు శ్రీకృష్ణుని మదుర సంభాషణా చాతు ర్యము, ప్రియంవదత్వము, ప్రేమదృశ వ్యజ్యమానములగు చున్నవి. 'వచ్చెద విదర్భ భూమికి' (భాగ. 1716) అను పద్యభావము శ్రీకృష్ణుని ధీరగుణము తెలుపు చున్నది. 'మెచ్చె భవద్గుణోన్నతికి'19 అను పద్యభావము ననుసరించి శ్రీకృష్ణుని చాతుర్యమును,కృతజ్ఞతా భావమును. సాగర గంభీరత్వమును పోతన వ్యక్తీకరించినాడు. కనియెన్ రుక్మిణి'20 అను పద్యము నాశ్రయించి శ్రీకృష్ణుని రూప వైభవము జగన్మోహనమని వర్ణితమైనది. ఇందు నిత్య నూతనత్వము వ్యంగ్యము. రుక్మి గర్వభంగ సన్నివేశమునందు అతని వైదగ్ధ్యము, అవలీలగా శత్రువులను జయించి రాక్షసవిధిచే రుక్మిణిని గైకొని వివాహమాడి సుఖంబున్న యెడ నాతని సుఖిత్వము, అతులకేళీ సౌందర్య శాలిత్వము, ప్రీతిపాత్రత్వము మొదలగు గుణములు వెలుగొందు చున్నవి. మొత్తమునకు రూపగోస్వామి చెప్పిన నాయక లక్షణము లన్నియు శ్రీకృష్ణునియందు వ్యంగ్య సుందరముగా సమన్వయించుట పోతన కవితా శిల్పమునకు పతాకయని పేర్కొనవచ్చును.

కం. 'ప్రియురాలివలని వార్తలు
ప్రియజనులకు నెల్ల ప్రొద్దుఁ బ్రియమగుభంగిం
బ్రియుఁడగు హరిచరితంబులు
ప్రియభక్తుల కెల్ల యెడలఁ బ్రియములుగావే'[21]

మధురభక్తి మహనీయోదాహరణ దశమస్కంధము. అందును గోపికల వృత్తాంతము. రూపగోస్వామియు మధుసూదన సరస్వతియు లాక్షణికముగా నిరూపించిన యంశములన్నియు దశమస్కంధమునందు లక్ష్యరూపముగా జారు వారినట్లు కన్పట్టును. ప్రత్యేకించి రూపగోస్వామి లక్షణ గ్రంథములకు ఆధార మైనది. గోపికావృత్తాంతమేకాక రాధామాధవ వృత్తాంతము కూడ ననియు స్పష్టము కాగలదు. ఆంధ్ర భాగవతమునందు రాధ ప్రసక్తి లేదు కావున గోపికాపరముగా మధురభక్తిని అనుశీలించుటయే యీ వ్యాస లక్ష్యమగు చున్నది.

రసము సామాజిక నిష్ఠము. పాత్రాశ్రితము గోపికలచే ననుభవింపబడు మధుర రతి సామాజికులచే ఆస్వాదింపబడి మధురభక్తిగ పరిణమించును. కావున, పోతన భాగవతమునందలి గోపికల నాశ్రయించిన మధుర భగవ ద్రతిని అనుశీలించినచో తత్స్థాయియే రసమగునను న్యాయమున భగవద్రతిని నిరూపించినట్లు కాగలదు.

మధుసూదన సరస్వతి 'ద్రుతేని త్రే ప్రతిష్ఠాయా గోవిందాకార స్థిరసాభక్తి రిత్యభిధః'[22] అని పేర్కొనబడిన భక్తి నిర్వచనము సుప్రసిద్ధము. మొదట భక్తుని చిత్తము ద్రుతము కావలయును. అట్టి చిత్తము ద్రుతికి కామ క్రోధ భయ స్నేహ హర్ష శోక భయ శమములు కారణములని యా లాక్షణికుడు నిరూపించెను. పై కారణములచే ద్రుతత్వమును భజించిన చిత్తమునందు ప్రవే శించిన గోవిందాకారత యనెడి స్థాయినే భక్తి యనవలెనని యాతని మతము. అనగా భక్తి రసస్థితి నొందుటకు ముఖ్యముగా మూడు దశ లవసరము. 1. చిత్తముద్రుతమగుట 2. ద్రుత చిత్తమునందు గోవిందాకారము ప్రవేశించుట 3. తత్ భగవద్రూపరతి స్థాయిగా పోషింపబడుట.

ఆంధ్ర మహా భాగవతమునందలి దశమస్కంధ పూర్వార్ధమంతయు పై మూడు దశలను భక్తుల హృదయమునందు కలిగింపజేయుటకు అపూర్వముగా సమర్చిన కథా సంవిధానమువలె భాసించుచున్నది. స్థూలముగా గమనించినచో శ్రీకృష్ణుని బాల్య క్రీడలు గోపికల చిత్తములు ద్రుతిపొందుటకు కారణములని గ్రహించుటకు వీలగుచున్నది. గోపికలు కాత్యాయని వ్రతము ఆచరించు ఘట్టము మొదలుకొని వస్త్రాపహరణ ఘట్టము ముగియువరకు గోవిందాకారము గోపికల ద్రుత చిత్తములో ప్రవేశించిన దశగా భావింపవచ్చును. రాసక్రీడా ఘట్టమంతయు భగవద్రూపరతి స్థాయిత్వమును భజించిన సరస ఘట్టముగా నిస్సంశయముగా పేర్కొనవచ్చును. ఈ మూడు ఘట్టములను క్రమముగా పఠించు సామాజికునికి మధుసూదన సరస్వతి పేర్కొనిన భక్తి రసానుభవస్థితి పదిలముగా నందగలదు. ఈ యంశమును కొంత వివరముగా పరిశీలించుట యవసరము.

భక్తిరసరూపుడైన శ్రీకృష్ణుడు సకల నాయిక శిఖామణిగా పేర్కొనుచు రూపగోస్వామి యతనిని పూర్ణుడనియు, పూర్ణతరుడనియు, పూర్ణతముడనియు పేర్కొనెను. గోకులమందు గోపాలుర నడుమ నడయాడుచు స్వయముగా పరిపూర్ణుడయ్యును, పరిమిత గుణములను మాత్రమే ప్రదర్శించువాడు పూర్ణుడైన గోవిందుడు. మధురానగరమునందు వర్తిల్లుచున్న కొన్ని గుణములను మాత్రమే ప్రదర్శించు మాధవుడు పూర్ణతరుడు. ద్వారకయందలి శ్రీ కృష్ణుడు సకలగుణ పూర్ణుడనియు కావున పూర్ణతముడనియు రూపగోస్వామి వివేచన. దీనిని భాగవత పూర్వార్ధమును అన్వయించుకొనినచో నిట్లు భావింపవచ్చును: బాల్యక్రీడలు పచరించు శ్రీ కృష్ణుడు పూర్ణుడు. వస్త్రాపహరణ ఘట్టమున పూర్ణతరుడు. రాసలీలా ఘట్టమున పూర్ణతముడు.

## దశమస్కంధ కథాక్రమము-మధురభక్తిరసావిష్కారము

శ్రీకృష్ణావతార ఘట్టమునకు పూర్వరంగము బహువిధ రసభావములతో సంకీర్ణమైయున్నది. దేవకి యష్టమ గర్భము తనకు మృత్యు సంకేతమని యెఱిగిన కంసుని చిత్తము వైరానుబంధమున్న అన్యానుసంధానము మఱచి హరినే యెల్లప్పుడు స్మరించుచుండెను. దానవ వైరి పుట్టుకకు పూర్వము కంసుని

యందు. వైరభక్తిని పెంచి తత్కథా శ్రవణాసక్తుల యందు క్రోధ కారణ మున కలిగెడి చిత్తద్రుతిని సంవదించినాడు.

కం 'తిరుగుచుఁ గుడుచుచుఁ ద్రాగుచు
నరుగుచుఁ గూర్చుండిలేచు చనవరతంబున్
హరిఁదలఁచి తలఁచి జగమా
హరిమయమని చూచెఁ గంసుండాఱనియలుకన్'

(భాగ.ద. పూ. 85)

అను పద్యము వైరభక్తిచేత ద్రుతమగు చిత్తస్థితిని వ్యంజించుచున్నది. బ్రహ్మాది దేవతలు దేవకీ గర్భస్థ శిశువును కీర్తించునపుడు జ్ఞానభక్తి వెలు గొందుచున్నది.

శ్రీకృష్ణావతారము - బాల్య లీలలు :-

ఉ. పుట్టువులేని నీకభవ! పుట్టుట క్రీడయకాక, పుట్టుటే?
యెట్టనుడున్ భవాది దశలెల్లను జీవులయం దవిద్య దాఁ
జుట్టుచునుండుఁ; గాని నినుఁ జుట్టునదింబలెఁ బొంతనుండియుం
జుట్టఁగ లేమిఁ దత్క్రియలఁ జొక్కని యొక్కటి వాదుపీశ్వరా!'

(భాగ. ద. పూ. 99.)

శ్రీకృష్ణావతార సమయమందు కలిగిన శుభశకునములు వసుదేవుడు దేవకీదేవి విష్ణువును స్తుతించిన పద్యములు సహృదయుల హృదయములను వత్సలార్ద్రము నొనర్చును. విశేషించి యీ క్రింది పద్యము దేవకీదేవి కొడుకుగా పుట్టిన దేవదేవునకు కడుపుకోతను చెప్పుకొని ఆర్తిని వెలార్చునది.

తరల. 'నలినలోచన! నీవు నిక్కము నాకుఁ బుట్టెదవంచు నీ
ఖలుఁడు గంసుఁడు పెద్దకాలము కారయింట నడంచె; దు
ర్మలిన చిత్తుని నాజ్ఞసేయుము; మమ్ముఁగావుము భీతులన్;
నులుసు లేక ఫలించె నోఁచిన నోములెల్లను నీవయై.'

(భాగ. ద. పూ. 130)

ఆడుబిడ్డను సంహరించుటకు వచ్చిన కంసునితో దేవకి మొరపెట్టు కొనిన మాటలు శోక భావోన్నిద్రములు. కరుణము, రౌద్రము, జన్యజనక రసములుగా పఠితల హృదయములను సంక్షుభిత మొనర్చు ఘట్టము.

ఉ. అన్న! శమింపుమన్న! తగదల్లుడుగాఁ; డిదిమేనగోడలా;
మన్ననసేయుమన్న! విను; మానినిఁజంపుట రాచపాడిగా
దన్న! సుకీర్తివై మనఁగదన్న! మహాత్ములు వోవుత్రోవఁ బో
వన్న! భవత్సహోదరిఁగదన్న! నినున్ శరణంబు వేఁడెదన్'
(భాగ. ద. పూ. 150)

కం. 'కట్టా! యార్గురు గొడుకులఁ
బట్టి వధించితివి యాఁడుఁబడుచిది; గోడల్
నెట్టన చంపఁగ వలెనే ?
కట్టేఁడివి గదన్న! యన్న! కరుణింపఁగదే!' (భాగ. ద. పూ. 151)

మొదలగు పద్యములు సహృదయుల కన్నులలో అశ్రుధారలను కురిపించగలిగిన శక్తిమంతములైన పద్యములు. ఇక రేపల్లెలో శ్రీకృష్ణుని చూడవచ్చిన గొల్లల చిత్తములు హర్షభావ పరిపూర్ణములు.

ఆ. 'ఏమి నోము ఫలమొ యింత ప్రొద్దొకవార్త
వింటిమ బలలార! వీనులలర;
మన యశోద చిన్న మగవానిఁగనెనఁట!
చూచి వత్తమమ్మ సుదతులార!' (భాగ. ద. పూ. 184)

ఉ. 'వేడుక తోడఁ గ్రొమ్ముడులుపీడఁ గుచోపరిహార రేఖల
ల్లాడఁగపోలపాలికల హాటకపత్రరుచుల్ వినోదనం
బాడఁ బటాంచలంబు లసియాడఁగఁజేరి యశోదయింటికిం
జేడియలేఁగి చూచిరొగి జిష్ణుని విష్ణునిఁ జిన్నికృష్ణునిన్.'
(భాగ.ద.పూ. 187)

పూతన, శకటాసురుడు, తృణావర్తుడు బాలకృష్ణుని వధించుటకు చేసిన ప్రయత్నములు ఆ యవతారపురుషుడు వారిని సంహరించిన లీలలు అద్భుత వీర కృత్యములుగా సాగి పఠితలచిత్త ద్రుతికి కారణములగుచున్నవి. ఇవి యన్నియు నొకయెత్తు, శ్రీకృష్ణుని దుడుకు చేతలనుగూర్చి గోపికలు యశోదా దేవికి విన్నవించుకొనిన ఘట్టము మరియొక యెత్తు.

'బాలురకుఁబాలులేవని బాలెంతలు మొరలువెట్ట (బకపకనగి' మొదలగు (దశ. పూర్వ. 306.328 వరకుగల) పద్యములన్నియు శ్రీకృష్ణుని దుడుకు తనమును వ్యక్తీకరించునట్టివే. అతని బాధలు పడలేక 'పోయెద మెక్కడికైనను మాయన్నల సురభులాన మంజులవాణీ' అని ఆక్రోశించినారు గోపికలు. గోపికల చిత్తములందు క్రోధ భయ శోకాదులను కల్పించి చిత్తద్రుతిని బొందు హేతువులను సృష్టించినాడు. ఇన్ని యాగడములు చేసిన యా బాలుడు తల్లికడ చీకుచింతలేనివానివలె, ఏమీ తెలియని అమాయకునివలె నుండుట అతని పూర్ణత్వము వ్యంజింప జేయుచున్నది.

ఉ. 'కాంతలు దల్లితోఁ దన వికారములెల్ల గణింప భీతుఁడై
శాంతుని సొంపునం బరమసాధుని పెంపున గోలమాడ్కి నవి
భ్రాంతునికైవడిన్ జడునిభంగిఁ గుమారకుఁ డూరకుండెనే
వింతయు లేక తల్లి కుచవేదికపైఁ దలమోపి యాడుచున్'

(భాగ.ద.పూ. 334)

శ్రీకృష్ణుడు గోపకుమారులతో కలిసి యాడిన ఘట్టములందు స్నేహ కారణముగా చిత్తము ద్రుతమయ్యెడి విధము లెస్సగా స్ఫురించుచున్నది.

సీ. 'గోవల్లభుఁడ నేను గోవులు మీరని
వడి అంకెవైచుచు వంగియాడు
రాజనే భటులు మీరలురండు రండని
ప్రాభవంబునఁ బెక్కుపనులు పనుచు
నేదస్కరుండ; మీరింటివారని నిద్ర
పుచ్చి సొమ్ములు గొనిపోయి డాఁగు
నే సూత్రధారి మీరిందఱు బహురూపు
లని చెలంగుచు నాటలాడఁబెట్టు

తే. మూలలుఱుకును; డాఁగిల మూఁతలాడు; నుయ్యేలలనూఁగుఁ; జేబంతు లొనరవైచు;
జారచోరులజాడలఁ జాలనిగుడు; శౌరి బాలురతో నాడు సమయమందు.'

(భాగ.ద.పూ. 305)

ఈ పద్యము తెలుగువారినోట స్నేహభక్తిరుచులను నేటికిని పంచిపెట్టు చున్నది. బాలకృష్ణుడు నోటియందు విశ్వరూప ప్రదర్శనము తల్లియెదుట గావించినపుడు అద్భుత భావోన్నిద్రమైన భగవంతుని పరిపూర్ణత్వము ధ్వనింప బడుచున్నది. అద్భుత భావమును వ్యక్తము చేయుటకు ఈ క్రింది పద్యము ఒక నానుడిగా తెలుగువారు నిత్యజీవితమునందు నేటికిని పఠించుకొనుచున్నారు.

మ. 'కలయో, వైష్ణవమాయయో! యితర సంకల్పార్థమో, సత్యమో
తలపన్నేరక యున్నదాననొ యశోదాదేవిఁగానో పర
స్థలమో బాలకుఁడెంత యీతని ముఖస్థంబై యజాండంబుప్ర
జ్వలమై యుండుట కేమిహేతువొ మహాశ్చర్యంబు చింతింపఁగన్'.

(భాగ. ద. పూ 342)

యశోద శ్రీకృష్ణునియందు ప్రచరించు వత్సలము భక్తికి పోషకముగా పోతన అభినివేశముతో వర్ణించెను.

కం. 'వీరెవ్వరు శ్రీకృష్ణులు, గారా! యెన్నఁడును వెన్నగానరఁట కదా
చోరత్వం బించుకయును, నేరరఁట, ధరిత్రి నిట్టినియతులుఁగలరే'

కం. 'పట్టినఁబట్టువడని నినుఁబట్టెదమని చలము కొనినఁబట్టుట బెట్టే
పట్టువడవండ్రు, పట్టీ, పట్టుకొనన్ నాకుఁగాక పరులకు వశమే.'

కం. 'ఎక్కడనైనను దిరిగెద,
వొక్కెడన్ గుణము గలిగియుండవు నియమం
బెక్కడిది నీకు మఱచినఁ జక్కనఁ
బోయెదవు పెక్కు జాడలఁ బుత్రా!'

(భాగ.ద.పూ. 374, 375, 376)

పై పద్యములు వాత్సల్య కారణముగా చిత్తద్రుతికలుగు భక్తిప్రవృత్తికి చక్కని యుదాహరణము.

శ్రీకృష్ణ బలరాములు పిన్నవయసునందే భయంకర రాక్షసులను వధించిన ఘట్టములన్నియు వారి మహిమలకు పతాకలవలె భాసించుచున్నను రాక్షస విజృంభణాదులవలన కలుగు భయాతిరేకమువలన చిత్తము ద్రవీకరింప బడుటకు వీలగుచున్నది. పూతన, శకటాసురుడు, తృణావర్తుడు, వత్సాసుర, బకాసురులు, ధేనుకాసురుడు, కాళీయుడు మొదలగు రాక్షసులను మర్దించిన

ఘట్టములు పతితల హృదయములలో భయభావములను కలిగించి హృదయముల నార్ద్రపరచి భగవన్మహిమ వానియందు ప్రతిఫలించుటకు తోడ్పడుచున్నవి.

మ. 'అదరెన్ గొండలతోడభూమి గ్రహతారానీకముల్ మింటిపై
బెదరెన్ దిక్కుల మాఱుమ్రోఁత లెసఁగెన్ భీతిల్లి లోకంబులున్
గదలం బాఱెను వజ్రభిన్న గిరిరేఖం బూర్వదేహంబుతోఁ
ద్రిదశ ధ్వంసిని గూలికుయ్యిడఁగఁ దద్దీర్ఘోరు ఘోషంబునన్'

(భాగ.ద.పూ. 227)

కం. 'సుడియెఱుఁగని హరి సుడివడ
సుడిగాలి తెఱంగు రక్కసుఁడు విసరెడియా
సుడిగాలి ధూళి కన్నుల
సుడిసిన గోపకులు బెగడి సుడివడి రధిపా!'

(భాగ.ద.పూ. 265)

ఉ. 'చంచుపుటీటి పక్షములు జల్లున విచ్చి పదంబులెత్తికు
ప్పించి నభంబుపై కెగసి భీషణఘోషణ వక్త్రుఁడై విజృం
భించి గరుత్సమీరమున భిన్నములై తరులోలిఁగూలఁగా
మించి బకాసురుం డొడిసి మ్రింగె సహిష్ణునిఁ జిన్నికృష్ణునిన్.'

(భాగ.ద.పూ. 445)

శా. 'వేల్పుల్ చూచి భయంబునొంద గ్రసనావేశంబుతో నుజ్జ్వల
త్కల్పాంతోజ్జ్వలమాన జిహ్వ దహనాకారంబుతో మ్రింగెన
స్వల్పాహీంద్రము మాధవార్పిత మనోవ్యాపార సంచారుల
న్నల్పాకారుల శిక్యభారులఁ గుమారాభీరులన్ ధీరులన్.'

(భాగ ద.పూ. 476)

మ. 'ఒక తాలాగ్రము తాఁకవై వనది కంపోద్రిక్తమై త్రెళ్ళివే
ఱొక తాళాగ్రముపైఁ బడన్నదియు నత్యుగ్రాహతిన్ నిల్వకొం
డొక తాళాగ్రముపైఁ బడన్ విఱిగి యిట్లొండొంటిపైఁ దాళవృ
క్షకము ల్గూలెఁ బ్రచండమారుతము తాఁకన్ గూలు చందంబునన్'

(భాగ. ద. పూ. 620)

ఉ. 'భూరి మహాప్రతాప పరిపూర్ణ భయంకర గోపబాల కం
 ఠీరవ పాతవేగ వికటీకృత దుర్విషభీషణోర్మి సం
 పూరితమై వడిం గలఁగి పొంగి ధనుశ్శతమాత్ర భాగవి
 స్తారము వొందె నమ్మడుఁగు తప్త పయః కణ బుద్బుదోగ్రమై'
 (భాగ. ద. పూ. 638)

కం. 'అభ్రంకష ధూమాయిత
 విభ్రాంత మహాస్ఫులింగవిసరోగ్రశిఖా
 విభ్రష్ట దగ్ధలోకా
 దభ్రంబై వచ్చెఁ జూడు దవశిఖి కృష్ణా!' (భాగ.ద.పూ. 744)

పై పద్యములన్నియు ఆయా ఘట్టములందు భయావహములైన సన్నివేశములను కన్నులకు కట్టుకున్నట్లుగా, చిత్తములకు హత్తుకొనునట్లుగా రచింపబడినవి. రాక్షస విజృంభణమువలన కలిగెడి యీ భయము శ్రీకృష్ణుని లీలా ప్రకటనమువలన ఉపశమించి పోవునదియే. అనగా భయముచే చిత్తము ద్రవీకరింపబడి దానియందు భగవంతుని మహిమాన్వితమైన రూపము తద్గుణ కీర్తనమువలన ముద్రిత మగునట్లుగా భాగవత రచనా ప్రణాళిక సాగినదని స్పష్టమగుచున్నది. పూర్వము పేర్కొనినట్లు భయశోకాది భావముల చేతనైన చిత్తద్రవీకరణము భక్తిరసానుభవ స్థితికి ప్రథమ సోపానము. శ్రీకృష్ణుడు దావాగ్ని మ్రింగి గోపసంఘమును కాపాడిన ఘట్టము వరకు ఈ ప్రథమ దశ వ్యాపించినది ఆపై దశమ స్కంధ నిర్మాణమునందు ఒక విరామము భాసించుచున్నది. వర్ష శరత్ హేమంత ఋతువర్ణనము తద్విరామమును రమణీయముగా వ్యంజింప జేయుచున్నది.

ఋతువర్ణనము : గోవిందరూపాకారత్వము మనసునందు స్థిరముగా నిలుచునట్లు భక్తిరసకథాకథనము చేయుట భక్తిరసపోషణలో ద్వితీయదశ. ఋతువర్ణనమునందు బమ్మెర పోతరాజు ఒక అపూర్వ శిల్పమును పాటించెను. దావాగ్ని మ్రింగి గోపికలను రక్షించిన తరువాత వారి హృదయములందు అనవరత శ్రీకృష్ణ సందర్శనాభిలాష జనించినట్లు పోతన స్పష్టము చేసెను.

కం. 'కమలాక్షు నొద్ద నుండని
నిమిషము యుగశతముగాఁగ నెగడిన గోవ
ప్రమదలు సంభ్రమమున నా
కమలాక్షునిఁ జూచి ముదముఁగనిరి మహీశా!'

(భాగ. ద. పూ. 751)

శ్రీకృష్ణ దర్శనాకాంక్ష దర్శించిన తరువాత పొందెడి సంతోషాతిశయము ఈ పద్యమునందు కొట్టవచ్చినట్లు కన్పించుచున్నది. ఆపై వర్ష ఋతువు ఆసన్నమైనది. శ్రీకృష్ణరూప సందర్శనాభిలాషులైన గోపికలకు వర్ష కాలమేఘము శ్రీకృష్ణమేఘముగా భాసించినది. ప్రకృతియందలి సర్వపదార్థములయందును విశేషించి కాలస్వరూపమైన వర్షాది ఋతువులయందు శ్రీకృష్ణునే సందర్శింపగలిగిన సంతత భగవద్రతి రూపభావన గోపికలయందేర్పడినదని పోతన ప్రబంధ ధ్వని నాశ్రయించి ప్రతీయమానమొనర్చెను. వర్షకాలమునకును కృష్ణమేఘమునకును రూపకమునందు రూపసామ్యమతికినాడు పోతన.

సీ. 'విశ్వమోహనమైన వేణు నినాదంబు
సరసగంభీర గర్జనముగాఁగ
మహనీయ నిర్మల మందహాసద్యుతి
లలితసౌదామినీ లతిక గాఁగఁ
దలచుట్టు బాగునఁ దనరు పింఛపుదండ
శైలభేదను శరాసనముగాఁగఁ
గరుణాకటాక్షవీక్షణ సుధావర్షంబు
సలిలధారా ప్రవర్షంబు గాఁగఁ

తే. జాడనేతెంచు గోపాలజన మునీంద్ర
చాతకంబుల దురవస్థఁ జక్కఁజేసి
కృష్ణమేఘంబు బహుంతర కీర్తి నొప్పె
విమల బృందావ నాకాశ వీధియందు.' (భాగ.ద. పూ 761)

శరదృతు వర్ణనము వర్షఋతు వర్ణనముకంటె విశిష్టముగా సాగినది. బృందావన విహారియైన శ్రీకృష్ణుడు చతురనటవర్తి గోపాలమూర్తిగా అభివర్ణింప

బడివాడు. 'హరివేణునాదంబు పూరించిన, మారవికార హేతువగు తద్గీతం బాలించి' (10-770) గోపికలు శ్రీకృష్ణుని గురించి చింతించిన పద్యములు దాదాపు ఇరువదియారు ఇందు రచింపబడినవి.

మ. 'శ్రవణోదంచిత కర్ణికారములతో స్వర్ణాభ చేలంబుతో
నవతంసాయిత కేకి పింఛకముతో నంభోజ దామంబుతో
స్వవశుండై మరాధరామృతముచే వంశంబుఁ బూరింపుచు
న్నవిదా! మాధవుఁడాలవెంట మనమందొప్పారెడిం జూచితే.'

(భాగ.ద. పూ 771)

అను పద్యముతో నారంభించిన యీ ఘట్టమంతయు గోవిందుని మంగళాకారము మనసునందు నిండించికొనెడి భక్తియోగ శ్రోతస్వినిగా భాసించుచున్నది. హేమంత ఋతువర్ణనము గోపికలమానసికావస్థను మరియొక అడుగుముందుకు వేయించినది. ఈ ఋతువునందు కాత్యాయనీ వ్రతము నిర్వహించుట యాచారము. ఆ కాత్యాయనిని పూజించుట యెందులకో పోతన వివరించి మధుర భక్తి బీజమును మనోహరముగా నాటినాడు.

కం. ఓ కాత్యాయని! భగవతి!
నీకును మ్రొక్కెదము మేము నేఁడనుకంపన్
మాకిందఱకును వైశమ
శ్రీకృష్ణుఁడు మగఁడు గాఁగఁ జేయుము తల్లీ!' (భాగ.ద.పూ. 808)

భగవంతుని పతిగా కోరెడి గోపికల చిత్తములు గోవిందరూపమును మనసునందు చిత్రించుకొని తద్గతమైన రతిని అనవతరము భజించుచున్నవని స్పష్టమగుచున్నది.

## గోపికావస్త్రాపహరణ ఘట్టము

ద్రుత చిత్తములందు గోవిందాకారతను గాఢముగా ముద్రించునది గోపికావస్త్రాపహరణ ఘట్టము.

కం. 'కొంటివి మా హృదయంబులు,
కొంటివి మా మనము లజ్జగొంటివి వలువల్
గొంటివిఁక నెట్లు చేసెదొ
కొంటెవుగద నిన్ను నెఱిఁగికొంటిమి కృష్ణా!' (భాగ. ద.పూ. 822)

ఈ పద్యమునందు గోపికలు కొంటివి మా హృదయములు అనియు నిను నెఱిగికొంటిమి కృష్ణాయనియు చెప్పుచు ఈ పద్యమును ముగించుట విశేషము. గోపికల హృదయములు శ్రీకృష్ణునియందు లగ్నమైనవనియు, వానియందు శ్రీ కృష్ణుడు నిశ్చలనముగా నిలచియుండెననియు స్పష్టమగుచున్నది. ఆర్ద్రచిత్తమునందు గోవిందరూపము నిశ్చలముగా నిలుచుటకు దేహాభిమానము తొలలగవలెనని వేదాంత వ్యాఖ్యానము అనగా మాయావరణము నివారణము కావలెనన్న మాట. రసపరముగా దీనిని వ్యాఖ్యానించుకొనినచో ఆర్ద్రమైన చిత్తమునందు గోవిందుడు నిలిచినపుడు అనుభూతియందు విశ్వజనీనత భావించుననియు లింగవివక్షకు తావలమైన దేహేంద్రియ స్పృహ ఉండదనియు వాసనాసంవలితమైన ఆత్మానంద చిత్కళతో సంయోగము కూడుననియు భావించవచ్చును. ఇంద్రియావరణమునకు ప్రతీకలుగా ఈ కథయందలి వస్త్రములు గోచరించుచున్నవి. వస్త్రాపహరణము చేసినవాడు శ్రీకృష్ణుడు. శ్రీకృష్ణుడే రసరూపుడు. తద్రసము ననుభవింప కోరిన సహృదయ చిత్తములే గోపికలు.

కం. 'ఎవ్వనిఁగని మోహించితి
రెవ్వఁడు మీ మానధనము లెల్ల హరించెన్
నివ్వెఱలెను మీ కూరిమి
యెవ్వనిపైఁ బలుకరాదె యే నన్యఁడనే?' (భాగ. ద. పూ. 833)

ఈ పద్యము పైకి చూచినచో వలపుగాని వాక్యమువలెనే కనిపించును. కాని, రసపరముగా భావించినచో ద్రుతచిత్తమునందు ప్రతిబింబించిన గోవిందుని ఆకారమునే అనన్యభావముతో స్థాయిరూపముగా సాధించుకొనుచున్న గోపికల భక్తిరససాధనము గోచరమగును. 'ఏ నన్యుడనే' అనుటలోని వ్యంగ్య మాధుర్యమును భావించినచో భక్తిరస దాతాత్మ్యస్థితి సహృదయులకు గోచరము కాగలదు.

వేదాంతపరమైన అంతరార్థముకూడ సాధకుల వాసనా విరహితత్వమును వ్యంజింపజేయుచున్నది. డాక్టరు వేదుల సూర్యనారాయణశర్మ గారి మాటలలో,

'గోపికలు నందగోప సుతుడైన కృష్ణుణి భర్తగా పొందాలని వ్రతం చేస్తున్నారంటే విషయ మనోవృత్తులు (గోపికలు) ఆనందవృత్తికి కల్గే (నంద గోపునికి కల్గిన) వాసనావిరహిత ముక్తి తత్త్వాన్ని (కృష్ణుణి) చేరడానికి సాధకులు చేసే సాధనాక్రమం సాగిస్తున్నారన్నమాట. నంద గోపుని కొడుకు కృష్ణుడు అంటే ఆనంద వృత్తి వల్ల కలిగే వాసనా రహిత తత్త్వం అన్నమాట. అందుకు మాయను ఒత్తిగించుకోవడమే వివస్త్రలు కావడం అన్నదాని అంతరార్థం. మాయను ఒత్తిగించు కొన్నా తిరిగి అంతలోనే తమోగుణంతో మాయ ఆవరిస్తూనే వుంటుంది. అన్నదే కాళిందీ నదిలో కంఠం వరకు గోపికలు దిగివున్నారన్న దాని అర్థం. కృష్ణుడు వచ్చి బట్టలు ఎత్తికొనిపోయి చెట్టెక్కి కూర్చున్నా డంటే వారు కోరిన వాసనా విరహిత ముక్తి తత్త్వం (కృష్ణ తత్త్వం) వారికి అందజేయడానికై వారు తిరిగి వాసనలను పొందకుండా చేయడం అనే అంతరార్థం కృష్ణుడు చేసిన వస్త్రాపహరణానికి అర్థంగా ఇందులో కన్పిస్తూంది. మీరు వివస్త్రులై జలంలో దిగి వ్రతభంగం పొందే పని చేశారంటే మాయను విడిచి (వస్త్రాలు విడిచి) వాసనావిర హిత తత్త్వం (కృష్ణుని) తో చేరడానికి సాధనలు చేస్తూ కూడ తిరిగి మాయలోనే (కాళింది జలంలోనే) పడ్డారు. కాన వివస్త్రులుగా పైకి గట్టెక్కి, నా వద్దనుండి బట్టలు గ్రహిస్తేనే మీకు ప్రతిఫలం దక్కు తుంది అని అన్నాడు. అంటే ఆ విధంగా సాధకులకు వాసనారహిత తత్త్వోపాసనమువల్ల (కృష్ణ తత్త్వోపాసనం వచ్చి) అంతఃప్రబోధం కల్గిందన్నమాట.[23]

ఈ ఘట్టమునందలి తాత్త్వికబోధ జ్ఞానశక్తికి పోషకముకాగా గోపికల రసభావ వృత్తి మధుర భక్తికి ఉపబలకముగా సాగినది. చిత్తమునందు భగవంతుని ఆకారము ప్రతిబింబించుట ప్రాథమిక దశ. ప్రతిబింబించిన యాకారము 'యద్భావమ్ తద్భవతి' అను న్యాయమున సంతతము మననము చేయు గోవిందాకారమునందు హృదయము తన్మయమగుట రసావస్థకు ప్రాతి పదిక. ప్రతిఫలము నుండి తాదాత్మ్యము వరకు సాగెడి భగవద్రూపరతి స్థాయిభావావస్థలో వస్త్రాపహరణ ఘట్టమందలి గోపికల పాత్రలు తన్మయా వస్థకు అనుగుణమైన చిత్తమును వ్యక్తీకరింపజేయుచున్నారు. ఈ ఘట్టమును ముగించుచు పోతన .

కం. 'ఉల్లములు నొవ్వ నాడినఁ
గల్లలు చేసినను నగినఁ గలఁచిననైనన్
వల్లభులు సేయు కృత్యము.
వల్లభలకు నెగ్గుగాదు వల్లభ మధిపా!' (భాగ. ద. పూ. 846).

ఈ పద్యమునందు శ్రీకృష్ణుని వల్లభునిగ గోపికలను వల్లభలుగా పోతన వ్యాఖ్యానించుట యీ ఘట్టము మధురభక్తికి మహనీయమైన ఆలంబన మని మనకు జ్ఞాపకము చేయుట.

సజాతీయ విజాతీయ భావములచే సంఘటితమై పరిపోషింపబడు స్థాయి భావమును చిత్రించు సన్నివేశములు కొన్ని గలవు.

**మునిభార్యలు అన్నము తీసికొనివచ్చి కృష్ణునికి ఆరగింపు చేయుట :**

అట్టివానిలో మునిభార్యలు అన్నము తీసికొనివచ్చి శ్రీకృష్ణునకు అరగింపుజేయు ఘట్టము ఒకటి. ఇది చిన్నదయ్యును గుణమునందు మిన్నయై భాసించుచున్నది. ఆకలిగొనిన గోపాలురు బ్రహ్మణులను అన్నము పెట్టుడని కోరగావారు తిరస్కరించిరి. గోపాలురు నిరాశులై తిరిగివచ్చి వారికి నాయుదంతమును పేర్కొనిరి. శ్రీకృష్ణుడు బ్రాహ్మణసతులకు తమరాకనెఱింగించినచో వారన్నము పెట్టెదరని సూచించెను. వారట్లు చేసిరి. ఆ బ్రాహ్మణవనితలు గోవింద సందర్శన కుతూహలలై భక్ష్యభోజ్యాదులను కుంభము లందుంచుకొని వేవేగముగా సముద్రమును చేరనేగు నదులవలె గోవిందునికడకు సంభ్రమముగా నేగిరి.

కం. 'బిడ్డలు మగలును భ్రాతలు
నడ్డము చని వలదనంగ నటుదలఁదని మా
ఱొడ్డుచు జగదీశ్వరునకు
జడ్డన నన్నంబుఁ గొనుచుఁ జనిరాసుదతుల్' (భాగ.ద.పూ.859)

అటువెడలి యమునాసమీపమున అశోకవృక్షము క్రింద గోపబాలురతో కలిసి క్రీడించు గోపాలదేవుని కనులార గాంచిరి.

సీ. 'ఒక చెలికానిపై నొకచెయ్యిచాఁచి వేఱొకచేత లీలాబ్జ మూఁచువానిఁ
గొప్పున కందని కొన్ని కుంతలములు చెక్కుల నృత్యంబు సేయువానిఁ
గుఱుచ చుంగలు పుచ్చికొమరారఁ గట్టిన పసిఁడి వన్నెలుగల పటమువాని
నొద్దలఁదిరిగిరా నల్లవడఁ జుట్టిన దట్టంపుఁ బింఛపు దండవాని

తే. రాజితోత్పల కర్ణపూరములవాని
మహితపల్లవ పుష్పదామములవాని
భువనమోహన నటవేష భూతివానిఁ
గనిరి కాంతలు కన్నుల కఱవుదీఱ' (భాగ.ద.పూ.861)

కన్నులు కరువు తీర చూచుటయే కాదు తనువులపై స్పృహలను కూడ కోల్పోయి తన్మయత్వమును భజించెడి యీ ఘట్టమునందు బిడ్డలు, మగలు, భ్రాతలు నడ్డము వచ్చి పలదని వారించుట భక్తికి విరోధ భావము. వారి మాటలు మన్నింపక శ్రీకృష్ణుని జగదీశ్వరునిగా భావించి యతనికి భక్తి పుర స్సరముగా ఆరగింపుల నందించుట కొరకై వెడలిన బ్రాహ్మణ వనితలయందు గోపికా స్వభావము వ్యంజింపబడుచున్నది. అడ్డంకుల నధిరోహించి ప్రవహించు భగవద్రతి శ్రీకృష్ణుని భువన మోహన రూప దర్శనముచే తన్మయావస్థను కల్పించు సాత్త్వికస్థితిని సాధించెను. విజాతీయ భావముల నధిగమించి స్థాయి పోషింపబడు విధమనగా నిటువంటిది.

ఆపై శ్రీకృష్ణుడు వారితో ననిన మాటలు వారి భక్తి భావమునకు కావ లయునని ఉంచిన అడ్డంకుల వంటివి. మొదట శ్రీకృష్ణుడు వారి యోగక్షేమ ములను విచారించి -

'... మమ్ము నిచటన్ వీక్షింప నేతెంచి నా
రెంతో వేడుకతో నెఱుంగుదుము నిర్హేతుస్థితిన్ నన్నుధీ
మంతుల్ మీ క్రియఁ జేరికందురు గదా మత్సేవలన్ సర్వమున్'
(భా.గ.ద.పూ. 865)

అని వారి భక్తి ప్రపత్తిని మెచ్చుకొనియు 'మీ భర్తలు మిమ్ముగూడి క్రతువులను సమాప్తి చేయవలసియుండగా మీరిటువచ్చి ఆ నైవేద్యములను నాకు ముందుగా నొసంగుట న్యాయము కాదు; యాగవాటికకు తిరిగిపొండని' వారి ప్రయత్నములు మాన్ప ప్రయత్నించెను.

కర్మనిష్ఠలను పాటించినచో శ్రీకృష్ణుని మాటలు సత్యములే. కాని, భక్తి భావమునందు సాక్షాత్పరమేశ్వరుడే శ్రీకృష్ణుడై యుండగా కర్మ ఫలము లన్నియు నాతనియందే సమర్పింపవలసి యుండగా ప్రత్యక్షదైవారాధనకంటె పరమార్థము మరియొకండు లేదుకదాయని యా వనితలు గోవిందున కన్నము కుడుపబెట్టిరి.

కం. 'పరమేశ్వరార్పణంబుగఁ
బరజనులకు భిక్షమిడినఁ బరమ పదమునన్
బరఁగెదరఁట తుది సాక్షా
త్పరమేశ్వరు భిక్షసేయు ఫలమెట్టిదియో.' (భాగ.ద.పూ. 870)

అన్న ఆ వనితల భావనము విరోధి భావముల నధిగమించి స్థిరత్వమును బొందిరి. స్థాయికి ఉదాహరణము. శ్రీకృష్ణుడు వారికిచ్చిన వరము భక్తి రససిద్ధి వంటిది. 'మీరు మానసంబులు నాయందు మరగఁజేసి నన్నుఁ జేరెద రిటమీద నమ్ముఁ'డని[24] యభయహస్త మిచ్చెను. భగవంతునియందు మానసములను సంతతము మరగజేయుటయే భగవద్రూపరతియైన స్థాయి. వనితలు పొందిన అనన్యభక్తి ఫలమును బ్రాణులు భావించి తమ మౌఢ్యమునకు పరితపించి యిట్లు విచారించిరి:

కం. 'జప హోమాధ్యయనంబులు
తపములు వ్రతములును లేని తరుణులు హరిస
త్కృప వడసిరన్ని గలిగియుఁ
జపలతఁ బొందితిమి భక్తిసలుపమి నకటా!' (భాగ.ద.పూ. 873)

కర్మకలాపమంతయు విక్షేపమును బ్రసాదించునదియే. నిజమునకు కర్మఫలము సమాహిత భక్తిచిత్తము. భగవదర్పణముగాని కర్మము భగవంతుని చేర్చలేదు. భగవదర్పితమైన కర్మము భక్తిగా పరిణమించి ముక్తికి సోపానము నందించును. ఈ చిన్నియుదంతము భక్తిరస పరమార్థము నందించు రమణీయోదాహరణము. ఇందలి బ్రాహ్మణ వనితలు వైదిక నిష్ఠామయమైన వాతావరణమునందున్నను అందలి కర్మమౌఢ్యమునకు దాసులు కాక సాక్షాత్ భగవద్రూపరతిని మనములందు పోషించుకొని పరమేశ్వరార్పణ బుద్ధితో భక్తి ఫలమునందుకొనిన పరమ సాధ్వులు. ఒకవిధముగా గోపకాంతలకు పెద్దక్కలు.

## శ్రీకృష్ణుడు గోవర్ధన పర్వతము నెత్తుట

స్వభావముచేత భిన్నమైనను శ్రీకృష్ణుడు గోవర్ధన పర్వతను నెత్తు ఘట్టము సజాతీయ విజాతీయ సంచారీ భావములచేత తాడితమయ్యు పోషింప

బడు స్థాయిని సాధించెడి మరియొక రసవత్తర ఘట్టము. ఇందు నందాదులు ఇంద్రయాగము చేయుటకు తలపెట్టెదరు. వీరు బ్రాహ్మణులవలె నిష్ఠాగరిష్ఠులు కాకపోయినను యాగకర్మలందు సంగబుద్ధి కలవారు.

కర్మరతులైన యాదవులు ఇంద్రయాగమును జేయ తలపెట్టిరి. ఆ యాగమువలన ఇంద్రుడు సంతసించుననియు, దానివలన వాన కురియుననియు, దానివలన కసవు పెరుగుననియు, ఆ కసవు మేసి ఆవులు బ్రతుకుననియు, వానివలన పాడియు సంపదలు లభించుననియు, వానివలన మానవులు దేవతలను సంతోషపెట్టుదురనియు నందుడు శ్రీ కృష్ణునకు తెల్పెను.

ఈ కథాసన్నివేశమునందు రసపోషణమునకు సంబంధించిన ఒక రహస్యము కలదు. యాదవుల హృదయములందలి భక్తికి ఆలంబనమైనవాడు శ్రీకృష్ణుడు. అతని రూపము, రూపభావనము, గుణ చింతనము, నామకీర్తనము, కథాశ్రవణము మొదలగునవి భగవద్రూపరతిని స్థాయిగా పరిపోషించుటకు తోడుపడుచుండును. ఈ కథలోని చిత్రమేమనగా, యాదవుల దైవభావనము శ్రీ కృష్ణునినుండి ఇంద్రునివైపు మరల్పబడుచున్నది. రసరూపుడైన కృష్ణుడు యాదవుల హృదయములనుండి మరలుటచేత స్థాయి భంజింపబడెడి ప్రమాద మేర్పడుచున్నది. దానికితోడు ఇంద్రయాగమునందు యాదవులకు లౌకికాభ్యుదయ రూపమైన కామనముండుటచే అది శుద్ధరతికి పోషకముకాని విరుద్ధభావ మగుచున్నది. విరుద్ధభావము స్థాయికి పోషకము కానిచో దానిని తత్పోషకముగా పరివర్తనము చేయవలసి యుండును. ఆ పనిని శ్రీకృష్ణుడే చేపట్టుట ఈ కథార్థమునందలి విశేషము.

> 'కర్మాను యాతంబులైన భూతంబులకుఁ బురుహూతునివలన భీతియేటికి? పురాతనజన్మ సంస్కారంబులు కుప్పలుగొని కప్పినఁ గర్మంబుల దప్పించి, పెంపు పడయ నప్పరమేశ్వరుండును నేరఁడు. ఇతరుల జెప్పనేల సురాసుర నరానీకంబులతోడి లోకంబు నిజసంస్కారవశంబై యంద డిందియున్నది సందేహంబు లేదు. దేహి కర్మవశంబున గురుతను దేహంబులఁ జొచ్చి వెడలు ఒజ్జ, వేలుపు, నెచ్చెలి, పగఱు, చుట్టంబులు, కర్మంబులు, జీవుండు కర్మంబుతోడ వర్తించు. అతనికిఁ గర్మంబుని దైవతంబు. కర్మంబునం బ్రతుకుచు నితరసేవ సేయుట, సతి పతి విడిచి జారుంజేరిన చందంబగు. విప్రుండు వైదికకర్మంబున మెలంగు.

నృపతి ధరణీపాలనంబునసంచరించు. వైశ్యుండు వాణిజ్య కృషికుసీద గోరక్షణాదుల వర్తించు. శూద్రుం డగ్రజన్ముల సేవించి బ్రతుకు. సత్త్వరజస్తమో గుణంబు లుత్పత్తి స్థితిలయ కారణంబులు. అందు రజంబున జగంబు జన్మించు. రజోగుణ ప్రేరితంబులై మేఘంబులు వర్షించు. వర్షంబునం బ్రజావృద్ధియగు. ఇంద్రుడేమి సేయంగల వాఁడదియునుం గాక,

శా. 'కోపింపన్ బనిలేదు శక్రునికిఁ దాఁ గోపించుఁ గాకేమి సం
క్షేపం బయ్యెడిదేమి పట్టణములున్ గేహంబులున్ దేశముల్
వ్యాపారంబులు మీఁకు బోయెడినె? శైలారణ్యభాగంబులన్
గోపత్వంబున నుండుచున్ మనకు సంకోచింపఁగానేటికిన్?'

(భాగ. ద. పూ. 886, 887)

మొదలగు మాటలు ఇంద్రుని యందలి ప్రామాణ్యబుద్ధిని తొలగించుటకు శ్రీకృష్ణుడు నిపుణముగా ప్రయోగించెను. గోవర్ధనగిరికే పూజలు సల్పవలెనని నియమించెను. దానికి నందాదు లంగీకరించిరి. నిజమున కాకొండ కొండ కాదు. ఆకృతిదాల్చిన శ్రీకృష్ణుడు. ఈ కల్పనము ఈ కథలోని ఆయువుపట్టు.

మ. 'సకలాభీరులు వీఁడె కృష్ణుఁడన నైజంబైన రూపంబుతో
నకలంకస్థితి నుండి శైలమిదె మీరర్చింప రండంచుఁ దా
నొకశైలాకృతిఁ దాల్చి గోపకులతో నొండొండఁ బూజించి గో
పక దత్తాన్నము లాహరించె విభుఁ డాప్రత్యక్ష శైలాకృతిన్.'

(భాగ.ద.పూ. 891)

ఈ పద్యము ఒక చిత్రమైన మలుపును సూచించుచున్నది. ఇంద్రునిపై ప్రామాణ్యమును కోల్పోయిన నందాదులు శ్రీకృష్ణుని భగవంతునిగా పూజించుటకు ఉన్ముఖులుకారు. రూపాంతరముచే రూపమును పొందింపచేసెడి విధానము లేదా ప్రతిబింబమును చూపించి బింబమును దర్శింపజేసెడి విధానమును గోవిందు డనుసరించెను. నందాదులు పూజించెడిది కొండ. వారి మనమునందు కొండ కొండయే కాని పఠితల మనసునందు మాత్రము ఆ కొండ గోపాలుడు. నందాదుల దృష్టిలో చూచినచో అ రూపము ఆభాసము. సహృదయుల దృష్టితో గమనించినచో గోవర్ధనము గోపాలకృష్ణుని మారురూపము. పాత్రలయం

దాభాసము, ప్రేక్షకులయందు రసము సృజియించగలిగిన విశిష్టఘట్టమిది. దీని వలన రసభంగము తొలగి ఆభాస మేర్పడినది. ఆభాసమునుండి రసస్ఫూర్తి కలిగించునుపాయము సాధింపబడినది. గోవిందుని సర్వవ్యాపకత్వము ఇందు సమర్థింపబడినది. గిరియై నిల్చినవాడు, గోపకులతో కలిసి గిరిని పూజించిన వాడుహరియే. కర్తయు భోక్తయు నాతడే. స్థాయియు రసము నాతడే. ఇట్టి అద్వైత సిద్ధినందుకొనుటకు అమరిన అమోఘ ఘట్టము గోవర్ధన పర్వతారాధనము.

ఆపైకథ మరొక రమణీయమైన మార్గమున నడచినది అది మహేంద్రునికి కోపము ప్రకటితమైన సన్నివేశము. ఇంద్రుడు సంవర్తకాది మేఘములను ప్రేరేపించి తాను స్వయముగా నైరావతమునెక్కి ఘోరమైన శిలావర్షమును కురిపించెను. గోపకులు గోకులము వికావికలయ్యెను. సర్వజ్ఞుడైన శ్రీకృష్ణుడు ఈ వృత్తాంతమెరిగి మహేంద్రుని గర్వమునకు కినుకపడి అతనికి మానభంగము కావించుటకును కడంగెను. భీతులైన జనులనుద్దేశించి ఇట్లు పలికెను: శ్రీ కృష్ణుడు ధైర్యము చెప్పిన మాటలలో నీ క్రిందివి గమనింపదగినవి.

చ. 'కలఁగకుఁడీ వధూజనులు కంపము నొందకుఁడీ వ్రజేశ్వరుల్
తలఁగకుఁడీ కుమారకులు తక్కినవారలు రాలవానచే
నలయకుఁడీ పశువ్రజము నక్కడ నక్కడ నిల్వనీకుఁడీ
మెలపున మీకు నీశ్వరుఁడు మేలొసఁగుం గరుణార్ద్రచిత్తుఁడై.'

(భాగ.ద.పూ.912)

ఇచట కరుణార్ద్ర చిత్తుడైనవాడు ఈశ్వరుడు. ఆపై గోవర్ధము నెత్తిన వాడు శ్రీకృష్ణుడు. శ్రీకృష్ణునియందు ఈశ్వర భావనము చేయుట ఇందలి భక్తి రస స్థాయి భావ పరిపోషణ రహస్యము. అంతటితోనాగక పోతన మరి రెండు కంద పద్యములను పేర్కొని తద్భావ భావనము చేయించెను.

కం. 'కిరియై ధరయెత్తిన హరి
కరి సరసిజముకుళమెత్తుగతిఁ ద్రిభువనశం
కర కరుఁడై గోవర్ధన
గిరి యెత్తెం జక్కనొక్కకేలన్ లీలన్.' (భాగ.ద.పు. 914)

కం. 'దండిని బ్రహ్మాండంబులు
చెందులక్రియఁ బట్టియెగరఁ జిమ్మెడు హరికిన్
గొండఁ బెకలించి యెత్తుట
కొండొక పనిగాక యొక్క కొండా తలఁపన్'

(భాగ.ద.పూ. 915)

వరాహ మూర్తియైన విష్ణువును ఉపమాన స్థానమునందుంచి మొదట శ్రీకృష్ణుని విష్ణు సన్నిభునిగా భావింపజేసెడి (914) పద్యమున ఈశ్వర భావమునుండి విష్ణు భావమునకు అనగా నిరాకారమూర్తి భావమునుండి సాకార మూర్తి భావమునకు పఠితలను పయనింపజేసెను. (915). కందమునందు హరికిని శ్రీకృష్ణునకును అభేదము చెప్పుట విశేషము. బ్రహ్మాండమును చెండుక్రియ ఎదురజిమ్ము హరికిని శ్రీకృష్ణునకును అభేద ప్రతిపత్తిని సాధింపజేసి పఠితల హృదయములందు భగవద్గుణ విశేషమును సంభావింపజేసెను. బ్రహ్మాండములతో నాడు హరి గోవర్ధనము గొడుగుగా నెత్తిన బాలునిగా రూపొందించుట.

శా. బాలుండాడుచు నాతపత్రమని సంభావించి పూగుత్తికెం
గేలన్ దాల్చినలీల లేనగవుతోఁగృష్ణుండు దానమ్మహా
శైలంబున్ వలకేలఁదాల్చి విపులచ్ఛత్రంబుగాఁబట్టెనా
భీలాభ్రచ్యుత దుశ్శిలాచకిత గోపీగోప గోపంక్తికిన్'

(భాగ. ద. పూ. 917)

ఈ పద్యమునందు కానబడుచున్నది భగవద్భావనమునకు పాత్రుడైన బాలుడు భక్తిభావనమునకు ఆలంబనమైనది తద్భావనము.

శా. బాలుండీతడు కొండదొడ్డది మహాభారంబు సైరింపఁగా
జాలండోయని దీనిక్రింద నిలువన్ శంకింపఁగాఁ బోలదీ
శైలాంభోనిధి జంతు సంయుత ధరాచక్రంబుపైఁబడ్డ నా
కేలల్లాడదు బంధులార! నిలుఁడీ క్రిందన్ బ్రమోదంబునన్

(భాగ. ద. పూ. 920)

అను పద్యమునందలి భావములతో ప్రకృష్టమగుచున్నది. రతికి వంక విరోధభావము. శంకను తొలగించెడి యీ పద్యము శంకను స్థాయికి అనుకూలముగా అనుసందించుచున్నది. శంక తొలగిన భగవద్రతి భావముతో నందాదులందరు 'జనార్దన కరుణావిలోకనామృత వర్షంబున నాఁకలి సీరు దప్పుల చొప్పెఱుంగక కృష్ణకథావినోదంబుల నుండి'రని పోతన పేర్కొని రసపోషణ సూచనము చేసెను. నందాదుల హృదయమునందు శ్రీకృష్ణభక్తి స్థిరమైనది. ఇంద్రప్రయోగము విఫలమైనది. విరోధభావము నధిగమించి స్థాయి రసత్వము నొందినపుడు విరోధభావమునందలి వైరుధ్యమునకు అస్తిత్వము లేదు. దీనిని సూచించునదియే ఇంద్రుడు శ్రీకృష్ణుని శరణు వేడుట.

స్థాయి, రసత్వమును బొందిన యీ తరుణమున స్థాయి రసపోషణ మర్మజ్ఞుడైన పోతన శ్రీకృష్ణుని చరిత్రమును గోపజనులు కీర్తించిన వైఖరిని విశేషించి వర్ణించెను. నందునిచేత 'కృష్ణుండు లోకరక్షకుండైన పుండరీకాక్షుని నిజాంశమనచు నంతరంగంబున జింతించు[25]నట్లు చేసెను. ఇంద్రునిచేత శ్రీకృష్ణుని నుతింపజేసెను. దీనికితోడు శ్రీకృష్ణునిచేత అతని ఆదివిష్ణుతత్త్వము వెలువరింపజేసెను. చివరకు కామధేనువుచేతకూడ శ్రీహరి విశ్వేశ్వరత్వమును నుతింపజేసెను. పురందరునిచేత గోపగణపతిత్వమునకు గోవిందు నభిషిక్తుని చేయించెను. ఈ ఘట్టములన్నియు చదువు సహృదయులకు సజాతీయభావసంవిధానముచే పరిపుష్టమైన స్థాయి భక్తిరసానుభవముగా అనుభవమునకు అందుచున్నది. నందుని వరుణనగరమునుండి కొనితెచ్చిన ఘట్టము శ్రీకృష్ణుని పరమాత్మ తత్త్వమును ప్రపంచించుచున్నది. ఈ ఘట్టము చివర 'నందాదులు పరమానందంబునుం బొంది, వెఱఁగుపడి హంసస్వరూపకుఁడైన కృష్ణునిం బొడగని పొగడి పూజించిరి.' భక్తి, మోక్షముకంటె గొప్పది అని నందాదుల పరమానందము వ్యంజింపజేయుచున్నది. ఊర్ధ్వలోకమును దర్శించిన గోపాలకశ్రేణికి ఆత్మానందము అనుభూతి కందినను వారు చూచినది కృష్ణుని; వారు పొగడినది కృష్ణుని; వారు పూజించినది కృష్ణుని! భగవద్రూపరతికి గోకులపతియే గతి. ఈ ఘట్టము చదివినచో రూపగోస్వామి పేర్కొనిన లక్షణము సలక్షణముగా సాధింపబడినదని స్పష్టము కాగలదు.

# మధురభక్తి—సంచారిభావముల పరిపోషణము

## 1 నిర్వేదము-

'నీచపురుషేషు ఆక్రోశన, అధిక్షేప, వ్యాధితాడన
దారిద్ర్య, ఇష్టవిరహ, పరసంపద్దర్శనాదిభిః
ఉత్తమేషుతు అవజ్ఞాదిభిః జనితావిషయ
దేషాఖ్యారోదన, దీర్ఘశ్వాస, దీనముఖతాదికారిణి
చిత్తవృత్తిర్నిర్వేదః.'26

నిర్వేదము పుట్టుటకు హేతువులుగా రసగంగాధరకర్త ఆక్రోశ
పేర్కొనెను. ఆక్రోశనము, అధిక్షేపము, వ్యాధి, తాడనము, దారి
ఇష్టవిరహము, ఇతరుల సంపత్తును దర్శించుట మొదలైనవానిచేత నీ
వరతిరస్కారాదులవలన కలిగెడి విషయద్వేషము ఉత్తములకును
ననియు, అట్టి నిర్వేదము కలిగినపుడు క్రోధనము, నిట్టూర్పు, దీనము
మొదలగునవి అనుభావములుగా భాసించుననియు రసగంగాధరాది లా
నిర్దేశము. మధురభక్తి ప్రవక్తయైన రూపగోస్వామి నిర్వేదమను
భావము ఆర్తి విప్రయోగము, ఈర్ష్య, విషాదము, విపత్తి, అపరాధమ
లగు వానివలన కలుగునని పేర్కొనెను. సామాన్యముగా లాక్షణికుల
మును శాంతరసానుకూలమైన భావముగా పేర్కొందురు. మరికొందర
మును శాంతమునకు స్థాయి భావమని తెల్పుదురు. దీనిని వివరించుచ
లంకార సంగ్రహ వ్యాఖ్యాన కర్త నుడివిన మాటలివి:

'తత్త్వజ్ఞానజోనిర్వేదోఽస్యస్థాయీ' వీరు భరతుఁడు ని
స్థాయి భావముగా సూచించెదనందురు. ఎట్లన, స్థాయి భావము
దింటిని౯దెలిపి వ్యభిచారి భావముల గణించు ప్రబ్రపథమున
దమును' బేర్కొనెను. నిర్వేద మమంగళ ప్రాయము. వ్యక్తి

బేర్కొనుచు మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని శాస్త్రాణి ప్రథంతే" అను న్యాయానుసారముగాఁ దెలుపవలసిన భరతముని యమంగళ ప్రాయమగు నిర్వేదమును ప్రథమమున నేల పేర్కొనెను? ఇది యమంగళ ప్రాయమైనను స్థాయి భావముల వెంటనే దీనినిఁ బఠించుటఁ బట్టి స్థాయి భావముగను, వ్యభిచారి భావముగను గూడ దీని నుద్దేశించెను. అతనికి యుద్దేశమే లేనిచో భరతుఁడు దీనిని స్థాయి భావముల వెంటనే వ్యభిచారి భావముల క్రమమునఁ బఠింపడు ఈ నిర్వేదము దారిద్ర్య, వ్యాధి, అవమాన, అధిక్షేప, క్రోధ, ఇష్టజనవియోగ, తత్త్వజ్ఞానాది విభావములవలనఁ గలుగును. కాని తత్త్వజ్ఞానము వలనఁ గలిగిన నిర్వేదమే శాంతమునకు స్థాయి భావము.'[27]

మధుర రసమున నిర్వేదము తత్త్వజ్ఞాన జన్య నిర్వేదము కాదు దీని కాలంబనములుగా పేర్కొనిన ఆర్తి మొదలగునవి శృంగారాది రసముల పట్ల అన్వయించు వానికంటె విశిష్టమైనది. మధుర భక్తిరసమునందు నిర్వేదమునకు హేతువైన ఆర్తి చిత్రమైనది. శ్రీకృష్ణుని జేరబోవు గోపికలను బంధువులు వారించినారు. కాని, శ్రీకృష్ణుని మృదుగీతరవము వారి వీనులకు వెక్కసమై తోచుటనే మోహావేశమునందు శ్రీకృష్ణుని నాథునిగా భావించి చేరవచ్చిరి. కాని అచ్చట శ్రీకృష్ణుడు కానబడలేదు మోహావిష్టలైన గోపికలు తమ ఆశ వమ్మయినదని ఆర్తిగా భజించినారు. ఇది కేవలము మదనార్తికాదు. శ్రీకృష్ణుని పొందవలయునన్న ప్రీతితో కూడుకొనిన రతిని పోషించెడి ఆర్తి. అందుచే దీనియందు మధురస్పర్శ భాసించుచున్నది.

ఉ. 'అక్కట! బంధులున్ మగలు నన్నలుఁ దమ్ములుఁ బుత్రకాదులున్
నెక్కొని రాత్రిఁ బోకుఁడన నీ మృదు గీతరవంబు వీనులన్
వెక్కసమైన వచ్చితిమి వేగమె మోహమునొంది నాథ! నీ
వెక్కడఁబోయితో యెఱుఁగ మిక్రియ నిర్దయుఁ డెందుఁగల్గునే?'
(భాగ. ద. పూ. 1052)

ఈ పద్యము మొదలుకొని 1059 వరకు గల ఘట్టమునందు ఈ ఆర్తి ప్రస్ఫుటముగా కానవచ్చును. పోతన్నగారు ఈ యంశమును -

'అని యిట్లంగనలంచిత స్వరముతో నంకింపుచున్ బాడుచున్
దనురావేయని చీరియేడువ' (భాగ. ద.పూ. 1059)

జగన్మోహనుడైన శ్రీకృష్ణుడు ప్రత్యక్షమయ్యెనని పేర్కొనెను. నిజమునకు ఏడ్చెడి ఆ గోపికల వైఖరిని వర్ణించుచు పోతన్నగారు అంచిత స్వరముతో నంకించినారనియు, పాడినారనియు, పిలిచినారనియు పేర్కొనెడి వర్ణనమునందు ఆర్తియందలి ప్రీతిచ్ఛాయ మధురముగా వ్యక్తీకరింపబడు చున్నది. ఒక విధముగా బంధుజన మోహమునుండి విరక్తమై శ్రీకృష్ణుని యాకార రతియందు అనురక్తమై తద్దర్శనాదులకై ప్రకటించు అత్యంతవేదనా భావమే నిర్వేదమనవచ్చునని స్పష్టమగుచున్నది.

నిర్వేదమునకు మరియొక హేతువు విప్రయోగము. శృంగార రసము నందు విప్రయోగమనగా విప్రలంభ శృంగారముగా గ్రహింపబడినది. అది అభిలాష, ఈర్ష్య, విరహ, ప్రవాస భేదములచే నాలుగు విధములు. నాయికా నాయకుల సంయోగమునకు పూర్వమే కలుగు కోరికను అభిలాష యందురు. దీనినే పూర్వరాగమనియు అందురు. ఇది సంభోగ పర్యంతము వరకు వ్యాపించియుండును. అన్యకాంతాసక్తుడైన నాయకునిపై నాయిక ఈర్ష్య వహించుటవలన కలిగిన విప్రలంభము ఈర్ష్యా విప్రలంభము సంభోగానంత రము కారణాంతరముచే నాయికా నాయకులు విడివిడి పునస్సమాగమాకాంక్ష చే విరహము ననుభవించినచో విరహ విప్రలంభమందురు. శాపకారణముగా గాని కార్య విశేషము వలనగాని నాయికానాయకులు భిన్న ప్రదేశములందుండుట తటస్థించినచో ఆ విరహమును ప్రవాస విప్రలంభమని పేర్కొనవచ్చును. శృంగార రసమునందు భాసించెడు ఈ విప్రయోగము మధురభక్తియందు భక్తులకు భగవంతునికి నడుమ ప్రవర్తిల్లును. ఈ యంశము మధురానగర పౌరకాంతలయందు మధురాతి మధురముగా పోతన చిత్రించెను.

సీ. 'వేణునాదములపై వెలసిన మాధవుం
దధరామృతము లిచ్చి యాదరించుఁ
బింఛదామములపై పెరిఁగిన వెన్నుండు
మస్తకంబునఁదాల్చి మైత్రి నెఱపు
పీతాంబరములపై బెరసిన గోవిందుఁ
డంసభాగములఁ బాయక ధరించు
వైజయంతికలపై వ్రాలినఁ గమలాక్షుఁ
డతి కుతూహలమున నఱుతఁదాల్చుఁ

తే. దనరు బృందావనంబునఁ దరులమైన
గృష్ణుఁ డానందమునఁజేరి క్రీడసల్పు
నెట్టి నోముల నయిన మున్నిట్టి విధము
లేల కామైతి మోయమ్మ! యింకనెట్లు?' (భాగ. ద. పూ. 1353)

ఉ. 'పాపపుబ్రహ్మ! గోపికల పల్లెలలోన సృజింపరాదె ము
న్నీ పురిలోపలన్ మనల నేల సృజించె నరైన నిచ్చలున్
జేపడుఁ గాదె యీ సుభగుఁ జెందెడి భాగ్యము సంతసంబునీ
గోపకుమారుఁ బొంద మును గోపకుమారిక లేమినోచిరో!' (ద. 1354)

పై సీస పద్యమునందు శ్రీకృష్ణుని పొందవలెనన్న గాఢమైన అభిలాష ప్రస్ఫుటముగా కానవచ్చుచున్నది. భౌతికముగా నాతని పొందజాలకపోయి నను అతడుపయోగించు ఉపకరణములుగానైన తామున్నచో నాతనిని బొంద వచ్చునన్న అభిలాష పై సీస పద్యమున వ్యక్తమగుచున్నది. పాపపుబ్రహ్మ అను పద్యమునందు ఈర్ష్యావిప్రలంభము చక్కగా నిరూపింపబడినది.

శ్రీకృష్ణుడు శంఖచూడుని చంపి శిరోరత్నము బలభద్రునకిచ్చి యొక నాడు వనమున కేగెను. ఆనాడు ఇండ్లకడ గోపికలు అతని లీలలు పాడుచు 'తద్విరహవేదనానలభరంబు సహింపక' తమలో నిట్లనుకొనిరని ఏడెనిమిది పద్యములు (1128 నుండి 1135 వరకు దశమస్కంధమున) పోతన కడు రమ ణీయముగా రచించెను.

ఉ. 'ఎప్పుడు ప్రొద్దుగ్రుంకు హరియెప్పుడు గోవులమేపి తెచ్చు మా
కెప్పుడు తన్ముఖాంబుజ సమీక్షణమబ్బునతండువచ్చి న
న్నెప్పుడు గారవించుఁ దుదియెప్పుడు మద్విరహాగ్ని రాశికిన్
జెప్పఁగదమ్మ! బోఁటి! మరుసేఁతలనుల్లము దల్లడిల్లెడిన్.'
(భాగ.ద.పూ. 1131)

మ. 'చెలియా! కృష్ణుఁడు నన్నుఁ బాసి వనముంజేరంగ నయ్యాక్షణం
బులు నాకన్నియు నుండ నుండఁగఁ దగన్ బూర్ణంబులై సాఁగిలో
పలఁదోఁచుంబ్రహరంబులై దినములై పక్షస్వరూపంబులై
నెలలై యబ్దములై మహాయుగములై నిండారు కల్పంబులై.'(ద.1132

విరహ విప్రలంభమునకు ఈ పద్యములు పతాకలవలె భాసించుచున్నవి. శ్రీకృష్ణుని పొందు పొందిన తరువాత కలిగిన విరహమునందలి వేదననిందు పోతన అత్యంత సహజముగా చిత్రించెను.

ప్రవాస విప్రలంభమునకు శ్రీకృష్ణుడు మధురానగరమున కేగిన తరువాత గోపికలు పొందిన విరహము సముచితమైన యుదాహరణ.

ఉ. 'బంధుల బిడ్డలన్ మగల భ్రాతలఁదల్లులఁ దండ్రులన్ మనో
జాంధతఁ జేసి డించి శరణందిన మమ్ము వియోగ దుర్దశా
సింధువునందుఁ ద్రోసి యిటు చేరకపోవుట పాడిగాదు పు
ష్పంధయ! మీ యధీశునకుఁ బాదములంబడియొత్తి చెప్పవే.'(ద. 1464)

ఈ పద్యము ప్రవాస విప్రలంభమునకు మచ్చునకుగై కొన్న ఉదాహరణము. భ్రమర గీతములన్నియు ఈ కోవకు చెందినవే యనవచ్చును. ఇందు శృంగార నాయికా నాయకుల నడుమనున్న రతిభావముకంటె విలక్షణమైన మధురభక్తి స్థాయియైన భగవద్రతి భాసించుచున్నది. ప్రవాస విప్రలంభమునందే భగవద్రతి పుష్టిమంతముగుటకు అవకాశము కలదు. అభిలాష విప్రలంభమునందు భగవద్రతి వాంఛాంకుర స్థితిని భజించి ఈర్ష్యా విప్రలంభమునందు శాఖావిస్తృతినిదాల్చి విరహ విప్రలంభమునందు పుష్పసముదాయమును సంతరించుకొని ప్రవాస విప్రయోగమునందు ఫలయోగస్థితిని పొందుటకు వీలున్నదని గోపికల చరిత్రయే గొంతెత్తి చాటుచున్నది. భగవద్విరహము నిర్వేదమునకు హేతువైనట్లు చిత్రించుట భాగవత తాత్పర్యము. ఈ యంశమును శ్రీకృష్ణుని వాక్యములందు పోతన ధ్వనింపఁజేసెను.

మ. 'చెలువల్ దవ్వుల నున్న వల్లభులపైఁ జిత్తంబులం గూర్తురు
త్కలికన్ జేరువ వారికంటె నదియుంగా కెప్పుడున్ నన్ను మీ
రలు చింతింపుచునుండఁ గోరి యిటు దూరస్థత్వమున్ బొందితిం
దలఁకం బోలదు నన్నుఁ బొందెదరు నిత్యధ్యానపారీణలై.'(ద. 1473)

ఈ పద్యము శృంగారరసమునకెంత వర్తించునో మధుర భక్తికి కూడనంత వర్తించును. కృష్ణుడు దూరస్థుడై యున్నప్పుడు విరహము, దానివలన ఆర్తి నిర్వేదము జనించును. దానికి భయపడక నిత్యధ్యానపారీణలై గోపికలు శ్రీకృష్ణుని పొందవలెనని భగవంతుని నిర్దేశము. శృంగార విప్రలంభము మధురభక్తి విప్రలంభముగా మారెడి విధమును నిర్వేదమునకది హేతువయ్యెడి వైనమును ఈ పద్యమునందు పోతన నిపుణముగా నిబంధించెను.

తరువాతి హేతువు ఈర్ష్య. విప్రలంభమునందు నాయిక నాయకు దన్య కాంతాసక్తుడైన సూచనలు కానబడగా దానిని గాంచి ఈర్ష్యను ప్రకటించుటను ఈర్ష్యావిప్రలంభముగా పేర్కొందురు దానినేకాక ఉజ్జ్వల నీలమణికర్త ఈర్ష్యను నిర్వేదమునకు కారణముగా పేర్కొనుట యిందు గమనింపదగినది. దీనిని మధురభక్తికి అన్వయించుకొనినచో శ్రీకృష్ణుని జాడ కానని గోపికలు అత దన్యకాంతతో కలిసి తిరిగిన జాడలుగని ఈర్ష్యపొంది వేదన ననుభవించుచు నిర్వేదమున కనుకూలమైన చిత్తప్రవృత్తిని భజించెదరు. దీనిని నిర్వేదహేతు వైన ఈర్ష్యగా భాగవతమునందు గ్రహింపవచ్చును.

సీ. 'కొమ్మకుఁబువ్వులు కోసినాఁడిక్కడ
మొనసి పాదాగ్రంబు మోపినాడు
సతినెత్తుకొని వేడ్కఁ జరిగినాఁ డిక్కడఁ
దృణములోఁ దిదె తెలవజాడ
ప్రియకు ధమ్మిల్లంబు పెట్టినాఁడిక్కడఁ
గూర్చున్న చొప్పిదె కొమరు మిగులు
నింతికిఁగెమ్మోవి యిచ్చినాఁడిక్కడ
వెలఁది నిక్కినగతి విశదమయ్యె

ఆ. సుదతితోడ నీరుఁ జొచ్చినాఁడిక్కడ
జొచ్చితా వెడలిన చోటులమరెఁ
దరుణిఁ గామకేళిఁ దనిపినాఁడిక్కడ
ననఁగి పెనఁగి యున్న యందమొప్పె.' (ద. 1027)

శృంగారమునందైనచో అన్యకాంతాసక్తియందు అంగజమైన రతి భావింప బడును. మధురభక్తియందు భాగవతమైన రతియే ఉపాదేయము. పై పద్యము నందు అట్టి రతి భావనయే పోతన ప్రపంచించినాడని భావింపవలెను. ఈ ఈర్ష్యా భావము శ్రీకృష్ణుడు అన్యకాంతను పొందినపుడేకాక అన్యనగరమందు వసించు చున్నందులకు కూడా గోపిక లీర్ష్య పడిన ఘట్టములు కలవు. భ్రమర గీతల యందు గోపికలు శ్రీకృష్ణుని మధురా నగర నివాసమును భావించి అధిక్షేప రూపమున ఈర్ష్యను అత్యంత రతిని మధురముగా వ్యక్తము చేసిన ఘట్టములు కూడ దీనికి ఉదాహరణముగా గ్రహింపవచ్చును.

సీ. 'కాంచన రత్న సంఘటిత సౌధంబులే
మా కుటీరంబులు మాధవునకు
వివిధ నరేంద్ర సేవిత రాజధానియే
మా పల్లె యదువంశ మండనునకు
సురభి పాదప లతాశోభి తారామమే
మా యరణ్యము సింహ మధ్యమునకుఁ
గణనీయ లక్షణ గజతురంగంబులే
మా ధేనువులు కంస మర్దనునకు

తే. రూప విభ్రమ నైపుణ రూఢలైన
మగువలమె మేము మన్మథునకు
నేల చింతించు మముఁ గృష్ణుఁడేలతలచుఁ
బృథివి నధిపులు నూతన ప్రియులుగారె.' (ద. 1465)

మధురా వైభవమును రేపల్లె పేదరికమును పద్యమునందు తులనాత్మకముగా వివేచించుటలో నిట్టి ఈర్ష్య ప్రస్ఫుటముగా ప్రతీయమానమగుచున్నది. శృంగారమునందుకంటె మధుర భక్తియందు ఇట్టి ఈర్ష్య నిర్వేదమునకు హేతువగుట విశేషము.

**విషాదము** - ఇష్టము సిద్ధింపకుండుట వలనను రాజగురు ప్రభృతులనెడ చేసిన అపరాధములు వలనను కలిగిన అనుతాపము విషాదముగా లక్షణ గ్రంథములందు చెప్పబడినది. భక్తులకు కూడ ఇష్టాసిద్ధివలన విషాదము కలుగును. భక్తుల కత్యంత ప్రియమైనది భగవత్ సాన్నిధ్యము. భాగవతమునందు మధుర భక్తికి ప్రతీకలైన గోపికలు కృష్ణవిరహమును భరించలేక పొందెడి విషాదమును పోతన్న చక్కగా చిత్రించెను.

సీ. 'విరహాగ్ని శిఖలతో వెడలు నిట్టూర్పుల
ముమ్మరంబులఁ గంది మోవులెండ
గన్నుల వెడలెడి కజ్జల ధారలు
కుచకుంకుమంబుల గ్రొవ్వు బాపఁ
జెక్కులఁ జేర్చిన చేతుల వేఁడిమి
మోముఁ దమ్ముల మేలి మురువుడిందఁ
బొరిఁ బొరిఁ బుంఖాను పుంఖంబులై తాఁకు
మదను కోలల ధైర్యమహిమ లెడల

తే. దుఃఖ భరమున మాటలు తొట్రుపడఁగఁ
ప్రియము లాడని ప్రియుఁ జూచి బెగ్గడిల్లి
చరణములు నేల వ్రాయుచు సంభ్రమమునఁ
గాంత లెల్లను వగల నాక్రాంతలగుచు.' (భాగ. ద. పూ. 985)

తరువాతి హేతువు విపత్తి కలిగినపుడు తమ దైన్యమును ప్రకటించుచు శ్రీకృష్ణుని కుయివెట్టి విలపించు ఘట్టములందు నిర్వేద హేతువైన విపత్తిని దర్శింప వచ్చును. వనమున దవాగ్ని ప్రజ్వలించినపుడును ఇంద్రుడు సంవర్తకాది మేఘములచే ప్రళయవృష్టి కురిపించినపుడును -

శా. 'నీ చుట్టాలకు నాపదల్ గలుగునే నేమెల్ల నీవారమ
న్యాచారంబు లెఱుంగ మీశుఁడవు మా కాభీలదావాగ్ని నేఁ
డేచందంబున నింక దాఁటుదుము మమ్మీక్షించి రక్షింపవ
న్నా! చంద్రాభ! విపన్నులన్ శిఖివితాన చ్ఛన్నులన్ ఖిన్నులన్
(ద. 745)

ఉ. 'అక్కట! వానఁదోఁగి వ్రజ మాకులమయ్యె గదయ్య! కృష్ణ నీ
వెక్కడనుండి యింతతడవేల సహించితి నీపదాబ్జముల్
దిక్కుగనున్న గోపకులు దీనతనొంద భయాపహారివై
గ్రక్కునగావకిట్లునికి కారుణికోత్తమ! నీకుఁ బాడియే?' (ద.905)

నిర్వేదమునకు మరొక హేతువు అపరాధము. నాయకు డొనరించిన శృంగారపరమైన అపరాధము అనగా అన్యకాంతాశక్తిని ప్రకటించుటయే యపరాధమని లాక్షణికులు పేర్కొందురు. మధురభక్తియందు గోపికలు శ్రీకృష్ణు డన్యకాంతాసక్తుడైనట్లు భావించి అట్టి అపరాధమును పేర్కొనుచు విలపించిన ఘట్టములు భ్రమరగీతములందు ప్రసిద్ధములు.

మ. 'ఒక పుష్పంబందలి తేనెద్రావి మధుపా! యుత్సాహివై నీవు వే
ఱొకటిం బొందెడిభంగి మమ్మధర పీయూషంబునం దేల్చి మా
యకలంకోజ్జ్వల యౌవనంబుఁగొని యన్యాసక్తుఁడయ్యెన్ విభుం
డకటా! యాతనికెట్లు దక్కెఁసిరి మిథ్యాకీర్తి నమ్మెన్ జుమీ!'
(ద.1457)

ఇది శృంగార రసమునందెంత ఉజ్జ్వలముగా భాసించునో మధురభక్తి యందును అంత సముజ్జ్వలముగా శోభించును. శృంగార స్థాయియైన రతియందు భాసించెడి అపరాధము విప్రలంభపోషకమగునుగాని నిర్వేద హేతువుకాదు. మధురభక్తియందు నిర్వేదహేతువై భగవద్రతిని పరిపోషించి సంచారి భావమునకు సంపుష్టిని చేకూర్చును. ఇట్లు ఆర్తి విప్రయోగము, ఈర్ష్య విషాదము, విపత్తి, అపరాధములు అనునవి హేతువులుగా నిర్వేదమను సంచారిభావము భగవద్రతి రూపమైన స్థాయి నెట్లు పోషించునో రేఖామాత్ర ముగా నిందు సమీక్షించుటయైనది.

దైన్యము :

'దుఃఖ దారిద్ర్యాపరాధాది జనితః స్వాపకర్ష
భాషణాది హేతుశ్చిత్తవృత్తి విశేషోదైన్యం'[28]

దైన్యము జనించుటకు హేతువులుగా దుఃఖమును, దారిద్ర్యమును, అప రాధము మొదలగు వానిని లాక్షణికులు పేర్కొందురు. ఉజ్జ్వలనీలమణి భయ త్రాసములను కూడ హేతువులుగా పేర్కొనినది. స్వాపకర్ష భాషణములవలన దైన్యము వ్యక్తమగుచున్నది. దశమ స్కంధమునందలి భ్రమర గీతములలో దుఃఖ జనితమైన దైన్యభావమునకు ఈ క్రింది పద్య ముదాహరణము:

సీ. 'తనుఁబాసి యొక్కింత తడవైన నిటమీఁద
నేలపై మేనులు నిలువ వనుము
నేలపై మేనులు నిలువక యిటమున్న
ధైర్యంబు లొక్కటఁ దలఁగు ననుము
ధైర్యంబు లొక్కటఁ దలఁగిన పిమ్మటఁ
జిత్తంబు లిక్కడఁ జిక్క వనుము
చిత్తంబు లిక్కడఁ జిక్కక వచ్చినఁ
బ్రాణంబు లుండక పాయుననుము

తే. ప్రాణములు పోవ మఱి వచ్చి ప్రాణ విభుఁడు
ప్రాణి రక్షకుఁడగు తన్నుఁ బ్రాణు లెల్ల
జేరి దూఱంగ మఱి యేమి సేయువాఁడు
వేగ విన్నపమొనర్పింపవే మహాత్మ!' (భాగ.ద.పూ. 1480)

దారిద్ర్య హేతుజమైన దైన్యము మధురభక్తియందు కానరాదు. కాని, భయ సంజనితమైన దైన్యము మధురభక్తియందు కానవచ్చును. అక్రూరుడు బలరామకృష్ణులను మధురకు కొనిపోవుచున్నాడను వార్త వినగానే భయాందోళిత హృదయలైన గోపికలు దైన్యమును వెలార్చిన పద్యములు భాగవతము నందు ప్రసిద్ధములు

ఉ. 'హరి నవ్వుల్ హరి మాటలున్ హరి మనోజ్ఞాలాపముల్ లీలలున్
హరి వేడ్కల్ హరి మన్ననల్ హరికరాబ్జాలంబ నాహ్వానముల్
హరిణీలోచను లందఱున్ దలంచుపాయంబెట్లొ కోయంచులో
నెరియన్ ముచ్చటలాడిరంతగములై యేకాంత గేహంబులన్ (ద.1211)

ఉ. మేటి గృహస్థు బ్రహ్మ యని మిక్కిలి నమ్మితి! మమ్మ చూడనే
పాటియులేదు మాకుఁబరిపాలకుఁడైన సరోజ నేత్రుని
చ్చోట వసింపనీక నొకచోటకిఁ బోవిధించి పిన్నబి
డ్డాటలు చేసెనీ సుఖము లక్కట! భారతికైనఁ జెప్పరే' (ద. 1213).

అపరాధ జనితమైన దైన్యమునకు ఈ క్రింది పద్యములు ఉదాహరణములు:

ఉ. అత్తలు మామలున్ వగవ నాడిక కోడక నాథులన్ ద్రపా
యత్తలఁజేసి యిల్వరుస లాఱడివోవఁగ నీదు నవ్వులన్
మెత్తని మాటలన్ మరుఁడు మేకొని యేఁచిన వచ్చినార మే
పొత్తులనొల్లమో పురుషభూషణ! దాస్యములిచ్చి కావవే!' (ద. 993)

ఉ. 'అక్కట! బంధులున్ మగలు నన్నలుఁ దమ్ములుఁ బుత్రకాదులున్
వెక్కొనిరాత్రిఁబోకుఁడన నీ మృదుగీతరవంబు వీనులన్
వెక్కసమైన వచ్చితిమి వేగమె మోహమునొంది నాథ! నీ
వెక్కడఁబోయితో యెఱుఁగ మీక్రియ నిర్దయుఁ డెంతుఁ గల్గునే'
(ద. 1052)

పై పద్యములందు గోపికలు బంధువులను వీడివచ్చిన అపరాధమును తెల్పొనుచు శ్రీకృష్ణుని దర్శనార్థమై దీనముగా విలపించుట కలదు కావున అపరాధ జనిత దైన్యమునకు పైపద్యములను ఉదాహరణముగా గ్రహింపవచ్చును.

గ్లాని :

'ఆధివ్యాధిజన్యబలహాని ప్రభవోవైవర్ణ్య శిథిలాంగత్వ,
దృగ్భ్రమణాది హేతుః దుఃఖ విశేషోగ్లానిః'
అనియు 'వ్యాధ్యాది ప్రభవ బలనాశఃగ్లానిః'

అనియు, 'బలస్యాపచయోగ్లాని రాధివ్యాధి సముద్భవః'29 అనియు లాక్షణికులు పేర్కొనిరి. రూపగోస్వామి శ్రమవలనను, రతిశ్రమవలనను ఏర్పడునది గ్లానియని భావించెను. ఆధివ్యాధులవలన కలిగెడి గ్లాని మధుర భక్తికంతగా అన్వయించదు. శరద్రాత్రియందు శ్రీకృష్ణుడు కనుమొరగి చనిన సమయమున గోపికలు భ్రాంతచిత్తలై పున్నాగము మొదలైన లతలను వనితలుగా భావించి శ్రీకృష్ణునిగురించి ప్రశ్నించుచు వెదకుచు వేసారిన ఘట్టము నందలి ఈ పద్యము భ్రాంతివలన కలిగిన గ్లానికి ఉదాహరణముగా పేర్కొన వచ్చును.

సీ. 'పున్నాగ! కానవే పున్నాగ వందితుఁ
దిలకంబ! కానవే తిలకనిటలు
ఘనసార! కానవే ఘనసార శోభితు
బంధూక! కానవే బంధుమిత్రు
మన్మథ! కానవే మన్మథాకారుని
వంశంబ! కానవే వంశధరునిఁ
జందన! కానవే చందన శీతలుఁ
గుందంబ! కానవే కుందరదను

తే. నింద్రభూజమ! కానవే యింద్ర విభవుఁ
గువల వృక్షమ! కానవే కువలయేశుఁ
బ్రియక పాదవ! కానవే ప్రియవిహారు
ననుచుఁ గృష్ణుని వెదకిరయ్యబ్జముఖులు.' (ద. 1009)

ఇందు అచేతనములను చేతనములుగా భావించుటయందు భ్రాంతికలదు. తాము వెదకి వేసారుటచే సమీపవృక్షములందలి లతలను సంబోధించుచు శ్రీకృష్ణునుని జాడను తెలుపమని కోరుటయైనది. ఇందు భ్రాంతిజనిత గ్లాని అనుసంచారి వ్యంగ్యముగా ప్రతీయమాన మగుచున్నది. రతమువలన కలిగిన గ్లానికి రాస క్రీడాఘట్టమునందలి ఈ క్రింది పద్యము చక్కని యుదాహరణము:

చెలువ యొక్కతె చెక్కు( జెక్కుతో మోపిన
విభుఁడు తాంబూల చర్వితము వెట్టె
ాడుచు నొకలేమ యలసినఁ బ్రాణేశుఁ
డున్నత దోస్స్తంభ మూఁత నేసెఁ
ెమరించి యొక భామ చేరినఁ గడగోరఁ
జతురుఁడు కుచఘర్మజలము వాపె
లకంబు లొకయింతి కలిక చిత్రకరేఖ
నంటినఁ బ్రియుఁడు పాయంగ దువ్వెఁ
డఁతియొకతె పాడిపాగి డస్సిన యధ
ిమృతమున నాథుఁ డాదరించె
ిర యొక్కసతికి నంసావృతంబైనఁ
ింతుఁ డురముఁ జేర్చి కౌగిలించె.' (ద. 1095)

ాగవతమునందు రతమువలన గలిగెడి గ్లానిని వర్ణించుట అరుదుగా
ు. శ్రీకృష్ణ సాంగత్యమువలన రమణులు పారవశ్యము పొందినారన్న
ు భాగవతకర్త విస్తారముగా వర్ణించెను. కాని పై పద్యమునందు
రతమువలన కలుగు గ్లానిని గోపికలయందు వ్యంగ్యముగా సూచిం
పడుచున్నది. ఆడుచు నొకలేమ అలసిన అనియు, పడతియొకతె పాడి
్సిన అనియు ఇరువురు గోపికలపట్ల గ్లానిని వాచ్యము చేసినను మిగి
ట్ల దానిని వ్యంగ్యముగా సూచించెనని గ్రహించుటకు వీలుపడు
చెక్కును చెక్కుతో మోపుట యందును చెమరించి యొక బాల దరి
ందును ఘర్మజలములచే నలకములు తిలకములపై నొరగుటయందును,
సతికి నంసావృతమగుట యందును ఆయా నాయికల గ్లాని వ్యంగ్య
ది. ఒక విధముగా రతమునకు పూర్వమే యేర్పడిన ఈ గ్లాని నాయి
్క మౌగ్ధ్యమును, సాత్త్వికగుణమును వ్యక్తము చేయుచున్నవి.

:

శ్రమః ఖేదోఽధ్వరత్యాదేర్జాతః స్వేదాతి భూమికృత్ '30

ని రసగంగాధరకర్త శ్రమమును నిర్దేశించెను. రూపగోస్వామి అతిగా
ిలనను, నృత్యము చేయుటవలనను, రతివలనను కలిగినది శ్రమ

యనియు అది స్వేదాతిశయముచే వ్యక్తమగునని పేర్కొనెను. యమునా నదీ తీరమందు అంతర్హితుడైన శ్రీకృష్ణుని కానక గోపికలు సైకత స్థలములందు అన్వేషించుచు తిరిగిన ఘట్టమునందు మార్గాయాసము వలన కలిగిన శ్రమము వ్యంగ్యముగా స్ఫురించుచున్నది.

మ. 'అని యిబ్భంగి లతాంగులందఱును బృందారణ్యమం దీశ్వరున్
వనజాక్షున్ బరికించి కానక విభున్ వర్ణింపుచున్ బాడుచున్
మనముల్ మాటలు చేష్టలున్ క్రియలు నమ్మానాథుపైఁజేర్చి వే
చని రయ్యామున సైకతాగ్రమునకున్ సంత్యక్తగేహేచ్ఛలై'
(ద. 1035).

ఇందు విభుని వర్ణించుచు పాడుచు త్రికరణము లేకోన్ముఖములుకాగా యమునానదీ సైకతములందు వేచనిరి యని వర్ణించుటలో వారి త్రిప్పటలు స్పష్టమగుచున్నవి. భాగవతమునందు శృంగారనాయికలయందు కానబడు శ్రమము అంతగా వర్ణితము కాదు. మధురభక్తిప్రేరితలైన గోపికలు ఋషుల వలె శ్రీకృష్ణు నన్వేషించుట యోగముగా భావింపబడుచున్నది. కావున శ్రమ మును వర్ణించక శ్రమ కలుగుటకు హేతువులను మాత్రము వర్ణించి భాగవత కర్త ఔచిత్యము పాటించినాడని భావించవచ్చును. ఈ దృష్టితో పై పద్యము నిందుల కుదాహరణముగా పేర్కొనుటయైనది. నృత్యమువలన కలిగిన శ్రమ మునకు ఈ క్రింది పద్యము సముచితోదాహరణము:

కం. 'ఆడుచుఁ బాడుచు నందొక
చేడియ మంజీరమంజు శింజిత మమరం
గూడి హరికరము చనుఁగవ
పైడాయం దిగిచె జఘన భారాలసయై' (ద. 1093)

ఇందు నృత్యమువలన కలిగిన శ్రమము సర్వాంగముగా వ్యంజితమై నది. రతమువలన కలిగిన శ్రమమును భాగవత కర్త వాచ్యము చేయకపోయి నను తన్మయత్వము నందు రంగరించి అభివర్ణించెను.

సీ. 'చెలువ యొక్కతె చెక్కుఁ జెక్కుతో మోపిన
విభుఁడు తాంబూల చర్వితము వెట్టె
నాడుచు నొకలేమ యలసినఁ బ్రాణేశుఁ
డున్నత దోస్స్తంభ మూఁత సేసెఁ,
జెమరించి యొక భామ చేరినఁ గడగోరఁ
జతురుఁడు కుచఘర్మజలము వాపె
నలకంబు లొకయింతి కలిక చిత్రకరేఖ
నంటినఁ బ్రియుఁడు పాయంగ దువ్వెఁ

ఆ. బడఁతియొకతె పాడిపాడి డస్సిన యధ
రామృతమున నాథుఁ డాదరించె
హార మొక్కసతికి నంసావృతంబైనఁ
గాంతుఁ డురముఁ జేర్చి కౌగిలించె.' (ద. 1095)

భాగవతమునందు రతమువలన గలిగెడి గ్లానిని వర్ణించుట అరుదుగా కనపడును. శ్రీకృష్ణ సాంగత్యమువలన రమణులు పారవశ్యము పొందినారన్న అంశమును భాగవతకర్త విస్తారముగా వర్ణించెను. కాని పై పద్యమునందు మాత్రము రతమువలన కలుగు గ్లానిని గోపికలయందు వ్యంగ్యముగా సూచించుట కానవడుచున్నది ఆడుచు నొకలేమ అలసిన అనియు,పడతియొకతె పాడి పాడి డస్సిన అనియు ఇరువురు గోపికలపట్ల గ్లానిని వాచ్యము చేసినను మిగిలినవారిపట్ల దానిని వ్యంగ్యముగా సూచించెనని గ్రహించుటకు వీలుపడుచున్నది. చెక్కును చెక్కుతో మోపుట యందును చెమరించి యొక బాల దరి చేరుటయందును ఘర్మజలములచే నలకములు తిలకములపై నొరగుటయందును, హార మొక సతికి నంసావృతమగుట యందును ఆయా నాయికల గ్లాని వ్యంగ్యమగుచున్నది. ఒక విధముగా రతమునకు పూర్వమే యేర్పడిన ఈ గ్లాని నాయికల యొక్క మౌగ్ధ్యమును, సాత్త్వికగుణమును వ్యక్తము చేయుచున్నవి.

శ్రమము :

'శ్రమః ఖేదోఽధ్వరత్యాదేర్జాతః స్వేదాతి భూమికృత్'30

అని రసగంగాధరకర్త శ్రమమును నిర్దేశించెను. రూపగోస్వామి అతిగా తిరుగుటవలనను, నృత్యము చేయుటవలనను, రతివలనను కలిగినది శ్రమ

యనియు అది స్వేదాతిశయముచే వ్యక్తమగునని పేర్కొనెను. యమునా నదీ తీరమందు అంతర్హితుడైన శ్రీకృష్ణుని కానక గోపికలు సైకత స్థలములందు అన్వేషించుచు తిరిగిన ఘట్టమునందు మార్గాయాసము వలన కలిగిన శ్రమము వ్యంగ్యముగా స్ఫురించుచున్నది.

మ. 'అని యిబ్బంగి లతాంగులందఱును బృందారణ్యమం దీశ్వరున్
వనజాక్షున్ బరికించి కానక విభున్ వర్ణింపుచున్ బాడుచున్
మనముల్ మాటలు చేష్టలున్ గ్రియలు నమ్మానాథుపైఁజేర్చి వే
చని రయ్యామున సైకతాగ్రమునకున్ సంత్యక్తగేహేచ్ఛమై'
(ద. 1035).

ఇందు విభుని వర్ణించుచు పాడుచు త్రికరణము లేకోన్ముఖములుకాగా యమునానదీ సైకతములందు వేచనిరి యని వర్ణించుటలో వారి త్రిప్పటలు స్పష్టమగుచున్నవి. భాగవతమునందు శృంగారనాయికలయందు కానబడు శ్రమము అంతగా వర్ణితము కాదు. మధురభక్తి ప్రేరితలైన గోపికలు ఋషుల వలె శ్రీకృష్ణు నన్వేషించుట యోగముగా భావింపబడుచున్నది. కావున శ్రమ మును వర్ణించక శ్రమ కలుగుటకు హేతువులను మాత్రము వర్ణించి భాగవత కర్త ఔచిత్యము పాటించినాడని భావించవచ్చును. ఈ దృష్టితో పై పద్యము నిందుల కుదాహరణముగా పేర్కొనుటయైనది. నృత్యమువలన కలిగిన శ్రమ మునకు ఈ క్రింది పద్యము సముచితోదాహరణము:

కం. 'ఆడుచుఁ బాడుచు సందొక
చేడియ మంజీరమంజు శింజిత మమరం
గూడి హరికరము చనుఁగవ
పైడాయం దిగిచె జఘన భారాలసయై' (ద. 1093)

ఇందు నృత్యమువలన కలిగిన శ్రమము సర్వాంగముగా వ్యంజితమైనది. రతమువలన కలిగిన శ్రమమును భాగవత కర్త వాచ్యము చేయకపోయి నను తన్మయత్వము నందు రంగరించి అభివర్ణించెను.

కం. 'హరి తనుసంగ సుఖంబునఁ
బరవశలై వ్రేతలెల్లఁ బయ్యెదలు నిజాం
బరములు నెఱుఁగమి చోద్యమె
సురసతు లోక్షించి కరఁగి చొక్కిరిమింటన్.' (ద. 1097)

**మదము :**

'మదాద్యుపయోగ జన్మా ఉల్లాసాఖ్యః శయన హసితాది
హేతుశ్చిత్తవృత్తి విశేషోమదః'31

మద్యపానము వలన కలిగినట్టియు శయన హసితాదులను కలిగించు నట్టియు నుల్లాసమగు చిత్తవృత్తి మదము. దీనిని మరొక విధముగా —

'సమ్మోహానంద సందోహోమదో మద్యోపయోగజః'
'మద్యోపయోగము వలనఁ బుట్టిన సమ్మోహానందముల కలయిక.'32

రూపగోస్వామియు మధురపానమువలన జనించెడిది మదమని పేర్కొనెను. కాని, ఆంధ్ర భాగవతమున గోపికలు మద్యపాన మొనర్చినట్లు వర్ణితము కాలేదు. అదియొక విధముగా ఔచిత్య పోషకము. కాని మధువునకు బదులు అధరామృత పానమును భాగవత కర్త యెడనెడ పేర్కొనెను. ఉదాహరణమునకు—

కం. 'బుధ రంజనియును సూక్తయు
మధురయునగు నీదు వాణి మరఁగించెను నీ
యధరామృత సంసేవన
విధి నంగజ తాపమెల్ల విడిపింపఁగదే.' (ద. 1043)

ఆ. 'సురతవర్ధనంబు శోకాపహరణంబు
స్వరిత వంశనాళ సంగతంబు
నన్యరాగజయమునయిన నీ మధురాధ
రామృతలోనఁ దాపమార్పుమీశ!' (భాగ.ద.పూ. 1050)

భగవద్రతియందు మదిరాజనిత మదముకంటె అధరామృతపాన సంజనిత సమ్మోదమే సాత్త్వికము సార్థకము.

గర్వము:-

'రూపధన విద్యాది ప్రయుక్తాత్మోత్కర్ష జ్ఞానాధీన
పరావహేలనం గర్వః'[233]

రూపము ధనము విద్య మొదలగువానిచే జనించిన ఆత్మోత్కర్ష జ్ఞానము వలన కలిగిన పరావహేళనము గర్వము-అని రసగంగాధరకర్త పేర్కొనెను.

రూపగోస్వామి సౌభాగ్యరూప గుణమువలనను సర్వ శ్రేష్ఠాశ్రయము వలనను, ఇష్టవస్తు ప్రాప్తివలనను గర్వము దయించునని పేర్కొనెను. మధుర భక్తియందు భగవంతుని సాన్నిధ్యమే సౌభాగ్యము. అతనిని పొందగలిగిన రూపమే రూపము. అతని వాల్లభ్యమును పొందగలిగిన గుణమే గుణము. అతని ఆశ్రయమే సర్వశ్రేష్ఠాశ్రయము. శ్రీ కృష్ణుడే ఇష్టవస్తువు. శ్రీ కృష్ణుడు ఇతరులను లెక్కింపక తనతో విహరించినచో నా గోపికయొక్కొక్కసారి గర్వించును. ఆ గర్వముతో కన్నుమిన్నుకానక కమలాక్షునిపై యధికారము చూపబోయి ఆ కల్యాణగుణధాముని కానలేక తల్లడిల్లిన ఘట్టములు కూడ భాగవతమునందు కలవు.

సీ. 'పతులదైన్యంబును భామల క్రౌర్యంబుఁ
 జూపుచు విభుఁడొక్క సుదతి తోడ
విహరింప నదియెల్ల వెలఁదుల వర్జించి
 నాయొద్దనున్నాఁడు నాథుఁడనుచు
గర్వించి రాఁజాలఁగమలాక్షుమూఁపున
 నిడుకొను మనుడు నయ్యీశ్వరుండు
మొఱఁగి పోయినఁ దాపమును బొంది 'యోకృష్ణ!
 యెక్కడఁ జనితి ప్రాణేశ! రమణ!

తే. నీకు వరవుడ నయ్యెద నిలువు'మనుచు
వగవఁ గొందఱు కాంతలావనితఁ జూచి
వరుఁడు మన్నింప గర్వించి వనజనేత్రి
చిక్కెనేఁడని వెఱగును జెందిరపుడు.' (భాగ. ద. పూ 1032)

అను పద్యము దీనికి చక్కని తార్కాణము. సౌభాగ్యమనగా పతివాల్లభ్యము. అదిరూపగుణమువలన సిద్ధించినచో గర్వకారణమగును. నిజమునకీ

గర్వమునకు చెప్పదగిన అత్యుత్తమోదాహరణము సత్యభామ. శ్రీకృష్ణుని అష్టమ భార్యయగు లక్షణ తన స్వయంవరోదంతమును ద్రౌపదికి ఎరిగించెడి సందర్భమున శ్రీకృష్ణలబ్ధియను ఇష్టలాభమును పొందినపుడు తనకు కలిగిన ఆనందమును వివరించెను. ఇందు ఇష్టలాభమువలన కలుగు గర్వాతిశయము కనిపించుచున్నది.

చ. 'నరపతులం గనుంగొని మనంబున వారిఁ దృణీకరించి మ
త్కరజలజాత దివ్యమణి కాంచన మాలిక నమ్మురారి కం
ధరమున లీలమైనిడి పదంపడి నవ్యమధూకదామమూ
హరి కబరిం దగిల్చితి నయంబువఁ గన్నుల లజ్జదేఱగన్'

(భాగ. ద. ఉ. 1098)

శంక:

'కి మనిష్టం మమ భవిష్యతీత్యాకారాశ్చిత్తవృత్తి విశేషశ్శంకా"34

అని రసగంగాధరకర్త శంకకు నిర్వచనమిచ్చెను. తనకేమైన కీడు జరుగునేమోయని నాయిక శంకించుట శంక. ఈ లక్షణము రూపగోస్వామి ఉజ్జ్వల నీలమణియందు కానరాదు. ఐనను ఇట్టిది రససంచారిగా భాగవతము నందు ప్రసిద్ధము. రుక్మిణీకల్యాణఘట్టమున శ్రీ కృష్ణుడు తనను కదియరాడని శంకించి రుక్మిణి పలికిన పలుకులు నాయిక తనకనిష్టమగునేమోయను చింతతో కూడిన చిత్తవృత్తి రూపమైన శంకకుదాహరణము.

శా. 'లగ్నం బెల్లి వివాహముం గదిసె నేలా రాఁడు గోవిందుఁడు
ద్విగ్నం బయ్యెడి మానసంబు వినెనో వృత్తాంతమున్ బ్రాహ్మణుం
డగ్ని ద్యోతనుఁ డేటికిం దడసె నాయత్నంబు సిద్ధించునో
భగ్నం బై చనునో విరించి కృతమెట్లుంగిన్ బ్రవర్తించునో!'

(భాగ. ద. పూ. 1725)

రూపగోస్వామి యిచ్చిన లక్షణము ప్రకారము చౌర్యమువలనను, అపరాధమువలనను, పరక్రౌర్యమువలనను కలిగెడిది శంక. శంక - నాయిక చౌర్యాదులు తనకు వర్తించు నట్లుగాని, నాయకునకు వర్తించునట్లుగాని, లేక ఉభయులకు వర్తించునట్లుగాని భావించుట సంభావ్యము. ఇచట చౌర్యమనగా వస్తువులకు దొంగలించుట మాత్రమేయని గ్రహించుట పొసగదు. నాయిక హృదయ చౌర్యమును కూడ భావించ వచ్చును.

౦. 'పురసతుల విలోకనములు
సరసాలాపములు నర్మసంభోగములున్
మరగి హరి మనలనొల్లఁడు
నరవరు లోయమ్మ! నూతన ప్రియులుగదే' (ద. 1218)

ఇందు పురసతులు శ్రీకృష్ణుని మనసు దొంగిలించినారను శంకతో పికలు బాధనొందిన భావము స్పష్టము. దీనినే మధుర భక్తియందు చౌర్యము ౦న కలిగెడి శంకగా అన్వయింప వచ్చును. అపరాధమనగా నాయిక నవజ్ఞ ౦ మరియొక నాయికపై ఆసక్తిని ప్రకటించుట.

మధురానగర వనితలపై వలపుకొని రేపల్లెలో వసించు గోపికలను కృష్ణుడు విస్మరించెనని గోపికలు శంకించెడి యీ పద్యము అపరాధమూలక న శంకకు అమూల్యమైన యుదాహరణము.

'పుల్లసరోజలోచనలు పూర్ణ సుధాంశు ముఖుల్ పురాంగనల్
మెల్లనెయెల్లి పట్టణము మేడలనుండి సువర్ణలాజముల్
చల్లఁగ వారిఁజూచి హరి సంగతి సేయఁదలంచుఁగాక ప్రే
పల్లె వసించు ముద్దియలపైఁబడ నేలతలంచు నక్కటా!' (ద. 1217)

పరక్రౌర్యమువలన శంకకు - అక్రూరుని యొక్క క్రూరత్వమును ౦కించిన గోపికల చిత్తవృత్తియే చక్కని యుదాహరణము.

'అక్రూరుండని పేరు పెట్టుకొని నేఁడస్మన్మనో వల్లభుం
జక్రిం మాకడఁ బాపికొంచు నరుగన్ జర్చించి యేతెంచి నా
డక్రూరుండఁట క్రూరుఁ డీతడు నిజం బక్రూరుఁడౌనేని ని
ర్వక్రత్వంబునఁ గృష్ణుఁబెట్టి తనత్రోవం బోవిచారింపఁడే.'
(భాగ.ద. 1216)

౦సము :

'ఆకస్మికభయాచ్చిత్త విక్షోభస్త్రాసః'[35]

అని ప్రతాపరుద్రీయము. మెరుపు, దుష్టసత్వము, ఉగ్రనిస్వనము దలగు వానిచేత జనించిన చిత్తముయొక్క తడబాటు త్రాసము. ఉరుములు

వలనను కలుగు తొట్రుపాటు ఆవేగము. ఈ లక్షణమే మధురభక్తికి అనుకూలముగా నున్నది. ప్రియదర్శనము వలన కలిగిన ఆవేగమునకు ఉదాహరణము: శ్రీకృష్ణుడు మధురానగర ప్రవేశము చేయునెడ యాతని మంగళరూపము దర్శింపవలయుననెడి కుతూహలముతో ఆవేగవతులైన పౌర సుందరుల వర్ణనము కడు కమనీయము:

'గోవింద సందర్శన కుతూహలంబులం బౌరసుందరులు పరస్పరాహూయమానలై భుంజానలై భోజన భాజనంబులు దలగం ద్రోచియు, శయానలై లేచియు, నభ్యజ్యమానలై జలంబు లాడకయు, గురుజన శిక్ష్యమాణలై యోడకయు, గృహకార్య ప్రవర్తమానలై పరిభ్రమింపకయు, రమణ రమమాణలై రమింపకయు, శిశుజన బిభ్రాణలై డించియు, నలంకుర్వాణలై యన్యోన్య వస్త్రాభరణ మాల్యానులేపనంబులు పీడ్వడ ధరించియు నరిగి' (భాగ.ద. 1248)

అప్రియ దర్శనమువలన కలిగెడు ఆవేగమున కుదాహరణము-

'అంతలోన వారునుం గాంతార మార్గంబు వట్టిపోవుచు, నెడనెడ గోపగోష్పదంబుల సందుల నింత నంత నక్కడక్కడ యవాంకుశ హల కమల కులిశ చక్రచాపకేతనాది రేఖాలంకృతంబులయి మార్గాభరణంబులైన హరిచరణంబుల జాడఁగని, చొప్పు దప్పకచని, దుర్ఘటంబైన యమునాతటంబు చేరి, వారి మధ్యంబున నితరుల కసాధ్యం బైన సర్పంబుచేతఁగాటువడి, దర్పంబు చూపక, భోగిభోగ పరివృతుండైన శ్రీకృష్ణునిం గని, కృష్ణ కృష్ణేతి విలాపంబులఁ దాపంబులఁ బొందుచుఁ, దత్కాలంబునం బ్రతికూలంబయ్యె ననుచు దైవంబుఁదిట్టు గోపికలుం, గోపకులం గలసి, మేఁతలుడిగి, ఱెప్పలిడక, కృష్ణునిం దప్పక చూచుచు, నొరలుచున్న గోవులం గనిరి. అందుఁ గొందఱు యశోదం బట్టుకొని, విలపించుచుఁగృష్ణునుద్దేశించి యిట్లనిరి."

(భాగ.ద.పూ. వచనము 651).

ప్రియ శ్రవణమువలన కలిగిన ఆవేగమున కుదాహరణము-

'పుండరీకనయనుండు యమునాతట వనంబున జగన్మోహనంబుగ నొక్కగీతంబు పాడిన, విని, పరాయత్తచిత్తలై, తత్తరంబున వ్రేతలు

పనులకుం జేతులాడకయు, గోవులకుం గ్రేపుల విడువకయు, విడిచి విడిచి యీడకయు, నీడియీడి యీడినపాలు కాఁచకయ, గాఁచి కాఁచియుఁగాఁగిన పాలు డింపకయు, డించిడించియు డించిన పాలు బాలురకుం బోయకయుఁబోసి పోసియుఁ బతులకుఁ బతిచర్యలు సేయకయుఁజేసి చేసియు నశనంబులు గుడువకయుఁ గుడిచి కుడచియుఁ గుసుమంబులు ముడువకయు, ముడిచి ముడిచియుఁ, దొడవులు దొడుగకయుఁ, దొడిగి తొడిగియు గోష్ఠంబుల పట్టులనుండకయుఁ, బాయసంబుల నెఱయవండకయు, నయ్యయ్యెడల నిలువంబడకయుఁ, గాటుకలు నూటి నిడకయుఁ, గురులు చక్కనొత్తకయుఁ, గుచంబుల గంధంబులు కలయ మెత్తకయుఁ, బయ్యెదలు విప్పి కప్పకయు, సఖులకుం జెప్పకయుం సహోదరులు, మగలు, మామలు, మఱఁదులు, బిడ్డలు, నడ్డంబుచని, నివారింపం, దలారింపకయు, సంచలించి, పంచభల్లుని భల్లంబుల మొల్లంపు జల్లులపెల్లునం దల్లడిల్లి, డిల్లపడి, మొగుళ్ళగమి వెలువడి యుల్లసిల్లు తటిల్లతల పొందున మందగమనలమంద గమనంబున మందలు వెలువడి, గోవింద సందర్శనంబునకు జనిరి.' (భాగ.ద. 967)

సీ. తనుఁ బాసి యొక్కింత తడవైన నిటమీఁద
నేలపై మేనులు నిలువవనుము
నేలపై మేనులు నిలువక యటమున్న
ధైర్యంబు లొక్కటఁ దలఁగు ననుము
ధైర్యంబు లొక్కటఁ దలఁగిన పిమ్మటఁ
జిత్తంబు లిక్కడఁ జిక్కవనుము
చిత్తంబు లిక్కడఁ జిక్కక వచ్చినఁ
బ్రాణంబు లుండక పాయుననుము

తే. ప్రాణములు పోవ మఱి వచ్చి ప్రాణవిభుఁడు
ప్రాణి రక్షకుఁడగు తన్నుఁ బ్రాణులెల్ల
జేరి దూఱంగ మఱియేమి సేయుఁవాడు
వేగ విన్నప మొనరింపవె మహాత్మ! (భాగ.ద.పూ. 1480)

**ఉన్మాదము :**

'విప్రలంభ మహా విపత్తి పరమానందాది జన్మా
అన్యస్మిన్నన్యావ భాసః ఉన్మాదః'37

విప్రలంభము మహావిపత్తు పరమానందము మొదలగువానివలన పుట్టినట్టియు ఒకదానిని మరొకదానినిగా భ్రమింప జేయునట్టి చిత్తవృత్తి విశేషమున్మాదమమని లాక్షణికుల యభిప్రాయము. ప్రౌఢానందమువలన విరహము వలన కలుగునది ఉన్మాదమని రూపగోస్వామి పేర్కొనెను.

సీ. ఈ పొదరింటిలో నిందాఁకఁ గృష్ణుండు
నా తోడ మన్మథ నటనమాడె
నియ్యేల మగుచోట నిందాఁకఁ జెలువుండు
గాఢంబుగా నన్నుఁ గౌఁగిలించె
నీ మహీజమునీడ నిందాఁక సుభగుండు
చిట్టింటు సేఁతల సిగ్గు గొనియె
నీ పుష్పలత పొంత నిందాఁక దయితుండు
ననుడాసి యధర పానంబు సేసె

ఆ. నీ ప్రసూనవేడి నిందాఁక రమణుండు
కుసుమ దామములనుఁ గొప్పదీర్చె
ననుచు గొంద ఱతివ లంభోజనయనుని
పూర్వలీలఁదలఁచి పొగడరధిప! (భాగ.ద.పూ. 1034)

విరహము వలన కలిగిన ఉన్మాదమునకీ క్రింది పద్యము చక్కని యుదాహరణము.

సీ. పున్నాగ! కానవే పున్నాగవందితుఁ
దిలకంబు! కానవే తిలకనిటలు
ఘనసార! కానవే ఘనసారశోభితు
బంధూక! కానవే బంధుమిత్రు
మన్మథ! కానవే మన్మథాకారుని
వంశంబ! కానవే వంశధరునిఁ
జందన! కానవే చందన శీతలుఁ
గుందంబ! కానవే కుందరదను

తే. నింద్రభూజమ! కానవే యింద్రవిభవుఁ
గువలవృక్షమ! కానవే కువలయేశుఁ
బ్రియకపాదప! కానవే ప్రియవిహారు
ననుచుఁ గృష్ణుని వెదకి రయ్యబ్జముఖులు. (భాగ.ద.పూ. 1009)

**వ్యాధి :**

'రోగ విరహాదిప్రభవో మనస్తాపో వ్యాధిః'[38]

రోగము విరహము మొదలగువానివలన పుట్టిన మనస్తాపరూపమగునట్టి చిత్తవృత్తి విశేషము వ్యాధి యని యాలంకారికుల మతము. కాని రూప గోస్వామి చింతా ఉద్వేగాదులవలన వ్యాధి కలుగుననిరి. రోగమువలనకంటె విరహమువలన కలిగిన మనస్తాపమే మధురభక్తియందు సమంజసము. విరహమునందు కలిగెడి చింతయు, ఉద్వేగాదులును వర్ణింపబడినచో అది వ్యాధిగా పేర్కొనవచ్చునని రూపగోస్వామి భావము. దాని కనుగుణముగా నీ పద్యము నుదాహరణముగా గ్రహింపవచ్చును. ఇందు దర్పకజ్వర ప్రసక్తియు కలదు. కావున వ్యాధికి సార్థకమైన ఉదాహరణమని పేర్కొనవచ్చును.

సీ. ఈ పంచబాణాగ్ని నేమిట నార్తుము
నీ మంజు వాగ్వృష్టి నెగడదేని
నీ మన్మథాంబోధి నేత్రోవఁ గడతుము
నీ దృష్టి నావయై నిలువదేని
నీ చిత్తజధ్వాంత మేజాడఁ జెఱుతుము
నీ హాసచంద్రిక నిగుడదేని
నీ దర్పకజ్వర మేభంగి నణఁగు నీ
యధరామృతౌషధ మబ్బదేని

ఆ. నెట్లు నిర్వహింతు మేలాగు మాలాగు
కరుణ సేయవేనిఁ గదియవేని
మరుఁడు నిర్దయుండు మననిచ్చునే యశో
దాకుమార! యువతి ధైర్యచోర! (భాగ.ద.పూ. 999)

**మోహము:**

'భయ వియోగాది ప్రయోజ్యా వస్తుతత్త్వానవధారిణీ
చిత్త వృత్తిర్మోహః'[39]

భయ వియోగాదులవలన కలిగినట్టియు వస్తుతత్త్వమును నిశ్చయింప జాలనట్టియు చిత్తవృత్తి మోహమని లాక్షణికుల మతము. రూపగోస్వామి ఉజ్జ్వల నీలమణియందు హర్ష విశ్లేష విషాదము వలన హృదయమున కలుగు మూఢత్వము మోహమని పేర్కొనెను.

హర్షమువలన కలిగిన మోహమున కుదాహరణము:

మ. అమరేంద్రాంగన లాకసంబున విమానారూఢలై పోవుచున్
గమలాక్షున్ శుభమూర్తిఁగాంచి మురళీగానంబు లందందక
ర్ణములన్ నిల్పుచు మేఖలల్ వదలఁగా నాథాంక మధ్యంబులన్
బ్రమదా! వ్రాలిరి చూచితే వివశలై పంచాశుగ క్రాంతలై. (ద. 786)

విశ్లేషణమువలన కలుగు మోహమున కుదాహరణము:

మ. చెలియా! కృష్ణుఁడు నన్నుఁబాసి వనముంజేరంగ నయ్యాక్షణం
బులు నాకన్నియునుండ నుండఁదగన్ బూర్ణంబులై సాఁగిలో
పలఁదోఁచుం బ్రహరంబులై దినములై పక్షస్వరూపంబులై
నెలలై యబ్దములై మహాయుగములై నిండారు కల్పంబులై.
ద. (1132).

విషాదమువలన కలుగు మోహమున కుదాహరణము :

ఉ. ఎప్పుడు ప్రొద్దు గ్రుంకు హరియెప్పుడు గోవులమేపి తెచ్చుమా
కెప్పుడు తన్ముఖాంబుజ సమీక్షణ మబ్బు నతండు వచ్చిన
నెప్పుడు గారవించుఁ దుది యెప్పుడు మద్విరహాగ్నిరాశికిన్
జెప్పఁగదమ్మ! బోఁటి! మరు సేఁతల నుల్లము దల్లడిల్లెడిన్.
(భాగ. ద. 1131)

**మృతి :**

'రోగాదిజన్యా మూర్ఛారూపా మరణ ప్రాగవస్థా మరణం'40

అని లాక్షణికులు చెప్పిరి కాని రోగమనగా దీర్ఘవ్యాధియని శృంగారమున భావించుటకు వీలులేదు. మదన తాపము వలన జాడ్యమే రోగము. దాని వలన మూర్ఛాదులు కలుగవచ్చును. కాని మూర్ఛాదులయందు చిత్తవృత్తి లైన భావములకు ఆస్కారము లేదు. మదనావసలలో కూడ మృతి పేర్కొన

బడినది. విరహాదులవలన మృత్యువున కున్ముఖము నట్టి భావము పాత్రలచే ప్రదర్శితమైనచో దానిని మృతియనవచ్చును.

'మృతేరధ్యవసాయోఽత్ర వర్ణ్యః' (ఉ. నీ. 13.49).

అని పేర్కొనుచు రూపగోస్వామి 'మృత్యువునకున్ముఖమైన చిత్తవృత్తినే పేర్కొనినాడు. అట్టిదానికి ఉదాహరణముగా నీ క్రింది పద్యము పేర్కొన వచ్చును:

మ. ఘనులాత్మీయ తమో నివృత్తికొఱకై గౌరీశుమర్యాద నె
వ్వని పాదాంబుజ తోయమందుమునుఁగన్ వాంఛింతురేనట్టి నీ
యనుకంపన్ విలసింపనేని వ్రతచర్యన్ నూరుజన్మంబులన్
నినుఁజింతించుచుఁ బ్రాణముల్ విడిచెదన్ నిక్కంబు ప్రాణేశ్వరా!
(ద. 1709).

జాడ్యము :

'చింతోత్కంఠా, భయవిరహేష్టా నిష్టదర్శన
శ్రవణాదిజన్యా, ఆవశ్యకర్తవ్యా ప్రతిసంధానకరీ
చిత్తవృత్తిర్జడతా'41

చింతవలన, ఉత్కంఠవలన, భయమువలన, విరహమువలన, ఇష్టానిష్ట దర్శన శ్రవణాదులవలన పుట్టినట్టియు, అవశ్యకర్తవ్యములగు కార్యములందును నితికర్తవ్యతా మూఢత్వమును గలిగించునట్టిదియునగు చిత్తవృత్తి విశేషము జడతయని లాక్షణికులు నిర్దేశించిరి. కాని ఉజ్జ్వల నీలమణికర్త ఇష్టానిష్టదర్శన శ్రవణ విరహాదులవలన కలిగెడిది జాడ్యమని పేర్కొనెను.

అనిష్ట దర్శనమువలన కలిగిన జాడ్యమునకుదాహరణము—

చ. అదె మన కృష్ణునిం గఱచె నంతటఁ బోక భుజంగమంబు దు
ర్మదమున మేనఁ జుట్టుకొని మానక యున్నది యింక నేమి సే
యుద మెట సొత్త మే పురుషులోపుదురీయహి నడ్డపెట్ట నె
య్యది సదుపాయమంచుఁబడిరార్తరవంబులఁ దూలి గోపకుల్
(ద. 646)

అనిష్ట శ్రవణమువలన కలిగిన జాడ్యమున కుదాహరణము—

సీ పాదకమలంబు నెమ్మి డగ్గఱఁగాని
 తరలిపోవంగఁ బాదములు రావు
నీ కరాబ్జంబులు నెఱినంటితివఁ గాని
 తక్కీన పనికి హస్తములు చొరవు
నీ వాగమృతధార నిండఁ గ్రోలఁగఁ గాని
 చెవు లన్యభాషలఁ జేరి వినవు
నీ సుందరాకృతి నియతిఁ జూడఁగఁగాని
 చూడ వన్యంబులఁ జూడ్కి కవలు
నిన్నెకాని పలుకనేరవు మా జిహ్వ
లొల్ల ననుచుఁ బలుక నోడవీవు
మా మనంబులేల మఱపి దొంగిలితివి
యేమిసేయు వారమింకఁ గృష్ణ! (భాగ.ద.పూ. 990)

విరహము వలన జాడ్యమున కుదాహరణము—

తుడువదు కన్నులన్ వెడలు తోయకణంబులు కొప్పుఁజక్కఁగా
ముడువదు నెచ్చెలిం గదిసి ముచ్చటకుం జన దన్నమేమియున్
గుడువదు నీరమున్ గొనదు కూరిమి కీరముఁజేరి పద్యమున్
నొడువదు వల్లకీగుణ వినోదము సేయదు డాయ దన్యులన్
(భాగ.ద.పూ. 1730)

'స్త్రీణాం పురుషముఖావలోకనాదేః పుంసాంచ
ప్రతిజ్ఞాభంగ, పరాభవాదే రుత్పన్నో వైవర్ణ్యాధో
ముఖత్వాది కారణీభూతశ్చిత్తవృత్తి విశేషస్త్రపా'42

స్త్రీలకు పురుష ముఖావలోకమువలన కలుగునట్టియు, పురుషులకు
ాభంగము పరాభవమువలన కలిగినట్టియు వైవర్ణ్యము అధోముఖత్వము
ుగువానిని కలిగించు నట్టిదియునగు చిత్తవృత్తి విశేషము లజ్జ.

రూపగోస్వామి నూతన సాంగత్యమువలనను అవజ్ఞాదులవలనను కలుగు
జ్జ అని పేర్కొనెను. పై లక్షణము ననుసరించి మధురభక్తియందు
భయందు స్త్రీలకు చితమైన లజ్జను అనుశీలించుటయే సమంజసమగును.

నవీన సంగమమువలన నాయికకు కలుగు లజ్జను ఉషాకన్యయందు పోతన కడు రమణీయముగా పోషించినాడు. ఉషాకన్య నిద్దురలో కలగాంచి యందు గౌరీదేవి ప్రసాదించిన అనిరుద్ధుని చిత్రమునుగాంచి ఆతడు తనను గవసినట్లుగా అనుభవము నొంది ప్రకటించిన హావభావములు ఈ క్రింది పద్యము నందు దర్శనీయములై యున్నవి:

సీ. కలికి చేష్టలు భావగర్భంబు లయినను
ప్రియుమీఁది కూరిమి వెగ్గలింపఁ
బిదపిదనై లజ్జమదిఁ బదనిచ్చినఁ
జెలిమేనఁ బులకలు చెక్కులొత్త
మదనాగ్ని సంతప్త మానస యగుటకు
గురుకుచహారవల్లరులు కందఁ
జిత్తంబు నాయకాయత్తమైయుంటకు
మఱుమాట లాడంగ మఱపు గదుర

తే. సతివ మనమున సిగ్గు మోహంబు భయముఁ
బొదివె నునుమంచు నెత్తమ్మిఁ బొదువుమాడ్కిఁ
బ్రథమ చింతాభరంబునఁ బద్మనయన
కోరి తలచీర వాటింప నేరదయ్యె. (భాగ. ద. ఉ. 331)

అంతలో చెలికత్తెలామెను సమీపించిరి. తన మనోజ వికారమును లజ్జచే నామె మరుగు పెట్టుకొనెను. గూఢరాగయైన ఉషాకన్య వ్యక్తము చేసిన అనుభావ సాత్త్విక భావములు లజ్జయను భావముయొక్క అభివ్యక్తిని కన్నులకు కట్టింప చేయుచున్నవి.

చ. పొరిఁబొరి వచ్చు నూర్పుగమిఁ బుక్కిట నుంచి కుచాగ్రసీమపైఁ
బెరసిన సన్నలేఁజెమట బిందువులొయ్యన నార్చుఁ గన్నులన్
దొరఁగెడు బాష్పపూరములు దొంగలి ఱెప్పల నాని చుక్కలన్
దరుణులు రండు చూతమని తామొగమెత్తును గూఢరాగయై.
(ద. ఉ. 333).

పై సీసపద్యమున శరీరముపై పులకలు నిలుచుట, మదనాగ్నికి గురు కుచహారవల్లరులు కందుటను మంచు నెత్తమ్మి పొదువుమాడ్కి తలచీర

వాటింప నేరకుండుట యను సాత్త్విక భావములు చేష్టయు లజ్జను రమణీయముగా ప్రదర్శించుచున్నవి. స్వప్నమునందు మనోహరునితో కలిగిన తొలి బిగి కౌగిలిని పొందుట వలన నుదయించిన సంచారి భావములలో సిగ్గు, మోహము, భయమనునవి ముప్పేటగా కానవచ్చినను అందు సిగ్గునకే ప్రథమ తాంబూలము. తలచీర వాటింపనేరని చేష్ట దాని వ్యంగ్యాభివ్యక్తి. సీస పద్యమునందలి భావాభివ్యక్తికి ఆమ్రేడితమో యనునట్లు చెలుల యెదుట సిగ్గుచే మన్మథ వికారమును మరుగుపెట్టు నాయిక సాత్త్వికభావము లమరుదున్నవి. ఊర్పులను పుక్కిటలో దాచిపెట్టి ఊదుకొనుచు కుచాగ్రసీమపై వ్యాపించిన లేచెమట బిందువులను ఆర్పుకొనుట బాష్పములను తొంగలి రెప్పలతోనాని చుక్కలను మూతమని మిషపెట్టి చెలులకు చూపించక మొగమును పైకెత్తుట అనుచేష్టలు తొలి సమాగమ సుఖమును చెలులకు తెలియబరుపకుండ లజ్జతో దాచుకొనెడి యవస్థ స్పష్టమగుచున్నది.

పురుషులకు పరులవలన కలిగిన పరాభవమువలన కలుగు భావము లజ్జయని లాక్షణిక మతము. ఇట్టిది స్త్రీలయందును భాసించుటకు వీలు కలదు. గోపికావస్త్రాపహరణ సందర్భమున శ్రీకృష్ణుడు చీరలను దొంగిలించి వారి నుడికించిన సందర్భమున నిట్టిలజ్జ గోపికల యందును కాననగును. దైన్య భావముతో కూడిన లజ్జ గోపికల హృదయములందు తాండవించినది. వస్త్రాపహరణము వలన కలిగిన లజ్జను గోపికలు నిపుణముగా తెలియజెప్పిన ఈ మాటలు పోతన కవితామధురిమకు మధుబిందువులు :

కం. వచ్చెదము నీవు పిల్చిన
నిచ్చెదమేమైనఁగాని యెటు చొరుమనినం
జొచ్చెదము నేఁడు వస్త్రము
లిచ్చి మముం గరుణతోడ నేలుము కృష్ణా! (భాగ.ద.పూ. 830)

'మీ యంబరంబులిచ్చెదఁ దోయంబులు వెడలిరండు తొయ్యలులారా!'

అని శ్రీకృష్ణుడాదేశింపగా మడుగువెడలి వచ్చుటకు ఆ మగువలు మనసులో సిగ్గులు పోయిరి. ఆ సన్నివేశమును కథకుడు వర్ణించుచు -

కం. కొందఱు వెడలుద మందుఱు
కొందఱు వెడలుటయు సిగ్గుఁగొనువిందుం
డందురు కొందఱు దమలోఁ
గ్రొందల మందుదురు వణఁకుగొని మనుజేంద్రా! (ద. 837)

సిగ్గుచే గోపికలు పొందిన తడబాటు పైవాక్యములలో పోతన చిత్రించి నాడు. వారి యందలి సిగ్గును శ్రీకృష్ణుని చేతనే సూచింప చేసినాడు.

'శృంగారవతులార! సిగ్గేల మిముఁగూడి పిన్ననాఁటను గోలె బెరిఁగి నాఁడ' (ద. 841)

పోతన యెడనెడ సంచారి భావములనిట్లు సూచించుటయు కలదు.

శ్రీకృష్ణునిచే నోడిన జరాసంధునియందు లజ్జ ఈ క్రింది వచనము వలన కన్పట్టుచున్నది:

'విడివడి, చిడిముడికి నగ్గలంబయిన సిగ్గునన్రమ్మొగ్గి, నెమ్మొగంబు సూపక, కోప కపటభావంబులు మనంబునం బెనంగొనఁ దపంబు జేసియైన, వీరలం జయించెనని పలాయితులైన రాజులంగూడుకొనుచు, జరాసంధుండు విఱిగి చనియె'

(భాగ.ద. 1578)

ఇట్టి యుదాహరణము మధురభక్తియందవసరము లేదు కావున లజ్జను గోపికలయందు చిత్రించిన వైఖరి వివరింపబడినది

**అవహిత్థ :**

'వ్రీడాదిభిర్నిమిత్తైః హర్షాద్యను భావానాం
గోపనాయ జనితో భావవిశేషోఽవహిత్థం'43
సిగ్గు మొదలగు వానివలన హర్ష్యాదనుభావములను దాచునట్టి

చిత్తవృత్తి.

'అనుభావపిధానార్థేఽవహిత్థం భావఉచ్యతే
తద్వ్యభావ్యం భయవ్రీడాధార్ష్ట్యకౌటిల్య గౌరవైః'44

భయవ్రీడా ధార్ష్ట్య, కౌటిల్య, గౌరవములవలన పుట్టినట్టియును అనుభావ పిధానార్థమగు భావమహిత్థయని మరొక లక్షణముకూడా చెప్పబడినది.

సిగ్గు మొదలగు వానివలన హర్ష్యాదనుభావములను దాచునట్టి చిత్తవృత్తి అవహిత్థయని రూపగోస్వామి పేర్కొనెను. ఇది మూడు విధములు:

1. సిగ్గువలన 2. దాక్షిణ్యభావమువలన 3. సిగ్గుభయమువలన.

లజ్జవలన కలుగు అవహిత్థ కుదాహరణము

కం. కొంటివి మా హృదయంబులు
కొంటివి మా మనము లజ్జ గొంటివి వలువల్
గొంటెవ్వింక నెట్లు చేసెదొ
కొంటెవు గద నిన్ను నెఱిఁగికొంటిమి కృష్ణా !

(భాగ. ద. పూ. 822)

దాక్షిణ్యాభావము వలన కలుగు అవహిత్థ కుదాహరణము—

మ. ఇంతుల్ తోయము లాడుచుండ మగవారే తెంతురే వచ్చిరా
యింతల్ సేయుదురే కృపారహితులై యే లోకమందైన నీ
వింతల్ నీ తలఁబుట్టెఁ గాక మఱి యేపీ కృష్ణ! యో చెల్ల! నీ
చెంతన్ దాసులమై చరించెదము మా చేలంబు లిప్పింపవే. (ద. 829)

సిగ్గు భయమువలన కలుగు అవహిత్థ కుదాహరణము—

కం. మామా వలువలు ముట్టకు
మామా కొనిపోకు పోకు మన్నింపు తగన్
మా మానమేల కొనియెదు
మా మానస హరణమేల మానుము కృష్ణా! (ద. 820)

**స్మృతి :**

'సంస్కార జన్యం జ్ఞానం స్మృతిః'45

సంస్కారమువలన కలుగు జ్ఞానము స్మృతియని యాలంకారికుల యభిప్రాయము. సాదృశ్యమైన దానిని చూచుటవలన దృఢాభ్యాసమువలన స్మృతి కలుగునని రూపగోస్వామి నిర్దేశించెను. సాదృశ్యమైన వానిని చూచుటవలన దృఢభ్యాసమువలన కలుగు స్మృతికి భాగవతమునందు చక్కని ఉదాహరణములు కలవు.

సాదృశ్యంబువలన జనించెడి స్మృతి కుదాహరణము—

మ. అరవిందంబులకంటెఁ గోమలములై యందంబులైయున్న నీ
చరణంబుల్ కఠినంబులై మొనయు మాచన్నుంగవల్ మోవఁగా
నెరియం బోలు నటంచుఁ బొక్కుదుము నీయాకర్క శారణ్యభూ
పరిసంచారము కృష్ణ! నీ ప్రియులకున్ ప్రాణవ్యథం జేయదే.

(భాగ.ద. 1054)

శ్రీకృష్ణుడు కానరామిచే బాధనొందెడి గోపికలు అతడు కర్కశారణ్య భూములందు తిరుగునెడ అతనికోమలములైన పాదములు పడెడి బాధను గురించి పర్యాలోచనము చేయుచు స్మృతిరూపముగా గోవిందుని పాదారవిందములు వారి చన్నుగవలను స్మృశించిన సన్నివేశమును తలంచిరి. అరవింద సాదృశ్యముచే శ్రీకృష్ణుని పాదములు స్మృతిపథమున నిలుచుట యిందలి విశేషము. చన్నుగవ కర్కశత్వము కర్కశారణ్యభూమిని స్మరింపచేయుట ఇందు గమనింపదగిన విశేషము.

దృఢాభ్యాసమువలన కలుగు స్మృతికి భాగవతము నందలి చక్కని యుదాహరణము-

సీ. ఈ పొదరింటిలో నిందాఁకఁ గృష్ణుండు
నాతోడ మన్మథ నటన మాడె
నియ్యేల మగుచోట నిందాఁకఁ జెలువుండు
గాఢంబుగా నన్నుఁ గౌఁగిలించె
నీ మహీజము నీడ నిందాఁక సుభగుండు
చిట్టంటు సేఁతల సిగ్గు గొనియె
నీ పుష్పలత పొంత నిందాఁక దయితుండు
నను డాసి యధర పానంబు సేసె

ఆ. నీ ప్రసూనవేది నిందాఁక రమణుండు
కుసుమ దామములనుఁ గొప్పుదీర్చె
ననుచు గొందఱతివ లంభోజనయనుని
పూర్వలీలఁ దలఁచి పొగడి రధిప! (భాగ ద.1034)

శ్రీకృష్ణుని పొందు ననుభవించిన గోపికలు తత్సన్నివేశములను మరల మరల భావించుటవలన తద్భావము అభ్యాసముగా మారినది. తదభ్యాసమువలన పూర్వసన్నివేశ స్మృతియు తద్భావ చర్వణమును గోపికలకు లభించినది. స్మృతి గోపికల సామాన్యానుభూతి. మచ్చునకు కొందరి యనుభూతి ఈ సీస పద్యమునందు చిత్రింపబడినను అవి గోపికాసామాన్యమనుటలో విప్రతిపత్తిలేదు.

**వితర్కము :**

'సందేహాద్యనంతరం జాయమాన ఉహోవితర్కః' 46

—అని రసగంగాధరము.

సందేహము కలిగిన పిమ్మట కలిగెడి ఊహయే వితర్కమనబడును. రూపగోస్వామియు సంశయమువలన కలిగిన విమర్శను వితర్కముగా పేర్కొనెను. భాగవతమునుండి దీనికొక యుదాహరణము—

కం. 'కార్చిచ్చార్చు పటుత్వము
నేర్చునె నరుఁడొకఁడు శౌరినేఁడిది కార్చి
చ్చార్చి మనల రక్షింపగా
నేర్చెనితండజుఁడొ హరియె నిటలాక్షుండో' (భాగ.ద.పూ 749)

శ్రీకృష్ణుడు కార్చిచ్చును మ్రింగి గోపసంఘమును కాపాడినపుడు వారు శ్రీకృష్ణుని మహాత్మ్యమునకు ఆశ్చర్యపడి అతడట్టి పటుత్వము నేర్చునా? అని అనుమానపడి, అతడు బహుశః ఏ బ్రహ్మయో, ఏ విష్ణువో, ఏ శివుడో అయి యుండునని వితర్కించిరి. శ్రీకృష్ణునిపట్ల పచరించు భక్తిభావమునందు గోపిక లెంతటి భక్తిప్రవృత్తిని ప్రకటించగలరో గోపకులును అట్టి భావమునే ప్రకటింపగలరు.

చింత :

'ఇష్టాప్రాప్త్యనిష్ట ప్రాప్త్యాది జనితాఽధ్యానాపరపర్యాయా
వైవర్ణ్య, భూలేఖన, అధోముఖత్వాది హేతుశ్చిత్త వృత్తి
విశేషణశ్చింతా.'47

ఇష్టము లభింపక పోవుటవలన, అనిష్టమైనదానిని పొందుటవలన, వైవర్ణ్యము, భూలేఖనము, అధోముఖత్వము మొదలగువానిని కలిగించు చిత్త వృత్తివిశేషమే చింత. నిట్టూర్పులు, తలవాల్చుట, సంతాపము, స్మరణము, కృశించుట, దేహసంస్కారము లేకుండుట, అధైర్యమనునవి చింత కను భావములు. రూపగోస్వామి ఇష్టానావాప్తివలన, అనిష్టమైనదానిని పొందుటవలన చింత కలుగుననెను.

'శరద్రాత్రియందు పుండరీకనయనుండు యమునాతటమున జగన్మోహనంబుగా నొక్క గీతంబు వాడిన' (ద 967) తత్తీరంబున గోపికలు 'మొగుళ్ళగమి వెలువడి యుల్లసిల్లు తటిల్లతల పొందున' (ద. 967) చెంతకు రాగా హృదయేశుల సిగ్గులువుచ్చి అత్తమామల నెదిరించి సత్కులాంగనలట్లు వచ్చుట తగదని మానవతులను మరలి మందిరములకు చనుడని పలుక కుసుమ

శరుని శరపరంపరుల కోపలేని గోపకాంతల చింత పోతన ఈ క్రింది పద్యము నందు చక్కగా పొందుపరచెను:

సీ. విరహాగ్ని శిఖలతో వెడలు నిట్టూర్పుల
ముమ్మరంబులఁ గంది మోవు లెండఁ
గన్నుల వెడలెడి కజ్జల ధారలు
కుచకుంకుమంబుల గ్రొబ్బిపాఱఁ
జెక్కులఁ జేర్చిన చేతుల వేఁడిమి
మోముఁదమ్ముల మేలి మురువు డిందఁ
బొరిఁబొరిఁ బుంఖాను పుంఖంబులై తాకు
మదను కోలల ధైర్య మహిమ లెడల

తే. దుఃఖభరమున మాటలు తొట్రు పడఁగఁ
బ్రియము తాడని ప్రియుఁ జూచి బెగ్గడిల్లి
చరణములు నేల వ్రాయుచు సంభ్రమమునఁ
గాంత లెల్లను వగల నాక్రాంతలగుచు. (భాగ. ద. పూ. 985)

ముకుందుని పొందుకోరి వచ్చిన గోపకాంతలకు ఇష్టార్థము సిద్ధింపక పోవుటవలన, విరహాగ్ని శిఖలతో వెడలు నిట్టూర్పులతో మోముతమ్మి సౌంద ర్యము కృశించగా, పొరలిపొరలి వచ్చు దుఃఖమున సంతాపము నొందుచు, దుఃఖభరమున మాటలు తొట్రుపడగ, ప్రియములాడని ప్రియునిచూచి అధైర్య పడుచున్న వారి చింతను వ్యక్తము చేసిరి. చింతాభావమునకు లాక్షణికులు చెప్పిన అనుభావము లన్నియు నిందు అభివర్ణింపబడినవని తెలియుట స్పష్టము.

**మతి :**

'శాస్త్రాది విచారజన్య మర్థ నిర్ధారణం మతిః'48

శాస్త్రార్థములను విచారించుటచేత కలిగిన నిశ్చయమే మతి యని భావము. భక్తియందు వివిధ శాస్త్రాదులకంటె భాగవతత్త్వమును బోధించు తత్త్వ శాస్త్రార్థములే ప్రధానముగా కన్పట్టుచున్నవి. మతి మధుర భక్తియందు కంటె జ్ఞానభక్తియందెక్కువగా చోటు చేసుకొనినది. మధురభక్తికి ఆలవాల మైన రుక్మిణీదేవి—

మత్తకోకిల: నిన్నునీశ్వర! దేవదేవు నిర్ణయింపఁగ లేకయో
సన్నుతామర! కీర్తిశోభిత! సర్వలోక శరణ్య! మా
యన్న యీతఁడు నేఁడు చేసె మహాపరాధము నీయెడన్
నన్ను మన్ననచేసి కావు మనాథనాథ! దయానిధీ! (భాగ.ద. 1767)

అని కీర్తించినపుడు శ్రీకృష్ణుని పరమేశ్వర తత్త్వమును వితర్కించి నిశ్చయించినట్లే కానబడును. ఇంతగా చెప్పిన రుక్మిణి సహోదరుని భంగపాటుకు దుఃఖించినది. అప్పుడు బలభద్రుడామె నోదార్చుచు,

కం. అజ్ఞానజ మగు శోకము
విజ్ఞాన విలోకనమున విడువుము నీకుం
బ్రజ్ఞావతికిం దగునే
యజ్ఞానుల భంగి వగప నంభోజముఖీ (భాగ.ద.పూ 1779)

అనగా మధురభక్తికి ఆలవాలమైన నాయికలు సహితము మౌలికముగా జ్ఞానులయ్యుండవచ్చును. కాని రసభావములకు లోనైనప్పుడు శాస్త్ర విజ్ఞానముచే సత్త్వస్థితిని నిర్ణయించుకొనెడి సన్నివేశము లేర్పడవచ్చును. ఇట్టివి నాయికలయందేగాక గోపకులయందు, ఒక్కొక్కసారి దేవతలయందు కూడ పొడగట్టుచుండవచ్చును.

గోపజనులయందు కానవచ్చు మతికి,

సీ. కన్నులు దెఱవని కడుఁ జిన్న పాపఁడై
దానవిఁ జనుఁ బాలు త్రావి చంపె
మూఁడవ నెలనాఁడు ముద్దుల బాలుఁడై
కోపించి శకటంబుఁ గూలఁదన్నె
నేఁడాది కుఱ్ఱడై యెగసి తృణావర్తు
మెడఁ బట్టుకొని కూల్చి మృతునిఁజేసెఁ
దల్లివెన్నలకునై తను ఱోలఁగట్టినఁ
గొమరుఁడై మద్దులఁ గూల నీడ్చె

తే. బసులఁ గ్రేపులఁ గాచుచు బకునిఁజీరె
వెలఁగతో వత్సదైత్యుని వ్రేసిచంపె
సబలుడై ఖరదైత్యుని సంహరించె
నితఁడు కేవల మనుజుఁడే యెంచిచూడ. (భాగ. ద. పూ. 930)

అను పద్యమును, దిక్పాలకశ్రేష్ఠుడైన ఇంద్రుడు ప్రకటించిన మతికి-

**సీ.** వరమ! నీ ధామంబు భాసుర సత్త్వంబు
శాంతంబు హతరజస్తమము నిత్య
మధిక తపోమయమట్లు గావున మాయ
నెగడెడి గుణములు నీకులేవు
గుణహీనుఁడవు గాన గుణముల నయ్యెడి
లోభాదికములు నీలోనఁజేర
వైన దుర్జన నిగ్రహము శిష్టరక్షయు
దగిలి చేయఁగ దండధారివగుచు

**తే.** జగము భర్తవు గురుఁడవు జనకుఁడవును
జగ దధీశుల మను మూఢజనులు తలఁక
నిచ్చపుట్టిన రూపంబు లీవుదాల్చి
హితము సేయుదుగాదె లోకేశ్వరేశ! (భాగ.ద.పూ. 938).

ఉదాహరణములుగా గ్రహింపవచ్చును. శాస్త్రార్థ వితర్కమైన తరువాత నిశ్చయించెడిది మతియగుటచేత దైవతత్త్వార్థ నిశ్చయము చేసెడి భక్తులయందు ఇది సర్వసామాన్యమగుటచేత భక్తిభేదము లన్నింటియందు నిది పొడగట్టుట కవకాశమున్నది.

**ధృతి :**

'లోభశోక భయాదిజనితోపప్లవ నివారణ కారణీభూత
శ్చిత్తవృత్తి విశేషోధృతిః'49
అని రసగంగాధర కర్త పేర్కొనెను.

ఇట్టి ధృతి దుఃఖాభావము వలన ఉత్తమాప్తివలన కలుగునని రూప గోస్వామి పేర్కొనెను. దుఃఖాభావమునకు రుక్మిణి మనోగత ధృతిని పోతన వర్ణించిన తీరును గమనించదగినది:

మ. జలజాతేక్షణుఁ దోడి తెచ్చితివి నా సందేశముం జెప్పి నన్
నిలువం బెట్టితి నీ కృపం బ్రతికితిన్ నీ యట్టి పుణ్యాత్మకుల్
గలరే దీనికి నీకుఁ బ్రత్యుపకృతిన్ గావింపఁగానేర నం
జలి గావించెద భూసురాన్వయమణీ! సద్బంధు చింతామణీ!
(భాగ.ద. 1737)

ఇందు శ్రీకృష్ణుని రాకను గూర్చి వర్తమానము తెలియక రుక్మిణి పడిన శోకభయాది భావములు నివారణమగుటకై ఏర్పడిన కారణము చిత్రింప బడినది. తత్కారణజనిత చిత్తవిశేషమగు ధృతి 'నీ కృపవ్ ప్రతికితిన్'50 అను కృతజ్ఞతాబద్ధమైన వాక్యమునందు మధురాతిమధురముగా వ్యక్తీకరించెను.

**హర్షము :-**

దీనినే కొందరు ముదమని వ్యవహరింతురు. ఇష్టము లభించుటవలన కలిగిన సంతోషమను చిత్తవృత్తి హర్షమని లాక్షణికుల యభిప్రాయము. అభీష్టమైన దానిని చూచుటవలన అభీష్టము లభించుటవలన కలుగు చిత్తవృత్తి హర్షమని రూపగోస్వామి పేర్కొనెను. మధురభక్తి యందు శ్రీకృష్ణునికంటె శ్రీకృష్ణదర్శనముకన్న అభీష్టమేముండును?

కం. వచ్చిన వల్లభుఁగనుఁగొని,
విచ్చెసెనటంచు సతులు వికసితముఖులై
యచ్చుగ నిలిచిరి ప్రాణము
వచ్చిన నిలుచుండు యవయవంబుల భంగిన్.

(భాగ.ద.పూ 1060)

అను పద్యము హర్షమునకు సజీవోదాహరణము. నాథుడు కానబడ నప్పుడు గోపికలు చచ్చిన యంగముల యట్లుండిరట. అనగా చైతన్యరహితలై యుండిరని భావము. శ్రీ కృష్ణుడు వచ్చినంతనే ప్రాణము వచ్చినతోడనే నిలుచుండు అవయవముల భంగి గోపికలు నిలువబడిరట. ఇందు హర్ష భావముతో పాటు మధురభక్తిలో భాసించు అంగాంగి రసతత్వమును గూడ పోతన్నగారు ధ్వనింపజేయుచున్నారు. శ్రీ కృష్ణుడే రస స్వరూపుడు. అతడు అంగి, ఆత్మ, ప్రాణము, స్థాయి. సంచారులు స్థాయిని పోషించునట్టివి. అనగా స్థాయికి అవయవములు. అంగి సాక్షాత్కారమైనపుడు అంగములు హర్ష వికసితములగునని ఈ పద్యము హృద్యమముగా వ్యక్తీకరించుచున్నది. శ్రీకృష్ణ దర్శనము పొందిన గోపికలయందు ఈ భావము సర్వసామాన్యము.

**ఔత్సుక్యము :**

'అసునైవాస్యలాభోమమా స్త్వితీచ్ఛా ఔత్సుక్యం.'51

కోరినది పొందుటలో నెట్టి కాలవిలంబము సహించలేక పోవుటయే ఔత్సుక్యమనబడును. ఇష్టదర్శన లాలస, ఇష్టాతిస్పృహ ఔత్సుక్యమునకు ముఖ్యకారణములుగా రూపగోస్వామి పేర్కొనెను.

వ్రజవనితలు కోరినది కోరదగినది నందనందనుని పొందు. అహర్నిశలు అతని సాన్నిధ్యముకొరకే తపించిరి. గోపికలకు శ్రీకృష్ణుని ఎడబాటు క్షణ కాలమైన కల్పకమువలె తోచెడిది. పగలు గోపాలురతో గోవిందు డడవికేగుట వలన రాత్రి విధాత క్రూరుడై కంటికి రెప్ప లడ్డము చేయుటవలన కృష్ణదర్శ నకు నోచుకొనలేదను వగ గోవిందుని కన్నార చూడకున్నట్టి నిముషములు యుగములుగా తోచుచున్నవను గోపికల పలుకులలో గోవింద సందర్శన లాలసను గమనించవచ్చును.

ఉ. నీవడవిన్ బవల్ దిరుగ నీకుటిలాలక లాలితాస్యమి
ప్పావిధిఁ జూడకున్న నిమిషంబులు మాకు యుగంబులై చనుం
గావున రాత్రులైన నినుఁ గన్నుల నెప్పుడుఁ జూడకుండ ల
క్ష్మీవర! ఱెప్ప లడ్డముగఁ జేసె నిదేల విధాత క్రూరుఁడై.
(భాగ. ద. 1051)

**ఉగ్రత :**

'అధిక్షేపావమానాది ప్రభవా కిమస్య కరోమీ త్యాద్యాకారా చిత్తవృత్తి రుగ్రతా.'[52]

అధిక్షేపావమానములకు గురియై ప్రతీకారము చేయవలెననెడి తీవ్ర మైన ప్రచండమైన చిత్తవృత్తి యౌగ్ర్యము. మధురభక్తిరసమునందిట్టి ఉగ్ర తకు తావులేదుకాని పగతో అనవరతము భగవంతుని స్మరించే కంసాదులందిట్టి ఉగ్రత కాననగును.

శ్రీకృష్ణబలరాములు చాణూర ముష్టికులను మల్లయుద్ధమున కూల్చగా సభాజనంబుల కలకలంబు నివారించి కంసుడు పలికిన పలుకులు ఉగ్రతకు చక్కని యుదాహరణము.

మ. వల్లవ బాలురన్ నగరి వాకిటికిన్ వెడలంగ ద్రొబ్బుఁడీ
గొల్లల ముట్టికోల్గొనుఁడు క్రూరుని నందునిఁ గట్టుఁ డుర్వికిన్
దెల్లముగాఁగ నేఁడు వసుదేవునిఁ జంపుఁడు తండ్రిగాఁడు వీఁ
డెల్ల విధంబులన్ బరుల కిష్టుఁడు కావకుఁడుగ్రసేనునిన్.
(భాగ.ద.పూ. 1371)

**ఆమర్షము :-**

'పరకృతావజ్ఞాది నానాపరాధజన్యః మౌనవాక్యాది
పారుష్యాదికారణీ భూతశ్చిత్తవృత్తి విశేషోఽమర్షః.'53

పరకృతమగు నవజ్ఞారూప నానాపరాధములవలన కలిగినట్టిది, మౌన వాక్యము వాక్పారుష్యము మొదలగువానిని కలిగించు చిత్తవృత్తి విశేషము ఆమర్షము.

రూపగోస్వామి అధిక్షేప అవమానముల వలన కలుగు రోషమని నిర్దేశించెను.

భాగవతమునందు గోపకాంతలు యదువంశనందనుడు తమను మరచి పురకాంతాసక్తుడయ్యెనని రోషముతో అన్యాపదేశముగా భ్రమరముతో పలికిన రత్నములనదగిన భ్రమరగీతములు (భాగవతము దశమస్కంధము. పూర్వ భాగము **1453** నుండి **1463** వరకు గల పద్యములు) ఈ ఆమర్షణమునకు చక్కని యుదాహరణము. మచ్చునకొక పద్యము—

మ. ఒకపువ్వందలి తేనె ద్రావి మధుపా! యుత్సాహివై నీవు వే
ఱొకటిం బొందెడి భంగి మన్మథరపీయూషంబునం దేల్చి మా
యకలంకోజ్జ్వల యౌవనంబుఁగొని యన్యాసక్తుడయ్యెన్ విభుం
డకటా! యాతని కెట్లు దక్కెనిరి మిథ్యాకీర్తి నమ్మెన్ జుమీ.

(భాగ. ద. పూ. **1457**)

ఈ పద్యమునందు నాయక కృతమైన అవజ్ఞారూపమగు నపరాధములు స్పష్టముగా నిరూపింపబడినవి. నాయకు డొనరించిన అపరాధము వలన గోపిక తానవమానింపబడినట్లు భావించి అధిక్షేపరూపమున రోషమును ప్రకటించుచున్నది. 'మధుప' అనుటలో అన్యాపదేశము భావించి 'అమర్షము'నకు వన్నె పెట్టుచున్నది.

**అసూయ :**

'పరోత్కర్ష దర్శనాది జన్యః పరనిందాదికారణీభూత
శ్చిత్తవృత్తి విశేషః అసూయా.'54

ఇతరుల ఉత్కృష్టమును చూచుటవలన కలుగు చిత్తవృత్తి విశేషమే అసూయ. రూపగోస్వామి ఇతరుల సౌభాగ్యమందుండు విద్వేషమువలన గుణమువలన అసూయ కలుగునని నిర్దేశించెను.

శ్రీకృష్ణుడు మధురానగరమున ప్రవేశించగనే గోవింద దర్శన కుతూహలులై హర్మ్యాగ్రముల చేర నిలిచిన పురంధ్రీమణులు 'రక్కస విగత జీవగఁజన్నుఁబాలు ద్రావిన మేటి బాలకు'ని, 'నందుని వెలఁదికి జగమెల్ల ముఖమందుఁ జూపిన' ముద్దుమోమును, 'ద్రేతలమానంబు చూఱలాడిన లోక సుందరు'ని[55] చూచి ఆ సుందరాంగుడు లేకున్న పురమటవీస్థలమని, వానిని బొందని జన్మంబు విగతఫలమని, ఆతనిని చూడని చూడ్కులు వృథలని తలచి అట్టివానితో నాడిపాడి ఆకర్షించిన ఆ గోపకాంతల (ఉత్కృష్టమునకు) సౌభాగ్యమునకు అసూయ చెందిరి.

మ. చెలియా! గోపిక లీకుమారతిలకున్ జింతింపుచున్ బాడుచున్
గలయం బల్కుచు నంటుచున్ నగుచు నాకర్షింపుచున్ హస్తగా
మలకక్రీడకుఁ దెచ్చి యిచ్చలును సమ్మానంబులన్ బొందఁగాఁ
దొలి జన్మంబుల నేమి నోఁచిరొగదే దుర్గప్రదేశంబులన్.

(భాగ. ద. పూ. 1251)

**చాపల్యము :**

'అమర్షాదిజన్యా వాక్పారుష్యాది కారణీభూతాచిత్తశ్చపలతా.'[56]
'అమర్షప్రాతికూల్యేర్ష్యారాగద్వేషాశ్చమత్సరః
ఇతియత్ర విభావాస్స్యురనుభావస్తు భర్త్సనం
వాక్పారుష్యం ప్రహారశ్చ తాడనం వధబంధనే
తచ్చాపలమనాలోచ్యకార్యకారిత్వమిష్యతే.'[57]

అమర్షము, ప్రాతికూల్యము, ఈర్ష్య, రాగము, ద్వేషము, మాత్సర్యము, అనునవి విభాగములుగను, భర్త్సనము, వాక్పారుష్యము, ప్రహారము, తాడనము, వధ, బంధకము, లెస్సగ ఆలోచించకయే పనులు చేయుట అనునవి యనుభావములుగా చాపల్యమును వంజింపజేయును.

మధురభక్తికి మారుపేరైన గోపికలలో అమర్షము, రాగము వంటి విభావముల వలన వాక్పారుష్యము, లెస్సగ ఆలోచించకయే పనులు చేయుట వంటి అనుభావముల వలన చాపల్యము వ్యక్తమగుచున్నది.

ఒక శరద్రాత్రియందు యమునాతటమున గోవిందుని గానమునకు పరవశలై పరుగెత్తిన గోపకాంతలు కృష్ణుని కృపను బొందియు అంతలోనే

హరి యదృశ్యమగుటతో పువ్వులను, తీవెలను, చెట్లను, పుట్టలను, పక్షులను, ప్రకృతిని కృష్ణునిజాడ తెలుపమని ప్రతిమాలిరి. ఆ క్షణములో వృక్షాదులు సమాధానము చెప్పలేవన్న విచక్షణ జ్ఞానము కోల్పోయిరి. చిక్కిన ఈశుడు చిక్కక చిక్కులు పెట్టుచుండ ముకుంద సందర్శన లాలసులై వెదకి వెదకి కృష్ణునికొరకై తపించి తపించి తామే కృష్ణులమన్న భ్రమనుపొంది కృష్ణునివలె ఆడిపాడిన ఘట్టములను పోతన్న మన మనసులకు హత్తుకొనునట్లు చిత్రించెను.

కం. వెన్నలు దొంగిలి తినియెడి
వెన్నుఁడనని నొకతె నుడువ వేఱొక్కతె చే
సన్నల యశోద నంచును
గ్రన్నన కుసుమములదండఁ గట్టునిలేశా!

కం. కాళియఫణి యిది వీరలు
కాళియఫణి సతులు మ్రొక్కఁగదఁగిరి నేగో
పాలకుమారుఁడ ననుచును
లీలాగతినాడు నొక్కతేమ నరేంద్రా!

కం. తరుణులు గోపకులందఱు
హరిహయుఁడిదె వానఁగురిసె హరినేనని బా
సుర చేలాంచల మొక్కతె
గిరి నెత్తెదననుచు నెత్తుఁగెంగేల నృపా!

కం. మీరలు గోపకులే నను
రారిని దావాగ్ని వచ్చెనటుఁ జూడకుఁడీ
వారించెదనని యొక్కతె
చేరి బయల్ కబళనంబు సేయు నరేంద్రా!

(భాగ. ద. పూ. 1022 నుండి 1025 వరకు)

తమలో కృష్ణత్వ మారోపించుకొని కృష్ణునివలె ఆడిపాడిన రసవత్తరమైన ఈ ఘట్టములో గోపికలకు కృష్ణునిపై రాగము వెల్లడియగుచున్నది.

నిద్ర, సుప్తి, బోధవంటి సంచారిభావములు గోపికలకన్న శృంగార నాయికలయందే ఎక్కువగా కాననగును. భాగవతమునందు దశమ స్కంధములో ఉషాకన్యపొందిన స్వప్నావస్థలయందు ఈ మూడు భావములు వరుసగా ఒక క్రమమున గోచరించుట ప్రసిద్ధము.

నిద్ర :

'శ్రమాది ప్రయోజ్యం చేత స్సమ్మీలనం నిద్రా.'58

శ్రమాదులవలన కలిగిన మనస్సమ్మీలనమే నిద్ర.

సుప్తి :

'నిద్రావిభావోత్థజ్ఞానం సుప్తం.'59

నిద్రవలన కలిగిన జ్ఞానమే స్వప్నము.

బోధ :

'నిద్రానాశోత్తరం జాయమానో బోధోవిబోధః.'60

నిద్రానంతరము కలుగు బోధయే విబోధ.

బాణాసురుని కుమార్తెయైన ఉష ఒకనాటి నిద్రలో అనిరుద్ధుని కలిసినట్లు కలగన్నది.

సీ. ఆ దానవేశ్వరు ననుఁగుగూఁతురుసుషా
  కన్యసచ్చరిత సౌజన్య ధన్య
రూపవిభ్రమ కళారుచిర కోమలదేహ
  యతను నాఱవ బాణమనఁగ నొప్పు
సుందరీరత్నంబు నిందుని భానన
  యలినీలవేణి పద్మాయతాక్షి
యొకనాఁడు రుచిర సౌధోపరివేదికా
  స్థలమున మృదుశయ్య నెలమిఁ గూర్కి

తే. మున్ను తన చౌల నెన్నఁడు విన్నయతఁడుఁ
గన్నులారంగఁ దాఁ బొడగన్నయతఁడుఁ
గాని యసమాన రూపరేఖా విలాస
కలితు ననిరుద్ధు నర్మిలిఁ గవసినటులు (భాగ. ద. ఉ. 327)

చ. కలఁగని యంత మేలుకని కన్నులఁ బాష్పకణంబు లొల్కఁగాఁ
గలవలెఁగాక నిశ్చయముగాఁ గమనీయ విలాస విభ్రమా
కలిత తదీయ రూపము ముఖంబున వ్రేలినయట్లు దోచినన్
గళవళ మందుచున్ బిగియఁ గౌఁగిటిచే బయలప్పళించుచున్.
(భాగ. ద. ఉ. 328).

అలసట వలన కలుగు నిద్రను సంచారిగా లాక్షణికులు పేర్కొనినారు. లౌకికమైన కార్యకారణ సంబంధమును కల్పించుట ఈ లక్షణములోని తాత్పర్యము కావచ్చును. ఉషాకన్య రాక్షసరాజ కుమార్తె ఆమెయందు నిద్ర సంచారిగా వర్ణింపబడుచున్నది. ఆ నిద్ర అలసటవలన కాకపోవచ్చును కాని అది సుప్తికి లేదా స్వప్నావస్థకు నాంది. ఒకవిధముగా చూచినచో ఆమె నిద్రకును, సుప్తికిని దైవేచ్ఛ వెనుక కలదు. అది ఆ కథా నిర్మాణ రహస్యము. దైవేచ్ఛయైనను నిద్రయందు స్వప్నము కలుగుట, అందు అనిరుద్ధుని కూడుట యనునవి కలుగుచున్నవి. అపూర్వమైన ఆస్వాప్నిక యనుభవము వలన ఆమె కన్నులయందు బాష్పకణములు నిలిచినవి. తదితర సాత్త్వికభావములును విలాస విభ్రమాదులను పొడగట్టినవి. ఆమె బయలప్పళించుచు బోధను భజించినది. ఈ మూడును ఒకదానివెంట నొకటిగా నేర్పడు గొలుసుకట్టు భావములు. వానిని పై ఘట్టమునందు పోతన సహజ సుందరముగా నభివర్ణించియున్నాడు.ఉషానిరుద్ధుల ఘట్టము శృంగార రస ఘట్టము. ప్రాతిభాసికము లేదా అలౌకిక శృంగారము స్వాప్నిక వాస్తవ జగత్తుల సంగమభూమి. ఉషానిరుద్ధుల సంగమముకూడ నట్టిదే. ఇందు ఆధ్యాత్మికము లేదు. గోపికాకృష్ణుల సంగమము ఆధ్యాత్మికము. కావున దానిని నిద్రా సుప్తి బోధలవంటి సంచారి భావములచే వ్యక్తము చేయుట సమంజసము కాదని భాగవతమున నట్టి సన్నివేశములు చిత్రింపబడియుండక పోవచ్చును. స్వప్న సంజాతమైనను భౌతిక రతి మధురభక్తిలో పరిత్యాజ్యము. కావున పై సంచారి భావత్రయము శృంగార రసమున రాణించునేకాని మధురభక్తియందు కాదని నిశ్చయించుటకు వీలగుచున్నది.

## గోపికలు - మధురభక్తి

భాగవతమునందు గోపికాశ్రీకృష్ణుల ఘట్టము మధురభక్తి రసార్ణవమని అనుభజ్ఞులైన కోవిదులు పేర్కొనియుండుట స్పష్టము. లాక్షణికులు పేర్కొనిన సంచారి భావములను మధురభక్తి కనువుగా వివేచించుటయైనది. విభావానుభావ వ్యభిచారి సంయోగాత్ రసనిష్పత్తిః అని కదా ప్రసిద్ధ భరతరస సూత్రము! రసము సామాజిక నిష్ఠము. భాగవతమును పఠించు సహృదయుడు అనుభవించునది భక్తి. అందును గోపికా ఘట్టమున మధురభక్తి. సహృదయులకు విభావములు గోపికాకృష్ణులు. తద్విభావముల వలన సామాజికుల హృదయమునందు వాసనారూపముగానున్న రత్యాదులు ఆస్వాదయోగ్యములుగా నగును.

శ్రీకృష్ణుడు మధురానగరమున ప్రవేశించగనే గోవింద దర్శన కుతూహలులై హర్మ్యాగ్రముల చేర నిలిచిన పురంధ్రీమణులు 'రక్కస విగత జీవగఁజన్నుబాలు ద్రావిన మేటి బాలకు'ని, 'నందుని వెలఁదికి జగమెల్ల ముఖమందుఁ జూపిన' ముద్దుమోమును, 'త్రేతలమానంబు చూఱలాడిన లోక సుందరు'ని[55] చూచి ఆ సుందరాంగుడు లేకున్న పురమటవీస్థలమని, వానిని బొందని జన్మంబు విగతఫలమని, ఆతనిని చూడని చూడ్కులు వృథలని తలచి అట్టివానితో నాడిపాడి ఆకర్షించిన ఆ గోపకాంతల (ఉత్కృష్టమునకు) సౌభాగ్యమునకు అసూయ చెందిరి.

మ. చెలియా! గోపిక లీకుమారతిలకున్ జింతింపుచున్ బాడుచున్
గలయం బల్కుచు నంటుచున్ నగుచు నాకర్షింపుచున్ హస్తగా
మలక్రీడకుఁ దెచ్చి యిచ్చలును సమ్మానంబులన్ బొందఁగాఁ
దొలి జన్మంబుల నేమి నోఁచిరొగదే దుర్గప్రదేశంబులన్.
(భాగ. ద. పూ. 1251)

**చాపల్యము :**

'ఆమర్షాదిజన్యా వాక్పారుష్యాది కారణీభూతాచిత్తశ్చపలతా.'[56]
'అమర్షప్రాతికూల్యేర్ష్యారాగద్వేషాశ్చమత్సరః
ఇతియత్ర విభావాస్స్యురనుభావస్తు భర్త్సనం
వాక్పారుష్యం ప్రహారశ్చ తాడనం వధబంధనే
తచ్చాపలమనాలోచ్యకార్యకారిత్వమిష్యతే.'[57]

అమర్షము, ప్రాతికూల్యము, ఈర్ష్య, రాగము, ద్వేషము, మాత్సర్యము, అనునవి విభాగములుగను, భర్త్సనము, వాక్పారుష్యము, ప్రహారము, తాడనము, వధ, బంధకము, లెస్సగ ఆలోచించకయే పనులు చేయుట అనునవి యనుభావములుగా చాపల్యమును వంజింపజేయును.

మధురభక్తికి మారుపేరైన గోపికలలో అమర్షము, రాగము వంటి విభావముల వలన వాక్పారుష్యము, లెస్సగ ఆలోచించకయే పనులు చేయుట వంటి అనుభావముల వలన చాపల్యము వ్యక్తమగుచున్నది.

ఒక శరద్రాత్రియందు యమునాతటమున గోవిందుని గానమునకు పరవశలై పరుగెత్తిన గోపకాంతలు కృష్ణుని కృపను బొందియు అంతలోనే

భక్తికి స్థాయి భగవద్రతి యన్నచో భగవంతుడు సగుణుడు కావచ్చును; నిర్గుణుడు కావచ్చును. నిర్గుణుడైనచో పరబ్రహ్మము సగుణుడైనచో శ్రీకృష్ణుడు. నిర్గుణ పరబ్రహ్మ తత్త్వమును సదాచింతించుట వలన కలిగెడి అనుభవము జ్ఞానానందరూపమైనది. అది శాంత రసస్థితిని కలిగించు సామర్థ్యము కలిగినది. మధురభక్తియందు పరమాత్మచింతనమువలన కలిగిన బ్రహ్మానందమే లక్ష్యమైనను దానిని సగుణమైన బ్రహ్మమును ఆలంబనముగా చేసికొని సాధించెడి విశేషమార్గము గోచరించుచుండును. అనగా ఆధ్యాత్మిక అనుభవమును పొందుటకు భక్తులు భగవదాకారమును లింగముగా భావించి రమించెదరన్నమాట. అనగా గోపికలు తాము దర్శించెడి శ్రీకృష్ణుని మంగళ విగ్రహము తాము పొందదలచుకొనిన భగవద్రతిరూప రసానందమునకు జ్ఞాప్యముగా, స్ఫోరకముగా, అభివ్యక్తి కారకముగా, తలంచుచున్నారని స్పష్టము. అందువలననే శ్రీకృష్ణుడు గమ్యము, గమకము రెండును అగుచున్నాడు. భగవద్రతి సుఖమునకు గమకము సగుణబ్రహ్మము. సగుణబ్రహ్మ రతియే రసరూపమని భావించు భక్తులకు తద్రూపమే అపరోక్షానుభూతిగా తోచు రసప్రీతి. అట్లగుటవే దశమస్కంధమునందు రాస పంచాధ్యాయి మధుర భక్తిరస పంచకోశముగా భాసించుచున్నది. యమునా నదీ తీరము నందలి వేణుగానలోలుని దర్శింపబోయెడి ముగ్ధ గోపికల హృదయముల యందు 'రసోవైసః' అను ఉపనిషత్ వాక్కులచే నిర్దేశింపబడెడి పరిపూర్ణ రసాస్వాదనకై అర్రులు సాచెడి ఆసక్తిరూపమైన స్థాయి స్పష్టమగుచున్నది. శ్రీకృష్ణ దర్శనము వలన వేణుగాన సుధా రసపానము వలన భగవద్రూపరతి స్థాయిత్వమునుబొంది శ్రీకృష్ణ భావనము వలన భగవద్భావనము చేయు శక్తిని తదనుగుణములైన అనుభావములను బొందు రక్తిని గోపికా హృదయములు పొందగలిగినవి. శ్రీకృష్ణు డంతరార్థమైన ఘట్టము విభావ భావనాభ్యాసము గోపికలకు కలిగినది. శ్రీకృష్ణుని విరహరూపమున వ్యక్తమైన మధుర రతి భగవద్రూప రతిస్థాయి చర్వణరూపమైన సహృదయ రసానుభావ స్థితి మరల శ్రీకృష్ణుడు ప్రత్యక్షమగుట భగవద్రూపరతివలన కలుగు రసానుభవము యొక్క అభివ్యక్తస్థితి శ్రీకృష్ణుడు గోపికలతో సలిపిన రాసక్రీడ విశ్వజనీనమైన రసానుభవస్థితిని పొందిన భగవద్రూప రతియొక్క పరిపూర్ణస్థితి. అట్లగుటచే రాసపంచాధ్యాయి భగవద్రసానుభూతి పరిపూర్ణత్వమును సాధించుటయందలి పంచదశాకోశముగా, పంచదశావస్థలుగా భావింపవచ్చును.

అలౌకిక రసములైన శృంగారాదులకును భక్తికిని భేదము స్పష్టముగా కాననగును. బహువనితలు ఏక పురుషునియందు రతిని భజించినను ఒకడు బహువనితలయందు రాగము ప్రసరించినను రతికి రసస్థితి కలుగుట కష్టము. పైపెచ్చు శ్రీకృష్ణునివలె పెక్కు రూపములను దాల్చి, పెక్కురు గోపికలతో క్రీడించిన ఘట్టము శృంగార రస సూత్రములచే వివరించుటకు వీలుకానిది. అచట శృంగారమనుటకంటె అద్భుతమనుట మేలు. భక్తియందు శ్రీకృష్ణుడు రసానుభవజ్ఞాపకమైన లింగము. అందుచే అతనికి నిజమునకు స్త్రీ పురుష వివక్షలేదు. పురుషునివలె భావించుట స్త్రీ సహజము. సహృదయునకు తద్భావనము మిథ్యగా భాసించును. అట్లు భాసించుటకు గోపికల వాక్యములు కూడ తోడ్పడుచున్నవి. లౌకికార్థమున వారు స్త్రీలు. పరమార్థమున వారు జీవులు లౌకికార్థమున కృష్ణుడు పురుషుడు. పరమార్థమున పురుషోత్తముడు, లింగరూపుడు. లౌకికభావమునుండి అధిగమించి పరమార్థ భావమునకు విభావమైన లింగముగా శ్రీకృష్ణుని రమించి తరించుట భగవద్రూప రతియొక్క పరమ తాత్పర్యము. భౌతికార్థ శాసనము పారమార్థిక భావనము మధురభక్తికి జీవనము. ఈ దృష్టితో దశమస్కంధము భగవద్రూపరతి స్థాయికమైన మధుర భక్తికి మణిదీపముగా భాసించుచున్నది.

మధురభక్తియొక్క అనుభవమునకు పరాకాష్ఠ రాసక్రీడ. అందు రస రూపుడు కృష్ణుడు. అందు రమించు జీవులు గోపికలు. తద్విభావములను ఆలంబనముగా చేసికొని రసానుభూతిని సాధించువారు సహృదయులు. భక్తి పరిపూర్ణ రసము. తద్రసరూపుడు శ్రీకృష్ణుడు. శ్రీకృష్ణుని రూపము తత్పరి పూర్ణ రసానుభావ జ్ఞాపకమైన లింగము. గోపిక తల్లింగము నాశ్రయించి భక్తి రసమును సాధించు సహృదయ హృదయ స్థితికి ప్రతీక లేక జీవ సంస్కారమునకు ప్రతీక. సహృదయుడు తత్ప్రతీకను తాదాత్మ్య స్థితిలో భజించి పరిపూర్ణ రసానుభవమును సాధించును. అనుభవస్థితియందు గోవిందుడే రస రూపుడైన ఆనందుడు. ఇట్టి మధుర భక్తి రసఫలము నందించు కల్పతరువే భాగవతము.

# ముగ్ధభక్తి – బసవపురాణము

'పరమేశభక్తియన్ సురతరువుండ
హరుభక్తియన్ కనకాచలంబుండఁ
గామారి భక్తిచింతామణియుండ
సోమార్ధధరు భక్తిసురధేనువుండఁ
బగతుఁడాసించునే పరధనంబునకు
మృగపతి యెద్దెస మేయునే పుల్లు?
క్షీరాబ్ధిలోపలఁ గ్రీడించు హంస
గోరునే పడియల నీరు ద్రావంగఁ?
జూత ఫలంబులు చుంబించు చిలుక
జాతి బురుగుమ్రానిపండ్లు గన్గొనునె?
రాకామలజ్యోత్స్నఁ ద్రావుచకోర
మాకాంక్ష సేయునే చీకటిఁ ద్రావ?
వికిదమ్మివాసన విహరించు తేఁటి
పరిగొని సుడియునే బబ్బిలివిరుల' బ. పు. 54

పరమేశ్వరుని దైవమని నమ్మి అచంచల చిత్తముతో భక్తులు భగవంతు నారాధించు భక్తిమార్గము వీరశైవము. ఈ మతమునకు ప్రవక్త బసవేశ్వరుడు. ఆతడు మూర్తీభవించిన భక్తియని పాల్కురికి సోమనాథుడు కీర్తించినాడు.

'వడిఃబాఱు జలమున కొడలెల్లఁగాళ్ళు
వడిఁగాలుచిచ్చునకొడలెల్ల నోళ్ళు
వడిపీలుగాడ్పున కొడలెల్లఁ దలలు
వడిఁజేయు బసవన కొడలెల్ల భక్తి.' బ. పు. 38

బసవనికి ఒడలెల్ల భక్తి యని ప్రతిపాదించు వాక్యమునకు దృష్టాంతములుగా గైకొనిన మూడు వాక్యములు వీరశైవభక్తికి సహజముగా భాసించు

ప్రసారము, ప్రచారము, ప్రయోగము అను మూడు గుణములను వ్యక్తీకరించి నట్లయినది. నీరు పారినట్లే వీరశైవమునకు వేగ మధికము. కార్చిచ్చు అడవులను కాల్చునట్లే వీరశైవమునకు తీవ్ర మధికము. వడివీచు గాడ్పునకు పర్వతములను సహితము పెకలించు గుణమెట్లు సహజమో వీరశైవమునకును అన్య మతములతో ఢీకొను స్వభావము సహజము. బసవని చరిత్రలో నిట్టి వీరశైవ మత లక్షణములు విరివిగా కాననగును.

వీరశైవము - భక్తి

బసవని మతము ననుసరించువారు మాహేశ్వరులనియు, వీరమాహేశ్వరులనియు పిలువబడుదురు.

ఈశ్వర స్సర్వభూతానాం బ్రహ్మాదీనాం మహానితి
బుద్ధియోగా త్తదాసక్తో భక్తో మాహేశ్వర స్స్మృతః॥

బ్రహ్మాది దేవతాజాలం మోహితం మాయయాసదా
అశక్తం ముక్తిదానేతు క్షయాతిశయ సంయుతమ్॥

అనాది ముక్తో భగవానేక ఏవమహేశ్వరః
ముక్తిదశ్చేతి యోవేసవై మాహేశ్వర స్స్మృతః॥

క్షయాతిశయ సంయుక్తా బ్రహ్మవిష్ణ్వాది సంపదః
తృణవన్మన్యతే బుద్ధ్యా వీరమహేశ్వర స్సదా॥

శబ్దస్పర్శాది సంపన్నేసుఖలేశేతు నిస్పృహః
శివానందే సముత్కంఠో వీరమహేశ్వర స్స్మృతః॥[1]

బ్రహ్మ మొదలుకొని సర్వ భూతములకును ఈశ్వరుడే స్వామియని నిశ్చయజ్ఞానము కలిగి బ్రహ్మాదులకంటె మోక్షమీయకలిగిన శక్తిమంతుడు, భగవంతుడు మహేశ్వరుడేయని తెలిసికొని బ్రహ్మవిష్ణ్వాదుల విభవములు వినాశము చెందెడివనియు, శివ విభవము నాశనము లేదనియు గ్రహించి, అన్య దేవతలను గడ్డిపోచలవలె తలంచుచు నిత్యమైన శివానందమునందే ఆసక్తి కలవాడు వీరమహేశ్వరుడనబడునని శైవశాస్త్రములు ఘోషించుచున్నవి.

పాల్కురికి సోమనాథుడు వీరమాహేశ్వరుడు. అతని ముఖమునందు భక్తి కవితావేశముతో ఛందోవాహికల నాశ్రయించి ప్రవహించినది. ఆ వీర మహేశ్వరుని శివభక్తి అతని 'అనుభవసార' గ్రంథము నందలి పద్యములలో వ్యక్తీకరింపబడినది. ఈ క్రింది పద్యములు వీరశైవ భక్తి ప్రవృత్తిని ప్రత్యక్షీకరింపగల్గినవి.

చ. హరుఁడను కల్పవృక్ష, మమృతాంశుధరుండను కామధేను, వీ
శ్వరుఁడను పెన్నిధాన, మహివల్లభకుండలుఁడన్ సుధాబ్ధి శం
కరుఁడను మేరువుండఁ దమ కన్నులఁగానక వాంఛితార్థముల్
సురపతిఁగొల్చినన్ దమకుఁజొప్పడునే శివభక్త శేఖరా!

శా. వ్రాలున్వ్రాలు శివార్చనాపరవశవ్యాప్తిన్ బ్రమోదంబునన్
గ్రాలున్ గ్రాలు నహర్నిశంబు శివలింగధ్యానసంపన్నుఁడై
సోలున్ సోలు నపారసార వివిధ స్తోత్రప్రలాపంబులన్
దేలున్దేలు మహానుభావ సుఖవార్ధిం భక్తుఁడుద్యద్గుణా!

చ. హరు మది నిల్పి నిల్పి యనయంబును బూజలు సల్పి సల్పి శం
కరు మును జూచి చూచి తమకంబు దలిర్పఁగ నేచియేచి యీ
శ్వరు నుతిఁజేసి చేసి స్వవశస్థితిఁ జేష్టలఁబాసి పాసిత
త్పర వశభావమంది చను భక్తుఁడు లింగమునొందు సన్మతిన్![2]

భక్తికి బమ్మెరపోతన్న పెట్టినది పేరు. కాని పోతన్నకు పూర్వమే వెలసిన పద్యములివి. భక్తి పారవశ్యమునందు పోతన్నకు బాటలు చూపిన పద్యములాయని యనిపించుచున్నవి. పైన పేర్కొనిన ద్విపదలు సహితము 'మందార మకరంద మాధుర్యమునదేలు' అను పోతన్నగారి ప్రసిద్ధసీసపద్యము నకు దారిచూపినవనుటలో అనుమానము లేదు. సోమనాథుని బసవపురాణము ముఖ్యముగా ముగ్ధభక్తికిని ఆవేశ ప్రవృత్తికిని ఆలవాలమైనది. పోతనగారి ఆంధ్రమహా భాగవతము మధుర భక్తికిని, పారవశ్య ప్రవృత్తికిని ఆలంబన మైనది. ఆంధ్ర సాహిత్యమునందు ముగ్ధభక్తికిని, మధుర భక్తికిని పై రెండు పురాణములు పరమాదర్శములుగా భాసించుచున్నవనుటలో విప్రతిపత్తి లేదు.

భగవద్భక్తిని బోధించని మతముకాని, భక్తిని మోక్షమార్గముగా నంగీకరింపని భక్తుడుగాని లోకమునందుండుట అరుదు. భక్తిరస ప్రధానములైన కావ్యములు, రచనలు ఆయా మతములందు వెలువడుట సర్వసామాన్యము. భగవద్రతి స్థాయిగా భాసించెడి భక్తి సర్వ మతములయందును సామాన్యమయ్యును ఆయా మత సంప్రదాయముల ననుసరించి ఆయా భక్తిమార్గములలో కొన్ని పద్ధతులకు ప్రాధాన్యమేర్పడుచుండ వచ్చును. ఉదాహరణమునకు విష్ణుభక్తి లేదా వైష్ణవ భక్తి సంప్రదాయములో నవవిధ భక్తులు ప్రసిద్ధములు. కృష్ణభక్తి లేదా రాధామాధవభక్తి సంప్రదాయమునందు మధుర భక్తికి ప్రాముఖ్యము కలదు. అట్లే వీరశైవ సంప్రదాయమునందు వెలసిన భక్తి పద్ధతులన్నింటిలో ముగ్ధభక్తికి ఒక ప్రత్యేక ప్రతిపత్తి కలదు. పరమేశ్వరునిపై అచంచల విశ్వాసముంచి లింగదీక్షాదులను గైకొనుట వీరశైవచార నిరతిని భజించుట మొదలైనవానితోపాటు శివశరణ భావమునుబొంది పరమేశ్వరుని ప్రభువుగా, నెచ్చెలిగా, తల్లిగా, తండ్రిగా, గురువుగా, సుతునిగా భావించి, తత్సేవలో తనువును సహితము పరిత్యజించుటకు వెనుకాడని భక్త్యావేశము వీరశైవ భక్తులకు సహజ లక్షణము. దీనికితోడు అమాయకత్వము,నిశ్చలచిత్తము జోడైనచో ముగ్ధభక్తి చక్కగా రాణించును.

**బసవపురాణము ముగ్ధభక్తుల ప్రశంస**

> 'నిక్క మీశ్వరుఁగాని నిజమెఱుంగమిని
> ముక్కటి భక్తులు ముగ్ధులుగారె?' బ. పు. 63

ముగ్ధభక్తులను పేర్కొనుచు బసవని పలుకులుగా పాల్కురికి సోమనాథుడిట్లు పేర్కొనినాడు.

> 'నార్చయే దన్యదేవాం స్తునస్మరేన్న చకీర్తయేత్
> నతన్నైవేద్య మశ్నీయాచ్ఛివభక్తోదృఢవ్రతః॥'
> 'యద్గృహేష్వన్య దేవోఽస్తితద్గృహాణి పరిత్యజేత్
> నాన్యదేవార్చకాన్మర్త్యాన్ పూజాకాలే నిరీక్షయేత్'[3]

అని వీరశైవమతాచారము. శివునికంటె నితరమైన దేవతలను పూజించుటగాని,స్మరించుటగాని,కీర్తించుటగాని వీరశైవమున దోషము. శివునికంటె నితర దైవములు పూజింపబడు నిండ్లకు పోరాదు. వారికి నివేదించిన

పదార్థములను తినరాదు. అన్యదేవార్చకులను కంటచూడరాదు. ఇట్టివి వీరశైవాగమ నియమములు. వీనిని దృఢముగా విశ్వసించి జీవితమునం దాచరించు వారు వీరమాహేశ్వరులు. వీరిలో జ్ఞాన భక్తులుండవచ్చును లేదా ముగ్ధభక్తులు ఉండవచ్చును. జ్ఞానియైన వీరమాహేశ్వరుడు పంచవిధ క్లేశముల నధిగమించి సర్వక్లేశముల నుండి విడివడి పరబ్రహ్మమనెడి మహాలింగమునే హృదయ పద్మమునందు నిలిపి ధ్యానింపగలిగెడి ఉన్నత స్థితిని పొందగలిగి యుండును. ముగ్ధభక్తులు జ్ఞానభక్తులవలె సిద్ధులు కారు. పంచవిధ క్లేశములను సోపానముల నధిరోహించు సాధక భక్తులు వీరు. శివునియందు అచంచల విశ్వాసము కలిగియున్నను వీరు కొంతవరకు అవిద్యా క్లేశమును, అభినవ క్లేశమును, అస్తిగత క్లేశమును, రాగ క్లేశమును, ద్వేష క్లేశమును తమ భక్తి ప్రవృత్తుల యందు కలిగియుందురని చెప్పవచ్చును. మహేశ్వరుని భగవంతునిగా నమ్మ టలో వీరు ఏ పరమ మాహేశ్వరునికిని తీసిపోరు. కాని, పరిపూర్ణ జ్ఞాన స్థితి వీరికుండదు. సాధన స్థితియే వీరి సహజ స్వభావము. అందువలననే వీరిని ముగ్ధ భక్తులని పిలుచుట సార్థకమగుచున్నది.

బసవపురాణమునందు సిద్ధభక్తులతోపాటు ముగ్ధభక్తుల స్వభావములు వివేచించుచు డా.జి.వి. సుబ్రహ్మణ్యం గారిట్లనిరి :

> 'వీరితరభక్తులవలె వీరమాహేశ్వర వ్రత పారీణులైయున్నను అధిక ముగా నమాయకులు, నిరాడంబరులు, స్నిగ్ధప్రవృత్తిగలవారు. స్వచ్ఛ మైన వాత్సల్యము, పారవశ్యముతోఁగూడిన భక్తిభావము, వెన్నవంటి హృదయము, శివునిగాంచినంతనే ఆప్తునివలె మిత్రునివలె భావించి ముగ్ధభావముతో గీర్తించి సేవించి లాలించెడి స్నేహభావము వారికి వెన్నతోఁబెట్టిన సుగుణజాలము. వీరు శివుని కొఱకై ప్రాణములనైనను త్యజింపసిద్ధమై త్యాగోత్సాహ భక్తివీరులై యొప్పువారు.'[4]

బసవ పురాణమునందు ముగ్ధభక్తిచ్ఛాయలుకలిగిన భక్తులు పలువు రున్నను పాల్కురికి సోమనాథుడు ముగ్ధభక్తులని వాచ్యముగా పేర్కొనినవారు ముఖ్యముగా నెనిమిది మంది. వారి పేర్లు—

1. ముగ్ధ సంగయ్య 2. రుద్రపశుపతి 3. నక్కనయనారు 4. బెజ్జ మహాదేవి 5. గొడగూచి 6. దీపదకళియారు 7. నాట్య నమిత్తాండి 8. ఉడు మూరి కన్నప్ప. వీరిని గూర్చిన ప్రశంస బసవ పురాణమునందిట్లు కలదు:

1. 'గ్రక్కున సకలోపకరణంబు లోలి
జక్కొల్పి యముగ్ధసంగయ్య కలరఁ' బ. పు. 61

2. 'అని యూరుపీఠంబునందు ధరించె
మును గుఱియున్నదే ముగ్ధత్వమునకు' బ.పు. 65

3. 'తెలవ ముగ్ధత్వంబు దేట తెల్లముగ
మెఱయింతుఁ బొమ్మని మెచ్చి యక్షణమ' బ.పు. 66

4. 'కొడుకని యిబ్బంగిఁ గొనియాడుచుండఁ
బడఁతి నిశ్చలముగ్ధ భావంబునకును' బ.పు. 68

5. 'బాలనిశ్చల ముగ్ధ భావ సంపదకు
నీలోకమున దృష్టమిదియని పొగడ
గొడగూచి యని చెప్పఁబడి మహామహిమ
నడరెఁదా నాముగ్ధ యదియునుగాక' బ.పు. 73

6. దేవదానవ మానవావళి వొగడఁ
గా వీరభక్త శిఖామణియైన
యట్టి దీవద కళియారి ముగ్ధత్వ
మిట్టలంబై యొప్పెనిల'.... బ.పు. 76

7. 'అనుచు నానతియిచ్చి యద్దేవదేవుఁ
డనురాగలీలమై నతుల మౌగ్ధ్యమున
మించిన నాట్యనమిత్తాండి మహిమ
నంచితకనక దివ్యవిమానమునను
గొనిపోయెఁ గైలాసమునకు'.... బ.పు. 78

8. కావునఁ దొల్లి ముగ్ధ స్వభావులకు
దేవుండు కృపసేయుఁ దెల్లమిట్లనుచు
బసవయ్య ముగ్ధగణ సమూహైకథలు
పసరింప నాచెన్న బసవయ్య వినఁగఁ' బ.పు. 88

పై బసవపురాణ వాక్యములవలన వీరశైవమునందు ముగ్ధ భక్తులకు ప్రత్యేక స్థానము కలదని స్పష్టమగుచున్నది. తన్మతాచార్యుడైన బసవేశ్వరుడే ముగ్ధభక్తులను విశేషించి కీర్తించినాడు. జ్ఞానభక్తుల గాథలలో వారు పరమేశ్వరుని చేరు విధానము పర్వతారోహణమువలె భాసించినది. క్రమముగా భగవత్తత్త్వమును దర్శించి సాధించి పరమేశ్వరుని సాన్నిధ్యము పొందెడి విధానము స్పష్టముగా గోచరించును. కావున ఆరోహణపద్ధతి యందు సహజము. ముగ్ధభక్తియందట్లుకాదు. ఎత్తైన శిఖరమునుండి ఒక్కసారిగా లోతైన జలసరోవరమునందు దూకినట్లుండును. పరమేశ్వరునిపై విశ్వాసమే ఆ లోతైన సరోవరము. తమ సర్వస్వమును సమర్పించెడి శరణాగత భావమే శిఖరము. నిశ్చలభక్తితో శివునికి తనను తాను కైంకర్యము చేసికొనెడి భక్తియే జలావగాహనము. ఇందు కొండనెక్కెడి పద్ధతిలో నుండెడి ఆరోహణక్రమము కానరాదు. అవ్యవధానముగా భక్తియందు ఆత్మసమర్పణ చేసికొనెడి ఆవేశమే యిందు గోచరించును. అట్లగుటచే జ్ఞానభక్తులకంటె ముగ్ధభక్తులె భగవంతుని సాన్నిధ్యము సత్వరముగా పొందగలరని ముగ్ధభక్తి నిరూపించుచున్నవి. వీరశైవమునందు ముగ్ధభక్తులకందులకే అంత గౌరవము. బసవ పురాణమునందును అందులకే వారికంత గౌరవము.

## మధుర-ముగ్ధభక్తులు, భేదసాదృశ్యములు :

మదురభక్తికిని ముగ్ధభక్తికిని సహజముగా భక్తి లక్షణములందుండు సామ్యములతోపాటు ఆయా మత సంప్రదాయములందున్న భేదముల వలన నేర్పడిన వైవిధ్యము కూడ కలదు. వాని నీక్రింది విధముగా స్థూలవివేచనము చేయవచ్చును.

1. భగవద్రతిగాని భగవద్రూపరతిగాని స్థాయిభావముగా గలిగిన రసము భక్తి. ఆ భక్తియే విభావ భేదము ననుసరించి మధురభక్తిగాను ముగ్ధభక్తిగాను స్ఫురింపవచ్చును. నిజమునకు ఈ భక్తిభేదములు రెండును ఒక కొమ్మకు మొలచిన రెండు రెమ్మలు. భాగవతమునందు భగవంతుడాదివిష్ణువుగా ప్రతిపాదింపబడుచున్నను ఆయా యుగములయందు విష్ణువు దాల్చిన అవతార విశేషములను సహితము భగవద్రూపరతికి ఆలంబనములుగా అభివర్ణించుట కానబడుచుండును. మధురభక్తియందు

శ్రీకృష్ణరూపమొకటియే ఆరాధ్యము, ధ్యేయము. మధురభక్తి సంప్రదాయమున శ్రీకృష్ణుడే రసరూపుడు. శ్రీకృష్ణరసమే పరిపూర్ణరసము. శైవసంప్రదాయమునందును వీరశైవసంప్రదాయమునందును పరమేశ్వరుని సాకారునిగను లింగరూపునిగను ఆరాధించెడి పరిపాటి కలదు.

'మాయాశక్తి వశాదీశో నానామూర్తి ధరః ప్రభుః
సర్వజ్ఞ స్సర్వకర్తాచ నిత్యముక్తో మహేశ్వరః.'[5]

పరమేశ్వరుడు మాయాశక్తివశుడై పలువిధములైన దివ్యమంగళ రూపములు దాల్చుననియు అతడు జగత్ప్రభువనియు, సర్వజ్ఞుడనియు, సర్వ జగన్నిర్మాణ కారణభూతుడనియు, నిత్యముక్తుడనియు, శైవశాస్త్రములు వక్కాణించుచున్నవి. పరమేశ్వరుని దివ్యమంగళ రూపములన్నియు భగవద్రతికి ఆలంబన విభావములు కాగలవు.

ఇట్లు సాకార శివరూపారాధనము శైవమున మన్నించుటయు కలదు. వీరశైవమునందు లింగధారణము నియతము.

'వేదశాస్త్ర పురాణేషు కామికాద్యాగమేషుచ
లింగధారణ మాఖ్యాతం వీరశైవశ్చ నిశ్చయాత్॥'[6]

వేధములందును శాస్త్రములందును పురాణములందును, శివాగమము లందును, వీరశైవులు లింగధారణమును విధిగా చేయవలెనని చెప్పబడినట్లు సిద్ధాంత శిఖామణి పేర్కొనుచున్నది. లింగార్చనము బాహ్యమనియు, ఆంతర మనియు రెండు విధములు. జ్ఞానవైరాగ్యములు కుదురుటకు బాహ్యలింగార్చన ముపకరించును. బాహ్యలింగార్చనమునకు భగవద్రతి ముఖ్యము. క్రమముగా బాహ్యలింగార్చన భక్తి జ్ఞానవైరాగ్యములను కలిగించును. అంతర్లింగాను సంధానమునకు దారితీయును.[7] అంతర్లింగమే శివపరబ్రహ్మమనెడి మహా లింగము. దానిని హృదయపద్మమున ధ్యానింపగలిగిన వివేకి పంచవిధ క్లేశములనుండి విడివడి శివైక్యమును పొందగలడు.[8] ఈ ప్రస్థానమునందు శివ భక్తునకు తోడ్పడునది మహాలింగరూప భగవద్రతి. పంచవిధక్లేశముల నధి రోహించు వరకును భాసించెడి భగవద్రతి ముగ్ధభక్తిగా పరిగణించుటకు వీర

శైవమున పీలుకలదు. వీరశైవమున రూపమునకంటె లింగములకే ప్రాధాన్యము హెచ్చు. శివరూపమునకు లింగముప్రతీక, ప్రతినిధి. శైవులకు కాయికమే కైలాసము. ప్రాణలింగమే భగవద్రూపము. వైష్ణవమునందును విష్ణు రూపమునకు గాని మధురభక్తియందు శ్రీకృష్ణరూపమునకుగాని రసరూపమైన లింగమనియే తాత్త్వికముగా వ్యాఖ్యానము చెప్పెదరు. శైవులు భగవద్రూప సాక్షాత్కారానుభూతికి ప్రతినిధిగా శివలింగమును భావించెదరు. సగుణ నిర్గుణ భావనము శివలింగమునందు చేయుట శైవభక్తి సంప్రదాయము. ముగ్ధభక్తులయందు కానదు విశేషము ఇదియే. వారు సేవించునది శివలింగము, భావించునది శివరూపములు, భావించునది శివరూపమును. ముగ్ధభక్తిలో భగవద్రూపరతికి అలంబనము లింగము. మధురభక్తిలో శ్రీకృష్ణుని రూపమే అలంబనము. ఇట్లు భగవద్దతియందు ఉభయభక్తులును సామ్యములు కలిగియున్నను భగవద్రూపలింగసమారాధనమునందు భేదమును ప్రకటించుచున్నది.

2. భాగవతమునందు చెప్పబడిన నవవిధభక్తులు ప్రసిద్ధములు. అవి వైష్ణవ సంప్రదాయమునకు వర్తించునని చెప్పుటయు ప్రసిద్ధముకాని వీరశైవమునందును నవవిధ భక్తి మార్గముల ప్రసక్తి కలదు.

'శ్రవణం కీర్తనం శంభోఃస్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మని వేదనమ్'॥

'ఏవం నవవిధాభక్తిః ప్రోక్తాదేవేన శంభునా
దుర్లభా పాపినాంలోకే సులభాపుణ్య కర్మణామ్'॥[9]

పై నవవిధ భక్తులను సాక్షాత్ పరమేశ్వరుడే ప్రతిపాదించెనట. ఆ భక్తి మార్గములు పాపాత్ములకు దుర్లభములట పుణ్యాత్ములకు సులభములట. ఇట్లు శివ వైష్ణవ సంప్రదాయములందు నవవిధభక్తుల అంగభూతములని పూర్వాధ్యాయమునందు నిరూపించుటయైనది. అట్లే వీరశైవమున ముగ్ధభక్తికి అంగములుగా నవవిధ భక్తులను సమన్వయింపుకొనవచ్చును. సిద్ధాంత శిఖామణియందు వీరశైవులు అంతరంగమునందును, వీరమాహేశ్వరులు బహిరంగమందును లింగపూజను నిర్వహింతురని పేర్కొనబడియున్నది.[10]

శివయోగ సారమునందలి యీ పద్యము గమనింపదగినది-

కం. 'ఆత్మస్థుడై వెలుఁగు పర
మాత్ముని నక్షయుని శివుని నాత్మనుగనలే
కాత్మ పరిజ్ఞాన విరహి
తాత్ములు బాహ్యమునఁ గొల్తురప్పరమేశున్.'11

దీనిననుసరించి జ్ఞానులైనవారు ఆత్మస్థ శివలింగమును పూజింతురని స్పష్టమగుచున్నది. వీరికంటె భిన్నులు ముగ్ధ భక్తులు, వీరు పరమేశ్వర కథా శ్రవణము, పరమేశ్వర రూపగుణ కీర్తనము, పరమేశ్వరుని నామరూప పునః పునస్స్మరణము, పరమేశ్వర పాద సేవనము, శాస్త్రోక్త శివార్చనము లేదా శివలింగార్చనము, శివునకు వందనము, దాస్యము, శివుని నెచ్చెలిగా భావించి సేసెడి సఖ్యము, ఆత్మ నివేదనము మొదలగునవి భక్త్యంగములుగా సాధింప వలెనన్నచో అంతర్లింగారాధకులై యుండుటకు వీలులేదు. శివమూర్తినిగాని, శివలింగమూర్తినిగాని, లింగధారియైన జంగమమూర్తినిగాని సేవించి తరింపవల యునేగాని అంతర్లింగ ధ్యానము చేసెడి ప్రవృత్తి వీరియందు కానబడుట కష్టము. కావున విష్ణురూప భగవద్రతి మధురభక్తియందెట్లు సహజమో ముగ్ధభక్తి యందు కూడనట్లే నమర్థనీయమగుచున్నది. లింగరూపమునందును సాంగరూప మును దర్శించువాడే ముగ్ధభక్తుడు. ఇట్లు నవవిధ భక్తి భేదములను భావించుట యందు సామ్యమున్నను వానిని సాధించుట యందు కొంత భేదము తప్పదు.

3. మధురభక్తి యందు వలెనే ముగ్ధభక్తియందును మౌలికముగా 'అభి లాష' యను భావముండ వలయును. ఇట్టి యభిలాష లేకపోయినచో భగవద్రతి జనించుట దుర్లభము. ఈ లక్షణము రెండింట సమానము. ఇట్టి భక్తికి ఫలము ఆత్మనివేదనము. శైవవైష్ణవములు రెండును ఆత్మ నివేదన కత్యంత ప్రాముఖ్యమిచ్చును.

యస్. యస్. రాఘవాచార్ గారి మాటలలో-

'Both is virasaivism and visnavaism the ideal of self surrender to God is accorded the highest place in the scheme of Sadhana in virasaivism what follows sara-

nsathala is the consummation of the whole course of Sadhana in 'unitive life'. Aikyasthala is the Phala and not Sadhana. Hence the offiring of one's Totality of being to the Supreme in the act of self surrender is the Suprems Phase of Sadhana.'[12]

4. మధురభక్తియందు భక్తునకు భగవంతునకు నడుమ నాయికానాయక భావముండుననియు ముగ్ధభక్తియందు జీవశివభావముండుననియు ప్రసిద్ధము. మధురభక్తియందు భాసించు ఆధ్యాత్మిక శృంగారదీప్తి ముగ్ధభక్తి సంప్రదాయమునందు ప్రచురముకాదు. మధురభక్తి ప్రస్తానము శైవమునందు లేదనుటకు వీలులేదు. కాని, శ్రీకృష్ణభక్తియందు వలె ప్రాచుర్యము నొందలేదు. నాయికా నాయకభావము ఇది స్వభావమును తెలియజెప్పెడి ఔపమ్యము. భక్తుడు స్త్రీయైనను, పురుషుడైనను మధురభక్తియందు నాయికా స్వభావమును భజించుచున్నాడు. ఇందు కొంత విరోధాభాసము లేకపోలేదు. నాయిక నాయకునకు సర్వము సమర్పించునట్లు భక్తుడును తన సర్వస్వమును భగవంతున కర్పించుచున్నాడు. నాయికకు నాయక రతియే స్థాయియైనట్లు భక్తునకు భగవద్రతియే స్థాయి యగుచున్నది. కాని, నాయికా నాయక శృంగారమునందు తనూస్పృహ కలదు. మధురభక్తియందు తనూస్పృహలేని ఆత్మనివేదనమే భాసించును. అట్లగుటచే ఆత్మనివేదన రూపమైన శరణాగతియే భగవద్రతియని మధుర భక్తియందు స్పష్టమగుచున్నది. మధురభక్తి సంప్రదాయమును రూపగోస్వామి మొదలగువారు రస సంప్రదాయముతో సమన్వయపరచి ప్రపంచించిరి. భక్తిరసామృతసింధువు, ఉజ్జ్వల నీలమణి, భక్తిరసాయనము అట్టి ప్రయత్నములలో వెలసిన అపూర్వ లక్షణ గ్రంథములు, మధుర భక్తిలో అహంకారస్ఫూర్తి లేదు.

వీరశైవమునందును శరణునికి శివునికిని మధ్య సతీపతిభావము చెప్పెడి సంప్రదాయము కలదు

'అంగ లింగీ జ్ఞానరూప స్సతీజ్ఞేయ శ్శివః పతిః
యత్సౌఖ్యం తత్సమావేశీతద్వాన్ శరణనాను వాన్॥'

లింగాంగ సామరస్యముగల ప్రాణలింగి తాను భార్యయనియు శివుడు భర్తయనియు భావించును. బృహదారణ్యక శ్రుతియును ఈ యభిప్రాయమును బోధించుచున్నది.

'యథాస్త్రియాసం పరిష్వక్తోన బాహ్యం కించనవేద
నాపరం ఏవయే వాయం పురుషః ప్రాజ్ఞేనాత్మనాసంపరిష్వక్తో
నబాహ్యం కించన వేదనాంతరం"14

సిద్ధాంత శిఖామణి యీ భావమునే వ్యక్తీకరించుచు-

'సతీవరమణేయస్తు శివేశక్తిం విభావయన్
తదన్య విముఖ స్సోఽ యం జ్ఞాత శ్శరణనామవాన్॥'15

అని శరణుని నిర్వచించెను. శివశరణుడు పతివ్రతవంటివాడు. ఆమె తన భర్తయెడ తక్క పరపురుషునెడ నెట్లు విముఖురాలై యుండునో అట్లే శివుని విషయమున దక్క అన్యదేవతలయెడ విముఖుడై యుండునని వివరించెను. శివుడే దైవమని నమ్మి సేవించుటయందు నాయికా నాయక భావమున్నను రాధామాధవ తత్త్వమునందువలె మాధుర్య స్ఫూర్తి కానరాదు. డా॥ చిలుకూరి నారాయణరావుగారు బసవనికిని శివునికిని గల నాయికా నాయక శృంగార భావనను పేర్కొనుచు దానివి భక్తి శృంగారమనుట భావ్యమని పేర్కొనినారు:

'లక్షణ గ్రంథములలో చెప్పబడిన శృంగార మీకావ్యములలో ఉన్న దానికి కొంత విలక్షణముగా ఉన్నది. ఈ కావ్యములలోని నాయకులు సాధారణ కావ్యములలోని నాయకులవంటివారు కారు. నాయకునకున్ను నాయికకున్ను గల సంబంధముచేత శృంగార రస మేర్పడుతుంది కాని, సాధారణ కావ్యములలోని నాయికలవంటి నాయికలకు సోమనాథుని గ్రంథములలో తావు లేకపోయినది. అందుచేత భక్తిశృంగారమనే ఒక క్రొత్తరీతి శృంగారమును కల్పించినాడు. బసవేశ్వరుని పెండ్లికొడుకు వేషము భక్తి శృంగారమయినట్లు కవి వర్ణించినాడు. కాని, కావ్యరస నిరూపణ విషయములో నిజముగా బసవేశ్వరుడున్ను పండితారాధ్యుడున్ను నాయకులుకారు. వారు నాయికలు. శివుడు నాయకుడు. ఈ అపూర్వ నాయికా నాయకులకు గల సంబంధంముచేత ఏర్పడిన భక్తి శృంగారమును సోమనాథు డత్యద్భుతముగా నిరూపించినాడు. బసవేశ్వ

రునికిన్ని శివునికిన్ని గల నాయికా నాయక శృంగార భావనను చూడ వచ్చును.'

"పనుగొన గురుమూర్తిపతి కూటమునకు
మనసు నపుంసకంబన నెట్లువచ్చుఁ?
బున్నపుంసక గుణంబులు గల్గెనేని
నెన్నంగ నతి కామియే, యట్లుఁగాక—
మగలకు మగడగు మత్పతిఁగవయ
మగవాండ్రు నాండ్రుగా మరుగుదురనిన
మనసుగూడుట సోద్యమా పతిననుట
మనసున కడమున్న తన విభుఁగదిసి
మనికుఁడై తనుదాన మరచి యున్నట్టి
యనువు దానిదియొకో!-యట్లునుగాక,
పొగయంగ నొక్కటఁ, జూచుట రెంట,
వగమూఁట, నూర్పులు నిగుడ నాల్గింటఁ,
దావమైదంటను, దయ్యెడాఱింట,
నేవారఁ గుడువమి యేడింట మరులు,
నొక్కండుఁబలుకమి యొగినెన్మిదెంట,
జావుపదింటఁగ్రచ్చఱ విరహులకు
భావింప నివియ దశావస్థలండ్రు;
దావిభుఁబాయక చావక చచ్చు
నీ విషయావస్థలితరులకగునె.''[16]

చిలుకూరి వారు దీనిని భక్తి శృంగారమని పిలిచినను దీనిలో మధుర భక్తిచ్ఛాయలు దర్శించుటకు వీలగుచున్నది. కాని, ముగ్ధభక్తి సంప్రదాయము మధురభక్తి సంప్రదాయమువలె ఒక ప్రసిద్ధ ప్రస్థానముగా లాక్షణికులచేత నిరూపించబడలేదు. నవవిధ భక్తులను మధురభక్తి కన్వయించుకొనినట్లు ముగ్ధ భక్తిని అన్వయించుకొనవచ్చును. వీరశైవ సిద్ధాంతమున శివ విశిష్టాద్వైతమన వచ్చుననియు, అది భేదాభేద సిద్ధాంతమనియు రామానుజుడంగీకరించిన ద్వైత భావము నంగీకరించుచు నిత్య సామీప్య సారూప్య భోగమాత్రమైన సమత్వ రూపముగల శివ జీవాద్వైతమును ప్రతిపాదించుననియు, కాని, వీరశైవ

వైష్ణవులకు భేదము కలదనియు డా॥ చిలుకూరి నారాయణరావుగారు పేర్కొ- యున్నారు.

మధురభక్తియందువలె వీరశైవమునందు నిరహంకార తన్మయ సాత్త్విక ప్రవృత్తి భక్తులలో సర్వత్ర గోచరించునని చెప్పుటకు వీలులేదు. ముగ్ధభక్తి సహజముగా ఉత్సాహభావముచేత ఉన్మీలించునది. శివునికొఱకు సాహసముగా భక్తులు బలిదాన మొనర్చుకొనుటయందుగాని ఆత్మ ప్రత్యయ ముతో శివునిపట్ల స్నేహాదులను పచరించుటయందుగాని ముగ్ధ భక్తులలో సాహంకార ప్రవృత్తి లేదా స్వాభిమాన ప్రవృత్తి స్పష్టముగా గోచరమగు చున్నది. పంచవిధ క్లేశములను తరించు సాధకులుగా ముగ్ధభక్తులు కానబడ చుందురు. కావున వీరియందు సిద్ధులైన జ్ఞానభక్తులయందు కానబడు శివాద్వైత భావము గోచరము కాకపోవచ్చును. కావున మధురభక్తి నిరహంకార భక్తి ముగ్ధభక్తి ఆత్మప్రత్యయముతో కూడుకొనిన భక్తి.

5. మధురభక్తియందు ముఖ్య గౌణ భక్తిరస విభాగములు కలవు. ముగ్ధ భక్తిని వివేచించెడి లక్షణ గ్రంథములు ప్రత్యేకముగా లేకపోవుటచే అందు ముఖ్య గౌణభక్తి విచారము సాగలేదు. శాంతము, ప్రీతి ప్రేయస్సు, వాత్సల్యము, మధురమనునవి కృష్ణభక్తియందలి ముఖ్య భక్తిరసములు. ఈ విభాగమును ముగ్ధభక్తికిని వర్తింపజేసికొన వచ్చును. బసవ పురాణమునందు అల్లమ ప్రభువును, ప్రీతికి కన్నప్ప బాణుడు మొదలైనవారును, ప్రేయోరసమునకు రుద్రపశుపతి, గొడగూచి మొదలైన వారును, వాత్సల్యమునకు బెజ్జమహాదేవి మొదలైన వారును ఉదాహరించుటకు యోగ్యులు. వైష్ణవమునందలి మధుర భక్తికి బదులు శైవమునందు ముగ్ధభక్తిని గ్రహించుటుచితము. మధుర భక్తి యందు శాంతాదులెట్లు సమన్వయించునో ముగ్ధభక్తి యందును శాంతా దులు సంగమించునని పేర్కొనవచ్చును. ఈ దృష్టితోడనే ప్రధాన రస విభాగము గ్రహించుట సమంజసము.

ఇట్లే వైష్ణవ భక్తి భేదము లన్నియు ముగ్ధశైవభక్తి గాథలకన్వయించి నచో ముగ్ధభక్తి భేదములు కాగలవు. ముఖ్య భక్తులను నవవిధ భక్తులను కలిపి నచో 4+9=13 భక్తి రసభేదములు కాగలవు

6. భక్తి రసామృత సింధువునందు చెప్పబడిన భక్త్యంశములకును, వీరశైవ మత గ్రంథములయందు చెప్పబడు భక్త్యంశములకును భేదములున్నను సమాంతరములుగా గోచరించు అంశములు కొన్ని కలవు. వానిలో పేర్కొనదగినవి:

అ. సాధనము, భావము, ప్రేమ అనునవి భక్తి సోపానములుగా భక్తిరసామృత సింధువునందు వర్ణింపబడినవి.

వీరశైవమునందు షట్ స్థలమును అభ్యాస యోగము చేయుటవలన శివత్వము ప్రాప్తించును. దానికి ఉపాసన, ధ్యానము, ధారణము, జ్ఞానమనునవి సాధనములు.[18] ఇవియే ముగ్ధభక్తికి సోపానములు. జ్ఞానము పొందిన భక్తుడు మౌగ్ధ్యమును వీడి జ్ఞానియై ముక్తుడగును.

ఆ. రూపగోస్వామి సాధన భక్తి మార్గమునందు వైధిరాగానుగ అను భేదములను వివరించెను. వీరశైవమునందు వీనిని కొంతవరకు పోలునట్టివిగా నున్న బాహ్యాభ్యంతరములు వివరింపబడినవి.

'అన్యాత్మ విదితం బాహ్యం శంభోరభ్యర్చనాదికం
తదేవతు స్వసంవేద్య మాభ్యంతర ముదాహృతమ్.'[19]

వైధికిని బాహ్యలింగార్చనమునకును శాస్త్రోక్త విధితో భజించుట సామ్యము. రాగానుగకును అభ్యంతర లింగార్చనమునకును ఆంతరమైన భక్తి భావమునందు సామ్యము కలదు.

ఇ. భక్తిరసామృత సింధువునందు భక్తి వలన కలుగు ప్రయోజనము లిట్లు పేర్కొనబడినవి :

'క్లేశఘ్నీ శుభదా మోక్షలఘుతాకృత్ సుదుర్లభా
సాంద్రానంద విశేషాత్మా, శ్రీకృష్ణాకర్షణీ చసా॥[20]

సిద్ధాంత శిఖామణిలోకూడ నిట్లే శివభక్తివలని ప్రయోజనములు కీర్తింప బడినవి. జగద్గురు రేణుకాచార్యులవారు శైవసంప్రదాయమునందు చెప్పబడిన పంచవిధ క్లేశములనుండి భక్తుని తరింపజేయునది భక్తియని కీర్తించినారు.

'తస్మాత్సర్వప్రయత్నేన శాంకరం లింగముత్తమమ్
అంతర్విభావయే ద్విద్వాన్ శేషక్లేశముక్తయే॥'[21]

శివభక్తి సంసార విషవృక్షము యొక్క కర్మములను వేళ్లను పంచ క్లేశములను పలాశములను భేదించుటకు పరవశువువంటిదని కీర్తించెను.

ఈ. ప్రతి జీవునియందు నిత్యసిద్ధమైన భావము నెలకొనియుండును. దీనిని చిద్రూపుడైన శ్రీకృష్ణభగవానునియొక్క ఆనందకణము చిత్కణుడైన జీవునియందు సిద్ధమైయుండునని భక్తితత్త్వజ్ఞులు పేర్కొందురు.

రూపగోస్వామి పేర్కొన్న యిట్టి భక్తి తత్త్వము వీరశైవమునందు కాననగును.

'చంద్రకాంతే యథాతోయం సూర్యకాంతే యథాఽనలః
బీజే యథాంకురస్సిద్ధస్తథాఽఽత్మని శివ స్థ్సితః॥'[22]

చంద్రకాంత శిలయందు నీరు, సూర్యకాంత శిలయందు అగ్ని, విత్తునందు మొలక స్వాభావికలములయినట్లే జీవునియందు పరమ శివుడు స్వాభావికముగా నుండునని రేణుకాచార్యులు వివరించిరి.

ఉ. రూపగోస్వామి 64 విధములైన భక్త్యంగములను పేర్కొనెను. అందు గురుపాదపద్మముల నాశ్రయించుట మొదలగు దశవిధాంగములు తప్పక పాటింపదగినవి.[23] శ్రీకృష్ణ విముఖజన సాంగత్యము వీడుటవంటి దశవిధ నిషిద్ధాంగములు వివరింపబడినవి.

వీరశైవులకును నిట్టి విధి నిషిద్ధాంగములు పేర్కొనబడినవి. రెండింటియందును గురువుల నాశ్రయించుట, అన్యమతానుచరులతో మాట్లాడకుండుట ఇత్యాది విధినిషేధములు విధింపబడినవి [24]

'తతో వివేకసంపన్నో విరాగీ శుద్ధమానసః
జిజ్ఞాసు స్సర్వసంసార దోషధ్వంసకరం శివమ్॥'

'ఉపైతిలోక విఖ్యాతం లోభమోహ వివర్జితమ్
ఆత్మ తత్త్వ విచారజ్ఞం విముక్త విషయ ప్రభమ్॥'

'శివసిద్ధాన్త తత్త్వజ్ఞం భిన్న సందేహ విభ్రమమ్
సర్వతంత్ర ప్రయోగజ్ఞం ధార్మికం సత్యవాదినమ్॥'

'కులక్రమాగతాచారం కుమార్గాచార వర్జితమ్
శివధ్యాన పరంశాన్తం శివతత్త్వ వివేకినమ్॥'

'భస్మోద్ధూలన నిష్ణాతం భస్మతత్త్వ వివేకినమ్
త్రిపుండ్ర ధారణోత్కంఠం ధృతరుద్రాక్షమాలికమ్॥'

'లింగధారణ సంయుక్తం లింగపూజా పరాయణం
లింగాంగస్థల భేదజ్ఞం శ్రీగురు శివవాదినమ్॥'

వివేకగుణ సంపన్నుడు, విరాగి, శుద్ధమానసుడు అగు సాధకుడు సర్వసంసార దోషములను ధ్వంసము చేయునట్టి పరమేశ్వరుని గూర్చి తెలిసికొనవలెననెడి జిజ్ఞాసువై లోకవిఖ్యాతుడు, లోభమోహ వివర్జితుడు, ఆత్మతత్త్వ విచార జ్ఞానము నెరింగినవాడు, ప్రాపంచిక విషయాసక్తి వీడినవాడు, శివసిద్ధాంత జ్ఞానము కలినవాడు, పలుసంశయములచే నగు భ్రమము తొలగినవాడు, సర్వ తంత్ర ప్రయోగజ్ఞాని, ధార్మికుడు, సత్యవాది, కులక్రమారతాచార వర్తనుడు, కుమార్గాచార వివర్జితుడు, శివధ్యానాసక్తుడు, శాంతుడు, శివతత్త్వవివేకి, భస్మోద్ధూలన నిష్ణాతుడు, భస్మతత్త్వ వివేకి, త్రిపుండ్ర ధారణోత్కంఠుడు, రుద్రాక్షమాలికాధారి, లింగధారి, లింగపూజా పరాయణుడు, లింగాంగస్థల భేద జ్ఞానము నెఱిగినవాడు అగు శ్రీ గురువునే ఆశ్రయించవలెనని రేణుకాచార్యులవారు వివరించిరి.

'శివభక్తో మహాతేజ శ్శివభక్తి పరాఙ్ముఖాన్
నస్పృశేన్నైవ వీక్షేత నతైస్సహవసేత్క్వచిత్॥'

'స్వమార్గాచార నిరతా స్స్వజాతీయాద్విజాస్తయే
తేషాం గృహేషు భుంజీతనేత రేషాం కదాచన॥'

'స్వమార్గాచారవిముఖై ర్భవిభిః ప్రాకృతాత్మభిః
ప్రేషితాం సకలం ద్రవ్యమాత్మలీన మపిత్యజేత్॥'

'నార్చయే దన్యదేవాంస్తునస్మరేన్న చకీర్తయేత్
నతన్నైవేద్యమశ్నీయాచ్ఛివ భక్తోదృఢవ్రతః॥'

'యద్గృహేష్వన్యదేవోఽస్తి తద్గగృహాణి పరిత్యజేత్
నాన్యదేవార్చకాన్మర్త్యాన్ పూజాకాలే నిరీక్షయేత్॥'

'శివస్థానాని తీర్థాని విశిష్టాని శివార్చకః
శివయాత్రోత్సవే నిత్యం సేవేత పరయాముదా॥'

'స్వమార్గాచార వర్తిభ్య స్స్వజాతిభ్య స్సదా వ్రతీ
దద్యా త్తేభ్య స్సమాదద్యాత్కన్యాం కులసముద్భవామ్॥'[26]

శివభక్తుడు శివభక్తి విముఖులను స్పృశించరాదు, వీక్షించరాదు, కొంచెము సేపయినను వారితో కలిసియుండరాదు. స్వమార్గాచార నిరతులైన స్వజాతీయుల యిండ్లయందే భుజించవలెను. స్వమార్గాచార విముఖులైన ప్రాకృతజనులచే పంపబడిన ద్రవ్యములెట్టివైనను త్యజింపదగినవి. దృఢవ్రతుడైన శివభక్తుడు శివునికంటె నితరమైన దేవతల నర్చించరాదు, స్మరింపరాదు, కీర్తింపరాదు. ఇతరదేవతలకు నివేదించిన ప్రసాదము స్వీకరించరాదు. శివేతర దైవముల నారాధించు ఇండ్లకు పోరాదు. తాను శివుని పూజించునపుడు ఇతర దేవార్చకులను చూడరాదు. శివభక్తుడు శివయాత్రోత్సవవేళలందు శ్రేష్ఠమైన శివక్షేత్రములను, తీర్థములను సంతసముతో సేవించవలయును. శివభక్తులు స్వమార్గాచార వర్తనులైన స్వజాతీయులకే కన్య నీయవలయును. అట్టివారి నుండియే కన్యలనందుకొనవలయును.

ఊ. రూపగోస్వామి శ్రీకృష్ణుని చతుష్షష్టి గుణములను పేర్కొనెను.

వీరశైవులకు చతుష్షష్టి శీలములు పాటించ దగినవి.[27] బండారు తమ్మయ్యగారు వీరశైవాచారములను గూర్చి నిట్లు పేర్కొనిరి:

'వీరశైవులకు లింగాచారము, సదాచారము, శివాచారము, గణాచారము భృత్యాచారము నను పంచాచారములును, భూతి, రుద్రాక్షము, మంత్రము. గురువు, లింగము, జంగమము, పాదతీర్థము, ప్రసాదము అనియెడి అష్టావరణములను విహితములై యున్నవి. ఈ అష్టావరణ పంచాచార నిర్వాహణమేకాక చతుష్షష్టి శీలములని యఱువది నాలుగు తెఱంగుల శీలములు గూడ విధింపబడియున్నవి.'[28]

ఎ. హరిభక్తులు భక్త్యంగముల ననుష్ఠించకపోయినను వారికెట్టి దోష మాపాదించబడదని రూపగోస్వామి తెలిపెను.[29]

వీరశైవులకు సహితము కర్మబంధము లేదు.

'శివాశ్రితానాంజంతూనాం కర్మణా నాస్తిసంగమః
వాజినాం దినసాథస్య కథం తిమిరజం భయమ్'॥[30]

సూర్యుని గుడ్లాలకు చీకటి వలన భయము కలుగనట్లు పరమేశ్వరు నాశ్రయించిన ప్రాణులకు కర్మబంధముండదని వీరశైవ సిద్ధాంతములు నుడువుచున్నవి.

ఏ. శంఖ చక్రములను ముద్రలను భాగవతోత్తములు ధరింతురు. లింగధారణ, భస్మధారణ, రుద్రాక్షధారణ, పంచాక్షరీ మంత్రజపము వీర శైవులకు విధి.

'భూతిరుద్రాక్ష సంయుక్తో లింగధారీ సదాశుచిః
పంచాక్షర జపోద్యోగీ శివభక్త ఇతిస్మృతః'31

విభూతి రుద్రాక్షలను ధరించినవాడు, లింగధారియై పంచాక్షరీ మంత్ర మును జపించువాడే శివభక్తుడనబడునని సిద్ధాంత శిఖామణి తెలియజేయు చున్నది.

ఐ. భక్తులకు శాస్త్రములందుగల దృఢవిశ్వాసమును, శ్రద్ధను, అభి రుచినిబట్టి, ఉత్తములనియు, మధ్యములనియు, కనిష్ఠులనియు రూపగోస్వామి వర్గీకరించెను.

ఏ శివసేవ నవవిధ భక్తులతో కూడియుండునో దానిని పూర్ణభక్తి యందురు. మిగిలినదంతయు నల్పభక్తి. అదియు మరల మానసిక, వాచిక, కాయికములని త్రివిధములు అని రేణుకాచార్యులు నుడివిరి.

'సాంగాఽన్యూనా చయా సేవా సా భక్తిరితి కథ్యతే,
సాపునర్భిద్యతే త్రేధా మనోవాక్కాయ సాధనైః'

'శివరూపాది చింతా యాసా సేవా మానసీస్మృతా
జపాది ర్వాచికీ సేవాకర్మ పూజాచకాయకీ'32

ఓ. వైష్ణవులకు భాగవతోత్తముడు భగవంతునివలె పూజింపదగినవాడు. శైవధర్మముకూడ నిట్టిదానినే నంగీకరించినది.

'యథాగురౌ యథాలింగే భక్తిమాన్ పరివర్తతే
జంగమేచ తథా నిత్యం భక్తిం కుర్యాద్విచక్షణః॥'33

గురువు నెడలను లింగమునెడలను నెట్లు భక్తి చూపునో భక్తిగల వివేకవంతుడు జంగమునెడలను అటులే భక్తి కలిగియుండవలెనని వీరశైవ సిద్ధాంతము తెలియచేయుచున్నది.

ఓ. 'మాఘస్నానమునకందరు అధికారులే' అని వశిష్ఠుడు రాజునకు తెలియజేయుచు హరిభక్తి నుదాహరించుటనుబట్టి జాతిమత వివక్షతలేక భక్తి కందరు అధికారులేనని శాస్త్రములు ధ్రువపరచుచున్నవని రూపగోస్వామి వక్కాణించెను.34

భక్తియే ముఖ్యముగాని జాతికాదని వీరశైవమును నంగీకరించినది.

'అధమే చోత్తమే వాపి యత్ర కుత్ర చిదూర్జితా
వర్తతే శాంకరీ భక్తి స్సభక్త ఇతిగీయతే॥'

'భక్తి స్థిరీకృతాయస్మిన్ల్మేచ్ఛేవా ద్విజసత్తమే
శంభోఃప్రియ స్సవిప్రశ్చన ప్రియోభక్తి వర్జితః॥'35

అధముడైనను, ఉత్తముడైనను ఎవనియందు శంకరునెడ దృఢభక్తి కలిగియుండునో వాడే భక్తుడు. స్థిరభక్తి గలవాడు. మ్లేచ్ఛుడైనను ద్విజుడైనను వాడే శంభునకు ప్రియుడు. జాతిచే విప్రుడైనను భక్తిలేనివాడు శివున కప్రియుడు.

## ముఖ్యభక్తి భేదములు - ముగ్ధభక్తి

మధురభక్తి రసానుశీలనము ననుసరించి ముగ్ధభక్తి రస భేదములను వివేచించుటకు వీలున్నదని పేర్కొనుటయైనది. కృష్ణభక్తియందు ముఖ్య రసము లేదు. అవి శాంతము, ప్రీతి, ప్రేయస్సు, వాత్సల్యము, మధురము అనునవి. ఆ విశ్లేషణము నాశ్రయించి శైవభక్తియందును శాంతము, ప్రీతి, ప్రేయస్సు, వాత్సల్యము, మౌగ్ధ్యము అను విభాగములను భావింపవచ్చును. పూర్వాధ్యాయమునందు మధురభక్తియందు శాంతాదులు సంగమించునని నిరూపించుటయైనది. అట్లే వీరశైవమునందును ముగ్ధభక్తియందు శాంతాదులు సంగమించునని నిరూపింపనగుచున్నది.

### శాంత భక్తి

ముఖ్యభక్తి రసములలో మొదటిది శాంతభక్తి రసము. శాంతరతి స్థాయిభావము. బసవన్న మంత్రి, అల్లమ ప్రభువు మొదలగువారు ఈ శాంత భక్తికి ఆలంబన విభావములు కాగలరు.

ఇందు భగవత్ స్వరూపానుభవమునకే ప్రాముఖ్య మెక్కువగా నుండును. శాంతభక్తి రసమునకు మహాత్ముల కథలు వినుట, మహాత్ములను సేవించుట, తత్వవివేచనము, జ్ఞానభక్తుల సాంగత్యము కోరుట యిత్యాదు లుద్దీపన విభావములు.

శాంతభక్తిరసమున కనుభావములు - నాసాగ్రమునందు దృష్టినిలుపుట, అన్యమతస్థులయందు ద్వేషము లేకుండుట, అహంకారశూన్యత్వము మున్నగునవి.

నిర్వేదము, ధృతి, హర్షము, మతి, స్మృతి, విషాదము, ఉత్కంఠము, ఆవేగము, వితర్కం, అనునవి శాంత భక్తిరసమునకు సంచారి భావములుగా పేర్కొనబడినవి.

బసవపురాణమునందు సామాన్యముగా వీరభక్తులు, ముగ్ధభక్తులు గోచరించుదురు. కాని, శైవమతాచార్యులును, బసవపురాణ నాయకులునైన బసవేశ్వరుడు జ్ఞానియు, మహిమాన్వితుడు, అవతారమూర్తియునగుటచేత నాతనియందు శాంతభక్తి ప్రస్ఫుటమగు చుండును. శాంతభక్తిని సాధించువాడుముగ్ధభక్తునికంటె విశిష్టుడై జ్ఞానఫలమును పొందెడివాడగున్నాడు. ఒక విధముగా ముగ్ధభక్తి జ్ఞానభక్తిగా పరిగణించినచో శాంతభక్తి స్థితి యేర్పడవచ్చును. అట్టి స్థితి శుద్ధముగ్ధ భక్తులకు సాధ్యము కాదు. మతాచార్యులయందు శుద్ధముగ్ధభక్తి ఉపాదేయముకాదు. అట్లగుటచే బసవేశ్వర భక్తిశీలమును ముగ్ధభక్తుల వరుసలోకాక మొట్టమొదట అనుశీలించుట యగుచున్నది. ముగ్ధ భక్తులనునరించెడి భక్తిమార్గమున కీతడు గురువు. అందుచే నీతనికి మొదటి పీట.

జన్మతః తనయందు నెలకొనియున్న జ్ఞానవైరాగ్యవాసనలను బసవన్న యీ క్రింది చర్యల ద్వారమున వ్యక్తీకరించినట్లు పాల్కురికి సోమనాథకవి వర్ణించెను. బాల్యమునుండియు భగవదర్పితమైన మనసు కలవాడైన బసవన్న తన తలపులను చేష్టలద్వారా యెట్లు వ్యక్తీకరించెనో నీ క్రింది పాదములందు కవి హృద్యమముగా వర్ణించెను. ఇట్టి సంస్కారము శాంత భక్తికి ప్రాతిపదిక వంటిది. శాంతరతికట్టి హృదయము జనక స్థానమని వ్యంజింపజేయుట విశేషము.

'వెనుకఁజీకటియుండఁదనకేటితేజ
మనుగతి దీపంబుఁగనుఁగొని నవ్వు
సన్నుతలింగపు బ్రసాదమగ్నతన
యున్నట్లు చనుగుడ్చు నూరకయుండు
శివసుఖామృతమును జేఁగ్రుమ్మరించి
చవిసూచుమాడ్కి హస్తములారగించు
శివపదధ్యాన నిశ్చేష్టితావస్థఁ
దవులు చందంబునఁదావెఱఁగందు
బిలిబిలి సంసారమిలఁ బాఱఁదోలి
చెలఁగి యాడెడుగతిఁ జేతులాడించు
మాయాప్రపంచంబు డాయంగనీక
పాయఁ దన్నెడురీతిఁ బాదంబులార్చు
వడిమెయిఁ దనపూని వచ్చిన పనులు
దడవయ్యెననుచు నుల్కెడుభంగినులుకు
భవుఁ బాడ నానందబాష్పంబు లొలుకు
పవిది నేడుచుఁ గనుఁగవ నశ్రులొలుక
భవబాధలకు నగపడి మొఱవెట్టు
భవుల కుయ్యాలించుభాతి నాలించు
నొదయల యడుగులఁబడి మొఱల్వెట్టు
వడుపునఁ బుడమిపైఁ బడిబోరగిల్లు
నిలమఱపడ్డ నిర్మల శివభక్తి
తనయెత్తువడువునఁ దాఁదలయెత్తు
నరుదొందఁ బద్మాసనాసీనవృత్తిఁ
బొరి నభ్యసించుపొల్పునఁ గూరుచుండుఁ
బూరి ద్వితీయ శంభుండనునంది
నేనను భావన నిలఁదోగిఁ యాడు
నావీర మాహేశ్వరాచారమెల్లఁ
బ్రోవయి నిల్చినపోల్కి నిల్చుండుఁ
గడఁకతో నాఁడి మార్గము దప్పకుండ
నడుగిడులీలఁ దప్పడుగులువెట్టు

మలహరుఁ బేర్కొను మాత్రగద్గదము
లలరుకై వడిఁదొక్కుఁబలుకులు వలుకు
బల్లిదులాశ్మశివభక్తులే యనుచుఁ
గ్రేళ్ళువారుచు నాడుక్రియఁ బాటియాడు
సంత వినోదం పుటాటప్రాయమున
సంతతంబును శివార్చనమాచరించు' బ.పు. పు 18

బసవన్న విషయ వైరాగ్యము, ప్రాపంచిక వైరాగ్యము నతడు తన తల్లిదండ్రులతో మాట్లాడిన మాటలలో వ్యక్తమగుచున్నది:

'కాకులు వెంచిన కోకిలపిల్ల
కాకులఁబోలునే కావుకావనుచు
నెక్కడి తల్లి మీరెక్కడి తండ్రి
ఎక్కడితోడు ధర్మేతరులారా
చెన్నయ్య మా తాత చేరమ తండ్రి
పిన్నయ్య కక్కయ్య బిడ్డనేనచు
వేడుక సద్భక్తి విధినుండువాఁడ
నేడు గడయు మాకు నిది నిక్కువంబు
మీయంత నుండుఁడు మీరును నేను
నాయంత నుండెద వేయును నేల?' బ. పు. పు. 22

అణవ మలమును బాయుటకు మాతా సతీసుతాదుల భ్రాంతిని వదలి తాను శివాంశమైన చైతన్య స్వరూపమును కనుగొనవలయునని వీరశైవ దీక్షాబోధ ఈ క్రింది విధముగా వివరించు చున్నది:

"సకలంబుఁ దానయై సర్వేశ్వరుండు
సకలంబు నాడించు చైతన్యమూర్తి
శివుఁడట్టి చైతన్య చేతనాత్మకుఁడు
తవిలి ప్రేరేపంగఁ దానాడుజగము
తల్లి పార్వతియును దండ్రి శివుడు
నెల్ల భక్తులు తన హిత బంధుజనులు
ననుచు నానాపురాణాగ మారములు

మనుజెప్పెఁ గావున ముందుండి నీవు
నాదినీశ్వర బీజమంద్రైతిగాన
భేదంబులెల్లఁ గల్పితముగా నాత్మఁ
జింతించి తెలియును స్థిరమౌటనీవు
అంతన పాయునీ కాణవమలము '36

తత్వ వివేచనముగల బసవన్న కర్మబద్ధుడగుట కంగీకరించక తండ్రితో పలికిన పలుకులివి:

'వీరమాహేశ్వరాచార దీక్షితుని
నిర్మితోభయకర్మనిర్మూలు నన్నుఁ
గర్మాబ్ధి ముంచుట ధర్మమే నీకుఁ?
గ్రచ్చుఱఁగన్నులఁగానవుగాక
వచ్చునే బసవని వడుగ సేయంగ' బ.పు.పు. 19

వీరశైవులు మహేశ్వర దీక్షను బొందిన తరువాత పూర్వాశ్రమమును నిరసించవలెనని సిద్ధాంత శిఖామణి తెలుపుచున్నది.

'లింగైకనిష్ఠ హృదయ స్సదామాహేశ్వరోజనః
పూర్వాశ్రయగతాన్ ధర్మాంస్త జేత్స్వాచారరోధకాన్' 37

శివలింగైక నిష్ఠా హృదయులైన మాహేశ్వరులు మాహేశ్వరాచారములకు విరుద్ధములైనట్టి పూర్వాశ్రమ ధర్మములను పూర్తిగా త్యజించవలెను. వీరమాహేశ్వరుడైన బసవన్న ఉపనయనము నంగీకరించలేదు. దేవతలకారాధ్య దైవమైన ఈశ్వరుని కొలుచువాడు అన్యదేవతలను స్మరించ నవసరము లేదని ఖండితముగా పలికెను. మంత్రములకు రాజమంత్రమై వెలయునది శివమంత్రమని భసిత రుద్రాక్షధారణ మోక్షానుసారి వేషమని అన్యదేవతాస్మరణ మాత్రమున ఇరువదెన్మిది కోట్ల నరకములు పొందుదురని శ్రుతులు ఘోషించుచుండగా తనకు వడుగు చేయవలెనని తండ్రి యెట్లు తలంచెనని బసవన్న ఆక్షేపించెను.

అదికాక షడ్దర్శనాతీతమైన
మదనారి సద్భక్తి మార్గంబు వినుము
శ్రుతి 'విశ్వతశ్చక్షుఋత' యుండుఁబొగడు

స్తుతుల మీఱిన యట్టి సూక్ష్మరూపంబు
ఆదికి నాది నిత్యానందమూర్తి
శ్రీదివ్య లింగమూర్తియను దైవంబు
నట్టి యీశ్వరు నాత్మఁ బట్టించి చేతఁ
బెట్టంగఁజాలిన పృథుదయామూర్తి
ప్రకటింప 'నగురోరధిక' మనఁబరగు
సకలస్వరూప మానమయ సద్గురుఁడు
మంత్రంబులకు రాజమంత్రమై వెలయు
మంత్రంబు దానికి మఱి షడక్షరియు
భవదూరమగు జటాభసిత రుద్రాక్ష
సవిశేష మోక్షానుసారి వేషంబు
భువిజన్మ పాపౌఘ భూజకుఠార
మవిరళ సత్క్రియాష్టాంగ సద్భక్త
సందర్శనంబుల సకలపాపములు
ద్రుందు మోక్షాంగన వొందుఁగావునను
నిది ఫలప్రాప్తియింకిట మీఁదలింగ
పదసేవనోత్కృష్ట భవ్య సౌఖ్యంబు
ఫలమిట్టిదని చెప్ప భావింపశ్రుతుల
తలమె జీవన్ముక్తి తత్త్వాత్మకంబు
.... .... .... .... .... .... ....
"ధరనన్య దేవతాస్మరణ మాత్రమున
నిరువదెన్మిది కోట్లు నరకంబు లొందు"
నన శ్రుతులందును వినరె బాపనికి
దినకర పావక దిక్పాలకులను
హరి విరించ్యాదుల నఖిల దేవతల
ధరమూఁడు సంధ్యలఁ దాఁ గొల్వవలయుఁ' బ.పు.పు. 20,21

పరమేశ్వరునకు ఇతర దేవతలతో సమానత్వమును చెప్పుటను ఓర్చుకొనలేడు మహేశ్వరుడు.

'బ్రహ్మాద్యైర్మలిన ప్రాయైర్నిర్మలే పరమేశ్వరే
సామ్యోక్తిం యోన సహతే సవై మహేశ్వరాభిధః.'[38]

'బ్రహ్మ విష్ణు రుద్రేంద్రాస్తే సంప్రసూయంతే' అను శ్రుతి వాక్కును బట్టి జననమరణాదులచే పీడింపబడుచు ఆణవాది మలములతో కూడిన బ్రహ్మాదులతో అణవాది మలరహితుడైనట్టి పరమేశ్వరునకు సమానత్వము చెప్పుట నెవ్వడోర్వలేడో అతడే మహేశ్వరుడు.

వీరమహేశ్వర దీక్షితుడైన బసవన్న పరమేశ్వరునితో మరేదైవమును సమానముగా భావించుట ఓర్చుకొనలేడు.

రుద్రాక్ష భసితధారులను వీరశైవులు సాక్షాద్రుద్ర మూర్తులుగా తలంతురు. క్షుద్ర ముద్రలనుగూర్చి కలనైన తలచుట దోషముగా భావింతురు. బసవన్న తండ్రితో నిట్టి యభిప్రాయమునే వ్యక్తపరచెను.

'రుద్రాక్షభసితాది ముద్రలు దాల్చి
క్షుద్రముద్రలు దాల్పఁగూడునే చెపుమ!' బ.పు.పు. 19

'దర్శనాత్ స్పర్శనాచ్చైవ స్మరణాదపి పూజనాత్
రుద్రాక్షధారణాల్లోకే ముచ్యంతే పాతకైర్జనాః॥'
'భస్మోద్ధూలితసర్వాంగా ధృతరుద్రాక్షమాలికాః
యేభవంతి మహాత్మానో రుద్రాస్తే నాత్రసంశయః॥'[39]

రుద్రాక్షలను దర్శించినను, స్పృశించినను, స్మరించినను, పూజించినను, ధరించినను జనులు పాపముల వలన విడువబడుదురు. సర్వాంగములందు భస్మధారణ చేసి రుద్రాక్షలను ధరించు మహాత్ములు సాక్షాద్రుద్రులేయగుటలో సంశయము లేదని సిద్ధాంత శిఖామణి తెలియచేయుచున్నది. శైవాచారనిరతి గల బసవన్న ఈశ్వరార్చన కళాశీలుడు, ఆగమోక్త ప్రకారముల లింగము జంగమముల నర్చించువాడు.

'గురుముఖతః దీక్షాసంస్కారమునంది లింగార్చన పరాయణులగు వారికి కొన్ని చిహ్నములుండును. అవి బాహ్యాంభ్యంతర భేదముచే ద్వివిధము. బాహ్య చిహ్నములు పది కలవు. అందు మొట్టమొదటిది ముఖ్యమైనది భస్మరుద్రాక్షధారణము.'[40]

భస్మరుద్రాక్షధారణమును గూర్చి చంద్రజ్ఞానాగమము ఈ విధముగా తెలియజేయుచున్నది:

'తేషాం బాహ్యే చిహ్నానిదశసన్తి బృహస్పతే
ప్రథమం భస్మరుద్రాక్షలిఙ్గధారణమీరితమ్॥'

'ఉద్ధూళనంతతః కార్యమవణ్ఠనమేవచ
త్రిపుణ్ఢ్రం చేతి విఖ్యాతం త్రివిధం భస్మధారణమ్॥'

'పఞ్చభిర్బ్రహ్మభిర్వాపి మూలమన్త్రేణ వాపునః
సమ్మన్త్ర్య నిర్మలం భస్మతేన లిమ్పేత్సుసంయుతః॥'

'భస్మనామన్త్రితేనైవ సజలేనానులేపనం
అవకుణ్ఠన మాఖ్యాతం త్రిపుణ్ఢ్ర మథకర్త్యతే॥

'ద్వాత్రింశత్స్థా నటీవాథ షోడశ స్థానకేఽథవా
అష్టస్థానే తథాచైవం పఞ్చస్థానే చయోజయేత్॥'

'భస్మస్నాన విధిం వక్ష్యామ్యశేషా ఘౌఘ నాశనం
భస్మముష్టిం సమాదాయ సంహితా మన్త్రమన్త్రితం
మస్తకాత్పద పర్యన్తం భస్మసానసం సమాచరేత్।'41
'శిఖాయా మేకరుద్రాక్షంత్రింశత్తు శిరసావహేత్
ద్వాత్రింశత్తు గళే దద్యాత్ బాహ్వోష్షోడశషోడశ॥

ద్వాదశం మణి మన్థేఽపిస్కన్ధేపఞ్చ శతం వహేత్
అష్టోత్తరశతైర్మా లాంజపయజ్ఞేప్రకల్పయేత్
ముక్తా ప్రవాళస్ఫటికరౌప్యవైడూర్య కాఞ్చనైః
ధారయేద్యస్తు రుద్రాక్షాన్సరుద్రో నాత్రసంశయః॥'42

వీరశైవాచారనిరతుడైన బసవన్న మనోవాక్కాయ కర్మలచేత అనగా త్రికరణశుద్ధిగా వీరశైవాచార సంపదాయముల నాచరించిన ఘన భక్తి సంపన్నుడు. మనసులోని భక్తి మాటలలో వ్యక్తము చేయుటయే కాదు అతని వేషము ఆచరణయు అనుగుణముగనే యుండును. పెళ్ళికొడుకయిన బసవన్న వేషధారణను పాల్కురికి సోమనాథ కవి యిట్లు వర్ణించెను:

'భసితంపు నెఱపూఁత పలుచగాఁబూసి
నొసలఁ ద్రిపుండ్ర మొప్పెసఁగ ధరించి
మౌళిఁబ్రసాద సుమంబులు దుఱిమి
పోలఁగ రుద్రాక్షభూషలు దాల్చి
సారమై లింగపసాయితంబనెడు
పేరను గల్గు కఠారంబు గట్టి' బ.పు; పు 23.

బసవన్న ఆగమోక్త ప్రకారములనే భగవత్సేవన చేయువాడు. 'మౌళి ప్రసాద సుమంబులు తురిమి' యనుటలో నీ విషయము స్థిరపడుచున్నది.

'నిత్యసిద్ధేనదేవేన భిషజాజన్మరోగిణామ్
యద్యత్ప్రసాదితం భుక్త్వాత త్తజ్జన్మరసాయనమ్॥'43

జన్మమనెడు రోగమును బాపు వైద్యుడును, శివలింగము నందెల్లప్పుడును నుండువాడును, స్వయంప్రకాశకుడైన మహాదేవునిచే స్వీకరింపబడి ప్రసాద రూపమైయుండు వస్తువు సంసార రోగమును బోగొట్టు మహారసాయనము.

'పత్రం పుష్పం ఫలం తోయం యచ్ఛివాయ నివేదితం
తత్తత్ స్వీకారయోగేన సర్వపాపక్షయో భవేత్॥'44

ఆకుకాని, పువ్వుకాని, ఫలముకాని, నీరుగాని, శివునకు నివేదితమైన దానిని స్వీకరించుటవలన నెల్లపాపములు నశించునని వీరశైవ సిద్ధాంతము.

ఆజన్మ భక్తియుక్తుడైన బసవన్న మౌళి ప్రసాద సుమములు తురిమి లింగపసాయిత శస్త్రధరుడై పెళ్ళికి బయలుదేరినట్లు వర్ణించబడినది లింగపసాయిత శస్త్రమును ధరించుట వీరశైవాచార సంప్రదాయము.45

వీరశైవులకు జంగమ లింగమమే ప్రాణలింగము. జంగముండుత్తమోత్తముండు. పరమ శివుడు స్థిరలింగమందు మంత్ర సంస్కారముచే మాత్రమే యుండును. చరలింగమైన జంగమునియందు శివుడెల్లపుడుండునని వీరశైవసిద్ధాంతము.

'అచరే మంత్ర సంస్కారాల్లింగేవసతి శంకరః
సదాకాలం వసత్యేవ చరలింగే మహేశ్వరః'46

శివయోగియనెడి యీ జంగమ లింగమునకు (చరలింగమునకు) ఏది సమర్పించినను నది తిరుగులేని ఫలము నిచ్చును కావున సర్వప్రయత్నములతో మహాత్ముడైన ఆ శివయోగికే దానము చేయువలెనని వీరశైవ సంప్రదాయము.

'శివయోగిని యద్దత్తం తదక్షయఫలం భవేత్
తస్మాత్సర్వ ప్రయత్నేన తస్మై దేయం మహాత్మనే'47
అనుభవసారముకూడ నీ విషయమునే ధ్రువపరచుచున్నది.

కం॥ జంగమ పరాఙ్ముఖుండై
లింగార్చన సేయునతని లీలఁ దలిర్పన్
వెంగలియై శవమునకును
శృంగారముఁ జేసినట్లు శివభక్తినిధీ!'

ఉ॥ 'జంగమ భక్తి లింగపరిచర్యయ మీఱుట యుత్తమంబు త
జ్జంగమలింగ పూజలవి సామ్యము సల్పుట మధ్యమంబు మున్
జంగమలింగ పూజ యెడ సల్పక లింగముఁ గొల్చుచున్కియె
న్నంగఁ గనిష్ఠమౌట శరణ ప్రతిపత్తియె ముఖ్యమెమ్మయిన్॥'48

బండారి బసవన్న అతిభక్తితో భక్తుల నెదుర్కొని కొలిచిన విధము సోమనాథుడు చక్కగా వర్ణించెను:

'ప్రతి దినంబును భక్త బండారి బసవఁ
డతిభక్తిరతి మతి నంకురింపఁగను
శాశ్వత ఘనలింగ సంపద మెఱసి
యీశ్వర భక్తుల నిట్లెదుర్కొనుచు
మంగళ హర్షోదితాంగ విక్రియల
సంగతి నాత్మ నుప్పొంగి యుప్పొంగి
భయ భక్తి యుక్తిఁ దద్భక్తాంఘ్రిచయము
పయిఁ జక్క జాఁగిలఁబడి మ్రొక్కి మ్రొక్కి
పటుతరసద్భక్త పాదాబ్జరేణు
పటల పర్యంకంబుపైఁ బొర్లి పొర్లి
హరభక్త నికరదయామృతవృష్టి

మహాత్ములను సేవించుట మొదలగునవి శాంత భక్తి రసమునకు ఉద్దీపన ములు. భక్తుల నెదుర్కొనునపుడు బసవన్నకు కలిగిన హర్షము కవి గా వర్ణించెను:

'మంగళ హర్షోదితాంగ విక్రియల
సంగతి నాత్మనుప్పొంగి యుప్పొంగి'

ఇష్టమైన వానిని పొందునపుడు కలుగునది హర్షము.

'దేవభర్తృ గురుస్వామి ప్రసాదః ప్రియసంగమః
మనోరథాప్తిరప్రాప్య మనోహరధనాగమః
తథోత్పత్తిశ్చ పుత్రాదేర్విభావో యత్ర జాయతే
నేత్ర వక్త్ర ప్రసాదశ్చప్రియోక్తిః పులకోద్గమః
అశ్రుస్వేదాదయశ్చాను భావహర్షం తమాదిశేత్॥'49

దేవభర్తృ గురుస్వాములు మొదలగువారి యనుగ్రహము, ప్రియ ము, మనోరథము సిద్ధించుట, అప్రాప్యమనోహర ధనాగమము త్పత్తి మొదలగునవి విభావములు. నేత్రముఖ ప్రసన్నత, ప్రియోక్తి గమము, అశ్రూదయము, స్వేదోదయము మొదలగునవి అనుభావములు హర్షము వ్యక్తమగును. బసవని యందు భక్తులను గాంచుట వలన హర్షము శాంతభక్తికి పోషకముగా వర్ణింపబడుట నీ కార్యము నంద ను.

బసవన్న ప్రియోక్తులతో భక్తమండలిని సంతోషపరిచెడివాడు.

'చారువచోవిలాసంబులఁ దనర
నోరార వారి సన్నుతి చేసి' బ. పు. పు. 34.

హరభక్తులతో నాడునపు డత డానంద పారవశ్యమున నోలలాడువాడు.

'దరహసితాస్య విస్ఫురణయుఁదనర
హరగణాస్థానంబునం దాడి యాడి' బ. పు. పు. 34.

శివభక్తగణములందు శివ తత్త్వమరసి వారిని సేవించి తరించిన భక్తా ప బసవన్న.

'అనవరతము నీప్సితార్థుల కర్థిఁ
దనుమనోధనము లప్పన సేసి చేసి' బ.పు.పు 34

తృప్తినొందెడువాడు. వీరమహేశ్వరులు గురులింగమ జంగమములకు తను మనో ధనములర్పించుట ఆచారము.

'ప్రాణేశ్వరునకుఁ బ్రాణార్థంబులొసఁగు
జాణవై ధనమిమ్ము సద్భక్తులకును
వినుము వెండియు నొక్కవిత్తమేకాదు
తనుమనోధనములు దగఁగురులింగ
జంగమావలి వినిశ్చయ మెట్టులనిన
సంగత లింగ దీక్షాకాలములను
త్రివిధ మూర్తులకును శ్రీగురుస్వామి
త్రివిధమిమ్మనియె నాత్రివిధ మెట్లనిన
తను వెప్పుడును గురూత్తమునకు మనముఁ
దనర లింగమునకు ధనము భక్తులకు
ఘనమనోవాక్కాయ కర్మ సత్క్రియలఁ
దనగురుని యనుజ్ఞఁదప్ప కిచ్చెదను
ఘనములకెల్లను ఘనమైనలింగ
మును శ్రీగురుండును ముదమార నిచ్చె
నటుగాక దీక్ష నీవాసించినవుడు
తటుకునఁదను మనోధనముఁ ద్రిమూర్తు
లకు సమర్పింప వాలాయంబు గాన
నొకటియు నీది గాకుండుటఁ దెలని
త్రివిధమూర్తులకును ద్రివిధ వస్తువుల
నవిరళప్రీతి నీవర్పించితేనిఁ
బట్టించు సద్భక్తి భావమంతటను
గట్టిగాఁ దొలఁగునీ కార్మిక మలము'50

అని వీరశైవ దీక్షా బోధయం వివరించినట్లు త్రివిధ వస్తువులచు త్రివిధ మూర్తుల కర్పించిన కార్మికమలము తొలగుచున్న విషయమును నమ్మి జీవితమున పాటించిన బసవన్న భక్తులలో భగవత్స్వరూపము గాంచకలిగిన జ్ఞాని. అహర్నిశలు భక్తులను సేవించి తరించిన మహనీయుడు.

'శీల సంబంధుల శీలంబు లెఱిఁగి
శీలసంబంధ సుస్థితి నుంచి యుంచి'. బ. పు. పు. 34

శివసంబంధమైన విశిష్ట జ్ఞానమును కలిగి శివధ్యానైక తత్పరులై శివ ప్రాప్తియందుత్కంఠ కలిగినవారే శీలవంతులని సిద్ధాంత శిఖామణి నుడువు. చున్నది.

'శీలం శివైక విజ్ఞానం శివధ్యానైకతానతా
శివప్రాప్తి సముత్కంఠాతద్యోగి శీలవాన్స్మృతః.'[51]

వైరాగ్యసంసార వర్జితాత్మకుడైన అల్లమ ప్రభువు రాక విని బసవన్నకు కలిగిన సంతోసమున కవధి లేదు.

'గుణహీనుఁడయ్యును గుణమిచ్చువాని
ప్రణవాత్మఁడయ్యు నేర్పడియుండువానిఁ
గని శరణనుచు గద్గదకంఠుఁడగుచుఁ
గనుఁగవ హర్షాశ్రు కణములు దొరుగ
బసవఁడల్లంతటఁ బ్రణమితుండగుచు' బ.పు; పు. 37

'మదసమ్మద పీడాద్యైర్వైస్వర్యం గద్గదం విదుః'మదమువలన సంతోషం వలన పీడాదుల వలన కలుగు గాద్గద్యమే వైస్వరము.[52] అల్లమ ప్రభువును చూచుటవలన కలిగిన హర్షముచే బసవన్న కంఠస్వరము గద్గదస్వరముగా మారినది. కవి సాత్త్విక భావమును చక్కగా వర్ణించెను.

'అశ్రునేత్రోద్భవం వారి క్రోధ దుఃఖ ప్రహర్షజం' క్రోధము దుఃఖము హర్షము అనువానివలన పుట్టిన కన్నీరే అశ్రువుగా ఆలంకారికులు పేర్కొనిరి.[53]

జంగమునే ప్రాణలింగముగా భావించి పూజించు బసవన్నకు అల్లమ ప్రభువును కనుగొనినంతనే 'కనుఁగవ హర్షాశ్రు కణములు' దొరలినవి. అల్లమ ప్రభువుకు విందుచేసి, చేసిన పదార్థములన్నియు ప్రభు వారగించగా, ఇంకెటులో నని ఆలోచింపక-

'ఏనకాకోగిరం బింక నీకనుచు'[54] - నీకు నేనే అహారమని పలికి ప్రభువును మెప్పించి వరములు పొందెను. తన మనసు తన పలుకుతో పాటు తన తనువును కూడ భగవత్స్వరూపుడని భావించిన అల్లమ ప్రభువునకు నివేదించుకొన్న త్యాగధనుడు బసవన్న.

మమకారములు లేకుండుట, నిరహంకారముతో జీవించుట యనునవి శాంతభక్తి కనుభావములుగా చెప్పబడినవి.

'మోహమా యాదితమోరాశిఁ ద్రుంచి
దేహేంద్రియాది విద్వేషంబడంచి' బ. పు; పు. 41

తన యర్ధాంగియన్న మమకారముగాని, మానావమానములను గూర్చిన చింతనముగాని తలంచక అర్థించుటకు వచ్చిన భక్తుని శివస్వరూపునిగా భావించి యతడు కోరిన తన యిల్లాలి పట్టుపుట్టమును ఇచ్చెను.

"పుట్టుసావెఱుఁగని యట్టిమహాత్మఁ
డిట్టలంబుగ నీదు పుట్టమడ్గెడిని
పుట్టమీవేగ మీ పుట్టమిచ్చినను
బుట్టము మన" మని యట్టిచందమున
లజ్జయు సిగ్గుదలంపక బసవఁ
డజ్జలజాక్షి వల్వ్యాతిమటిఁబట్టి
యెలువంగ నొలువంగ నొక్కవస్త్రంబు
దళితాంబుజానన మొలఁబాయకున్నఁ
గనుఁగొని' బ.పు; పు. 57

జనులాశ్చర్యపోయిరి. 'నిక్కంబు బసవని నిజభక్తి మహిమఁ దక్కువ గాదయ్యె దరుణి మానంబు' అని భక్తమండలి బసవని, అతని భార్యను వినుతించిరి. మమకారము లేదనుటకిదొక చక్కని యుదాహరణము.

శాంతభక్తుడు, శివతత్త్వమరసినవాడు, నిరంతర శివధ్యానైక పరతంత్రుడు, మహిమలు చూపగల మహాత్ముడయ్యు, తానుచెప్పిన గీతములు భక్తులు పాడగా విని మడివాలు మాచయ్య కోపగించుట తెలిసికొనిన బసవన్న -

'అంతనంతయు విని యాత్మలోఁగలఁగి
యంతత ధరణి సాష్టాంగంబు లిడుచు
బసవఁడు భక్తజన సహాయుఁడగుచు
వెసనేఁగుదెంచి భయసమగ్రవృత్తి
మడివాలు మాచయ్య యడుగుల పొంతఁ
బుడమి సర్వాంగముల్ వొందఁగ మ్రొక్కి' బ.పు;పు. 109

ఆత్మనిందాతి దీనోక్తులతో తనను క్షమింపుమని కోరెను. బసవన్న నిరహంకారమునకు, ఆత్మతత్త్వ వివేచనమున కిదొక మచ్చుతునక. అర్థించిన భక్తుల కోరికలు తీర్చుటయేకాక అశించని భక్తులనాదుకొను ధార్మికుడు బసవన్న. మోళిగ మారయ్య కట్టెలు కొట్టి తెచ్చి విక్రయించిన ధనముతో జంగమ కోటికి ఆరగింపు చేయుట విని బసవన్న ప్రచ్ఛన్న వేషముతో వారిల్లుచేరి వారికి తెలియకుండ రెండువేల మాడలు ఒక్క వడిగము క్రిందనుంచి ప్రసాదముగైకొని వచ్చెను. ద్రవ్యార్జనము ధర్మమునకే ఉపయోగపడవలెనని సిద్ధాంతమును నమ్ముటయేకాదు, జీవితమునందాచరించి చూపిన మంగళ చరితుడు బసవన్న విశ్వగుణాదర్శము కూడ నిట్టి భావమునే స్థిరపరచుచున్నది.

'భోగాయైవ నితంబినీ పరిణయో యాగహ్యాతిః ఖ్యాతయే
స్వార్థం పాపకృతిః కుపాత్ర విషయ త్యాగార్థ మర్థార్జనమ్
స్వాధ్యాయాధ్యయనం ప్రతిగ్రహకృతే వాదాయ శాస్త్రశ్రమః
దుష్యేచ్ఛోదర పూర్తయే యదిహరేః కైంకర్యమాచర్యతే.'35

వివాహము సంతానమునకుకాక భోగమునకు, యజ్ఞము స్వర్గమునకు కాక ఖ్యాతికిని, పిండివంటలు చేసికొనుట అతిథులకు కాక తనకొరకేను, ద్రవ్యార్జనము ధర్మకార్యములకు కాక కుత్సితుల యుపయోగమునకును, అధ్యయనము బ్రహ్మలోకమునకుకాక బదులేమైన పొందుటకును, శాస్త్రాభ్యాస శ్రమ జ్ఞానార్జనమునకు గాక వివాదమునకును, భగవత్ కైంకర్యము పరమ పదమునకుకాక కడుపునింపుకొనుటకును ఆచరించిన అది నింద్యమే యగును.

ఇట్టి విషయములను చక్కగా గ్రహించిన జ్ఞాని బసవేశ్వరుడు. ద్రవ్యార్జనము ధర్మమునకే కాన మోళిగ మారయ్య జంగమకోటికి సలుపు అర్చనలను విని అత్యంతానందముతో నడుగకయే సహాయమందించిన ఉత్తమోత్తముడు బసవన్న.

'వేదశాస్త్ర పురాణేషు కామికాద్యాగమేషు చ
లింగధారణ మాఖ్యాతం వీరశైవస్య నిశ్చయాత్॥'

'అఘోరాఽపాప కాశీతియాతే రుద్రశివాతనూః
యజుషాగీయతే యస్మా త్తస్మాచ్ఛైవాఽఘవర్జితః॥'

'యోలింగధారీ నియతాంతరాత్మా
నిత్యం శివారాధనబద్ధ చిత్తః
సధారయేత్సర్వమలాపహత్యై
భస్మామల చారురుయథాప్రయోగమ్॥'

'యత్రేరుద్ర శివాతనూ రఘోరాఽపాపకాశినీ! తయానస్తను వాశంత
మయాగిరిశంతాభిచకశీహి॥'56

వేదములు, శాస్త్రములు, పురాణములు, కామికాది వాతులాంతములగు
గమములు వీరశైవునకు లింగధారణ విధిగా చెప్పబడినవి. మంజూష
త్రము కూడ లింగధారణమునే బోధించుచున్నది. కావున లింగధారియైన
శైవుడు పాపరాశివలన విడువబడినవాడగును.

వీరశైవాచార సంపన్నుడైన బసవన్న తాను లింగధారి యగుటయే
ప-

'లింగవంతులు గాని తెంగుల కతని
యంగణాంతరమున కరుగరాదనుచు
వంగకాయలు గట్టుకొంగులఁ బొదివి
లింగసన్నిహితుల భంగివర్తిల్లఁ
జనుదెంచియాబసవదండనాథుఁ
గని భయంపడి మ్రొక్కఁగన్నులనవ్వి' బ. పు; పు.41

ఈశ్వరార్చనలు గొంకక చేయుదని కూర్చుండబెట్టి లింగావసరములు
ంప ఆ బసవయ్య భావసంగతిని వంగకాయలు ప్రాణలింగములయ్యెను.

కన్నడ బ్రహ్మయ్య యను శివభక్తుడు దొంగతనము చేసి తెచ్చిన
ముతో జంగమకోటినర్చించువాడు. శివభక్తుల యింట దొంగతనము చేసెడి
పకాదు. శివభక్తుడు దొంగయైనను బసవన్న కంటికి వ్యక్త లింగమే. శరణని
కి కన్నడ బ్రహ్మయ్యకు బసవన్న దాస్యము చేయుట, అతని నిరహంకార
వకు, నిర్మల నిశ్చలభక్తికి నిదర్శనము.

సారవీరవ్రతాచారుని, జంగమారాధకులలో అగ్రగణ్యుని కన్నడ
హ్మయ్యను పురవీధిలో గాంచి బసవన్న సాష్టాంగ నమస్కారము చేయ-

'పట్టుముగత్తియు బలపంబుఁగన్న
పెట్టఁబోవలయు నాకిట్టున్న భంగి
నొండెడ ధనములె దొనర బిజ్జలుని
బండారమిలు సూప బసవఁర'మ్మనినఁ
బ్రత్యుత్తరం బీనిబాస గావునకు
సత్యనుచిత మన 'కట్లకా' కనుచుఁ' బ.పు;పు. 155

బిజ్జలుని ధనాగారము చూపి కన్నడ బ్రహ్మయ్య దోచుకొనుటకు సహాయపడెను. తాను దర్శించుచున్నది సాక్షాత్ శివ స్వరూపమును, కైంకర్య భావముతో సేవ చేయుచున్నది ఆ భగవంతునకు, ఆ జంగమ మాచరించు పనులను గూర్చిన చింతనము తన కనవసరము. ఆ కన్నడ బ్రహ్మయ్య చేత కూడ మహిమలు చూపించగల్గిన మహిమాన్వితుడు బసవన్న.

వీరశైవులందరు జాతి వివక్షతలేక వ్యవహరింతురు.

'సుకృతీ దుష్కృతీ వాపిబ్రాహ్మణోఽంత్యజోఽపి వా
శివైక భావయుక్తానాం సదృశో భవతి ధ్రువమ్॥'57

సర్వము శివమయమను దృఢమైన భావములు గలవారికి పుణ్యాత్ముడు, పాపాత్ముడు, బ్రాహ్మణుడు, అంత్యజుడు అందరు సమానులేయనుట నిశ్చయ మని వీరశైవసిద్ధాంతము. విభూతి, రుద్రాక్ష, లింగధారణచేసిన ప్రతి శివభక్తుని శివస్వరూపునిగా భావించు బసవన్నకు మడివాలు మాచయ్యకూడ సాక్షాత్తు లింగమూర్తిగా భాసించెను.

మడివాలు మాచయ్య చాకలి. అన్యమతస్థులు ఎదురైన, తాకిన వారిని చంపెడి నియమము కలవాడు. ఆ ఊరి కేతెంచిన క్రొత్తవాడొకడు తెలియక మాచయ్యను తాకగా కోపగించి వానిని పొడిచి మీదికి విసిరివేయగా అతని శవముకూడ కనిపించలేదని ప్రజలు చెప్పగా విని రాజు కోపించి మాచయ్యను చంపుమని సేవకుల కానతి యిచ్చెను.

'భక్తుల కులమెత్తి పలుకనిబాస' గాన బసవేశ్వరుండు బిజ్జలుడు మడివాలు మాచయ్యను 'చాకలి' యని పలుకుట సహితము సహించలేక పోయెను.

'చాకిచా'కని యేల సందడించెదవు
చాకియే యతఁడు సాక్షాల్లింగమూర్తి
కాక యేటికి ఁగనుకనిఁబలికెదవు
కులజుండునతఁడె యకులజుండునతఁడె
కులములేకయు నన్నికులములు నతఁడె
ఆ నీలగళు నపరావరావతారంబు - బ. పు; పు. 102

అని పలికి బసవన్న శివభక్తుల మహిమలు వివరించి బిజ్జలునిలో మాచయ్యకు క్షమాపణలు చెప్పించెను.

ఏకపీఠం జగత్సర్వమేక మాకాశమాలయమ్
ఏకతోయం సదాపీత్వా జాతిభేదం నకారయేత్॥'
'అమరంగ నటుగాక యఖిల మర్త్యులకు
సమము ధాతువులును సమము పిండములు
సమము సూతకములు సమము జన్మములు
సమము నిద్రాహార సంగకృత్యములు
సమము మోహభయాభిషంగ లోభములు
సమమింద్రియ విషయ సముదాయములును
సమములీ భూత పంచకములు నవయ
వములును సుఖదుఃఖ వాసనల్ సమము
లదిగాక ధరయేక మఖిల జీవులకు
తుదనాకసంబు పొత్తు సమస్తమునకు
తోయమొక్కటి జగత్తునకుఁ బ్రాపింప
నై యుండుఁ గుల భేదమైనలాగెట్లు'

* * *

'సద్రతి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య
శూద్రకులీనులంచును బల్కెదీవు
ఎక్కడ వారికి నేతెంచెఁ గులము
టక్కరులాడ మాటలుగాక యనిన'[58]

దీక్షాబోధ సహితము జాతిభేదమును గర్హించినది. పాములున్నను, ముండ్లున్నను పరిమళించు పుష్పములుగల మొగలి పొదవలె ఎన్ని దోషము లున్నను భగవద్భక్తి గల పురుషుడు సాత్త్వికులలో పూజ్యుడగునని విశ్వగుణా దర్శనము కూడ వివరించుచున్నది.

'భూయోదోషైరపి పరివృతః పూరుసాత్త్వికానామ్
ప్రాయః పూజ్యోభవతి భగవద్భక్తి మాసాద్యహృద్యామ్
ఆక్రాంతాఽపిప్రబలభుజగైః కంటకైరప్యనల్పైః
కిన్నాదృత్యా సురభికుసుమా కేతకీ భాగ్యభాజామ్॥'59

మడివాలు మాచయ్య వీరవ్రతాచారయుతుడు, శ్రేష్ఠుడు, కారణ పురుషావతారుడని తెలిసిన జ్ఞాని కాన బసవన్న మాచయ్యను 'చాకలి' యనుట విని ఓర్చుకొనలేకపోయెను. మాయామలంబు తొలగుటకు మానవుడు కులభ్రాంతిని, స్త్రీ పురుష భ్రాంతిని విడిచి ఆత్మదర్శనము చేయవలెను. శిలలలో జనించినను పసిడి పసిడియే. ఏ జాతిలో జనించినను భక్తుడు భక్తుడే.

'శిలలలోపల జనించిననేమి పసిడి
శిలయుఁ దానగునయ్య! చింతింపనట్ల
మానవులందు సంభవులైన నేమి
మానవులగుదురె మా భక్తవరులు
పూరుషులైన నపుంసకులైన
నారులైనను బ్రాహ్మణకులీనులయినఁ
జండాలులైనను శంభుఁ బూజింప
నొండేమి రుద్రసామ్యులు విచారింప
నదిగాక నీవు యాత్మను గాంచి
వదలకుండినఁ గుల వ్యామోహముడుగుఁ
మఱిదానె తొలఁగు నీ మాయామలంబు
తొరలు నహంకృతి దోడ్తోనయడఁగు.'60

భక్తిని శంకించిన వానిని, భక్తుని గుర్తించని వానిని వీరశైవులు సహించలేరు. కాని, వీరశైవులకు ధర్మాచారస్థలమునందు ఓరిమి, దయ, క్షమ మొదలగునవి అనుసరింపవలసిన ధర్మములుగా చెప్పబడుట వలన బిజ్జలుని పై

ఆగ్రహము చెందక భక్తగణముల మహిమలు చెప్పి అతనికి కనువిప్పు కలిగించెను.

'అహింసా సత్యమస్తేయం బ్రహ్మచర్యం చయాక్షమా
దానం పూజా జపో ధ్యాన మితి ధర్మస్య సంగ్రహః'61

అహింస, సత్యవాక్కు, దయ, క్షమ, దానము, పూజ, జప, ధ్యానములు శైవ ధర్మములుగా పేర్కొనబడినవి. వీరశైవ ధర్మములను బోధించిన వాడు కాదు బసవన్న. ఆచరించి ఆదర్శప్రాయుడైన వాడు. వీరశైవులు జాతిభేదము పాటించక భక్తులను భగవత్స్వరూపులుగా భావింతురు. అన్య మతస్థులను స్మరించరు, స్పృశించరు, కరుణించరు.

'యద్గృహేష్వన్యదేవోఽస్తి తద్గృహాణి పరిత్యజేత్
నాన్యదేవార్చకాన్మర్త్యాన్ పూజాకాలే నిరీక్షయేత్॥'62

ఏ గృహములందు శివేతర దైవములు పూజింపబడునో ఆ గృహములకు వీరశైవులు పోరాదు. పూజా సమయమున ఇతర దేవార్చకులను చూడరాదు. వీరశైవాచార విముఖులైన వారిచే పంపబడిన పదార్థములను తమ స్వాధీనమందున్నను ముట్టరాదని వీరశైవ సిద్ధాంతము బోధించుచున్నది.

'స్వమార్గాచార విముఖైర్భవిభిః ప్రాకృతాత్మభిః
ప్రేషితం సకలం ద్రవ్యమాత్మలీన మపి త్యజేత్'63

అతుల నిష్ఠాగరిష్ఠుండయిన బసవన్న జగదేక దండనాయకుడు ఆరగించుటకు తనయింటికాహ్వానించి, బసవన్న చనుదేరకముందే బ్రాహ్మణుల కాళ్ళు కడుగుట పరిచారకునిచే విని ఆగ్రహించెను.

'జగదేవుఁడంతలోఁ జనుదేరఁగాంచి
భుగ భుగ కోపాగ్ని యెగయముందటను
తెరచీరవట్టించి చొరనెట్లువచ్చు
నరుగుము భక్తజనాళిలో వెడలి
కులదైవమిలు వేల్పు మలహరుఁడుండఁ
బల్లుదోవలను బోవఁబాడియే నీకుఁ
గఱకంఠు శుద్ధ నిష్కలభక్తియుక్తి
జఱభుల కదియేల సమకూడుఁజెపుమ

ముల్లోకనాథుని ముట్టఁగొల్చియును
గల్లరిలోకుల క్షణియింపఁదగునె
హరునకు మజ్జనం బార్చుచేదులను
సరవి విప్రులకాళ్ళు సరిగడ్గఁదగునె
శివపాదజలములు శిరమునఁదాల్చి
భవుల కాళుల నీళ్ళు వైనల్కఁదగునె' బ. పు; పు. 536, 237

అని పరి పరి విధముల నిందించెను. జగదేవుడు పశ్చాత్తాప చిత్తుడై శోకజల సమన్విత నేత్రుడగుచు-

'కర్మబద్ధుఁడనైతిఁ గష్టుఁడ ఖలుఁడ
దుర్మదోపేతుఁడ దుష్కృతాలయుఁడఁ
బ్రజ్ఞా విహీనుఁడఁ బరమ పాతకుఁడ
నజ్ఞాని నధిక సర్వాపరాధుండ
శంకమాలిన యనచారుండ దీని
కింకఁ బ్రాయశ్చిత్తమేమియులేదు
పానలేటికి విడ్తుఁ బ్రాణంబు గెలస
మానతియిండునా 'కనిమ్రొక్కినిలువఁ' బ. పు; పు. 241.

జ్ఞానభక్తుడయిన బసవన్న మరికొన్ని దినములకు కల్యాణకటకమున శివద్రోహము జరుగగలదని శివద్రోహిని చంపిన శివుడు ప్రసన్నుడగునని పల్కెను. జగదేవ దండ నాయకుడు శివద్రోహిని చంపెదనని వీర తాంబూలము గొనెను.

భక్తవత్సలుడు, భక్తైకదేహుండయిన పరమేశ్వరుడు పర్వత పుత్రితో భక్తరత్నములకు బండారి బసవడని, స్థిరభక్తితో తనను కొల్చినగాని లభించని ముక్తి ధరలో బసవని తలచినంతనే కలుగునని బసవని సద్గుణ మహోన్నతిని వర్ణించెను.

'కారణలోక సంహారుండ నేను
కారణలోకోపకారి యితండు
[illegible]

భక్తరత్నములకు బండారి యితఁడు
భక్తైకదేహుండ భావింపనేను
భక్తజనప్రాణి బసవ పీక్షింప
ముక్తికిరాజఁజూ ముద్దినయ నేసు
భక్తికి రాజునూ బసవఁడీక్షింపఁ
బసరింప నే లింగపట్టబద్ధుండ
బసవండు సద్భక్తి పట్టబద్ధుండు
అచరలింగంబనే నచలేంద్రతనయ!
నచరాచరక్షోణిఁ జరలింగ మితఁడు
సనునాది నా పేరు శంభుండనంగఁ
బొనర ద్వితీయ శంభుఁడు వీని పేరు
స్థిరభక్తి మమ్ముఁగొల్చినఁగాని లేదు
ధరవీనిఁదలఁచినంతనె ముక్తిగలదు.' బ. పు; పు.51,52

'బసవా' అని పిలిచినంతనే బసవన్న భక్తుల నాదుకొనిన ఘట్టములు బసవపురాణమునందు గలవు.

గొల్లెత చల్లకడవ నెత్తుకొని పోవుచు జారిపడబోయి 'బసవ'యని తలచినంతనే బిజ్జలుని కొలువు కూటమునుండియే చేతులెత్తి ఆమెను పడకుండ కాపాడెను. చిట్టంబలుడు పూజా కుసుమములు కోసికొని వచ్చుచు బురదలో జారిపడ బోవుచు 'చిట్టంబలాధీశ' యని స్మరించగా బసవన్న యతనిని పడ కుండ కాపాడెను.

బసవన్న ఆర్తజన రక్షకుడేకాదు- మహిమలు చూపి భక్తులను, భగవం తుని ఆశ్చర్య చకితులను గావించెను.

భక్తుడొకడు బసవన్నను చేరి ఇటునటు కదలక పుట్టెడు ముత్తెముల నిమ్మ అన్న, ఎదురుగా నున్న జొన్నల రాశిని చూపి కావలసినన్ని ముత్తెము లను కొనిపొమ్మనగ అవియన్నియు ఆశ్చర్యకరముగా ముత్తెములయ్యెను.

బసవని శక్తిని పరీక్షింప సంగమదేవుడు బసవని మూడవకన్ను అడుగ 'అయత లింగపసాయిత హస్తుఁడై - యెఱుఁగనె నీదు మాయనే' ననుచు అద్దములో అతనికి మూడవ కన్ను చూపించగా భగవంతుడే సిగ్గుపడి పారి పోయెను.

మంత్రి బసవన్న భక్తుడు, శక్తియుక్తుడు, శాంతభక్తుడు. అంతర్లింగారాధన చేయునపుడతడు జ్ఞాని. కాని, జ్ఞానులుకూడ సామాన్య భక్తులు అనుసరించుటకు ఆదర్శప్రాయులై ఆచారనిరతులై యుండవలెను. కాన, బసవన బహిర్లింగారాధనకూడ చేయువాడు. లింగవంతులు కానివారికి తన ప్రాంగణమున అడుగిడుటకు అనుమతిలేదని, లింగమూర్తులనే సాక్షాత్ శివస్వరూపులుగా భావించి తదనుగుణమైన ప్రవర్తనచే బసవన్న ముగ్ధభక్తుడుగా భాసించును. శాంతభక్తి సామాన్యముగా జ్ఞానులైన వారిచే ప్రదర్శింపబడును. ముగ్ధభక్తి యొక్క పరిణతావస్థ లేదా ఫలావస్థ బసవేశ్వరుని చరిత్రలో కాననగును.

సద్గురూపదేశము ననుసరించి ప్రాణలింగమును ధ్యానించి మానసిక పూజా ద్రవ్యములతో సదా పూజించవలయునన్నది వీరశైవధర్మము.

'క్షమాభిషేక స్సలిలం వివేకో వస్త్రముచ్యతే
సత్యమాభరణం ప్రోక్తం వైరాగ్యం పుష్పమాలికా॥

గంధ స్సమాధి సంపత్తి రక్షతా నిరహంకృతిః
శ్రద్ధా ధూపో మహాజ్ఞానం జగద్భాసి ప్రదీపికా॥

భ్రాంతిమూల ప్రపంచస్య నైవేద్యం తన్నివేదనం
మౌనం ఘంటాపరిస్పంద స్తాంబూలం విషయార్పణమ్॥

విషయ భ్రాంతి రాహిత్యం తత్ ప్రదక్షిణ కల్పనా
బుద్ధిస్తదాత్మికాసక్తిర్నమస్కార క్రియామతా॥

ఏవం విధైర్భావశుద్ధైరుపచారైర దూషితైః
ప్రత్యఙ్ముఖ మనాభూత్వా పూజయే లింగమాంతరమ్॥'64

ఆ మానసిక పూజా ద్రవ్యములీ విధముగా వివరింపబడినవి:

క్షమ - అభిషేకజలము
నిత్యానిత్యవివేకము - వస్త్రము
సత్యవాక్కు - ఆభరణము
వైరాగ్యము - పూదండ
చిత్తమున ప్రాణలింగము నిలుపుట - గంధము
నిరహంకారము - అక్షతములు
శ్రద్ధ - ధూపము

జగత్తును ప్రకాశింపజేయు మహాజ్ఞానము - అఖండదీపము.
అహంకార మమకారములను నివేదించుట - నైవేద్యము
మౌనము - ఘంటానాదము
శబ్దస్పర్శరూపరసగంధసమర్పణము - తాంబూలము
విషయభ్రాంతి రాహిత్యము - ప్రదక్షిణము
తాదాత్మ్యమనంధాసక్తి - నమస్కారము

భగవత్సేవ బాహ్యమని, అభ్యంతరమని, బాహ్యాంభ్యంతరమని సిద్ధ శిఖామణి ముప్పిధములుగా పేర్కొనినది. ఇతరులకుకూడ కనిపించు పూజాది కర్మలు బాహ్య సేవయనియు, తనకు మాత్రమే కనిపించు శివపు కర్మము అభ్యంతర సేవయనియు, మనసు లింగాసక్తమైన బాహ్యాంభ్య సేవయనియు చెప్పబడినది.

'బాహ్యమాభ్యంతరంచైవ బాహ్యాభ్యంతరమేవవా
మనోవాక్కాయ భేదైశ్చత్రిధాతద్బుజనం విదుః
అన్యాత్మ విదితం బాహ్యం శంభోరభ్యర్చనాదికం
తదేవతుస్వసంవేద్యమాభ్యంతరముదాహృతమ్॥' 65

బాహ్యలింగార్చన వినా ప్రాణలింగార్చన చేయుట పగిలివి కుండలో పాలు పోయుట వంటిదనియు శైవమత ధర్మమున చెప్పబ కావున బాహ్యలింగార్చనకు శైవధర్మమున - అట్లే శైవభక్తియందు ప్రాముఖ్యము కలదని స్పష్టమగుచున్నది.

వీరశైవులలో అమాయకులైన ముగ్ధభక్తులు బాహ్య పూజకే ప్రా మిచ్చిరి. ఒక విధముగా మానసిక లింగార్చనము చేయువాడు జ్ఞానభక్తుడ బాహ్యలింగార్చనా నిరతుడు ముగ్ధభక్తుడు కావచ్చుననియు వివేచింపవ ముగ్ధభక్తులు బాహ్యలింగార్చనమునందును భక్తికే ప్రాముఖ్యమిత్తురు బాహ్యాచారములకును విధి విధానములకును విశేషప్రాముఖ్యము నీయరు. వంతుడు కోరునది భక్తి కాని, వారాచరించిన పద్ధతితో నిమిత్తము లేదు.

'చర్యావబోధరహితా భవభక్తిమాత్రా
స్నీతాస్త్వయా శివపురం యదహోకిరాతః
జాతిస్మరత్వ మథవా పరమామరత్వం
యేత్వాం విముక్తి రథవా భవతః ప్రసాదాత్॥'66

తెలియనివాడు చేసిన పూజ క్రమరహితమైనను భక్తి దృఢముగా నున్న యెడల పరమేశ్వరుడనుగ్రహించునని మల్హణకవి స్తవము కూడ తెలియజేయు చున్నది.

మానసిక పూజాద్రవ్యములలో అభిషేక జలమనగా గంగాజలము కాదు. క్షమ, ఓర్మి. కాని, ఉడుమూరి కన్నప్ప బాహ్యపూజను గూర్చి మాత్రమే తెలిసిన ముగ్ధభక్తుడు. శుచి శుభ్రత, అభిషేక పద్ధతి తెలియని అమాయకుడు.

'చెప్పుఁగాలను దొంటె శివుమీఁది పూజ
పోనూకి తెచ్చిన పుక్కిటి నీట
మానుగా శివునకు మజ్జనం బార్చి' బ.పు; పు. 81

పుక్కిటనీరు పూజకు పూజ్యమా? అను సందేహము సహితము రానివాడు. అహంకార మమకారములు నివేదించుటయే జ్ఞానభక్తులు భగవవంతున కర్పించు నైవేద్యముకాగా కన్నప్ప-

"పఱికి వెంట్రుకలపైఁ బత్తిరిరాల్చి
మఱి దొప్పఁ దెచ్చిన మాంసమర్పించి' బ.పు; పు. 81

జంతువులను చంపి కాల్చి తెచ్చిన మాంసమును తన తలవెంట్రుకలపై పెట్టుకొని తెచ్చిన పత్రిని రాల్చి దానిపై ఆ మాంసమును భగవంతునకు నైవేద్యమిడిన దృఢనిశ్చల భక్తుడు ఉడుమూరి కన్నప్ప.

జ్ఞానులకిది అజ్ఞానమే; పూజావిధులు తెలిసిన పండితులకిది అనుచితమే. చదువుకొనినవారికిది చండాలుర పనియే. కాని, జ్ఞానులు, మునులు, పండితులు, సన్మార్గవర్తనులు కూడ చేయలేని ఆత్మార్పణ కన్నప్ప మాత్రమే చేసి కఱకంఠుని కరుణార్ద్రదృష్టిపాతముచే పునీతుడయ్యెను.

చిత్తమున ప్రాణలింగమును నిలుపుటయే భగవంతునకు పూయు గంధము. ఇది మానసిక పూజాద్రవ్యము.

ఏణుమూర్తి తన ప్రాణలింగమునకు త్రికాలములందును మేలిచందనము నర్పించు నియమము కలవాడు. కడులేమివలన గంధమేవిధముగను గడియింప లేక 'తనువుండ మనసుండఁ దల్లడంబందనను'చు తనువెల్ల గంధముగా తీసి నర్పించవలెనని 'వలపలిచేయిని సానగదియించి తిగిచి శ్రీగంధంబు వడసి' శివునకర్పించి మెప్పించి అనుగ్రహము వడసెను.

భగవంతునిపట్ల చూపు శ్రద్ధయే ధూపము.
'తత్కులం హిసదాశుద్ధం సఫలం తస్య జీవితం
యస్య చిత్తం శివే సాక్షాద్విలీనమ బహిర్ముఖమ్'67

ఎవని చిత్తము శివుని కళిముఖమై క్రమముగా శివునియందే విలీనమై మరల వెలికి మరలదో వాని వంశము పావనమైనది. వాని బ్రతుకే సఫలమైనది. శ్రద్ధతో సేవించిన వాడే భగవదనుగ్రహమును పొందును. అట్టి శ్రద్ధయే భగవంతునకు వేయు ధూపము. కాని, గుగ్గులు కళయారు మూడు సంధ్యలందు శివునకు ధూపము వేయుట నియముగా కలవాడు. ఆలి మంగళ సూత్రమాదిగా అతని సంపద యంతయు ధూపమునకే హరించుకొనిపోయెను. తిరువరంధామమందు ఉరగేశ్వరుడు ఉరగకన్య పాడగా ముందటికొకింత సోలిపోగా ధరణి పాలుడు పెక్కు ఉపాయములచే చక్కచేయజాలకపోయెను. అంత గగ్గులు కళయారు వలసినంత గుగ్గులము రాజుచేత పొంది ఒక వస్త్రము యొక్క ఒక చివర ఈశుతోడ బంధించి మరొక చివర శస్త్రము బంధించి గ్రక్కున ఆ శస్త్రము తన కంఠమందు పొడుచుకొనివెనుకకు ఒరుగగా నాగేశుడతి సంతసమున ప్రత్యక్షమై యతనిని కరుణించెను.

జగత్తును ప్రకాశింప జేయు జ్ఞానమును పొందుటయే భగవంతునకు వెలిగించు అఖండదీపము. ఇది మానసిక పూజా ద్రవ్యము. కాని, మనసుతోపాటు మాటకు క్రియకు కూడ అత్యంత ప్రాముఖ్యమునిచ్చు కడమల నంబి ప్రాణలింగమునకు వేయి అఖండ దీపములను పెట్టుట నియమముగా కలవాడు. ధనతయు అర్చనలకే వ్యయము కాగా తనువుండ తలయుండ సంశయమేలని వెంట్రుకలవిచ్చి 'జ్వలనంబునకుఁబట్టి' శంభుని మెప్పించెను.

దీవదకళియారు భక్తియు నిట్టిదే. సంపదయంతయు అర్చనలకే హారతి కర్పూరమువలె హరించుకొని పోగా తలవెంట్రుకలు జడలల్లి దీపముగా వెలిగించి హరుని మెప్పించెను.

'మలకోశేశరీరేఽస్మిన్ మహాదుఃఖ వివర్ధనే
తడిదంకుర సంకాశేకోవామోదేత పండితః॥'68

దుఃఖముల నధికము చేయునట్టిదియు మెఱుపుఁ గొనవలె క్షణికమైనట్టిదియు సమస్త మలినములకు నిలయమైన శరీరమునం దభిమానముంచి పండితుడెవఁడు సంతోషింపడని సిద్ధాంత శిఖామణి తెలుపుచున్నది.

అందువలన భర్గునకు ప్రతిదినము వేయి దీపములను వెలిగించు నియమముగల నమినంది నెయ్యి లభించక పోవుటవలన ప్రాణత్యాగము చేయుటకు సిద్ధపడగా పరమేశ్వరుడు కరుణించి బావిలోని నీటితో దీపములను వెలిగించుమని ఆనతిచ్చెను. నమినంది సంతోషముతో నీటితో దీపములను వెలిగించెను. ఆ బావిలోని నీటిని త్రాగిన పశువులు చనిపోగా నమినంది వ్రతభంగము చేయతలపెట్టిన జైనులు సిగ్గుపడి నమినందిని క్షమావణవేడిరి. నమినంది ఆ జంతువులను తిరిగి బ్రతికించి జైనులకు శివదీక్ష యొసగెను.

వైరాగ్యమే పూదండ. కాని, ముగ్ధభక్తులు పూజాపుష్పములను పరమ పవిత్రముగా భావింతురు. అట్టి పూజాపుష్పమున నెవరైన వానన చూచిన శివద్రోహముగా భావించి ఉగ్రులగుదురు.

నరసింగ నయనారను రాజు పట్టమహిషితో కూడ ఈశుని అర్పించుటకు గుడికి పోయెను. అచట రాణి పూజార్హమగు పూవొకటి తోటలో వాసన చూచినదని పూజారి కోపగించి ఆమె ముక్కును కోసివేసెను. అది వినిన రాజు శివద్రోహమునకుగ్రుడై పువ్వు పట్టుటకు చాచిన చేతిని వ్రేళ్ళను నరికెను. జననాధుని ముగ్ధభక్తికి జగన్నాధుడు మురిసిపోయెను.

దోచమాంబ పూజాపుష్పమొకటి తక్కువైన నేత్ర కమల మర్పించి త్రినేత్రుని మెప్పించినది.

అహంకార మమకారములను శివార్పణ చేయుటయే భగవంతునకు భక్తుడు పెట్టు నైవేద్యము. ఇది మానసికపూజాద్రవ్యమైనను భక్తుడు భగవంతున కర్పించి గాని భోజనాదులు గ్రహించకపోవుట సర్వసామాన్యము.

'అర్పయిత్వానిజేలింగే పత్రం పుష్పం ఫలంజలమ్
అన్నాద్యం సర్వభోజ్యం చ స్వీకుర్యాద్భక్తిమాన్నరః.'[69]

శివభక్తులు మొదట యిష్ట లింగమునకు సమర్పించిన పత్ర పుష్ప ఫల జల భక్ష్య భోజ్యాదులనే తామనుభవించవలయునని వీరశైవధర్మము.

'అన్న జాతేతు భక్తేన భుజ్యమానే శివార్పితే
సిక్థే సిక్థేశ్వమేధస్యయత్ఫలం తదవాప్యతే.'[70]

శివార్పితమైన ఆహారపదార్థములు శివభక్తునిచేత భుజింపబడునపుడు, అందలి ప్రతిమెతుకునందును అశ్వమేధఫలమునిచ్చు మహిమమున్నదిగాన నట్టిఫలము వానికి లభించునని వీరశైవసిద్ధాంతము తెలుపుచున్నది.

అరివాళునయనారు అశ్వమేధ ఫలము పొందవలెనన్న కోరికతో కాదు కాని త్రినేతునకు త్రికాలనియమముగా 'రాజసంబు ప్రాలోగిరము సమర్పణ సేసి తాను నాలింగలీనమై' యట్లు వర్తించువాడు. ధనమంతయు సమసిపోగా నేను దినములు నిరుపవాసముండి కూలిచేసి ఆర్జించిన ధనముతో రాజనములు కొనితెచ్చుచుండగ ఆ సంభ్రమమున ధరతాకి నేలరాలినవి. పురహరునకర్పించ దలచిన బియ్యము నేలపాలగుటకు మిగుల దుఃఖించి భగవంతునికి నైవేద్య మర్పించలేని తన జీవితమెందులకని కొడవలితో తల నరుకుగొనబోగా ప్రసన్నుడై పార్వతీశు డనుగ్రహించెను.

మౌనమే ఘంటానాదముగా మానసిక పూజాద్రవ్యములందు పేర్కొన బడినది. భగవంతునకు చేయు నర్చనాదులలో ఘంటలు మ్రోయించుట కద్దు.

ముగ్ధభక్తుడైన ఘంటాకర్ణుడు పరశబ్దము వినకూడదని నియమము కాన ఘణఘణ గంటలు మ్రోయించుచు ఘంటాకర్ణుడని పేరుబడసెను.

'వినవెఘంటాకర్ణుఁడను ప్రమథుండు
మును పరశబ్దంబు వినని నేమంబు
గాన ఘంటలు ఘణఘణయని మ్రోయ
వీనులనొక వేనవేలు ధరించి
లోకంబులందు ఘంటాకర్ణుఁడనఁగ
ప్రాకటంబుగఁ జెప్పఁబడియె.' బ. పు; పు. 196.

## దాస్యభక్తి

భగవంతుని చేరు త్రోవ లలో మిన్నయైనది భక్తి మార్గము. ప్రవృత్తు లను బట్టి పయనించు బాటలు వేరుకాని గమ్యమొకటియే. భగవంతుని సారూప్య సామీప్య సాయుజ్యాదులు కోరెడువారు కొందరు, భగవదారాధన తప్ప మరొకటి కోరనివారు కొందరు, అర్చనాదులతో ఆనందించువారు కొందరు, కొలిచి సేవించి తరించువారు కొందరు, కైంకర్య భావముతో కైలాసవాసుని కరుణా

కటాక్ష వీక్షణాదులను బొంది కరిగిన ముగ్ధ భక్తులు కొందరు బసవపురాణము నందు ప్రచురముగా కనిపింతురు. భగవంతుడు అతని భక్తులు దాస్య భక్తి రసమునకు ఆలంబన విభావములు కాగలరు. సర్వదా భగవంతుని సేవయందే ఆసక్తమైన చిత్తము కలవారు దాసులు.

కన్నప్పకు కలలో శ్రీకంఠుడు కనిపించి 'చనఁజని ముందట ఘనలింగ మూర్తిఁ గనియెదు; ప్రాణలింగంబు నీకదియు' నని ఆనతియ్యగ మేల్కొని కనిపించిన బాటలో పయనించి ప్రాణ లింగమును కనుగొని పాసిపోరాదని తన పల్లియకు గ్రక్కున కొనిపోయి పాక నిర్మించవలెననియు, ఎండకునెండు నట్లు ఆ లింగముండుట తాను సహించలేననియు,

'బుద్ధులు సెప్పియు బుజ్జగించియును
దద్దయుఁగీడ్పడఁదగ వెడ్డువెట్టి
వలసిన వస్తువులిలఁదెచ్చి యిచ్చి
వలపించికొని పోవవలె'నని తలంచి బ.పు. 79

వరముగ్ధ భావనతో హరుని పలికిన పలుకులు కన్నప్ప యొక్క అమాయక దాస్యభక్తిని చాటుచున్నవి.

త్రిభువనేశునకు బుద్ధులుసెప్పవలెనని, జగజ్జనకుని బుజ్జగించవలయు నని, ముక్తినిచ్చు ముక్కంటికి వలసిన వస్తువులు తెచ్చియివ్వవలెనని కోరు కన్నప్ప మౌగ్ధ్యము, అమాయకత్వము, సేవానిరతి పఠితల కాపాత్రపట్ల సానుభూతి కలుగజేయును. బుజ్జగించి భర్గుని తన పల్లియకు కొనిపోవవలెను ఆలోచన అతనికెంతయో సంతోషము కలుగజేసినది. నేత్రప్రసన్నత, ముఖ ప్రసన్నత, ప్రియభాషణము, పులకోద్గమము, అశ్రూదయము, స్వేదో దయము మొదలగు వానివలన హర్షము వ్యక్తమగునని ఆలంకారికుల యభి మతము. కన్నప్ప పరమ హర్షమున విస్ఫారాంగుడగుచు పసివారిని బుజ్జ గించినట్లు పరమేశ్వరుని ప్రశ్నించుట మన మనసుల నాకట్టుకొనును.

'అక్కటా! యిది యేమి హరుఁడ యొక్కరుఁడ
విక్కడ నుండుట యేమి కారణమొ?
తలసూపకే యూరి తమ్మళ్ళతోఁడ
నలిగివచ్చితి సెప్పు మలుక దీర్చెదను

గౌరకలుమ్మెత్తపత్త్రిఁ బూజసేయ
మరులెత్తి వచ్చితో యురుతరాటవికి;
.....................
నాతోడి మోహంబున నన్నుఁ బ్రోవ
నేతెంచితో వేడ్కఁ యెసఁగ నిచ్చటికి!' బ. పు; పు. 79

మనసిజ హరుడు మనవంటి వాడేనని మాట పట్టింపుతో ఊరు వదలి వచ్చెనేమో అని, ఉమ్మెత్త పత్త్రిరిపూజకు మరులెత్తి వచ్చెనేమోయని, గంగా గౌరీ సంవాదము తీర్చలేక అడవి జొచ్చెనేమో అని, కంతుసంహారుడు కానల నుండుటకు కారణమేమని ప్రశ్నించు కన్నప్ప తనవంటి సేవకునిపై మోహముతో తనను బ్రోచుటకు ఏతెంచెను కాబోలని భావించెను. భక్తులు భగవంతు నేరూప మున కొలుతురో ఏ నామమున పిలుతురో ఆ రూపమున వారి ననుగ్రహించుట కద్దు. మానవు లేర్పరచుకొనిన జాతి మత భేదములు భగవంతునకుండవను జ్ఞానము లేని కన్నప్ప చెన్నయ్యను కలిసినందుననే పరమేశ్వరుని వెలివేసిరేమో అని తలచిన వెఱ్ఱివెంగలప్ప. సృష్టి స్థితి లయకారుని, కారణములకెల్ల కారణుం డయిన వానిని, ఆరాధ్యదైవమును కొలుచుచు, భగవంతుడన్న స్పృహ కలిగియు, తనవలెనే కష్టసుఖము లననుభవించు సామాన్య మానవునిగా భగ వంతుని భావించినవాడు ముగ్ధకన్నప్ప. 'ఎటనుండి అటకేతెంచె'నని ప్రశ్నించెను. 'ఎట్లు నీ బ్రతుక' ని వాపోయెను. 'ఇటనుండ జొచ్చి ఎంతకాలంబయ్యె'నని తోడునీడ లేక ఈశుడెంతగా ఒంటరితనముతో దిగులు చెందెనోయని దుఃఖిం చెను. 'ఒడలనర్ధముగొన్న యుమబోటియెద్ది? యెదరైననవ్వరే యెక్కడివారు' అని అయోమయముగా శరీరములో నర్ధభాగము నాక్రమించిన ఉమ యెచటకు పోయెనని గౌరీశంకరులు విడిపోయిన నవ్వరా నలుగురని లోకముతీరు వివ రించుచున్న కన్నప్ప అమాయకత్వమునకు కపటమెరుగని చిన్నారి పాపల మనసును తోపింపచేయును.

'కట్టిన గోచి యెక్కడ నొల్వవడితి' - దిక్కులే అంబరముగా గల వానికి కట్టిన గోచియు లేదని చింతించుచున్నాడు కన్నప్ప సృష్టికర్త ఒంటరి వాడయ్యెనని, సర్పహారికి సర్పమువలన హాని కలుగునని, నగవు కాదని అడవి నుండుట ప్రమాదమని యెట్టులైన తనవెంట పల్లెకు వచ్చుట శ్రేష్ఠమని పరమేశ్వరు ననునయించుచున్న కన్నప్ప మౌగ్ధ్యము మన మనసుల నాకర్షి

చును. పల్లెలో పాలు, పాయసము, నేతులు, ఇప్పపువ్వు, తేనెలు, ఫలాదులు, రుచిగల భోజనమునకు కొదవలేదని 'రావయ్య మ్రొక్కెద దేవదేవుండ! ప్రేవులు మాడఁగఁజావుఁదప్పినదే' అనుచు పాదాక్రాంతుడయ్యెను. భగవద్రతి సేవాభావము, అనుభావము కన్నప్ప భక్తికి కన్నాకువలె సహజముగా పోషింప బడినవి.

పరమేశ్వరుడు పలుకకపోవుటతో హాలాహల భక్షకుడు ఆకట పల్క లేడని, అరచియు లాభము లేదని ఆహారము తెచ్చి ఆకలి తీర్చవలెనని అడవికి పోయెను.

ఒక్కొక్క కోలతో నొక్కొక్క మృగమును చంపి, మంట దరికొల్పి మంచి మాంసము శోధించి శోధించి, చక్కగా పక్వమగునట్లు త్రిప్పి త్రిప్పి కాల్చి రుచికరమైన ముక్కలను, 'చిఱుతయుఁ గఠినంబు ఛిద్రంబు మొఱకు కఱకును గారాకుగాకుండ చూచి బిల్వపత్రి తన తలపై నిడుకొని దానిపై బడరునకాహారముగ నామాంసపు ముక్కలనుగొని పుక్కిళ్ళలో నీరు పట్టుకొని బయలుదేరెను. అదిదేవుని ఆకలి దీర్చను ఆహారము సిద్ధము చేయుటలో కన్నప్ప కనబరచుచున్న శ్రద్ధ మనలను ముగ్ధులను జేయును. పామరుడు, అనాగరికుడైన కన్నప్ప భగవంతుని సేవించవలెనన్న నిర్మలమైన సేవకా భావము పాల్కురికి సోమనాధుడు మన కన్నులముందు సాక్షాత్కరింపచేసెను.

భర్గున కాకలి దప్పులు తీర్చవలెనన్న తపనయే కాని పుక్కిట నీరు కొనిపోవుట యెంగిలన్న భావము కాని అపచారమన్న ఆలోచన కాని లేనివాడు. యుక్తాయుక్త విచక్షణ లేనివాడు, కాని భక్తుడు.

'చెప్పుకాలను దొంటి శివుమీఁది పూజ
పోనూకి దెచ్చిన పుక్కిటనీట
మానుగా శివునకు మజ్జనంబార్చి
పఱికి వెంట్రుకలపైఁ బత్తిరిరాల్చి
మఱిదొప్పఁదెచ్చిన మాంసమర్పించి
యనయంబు నిట్లు గన్నప్పదేవుండు
ననురాగమునఁగొల్వ...' బ. పు. పు. 81.

చెప్పుకాలుతో శివాగారమున చొచ్చుటయే అపచారము. కన్నప్ప చెప్పు కాలితో శివుని మీద నుంచిన పూలను త్రోసివేసి, పుక్కిటనున్న నీటితో శివున కభిషేకము చేసెను. శుచియు, శుభ్రము తెలియని అనాగరికుడుగా, భగవంతుని పూజాపుష్పములు కాలితో త్రోసివేసిన అవివేకిగా, నోటితో తెచ్చిన యెంగిలి నీటితో లింగాభిషేకము చేసిన మూర్ఖునిగా, మాంసము కాల్చి శివున కాహారము తెచ్చిన అజ్ఞానిగా కన్నప్ప మనకు గోచరించును. కాని తొలినాటి పూజాపుష్పములు కాలితో త్రోసివేయుట గర్వముతో కాదు. నోటిలోని నీరు లింగముపై గ్రుమ్మరించుట అహంకారముతో కాదు. కన్నప్పకు గంగాధరుడు ముక్తి నిచ్చు భగవంతుడే కాదు - అకలిదప్పులున్న మనవంటి వాడు. ఆహార పానీయము లందించువారులేక నీరసించిపోయిన భగవంతుడు. తన సేవల వలన కోలుకోవలయునని, ఎంత త్వరగ ఆహార మిచ్చిన శివు డంత త్వరగా శక్తిమంతుడు కాగలడని ఆలస్యమయిన మృత్యుంజయునకేమి ముప్పు వాటిల్లునోయన్న ఆతురతతో అట్టిపనికి పూనుకొనినవాడు. అతని అమాయకత్వమునకు అజ్ఞానమునకు సేవకాభావమునకు అద్దము పట్టినట్లున్నదీ ఘట్టము

శివునకు వివిధ భోజ్య లేహ్య చోష్య పానీయంబులు సమర్పించుటవలన వాని ఫలతారతమ్యములను శైవాచార సంగ్రహమిట్లు తెలుపుచున్నది:

గీ. కేవల క్షీరయుక్తంబు ఘృతరసంబు
గుడయుతము దుగ్ధ సహితమ క్షుద్రమహిమ
విదుకిరీటున కర్పింపవేయు గుణము
లొక్కటొక్కటికి ఫలములీ యోగిరములు.'

క. నైవేద్య తండులంబులు
భావింపఁగ లెక్కకెన్ని పట్టుద్దులగున్
గావించు శివపురస్థితి
కైవల్యంబన్నివేల్ యుగంబులు వరుసన్.'

క. అన్నమునకుఁ గోటి గుణం
బెన్నఁగ భక్ష్యములు శివునికిడఁ దత్ఫలముల్
సన్నుత జపోపవాసా
భ్యున్నతమఖదాన తీర్థముల ఫలమిచ్చున్.'71

కాని, కన్నప్పవంటి ముగ్ధభక్తుడు సమర్పించిన ఆహారమువలన కలుగు ఫలములను శైవధర్మములను బోధించు శాస్త్రములందు తెలుపలేదు. బహుశః కన్నప్ప భక్తివంటి భక్తికి ఫలము కన్నప్ప పొందిన దైవానుగ్రహమే కాబోలు. భోజ్యపదార్థములకంటె భక్తిభావమే ముఖ్యము.

ముందు కొలుచు తపసి శివాగారమున జొచ్చి కన్నప్ప పూజకు ఏవగించుకొని -

'అక్కట! యెంగిలి యదియు మాంసంబు
పుక్కిట నీరును బూజ్యమే పూజ;
చెప్పుకాలను నూకు శివభక్తిగలదె?
యెప్పాట వినఁబడునె? యెట్లు సైప' బ.పు; పు. 82.

అని శివాపచారమునకు మిక్కలి ఆవేదనచెంది ఆవేశపూరితుడై చెలది గజమును చంపినయట్లు తానును ఆ మూర్ఖుని అంతమొందించవలెనని తలచెను.

'ధ్రువముగ సర్వప్రాణుల, నవశ్యమునుఁ జేయకుండునది హింసమదిన్
శివనిందకులగు పాపుల నవిచారితవృత్తిఁ జంపనగు నీశానా'72

అని శివతత్త్వసారము నుడువుచున్నది. శాస్త్రోక్తముగా పూజావిధులను నిర్వర్తించు శివయోగికాన శివాపచారమున కుగ్రుడయ్యెను.

'కాన యిక్కడన మార్గముసేయు ధీర
మానసుడెంతవాడైనఁ గానిమ్ము
అట్లునేఁడును వాఁడు నరుడెంచెనేని
యెట్లైనఁ జంపకయేఁబోవననుచు'-82 బ. పు; పు. 82

వేచియుండెను. తపసియొక్క ఉగ్రత స్పష్టము కాగలదు. ఆలంకారికులు 'ఇతరులవలన తనకు కీడు కలిగిన పుట్టునటువంటి చండతను ఉగ్రత' అందురని ఉగ్రతకు నిర్వచనమిచ్చిరి. భక్తులు తమకు హానికలిగినను, తమ నవమానించినను సహింతురు, ఓర్తురు కాని, భగవదపచారము సహించలేరు. అందువలన ఉగ్రుడైన తపసి కన్నప్పను కడతేర్చుటకు పొంచి యుండెను. ఉఊకంఠుడే కన్నప్ప ఘన ముగ్ధ భక్తిని తపసికి చూపదలచెను.

త్రినేత్రములతో నున్న వదనమున వలపలికంట ఉదకము కారుచుండ కన్నప్ప అరుదెంచి హరుకంట నీరు బొడగని జిట్టులిక్కిపడి భయభ్రాంతు డయ్యెను. 'ఆకస్మికముగా కలిగిన భయముచే చిత్తము తడబడుట' త్రాసమని ఆలంకారికుల మతము. ఇట్టి సంచారి భావములచే స్థాయి భావ మిట పరిపుష్ట మైనది. కన్నప్ప వెంటనే ఉల్కిపడి 'తొల్లిటి పూజ చెప్పుకాలితో పోనూకి' పుక్కిట తెచ్చిన నీరు బుగులున నుమిసి తలపైనున్న పత్తిరి శివుని ముందు పడునట్లు తలవంచి, పత్తిరిపై కాల్చి తెచ్చిన మాంసపు ముక్కలు పెట్టి భగవంతుని కుపచారములు చేయదొడగెను నిటలాక్షుని కంట కన్నీటిని చూచి 'కటకటా! ఇదియేమి గర్జంబు పుట్టె!' నిటలాక్ష నీకంట నీరుగాఱెడిని!' అని తత్తరపాటుతో ప్రశ్నించెను. ఇష్టానిష్టములు సిద్ధించుట వలన కలుగు తత్తర పాటు ఆవేగమని లక్షణ శాస్త్రములందు చెప్పబడినది. కామితార్థ ప్రదాయకుడు కంట నీరు పెట్టుకొనుట కలనైన ఊహించని, సహించని, ఓర్చుకొనలేని భక్తులకు తత్తరపాటు నెట్లు కలుగ జేయవు?

'నీ నింద విని గౌరి నీఱైన నాఁడు
దానించు కేనియుఁ దడిగంట లేదు;
జనకుచేఁ దనయునిఁ దునిమించునపుడు
కనికరంబునఁ గంటఁ గ్రమ్మదు నీదు' బ. పు; పు. 83.

పూర్వానుభవములను తలచుట స్మృతి. కన్నప్ప గంగాధరుని పూర్వాను భవములను స్మృతికి తెచ్చుకొనుచు, ఎట్టి కష్టములందైనను కంట నీరు పెట్టని పరమేశ్వరుని కంట నీరుచూచి నివ్వెరపోయెను.

ఆలుబిడ్డలను, అడవులను, తనను సృష్టించిన పార్వతీశుడు నానొక్క డయ్యెనని యేడ్చెనేమో? అని, ఏకాకి అయ్యెను కాన లోకముల నెట్లు బ్రోవ గలనని ఏడ్చెనో? యని, కడుపు కాలంగ ఆకటికోర్వలేక తడవయ్యె కన్నప్ప రాడాయెనని ఏడ్చెనో? అని, పని పాట లేక కూర్చున్నవాడు కాన ఉమాపతిని ఒంటరిగా వదలి కన్నప్ప పోయెనని యేడ్చెనో? అని పరి పరి విధముల విత ర్కించెను. అనేక సందేహములు కలుగుట వలన నిది వితర్కము. కన్నప్ప

నిర్మల హృదయము, అతడు వెలిబుచ్చిన సందేహములు అతని ముగ్ధత్వము నకు వన్నె తెచ్చినవి. అతనిలోని స్నేహ భావము పెల్లుబికినది. తనవంటి దాసుని దోషమే ఈశుని కన్నీటికి కారణమని తలపోసెను.

శివుని కౌగిట చేర్చుకొని, అప్పళించి, అనునయించి ఈశుని బాధ తన బాధగా పొందిన కన్నప్ప చేష్టలు, ఆ సన్నివేశము మన మనసులకు హత్తుకొను నట్లు చిత్రించెను.

'నాయట్టి పుత్రుండు కలుగ నీకేల యప్పాలఱ్ఱుబుంగ' బ.పు;పు. 84

'ఊరకో నా యన్న! యూరకో నా స్వామి! యూరకింతేల'

బ. పు. పు. 84.

'ఉమ్మలికము తగదుడుగవే' అను యొమ్మున నేత్రోకములట్లొత్తు'

బ. పు. 84.

బిడ్డ బాధపడుట చూచి భరించలేని తల్లి యారాటము ఆవేదన ఇందు కాననగును.

పరమశివుడు కంటిలోని నలుసువలన కన్నీరు కార్చుచున్నాడని తలచి కనుఱెప్పయెత్తి ఊదిఊది నాలుక గ్రుడ్డుపై త్రిప్పి త్రిప్పి వస్త్రముతో కన్నీరు తుడిచితుడిచి-

'నెట్టును నేత్రాశ్రులెడతెగకున్న
నెట్టనదుఃఖించి బిట్టువాచఱచు
నడుగులఁబడి మ్రొక్కునంజలియొగ్గు
నడలు నిల్చును నిల్వఁబడులేచుఁజూచుఁ
'కటకటా!' యనుచు లింగముఁ జుట్టిచుట్టి
యటయిటయేఁగుచు నాత్మలోపలను' బ. పు. పు. 84.

మిగుల వగచెను. దైన్యముతో నడుగులబడిమ్రొక్కి అంజలి ఘటించు, ఒక కంటనే కారుచున్న కన్నీటికి కారణము తెలియక యవి ఆనందబాష్పము లనుట కవకాశములేదని, ఆననమున ఆనందము తోపదని, ఉష్ణజలములుకాన కారుణ్యజలములు కావని, ఘర్మజల మనుకొందమన్న కన్నులలోనే ఘర్మజల మేల స్రవించునని మరి దుఃఖమువలన అనిభావించిన ఒక కంటిలోనే కారుట యెట్లని పెక్కుసందేహముల తరువాత నది అక్షరోగముగా నిర్ణయించుకొనెను.

పెక్కుసందేహములను వెలిబుచ్చుటవలన నిది వితర్కము. ఈ సంచారి భావముతో స్థాయిభావము పరిపుష్టమైనది.

అది అక్షిరోగమో, కోడిరెప్ప పెరిగినదో, తడికంటివిధమో, నొవ్వియో, పొరగప్పెనో, మాదతెవులో, పువుకంటిపోటో, మయిలపడినదో, దుర్మాంస దోషంబో అని పెక్కు సందేహములను వెలిపుచ్చి, మందు మాకు తెలియని అమాయకుడు కాన యేమి చేయలేని సేవకుడుగా ముక్కంటి కన్నీరు చూచి కన్నప్ప పొందిన బాధ మన మనసులను కదిలించి వేయును.

'దీనికి మందుమాఁకే నేమెఱుంగ
నా యన్న! నా తండ్రి! నా యిష్టసఖుఁడ!
నా యయ్య! నా జియ్య! నా ప్రాణనాథ!
సర్వాంగసుందర! శంకర!' బ పు;పు. 85

అని పరి పరి విధముల వాపోయెను. ఏ విధములైన యుపాయములు లేమి కలిగిన భంగపాటును విషాదమనిరి ఆలంకారికులు. కన్నప్పకు కలిగిన విషాదము సోమనాథకవి చక్కగా వర్ణించెను.

'ముక్కంటివాఁడని మూఁడు లోకముల
నిక్కంబు వెఱతురు నిటలలోచనుఁడ!
యెన్నఁడు నీకొక్క భిన్నంబులేదు' బ.పు;పు. 85

సర్వ జగత్కల్యాణ కారణుడు, సర్వశక్తి సంపన్నుడు, సర్వేశ్వరుడు, అయిన నతనికి భిన్నము లేదని, ఎదురులేదని తెలిసియు ముగ్ధ భక్తుడైన కన్నప్ప, ముక్కంటి కన్నీరు చూచి కంటిరోగమని దైన్యము పొందుట పఠితలకా పాత్ర పట్ల సానుభూతి పెంచును.

'కంటిచిచ్చున మున్నుగాలినవారు
కంటి వార్తకు నికఁగనలరేమగుడ;
వినుమెంత గన్నుగానని వలపైన
వనిత లిట్లంగహీనునకుఁ జిక్కుదురె?
రూపింప నిట్లు కురూపివై యున్న
నేపారభక్తు 'లిహి' యని నగరె' బ.పు. పు. 85

విరూపాక్షుడు కురూపి యగునేమోయని స్వామి భక్తిపరాయణుడైన కన్నప్ప విలవిలలాడిపోవుచున్నాడు. కన్ను కానని వలపైన అంగహీనునకు వని తలు చిక్కరేమోయని దిగులుతో దుఃఖించుచున్నాడు. భక్తగణము ముందు భగవంతుడు భంగపాటు చెందునేమోయని ఆర్తిని భజించుచున్నాడు.

'కప్పెద నా లెస్సకంట నీ కన్ను
నాకన్న చూ మందు నీ కంటికనుచుఁ
జేకొని శరమున ఛేదించి పుచ్చి
కలకంఠు కంటిపైఁ గన్నప్పదేవుఁ
డతిముదిఁ దన నేత్రమర్పింపఁదడవ' బ.పు. పు. 85

నీలకంఠుని కంటిబాధ తీర్చుటకు తన కంటిని త్యాగముచేసిన దృఢ భక్తశిఖామణి కన్నప్ప. మందు లేక మరో మార్గము తెలియక మనసిజహరుని మనసు నెఱుంగు నుపాయములేక తనకుతోచిన విధముగా ప్రీతితో తన కన్ను నర్పించిన ధన్యమూర్తి కన్నప్ప. భగవంతునికొరకై కన్ను లర్పింపగల నిష్కామ భక్తులెందరు.

తన కన్ను ఫాలాక్షుని నయనమగుట చూచి మిక్కిలి యుత్సాహము పొందిన వాడైన కన్నప్ప ప్రక్క కంటినుండి నీరుకారుట చూచి ఆ కంటికి కూడ తన మిగిలిన కన్నే మందని తలచి తన చెప్పు కాలితో కన్నీరు కారు చున్న కంటిపై నుంగటము గుర్తుగా నుంచి శరముతో కన్ను తీయబోగా భక్తసులభుఁడు హసితాస్యుడై ప్రత్యక్షమై అనుగ్రహించెను.

కన్నప్ప ముగ్ధభక్తి మనలను ముగ్ధులను చేయకమానదు. అంతకాంత కుని ఆనందింపజేసి అనుగ్రహము పడసిన ధన్యజీవి కన్నప్ప. జ్ఞానులు మునులు అహర్నిశలు భక్తితో సేవలు చేయుచు, ధ్యానించుచు, కీర్తించుచు, శరీరము శుష్కింపజేసికొనుచు తపస్సు చేయుచు, భగవద్దర్శనము పొందలేక మిగుల దుఃఖించిన వారెందరో కలరు. కాని కన్ను లర్పించి భగవదను గ్రహము పొందిన కన్నప్ప ముగ్ధభక్తికి కన్నప్ప భక్తియే సాటి.

## సఖ్యభక్తి : (ప్రేయోభక్తిరసము)

నిర్గుణ బ్రహ్మమును సగుణ బ్రహ్మముగా భావించుట మౌగ్ధ్యము. నిరాకారుడైన పరమాత్మను మానవాకృతిలోగాని మానవతీతాకృతిలోగాని భావించి భజించి లౌకిక రాగాలను స్నేహానురాగాలను దైవసమర్పితము చేసి అంతులేని ఆత్మానందము పొందు లక్షణము ముగ్ధభక్తిలో కాననగును.

లోకములో స్నేహాది భావములే ఉదాత్తమైనవి. అవి భగవదర్పితము లైన మరెంతయో ఉదాత్తమగును. పరమేశ్వరుని భగవంతుడని యెఱిగియు స్నేహితునిగ, అప్తునిగ భావించి యతనికి సంరక్షకులు లేరని యూహించి ఆ పరాత్పరుని ఆపదలనుండి రక్షించు భారము తనదిగా వహించు అజ్ఞానముతో సాత్త్వికాహంకార మమకారములతో కూడికొన్న రాజస ముగ్ధభక్తి రుద్రపశుపతి కథలో కాననగును.

ఆది పురాణము చెప్పు కథకుడు క్షీరసాగరమథన వృత్తాంతమును వివరించుచు బ్రహ్మాది దేవతలు పారిపోగా అజాండమునెల్ల దరికొని గాల్చు గరళము శంకరుడు మ్రింగెనని చెప్పగా విని రుద్రపశుపతి యుల్కిపడి నేలపడి పొర్లిపొర్లి రోదించెను. విశ్వేశుడు విషము త్రాగిన వెఱ్ఱివాడని వాపోయెను.

'విని యుల్కిపడి పీఁపు విఱిగి హా! చెడితి
నని నేలఁబడి పొర్లి యక్కటా! నిన్ను
వెఱ్ఱిఁజేసిరిగాక! విశ్వేశ! యెట్టి
వెఱ్ఱివారైనను విషముఁ ద్రావుదురె ?
బ్రదుకుదురె? విషముపాలైనవార ?
లిది యెట్లు వినవచ్చు; నేమి సేయుదును?
నిక్కమెవ్విధమున నిన్నెకానె (కె?) ఱుఁగ
ముక్కంటి నాకింక దిక్కెవ్వరయ్య?' బ. పు; పు. 64.

అని రోదించెను. కారణంబులకెల్ల కారణంబయిన వానిని కాలకూట విషము సృష్టించినవాని హరించినవాని హరుని శక్తిసామర్థ్యములు తెలియక రుద్రపశుపతి విశ్వేశుడు విషము మ్రింగెనని విని హతాశుడయ్యెను.

'ముక్కంటి నాకింక దిక్కెవ్వరయ్యా' యని అతి దీనముగా రోదించుచు పలికిన పలుకులు పఠితల హృదయములు కదిలించక మానవు. అసమర్థులై పారిపోయిన బ్రహ్మాదిదేవతలు తెలివిగలవారు. అజాండము గాల్చు గరళము మ్రింగి జగత్తును రక్షించిన సర్వలోకైక రక్షకుడైన ఫణిభూషణుడు వెఱ్ఱివాడు. మహేశునిగాక మరొకదేవుని కొలువని రుద్రపశుపతి రుద్రుని స్నేహితునివలె ఆప్తునివలె తలచి భగవంతుని ఆపదనుండి యెట్లు కాపాడవలెనను ఆవేదనతో—

'నా కొఱకైనఁ బినాకి! యివ్విషము
చేకొనకుమియవే నీకు మ్రొక్కెదను
కటకటా! మేన సగంబున నుండి
యెటవోయితవ్వ! నీవెఱుఁగవే గౌరి!
ప్రమథగణములార! పరమాప్తులార!
సమసిన వెండి మీశక్యమే కావ?
శతరుద్రులార! యసంఖ్యాతులార!
క్షితిధర కన్యకాపతిఁ గావరయ్య!
వీరభద్రయ్యరో! విషము బ్రాణేశుఁ
డారగించె నిఁకెట్టులవునో కదయ్య!
ఓ పురాతనులార! యెదయుండు బ్రదుక
నోపునొకో! విషంబొగి నారగించెఁ
జావుదప్పింపరే సద్గురనాథు
దీవనలీయరే కావరే శివునిఁ
దల్లిలేని ప్రజలఁ దలఁతురే యొరులు
తల్లియున్న విషముఁ ద్రావనేలిచ్చు!' బ.పు; పు.64

అని పరిపరి విధముల వాపోయెను. కాలకూటము కాలకంఠుని కాపద కలిగించలేదని తెలియని అమాయకుడు. మేన సగంబున నుండి గౌరి యెందు కావలేదని యాక్షేపించెను. రుద్రునివలన కాపాడబడుచున్న శతరుద్రులను రుద్రుని కాపాడుమని వేడిన అజ్ఞాని. క్షితిధర కన్యకాపతి లోకరక్షకుడని

తెలిసియు ఆ క్షణములో వివేకము కోల్పోయిన రుద్రపశుపతి పశుపతి విషమార గించెనని దానివలన యెట్టి విపరీతము పుట్టునోయని విలవిలలాడెను.

'సమసిన వెండిమీశక్యమే కావ!' - ఈశుడు మరణించిన తిరిగి బ్రతి కించుట యెవనితరము? శివుని కంఠమందున్న విషము ఉదరము చేరక మాన దని అది హరుని హరించకపోదని ఊహించి యుల్కిపడెను.

'సందేహాద్య నంతరం జాయమాన ఊహావితర్కః'73 - సందేహాదులు కలిగిన తరువాత పుట్టిన యూహ వితర్కమని యాలంకారికుల యభి ప్రాయము. శివుని కంఠమున కాలకూటమున్నది అని విన్న క్షణమునుండి రుద్రపశుపతి మనసులో కలిగిన భయసందేహాల కంతులేదు. చివరకు ముక్కంటి మరణము తథ్యమని తలపోసెను. ఆ భావన భరించలేక విలవిలలాడిపోయెను. వితర్కమను సంచారి భావమువలన స్థాయి చక్కగా పోషింపబడినది.

రుద్రపశుపతి పశుపతిని రక్షింప తాను అసమర్థుడని దైన్యముతో ప్రమథగణములతో శతరుద్రులతో భగవంతుని రక్షింపుమని వేడెను. "దుఃఖ దారిద్ర్యాపరాధాది జనిత స్వాపకర్ష భాషణాది హేతుశ్చిత్తవృత్తి విశేషో దైన్యం"74 – దుఃఖము, దారిద్ర్యము, అపరాధము మొదలగువానివలన జనించిన స్వాపకర్షము సూచించు సంభాషణకు కారణభూతమగు చిత్తవృత్తి దైన్యమని తెలియుచున్నది.

రుద్రపశుపతి అతి దీనముగా 'చావు తప్పింపరే సద్గురునాథు' 'దీవన లీయరే కావరేశివుని' 'తల్లిలేని ప్రజల తలంతురే యొరులు'- అను దుఃఖించుట పఠితలకాపాత్ర మౌగ్ధ్యముపట్ల సానుభూతి కలిగి, యతని అమాయకభక్తికి మనసు ఆర్ద్రమగును. దీనాతిదీనమైన రుద్రపశుపతి పలుకులు మనసును కదలించును.

'పినాకీయివ్విషము చేకొనకుమియవే' 'నీకు మ్రొక్కెద' అనుటలో రుద్రుని రక్షించుకొనుటకతడు పడుచున్న యారాటము, ఆలస్యమైన నేమగునో నను తడబాటు ఇందు కానగును.

'అనర్థాతిశయ జనితా చిత్తస్య సంభ్రమాఖ్యా వృత్తిరావేగః అనర్థాతిశయము వలన జనించిన మనస్సంభ్రమమను పేరుగల చిత్త యావేగము.

కాలకూటము గళముజారిన కలికంతున కేమగునో యను భయ ననర్థమును శంకించుటవలన అతనిలో కలిగిన యావేగము పాల్కురికి నాథుడు అత్యంత సహజసుందరముగా చిత్రించెను. ఇట్టి సంచారి భావ స్థాయిభావము వరిపుష్టముగా పోషింపబడినది.

ప్రమాదము తెలియని పసిపాప నిప్పును పట్టుకొనుటకు పోవుచ దూరమునుండి చూచిన తల్లి ఆ క్షణమున నిందించి రక్షించుకొనలేనని పావకునకు నమస్కరించి ప్రసన్నునిగ చేసికొని ఆపదనుండి కాపాడుక కెట్లు ప్రయత్నించునో రుద్రపశుపతి పొందిన యావేదన మనక తోచును. ముక్కంటికే కష్టము కలిగిన తనకింక దిక్కెవ్వరని రోదించెన

తల్లిలేని తనయుడుకాన వారించువారులేక విషము ద్రాగెనని స్నేహానురాగములతో గిరిజారమణుని రక్షించుకొనవలెనని తలచెను. ఆ మియుమని వేడివేడి విరూపాక్షుడు వినిపించుకొనకపోవుటతో మృత్యుంజ మరణము తాను చూడలేనని ప్రాణములు విడుచుట కుద్యుక్తుడై ఘనజలా మున నురికెను.

"యత్ర స్థావర లింగానా మపాయః పరివర్తతే
అథవా శివభక్తానాం శివలాంఛనధారిణమ్॥
తత్రప్రాణాన్విహాయాపి పరిహారం సమాచరేత్
శివార్థం ముక్తజీవశ్చేచ్ఛివసాయుజ్యమాప్నుయాత్॥'[76]

స్థావరలింగముల కపాయము సంభవించిన, శివచిహ్నధరులైన భక్తుల కపాయము కలిగిన, తన ప్రాణములను విడచుటకైన శివభక్తుడు సి పరిహారము చేయవలెను. శివునికొఱకు ప్రాణములు విడుచువానికి సాయుజ్యమే కలుగును—

అని వీరశైవ ధర్మములు బోధించుచున్నవి. రుద్రపశుపతి ఈ కలుగనున్న యాపదనూహించి తన ప్రాణములను త్యజించుటకే నిశ్చయిం కొనెను. కాని, యతని ముగ్ధభక్త్యావేశమునకు ముగ్ధుడైన హరుడు పా

సమేతముగా ప్రత్యక్షమై 'అడుగుము నీకు వరమిత్తు నెయ్యదివాంఛితంబనగ' కడు సంభ్రమమున రుద్రపశుపతి ఉమాపతి పాదాబ్జములకు నమస్కరించి యే కోరికయు తనకు లేదని గ్రక్కున కాలకూట మమియుమని కోరెను.

అతినిష్ఠాగరిష్ఠులగు యోగులకు, అహర్నిశలు ఆ పరాత్పరుని ప్రాపకమునకు ప్రాకులాడెడి మహాత్ములకు సహితము అలవికానిది పరమేశ్వర సాక్షాత్కారము, లోకరక్షకుని రక్షణభారము తనదిగా భావించిన వెఱ్ఱివానికి శివశక్తిని శంకించిన అమాయకునకు మృత్యుంజయుడు మృత్యువాతపడునని తలచిన మూఢునకు ముగ్ధభక్తి వలన మారారి దర్శనభాగ్యము కలిగినది.

శివునాజ్ఞలేనిదే చీమయైన కుట్టదను విశ్వాసము కలవాడయ్యు విషము మూలముగా విరూపాక్షునకేమి విపత్తు కలుగునోయని కలవరపాటు చెందిన రుద్రపశుపతి మౌగ్ధ్యముపట్ల సానుభూతి కలుగుటయేకాక శితికంఠుని పట్ల యతనికున్న స్నేహమాధుర్యము మనలను ముగ్ధులను జేయును.

"ఇట లోకములలోన నెన్న నేకాక
యట మింగ నుమియక నదియెంత పెద్ద
యణుమాత్ర నా కంఠమందుఁ జిక్కినది
గణుతింప నున్నదే కాలకూటంబు
యింత సంతాపింపనేల నీ"కనుచు
వింతనవ్వోలయంగ సంతరించుడును
"నమ్మంగఁజాలఁ బినాకి యివ్విషము
గ్రమ్మననొక్కింత గడుపు సొచ్చినను
బెద్దయుఁ బుట్టునో పిమ్మటి వార్త
దద్దయువిననోపఁ దామున్న చత్తు
సమయనిమ్మొండేనిఁజావనవేని
యుమియు మివ్విషమొండె నొండు సెప్పకుము
తక్కిన మాటలు దనకింప" వనుచు - బ.పు; పు. 64

పలికెను. జగత్కారకుడని తాను నమ్మినవాడు, అత్యంతానురక్తుడై తాను కొల్చువాడు, ఇలవేల్పు, ఇష్ట దైవము తానేవచ్చి అణుమాత్రమున్నదని

కాలకూటమువలన తనకెట్టి ముప్పు కలుగదని నమ్మకము క
పలికెను. నమ్మక, విష మిమియుట కష్టపడదేని తనను చావనిమ
ముగా పలికినాడు.

'ఉమియకుండినఁజచ్చునోముగ్ధ యనుచు
నుమబోటి యాత్మలో నుత్తలపడగ
నుమిసినఁగాని కాల్చునోతమ్మ"ననుచుఁ
గమలాక్ష ముఖ్యులు గడగడ వడకఁ
బ్రమథు లాతని ముగ్ధభక్తికి మెచ్చి
యమిత మహోత్సవులై చూచుచుండ
నొక్కింత నవ్వుచు నుడురాజధరుఁడు
గ్రక్కున లేనెత్తి కౌఁగిటఁ జేర్చి
ప్రమథులయాన నీ పాదంబులాన
సమయ నిర్విషమున సత్యమిట్లనిన
నమ్మవే వలపరి నా తొడ యెక్కి
నెమ్మిఁజూచుచునుండు నీలకంఠంబు" బ.

అని యూరు పీఠంబునందు ధరించె. మంగళగౌరి సహితము
స్థిరభక్తికి నిశ్చేష్టయయ్యెను. వామదేవుడు విష ముమియకున్న
త్రైన ఆరుద్రపతి యెట్టి సాహసమునకు పాలుపడునోయని తత్తర
నది. భక్తజనవత్సలుడు, భూతేశుడు, భక్తుని సంరక్షింప విష ముమి
బోవు ప్రమాదమూహించి ప్రజాపతి ముఖ్యులు పరితపించిరట, గ
కరుణాంతరంగుడై తన కంఠము చూచుచుండుమని తన యూరు
ధరించి రుద్రపశుపతిని తరింపజేసెను.

'కుత్తుక హాలాహలము కదలినంతటనే చచ్చెదగాక' ం
కరవాలము ఝొమ్మునదూసి మోపికొని కఱకంఠుని కంఠమునే క
చూచుచు రుద్ర పశుపతి నేడును పశుపతి తొడపై ఉన్నాడ
నిర్మల నిశ్చల భక్తి మన కాశ్చర్యము కలిగించక మానదు. రుద్రః
స్నేహమాధుర్య ముప్పొంగు ముగ్ధభక్తిలో వీరభక్తియను శాఖకు
యలరారుచున్నది.

## వాత్సల్యభక్తి

తత్వపరముగా భగవంతు డభవుడు, అమేయుడు, నిర్గుణుడు. అట్టి నిర్గుణుడు సగుణత్వము పొందినపుడు భౌతికమైన మాతాపితృ సంబంధము లుండుట సహజము. శివతత్వ ముపాసించినను భగవంతుని రూపము పొడ గన్న భౌతిక రూపమునకే ప్రాధాన్యమిచ్చు భక్తి ముగ్ధభక్తి, భగవంతుని బిడ్డగా లాలించి ప్రేమించి తరించు భక్తియే వాత్సల్యభక్తి, పరమేశుని పసి బిడ్డగా భావించుట మౌగ్ధ్యము. కాని భక్తుల కావాత్సల్యభక్తియందు భగవ ద్రతి స్థాయిగా భాసించును. అవ్యయుడు, అనంతశక్తిధరుడు, ఈశుడు అను విషయము తెలిసియు బెజ్జమహాదేవి వాత్సల్యభక్తి దిక్పాలకపాలకుడు దిక్కులేనివారికి దిక్కైన ఆ మహేశుని దిక్కులేనివానిగా తలపోసి తల్లడ మందినది.

'ఎల్లనియోగంబు లెల్ల బాంధవులు
నెల్లవారలు గల్గ నిట్లు భర్గునకుఁ
దల్లిలేకుండుట దావిచిత్రంబు
తల్లిలేకది యెట్లు దానుయించె?
దల్లి సచ్చెనొ తాక త్రైలోక్యపతికిఁ
జెల్లఁబో! యిట్లేమి సేయంగవచ్చుఁ?' బ. పు; పు. 66.

వాత్సల్యభక్తికి భగవంతుడు, అతని గురువులు, తల్లిదండ్రులు ఆలంబన విభావములు. ఇట పెంచిన తల్లియు ఆలంబన విభావమగుట కవకాశము కలదు. బెజ్జమహాదేవి హృదయమున పెల్లుబిన వాత్సల్య స్రవంతి పఠితల హృదయము లార్ద్రమగునట్లు చేసినది. భక్తిరస పరవశుడై పాల్కురికి సోమనాథకవి పాఠ కుల మనః ఫలకములపై పాత్రల స్వభావములు హత్తుకొనునట్లు చిత్రించుటలో నతడు చూపించిన నైపుణ్య మనన్య సామాన్యము.

శ్రీ బండారు తమ్మయ్య ఈతని రచనలను గూర్చి పలికిన పలుకులివి: 'పాత్రముల ముగ్ధత్వమును ప్రదర్శించుటలో నీతఁ డెంతయుఁ బ్రతిజ్ఞా వంతుఁడు, ఇట్టి పట్టుల నీతఁడు సరసతరముగ ముద్దు మురిపెముల గురియు జాను తెనుఁగు పదముల జాలువార్చి వారి ముగ్ధతనమును

గన్నులఁ గట్టినట్లు చిత్రించి పాఠకుల విముగ్ధులఁ గావించును. బసవ పురాణమునఁ తృతీయాశ్వాసమందలి రుద్రపశుపతి, బెజ్జమహాదేవి, గొడగూచి, ముగ్ధసంగయ్య, కన్నప్ప మున్నగు ముగ్ధభక్తుల చరితముఁ బరికించిన నీ యంశము తేటపడును.'77

తల్లిలేని తనయునిగా తలపోసి తల్లడమందినదా తల్లి మనసు. పాత్రల ముగ్ధత్వము ప్రదర్శించుటలో ప్రతిభావంతుడైన పాల్కురికి సోమనాథుడు బెజ్జ మహాదేవి వాత్సల్యము కన్నులకు కట్టునట్లు మనసుకు హత్తుకొనునట్లు చిత్రీక రించెను.

వాత్సల్యభక్తికి కౌమారాది వయోరూపవేషశైశవ చపలతా స్మితలీల లుద్దీపన విభావములు. బెజ్జమహాదేవి తల్లిలేని తనయునిగా భావించి తన యిష్ట లింగమును గూర్చిన పలుకులు పఠితల హృదయములపై శాశ్వత ముద్ర వేయును.

'తల్లిగల్గిననేల తపసిగానిచ్చుఁ
దల్లిగల్గిననేల తలజడల్గట్టు
దల్లియున్న విషంబుఁ ద్రావనేలిచ్చుఁ?
దల్లియుండినఁ దోళ్ళు దాల్పనేలిచ్చుఁ?
దల్లి పాములనేల ధరియింపనిచ్చుఁ?
దల్లి బూడిదయేల తాఁబూయనిచ్చుఁ?
దల్లి పుచ్చునెభువిఁద నయునిఁదిరియఁ?
దల్లి పుచ్చునె సుతువల్లకాటికిని' బ. పు; పు. 66, 67.

అని సర్పహారివేషమున కావేదన చెంది జగద్రక్షకునకు ఆలనపాలన లేదని ఆరాటపడిన దామగువ మనసు. దివ్యగుణ సనాథుని మహిమలను ఆ నాథుని దీనావస్థలుగా నూహించి ఆక్రోశించినది బెజ్జమహాదేవి.

సామాన్యముగా లోకములో జ్ఞానుల దృష్టి ననుసరించి తపసి యగుట తలలు జడలు కట్టుట మున్నగునవి యుత్తమ లక్షణములే. కాని ముగ్ధభక్తు రాలైన బెజ్జమహాదేవి కన్నతల్లివంటి కరుణాదృష్టితో పసిని తల్లి పోషణలేని

భానికి కలుగువానికి కలుగు లక్షణములుగా భావించి విచారించినది. జ్ఞానుల దృష్టి ననుసరించి తలలు జడలు కట్టుట మున్నగున వెట్లు భాసించదగునో గమనింపదగినవి:

తలలు జడలుగట్టుట - తపసిలక్షణము
తోళ్ళు దాల్చుట - పశుపతిత్వమునకు గుర్తు
సర్పములు ధరించుట - ప్రజ్ఞాపారీణత్వమునకు ప్రతీక
బూడిద పూసికొనుట - కామరాహిత్యమునకు
భగవద్విభూతికి చిహ్నము
దేశద్రిమ్మరి యగుట - విశ్వవ్యాపకత్వమును తెలియజేయుట
వల్లకాటిలో వాసమేర్పరచుకొనుట - లయకారుడు
మృత్యుంజయుడని తెలియజేయుట

కాని మమకారములు కురిపించు మాతృమూర్తి కరువైనందువలనల శివుని తలలు జడలు గట్టెననియు, అతడు విషము త్రాగెననియు, తోళ్ళను దాల్చె ననియు, పాములను ధరించెననియు దేశసంచారి యయ్యెననియు, వల్లకాటిలో నాసమేర్పరచుకొనె ననియు విలవిలలాడినది బెజ్జమహాదేవి మనసు. పరమాత్మను పసిపాపగా భావించి తన బాధలవంటివే భర్గుని బాధలని తలంచిన ఆమె మౌగ్ధ్యముపట్ల పఠితలకు సానుభూతి కలుగును. లౌకికమైన స్నేహాను రాగాలను భగవదర్పితము గావించి భగవంతుని భజించు ఆ నిర్మల హృదయముతో మనము సహానుభూతిని పొందుదుము. అమాయకమైన ఆమె హృదయమునందు కలిగిన కలవరపాటు భావము మన మనసులను ఆర్ద్రమగునట్లు చేయును. బెజ్జ మహాదేవి స్త్రీ సహజమైన మాతృభావముతో శివుని శిశువుగ లాలించి వాత్సల్యామృత ధారలను కురిపించినది.

'నైరంతర్యేణ సంపన్నే భావే ధ్యాతుం శివంప్రతి .
తద్భావోజాయతే యద్వత్ కీటే భ్రమరచింతనాత్॥'
సి. శి. పరి. 16. శ్లో 22.

తుమ్మెదచే తీసికొనిరాబడి మంటిపట్టు యందుంచబడిన పురుగు సదా ఆ తుమ్మెదనే స్మరించుచుండుటచేత తాను కొన్ని దినములకు తుమ్మెదగానే మాఱునటుల నిరంతరము శివుని ధ్యానించు మనసు శివస్వరూపమే యగును.

బెజ్జమహాదేవియు నిరంతరము శివునే ధ్యానించుచు సర్వము శివమయముగా భావించినది. తాను కళ్ళతో చూచుచున్నది పసిపాపని రూపములో పరమేశ్వరుని.

'తవిలి లింగముఁజూడఁ దాఁ జూచురూపు
వివరించి లింగంబు వినవినుధ్వనులు
సొరిదిలింగము సోఁక సోఁకు స్పర్శనముఁ
బరమలింగము భుజింప భుజించు నవియు
నెగడి లింగంబు ఘ్రాణింప ఘ్రాణించుఁ
దగలింగదృష్టిచేఁ దాద్రష్టయగును
సరినిట్లుప్రాణైక సహచరుండగుచుఁ
జరియించు భక్తుండు సర్వాంగలింగ
ప్రాణాంగములు దనప్రాణలింగంబు
ప్రాణాంగములుగాఁగ నమరించి చేష్ట
లును లింగమందుఁ గీల్కొలిపి తానంత
యును లింగమయమయియుండు నాశరణు
నేమని మది నిర్ణయింతుఁ గీర్తింతు
నా మహాత్ముని యుపమాతీతమూర్తిఁ
జడ బుద్బుదము నీట సమసిన యట్లు
వడగండ్లు నీటిలో వర్షించు నట్లు
కాఁకల నింగిలీకము రసమైన
జోకఁగాష్ఠములగ్గి సోఁకి తామగ్ని
యైనట్లు లింగంబునందైన తనువుఁ
దాను లింగక్రియఁదగ లింగమయ్యెఁ
మదినెవ్వఁడెయ్యది మఱిగి ధ్యానించు
నదియైవాక్కున వెళ్ళనాడుచునుండు

నదియకర్మంబుచే నలరింపుచుండు
విదితంబుగా నిది వేదవాక్యంబు.'78

'యద్భావమ్ తద్భవతి' యనునట్లు భక్తులు భగవంతు నేరూపమున భావించి ధ్యానించి పూజించి సేవించిన భగవంతు డారూపముననే వారిని సంతోష పెట్టుననుట కిది ప్రత్యక్ష సాక్ష్యము.

'శ్రుతి'యేక యేవహి రూపేణ' యనియు
స్మృతి 'సాధక స్సంస్మరేత్సదా' యనియు
ధర 'తస్య తన్మయ తాం యాతి' యనియు
హరుని వాక్యము'79

తాను ధరించిన లింగమే ప్రాణలింగము. ప్రాణలింగములో భావన చేయుచున్నది శివరూపము. ధ్యానము చేయుచున్నది శివరూపమును. ఆ ధ్యానములో ఆ భావనలో భగవద్రూపరతి స్థాయిగా పోషింపబడుచున్నది.

'తొంగిళ్ళపైనిడి లింగమూర్తికిని
సంగనగావించు నభ్యంజనంబు
ముక్కొత్తుఁ జెక్కొత్తు ముక్కన్నుఁ బులుము
నక్కొత్తుఁ గడుపొత్తునట వీపునివురుఁ
.... .... .... ....
జెక్కిలిగిఁటుడుఁ జెలగి యేడ్వంగ
నాక్కవేలిడి పోయు నొక కొన్నిపాలు' బ.పు; పు. 67

జగత్పితకు జననియై మాతృవాత్సల్యము కురిపించినది బెజ్జమహాదేవి. ముక్కంటిని ముద్దులకుమారునిగ భావించినది. దిక్కులేని బాలునకు దిక్కై నిలిచెదననుకొనినది. దిగంతముల వరకు వ్యాపించినవాడని తెలియక శిరమున గంగను ధరించిన భర్గునకు అంగన అభ్యంగనము గావించుట యెంతవెఱ్ఱి. లోకపాలకుని చెక్కిలిగిటి యేడువగా ఒక వేలు నోటిలో పెట్టి పాలు పట్టుట యెంత అమాయకము. బాలునిగా భావించుచునే భగవంతుని సేవించుచున్న

ఆ పాత్రయందు భక్తులకు భగవద్రూపరతి పొంగులు వారుచున్నది. ఆ ముద్దరాలి భగవద్రూపరతి మనకు సహానుభూతిని కలుగజేయుచున్నది. 'కడవ నంటినయట్టి పిడుక విభూతి'ని పుత్రుని నొసలారంగ పూసినది బెజ్జమహాదేవి.

వీరశైవులకు భస్మధారణము విధి. ఐదు కారణములచే ఈ బూదికి ఐదు పేర్లు కలిగినవి. అష్టవిధ ఐశ్వర్యములను నిచ్చుగాన విభూతియనియు, శివత్వమును భాసింపజేయునదిగాన భసితమనియు, పాపములను భర్త్సించుటచే (భయపెట్టుటచే) భస్మమనియు, ఆపదలను క్షరణము చేయుటచే క్షారమనియు, భూతప్రేతాదులనుండి రక్షించునదిగాన రక్షయనియు ఐదు పేళ్ళతో వెలయుచున్నది.

'విభూతిర్భూతి హేతుత్వాద్భసితం తత్త్వ భాసనాత్
పాపానాం భర్త్సనాద్భస్మ క్షారణాత్ క్షారమాపదాం
రక్షణాత్సర్వభూతేభ్యోరక్షేతిపరిగీయతే॥'[80]

సకల భువన భాండములను తన యుదరమునందిడుకొనిన ఆ పరమేశ్వరునకు తన యుదరమును పాన్పుగా చేసిన ముగ్ధభక్తురాలు బెజ్జమహాదేవి. లయకారునకు జోలపాడిన అమాయకురాలు.

పడతి నిశ్చల భావమునకు మెచ్చిన ఆ జగద్రక్షకుడు పాపనిరూపమున నామె నెడబాయకుండెను. వనిత వాత్సల్య భక్తికి మెచ్చి అనుగ్రహింపదలచి పరమేశుడు కదలక మెదలక కన్ను తెరవకయుండెను. ఆ క్షణమున ఆమె పడిన ఆరాట మింతింతకాదు.

'నాకున్న! నాపట్టి! నా చిన్నపడుగ!
నాకుట్టి! చన్నేలరాకుడ్వవైతి
నీ చెమటయుఁజూచి నెత్తురునవుదు
నోచెల్ల! యెటుసూడనోపుదునన్న!
తల్లిఁగదన్న! యింతటి కోర్తునన్న!
ఎల్లెడ నాళుల నేనెఱుఁగఁ గదన్న!

కలిగితి లేక యొక్కఁడవు గదన్న!
తలరక యేనెట్లు ధరియింతునన్న!
నేలపై నా కాళ్ళు నిలువవురన్న!
ఏలపల్కవు సెప్పవే యన్న! నీకు
నలిమియో? కోపమో? యంగిటిముల్లో!
ఏఱుఁగను మందు మ్రాఁకేమియు" ననుచు
బసవుఁ బలవరించుఁ బయిఁబడి పొరలుఁ
గనుఁగొను మైపుడుకఁ గౌఁగిటఁజేర్చుఁ
గప్పఁ దెఱచుఁ గప్పఁగ్రమ్మఱఁ దెఱచుఁ
దప్పక వీక్షించుఁ దల్లడంబందు" బ.పు. పు. 68

కన్న ప్రేమకన్న పెంచిన ప్రేమ మిన్నయనట కిదొక చక్కని దృష్టాంతము. తల్లికనుక తనయునకిట్టి బాధ కలుగుటచూచి భరించలేకున్నది. కప్పును తెరచును మరల కప్పును వెంటనే తెరచును. పసివాడు పలుకక పోవుటకు కారణము తెలియక కాళ్ళు నేలపై నిలువక మందుమాకేమియు తెలియదన్న ఆవేదనతో తల్లి మనసు విలవిలలాడినది. బెజ్జమహాదేవి చింతను కవి చక్కగా వర్ణించెను.

'ఇష్టా ప్రాప్తనిష్ట ప్రాప్త్యాది జనతాఽధ్యానాపరపర్యాయా వైవర్ణ్య భూలేఖన, అధోముఖత్వాది హేతుశ్చిత్త వృత్తి విశేషశ్చింతా'81

ఇష్టము లభింపకుండుట, అనిష్టము వచ్చిపడుట మొదలగువానివలన జనించినట్టియు, ఆధ్యానమను నామాంతరము కలిగినట్టియు, వైవర్ణ్యము, భూలేఖనము, అధోముఖము మొదలగు వానిని కలిగించునట్టి చిత్తవృత్తి విశేషమే చింతయని యాలంకారికుల మతము.

ఇష్టార్థము సిద్ధింపకుండుట మొదలగునవి విభావములు. నిట్టూర్పులు, తలవాల్చుట, సంతాపము, స్మరణము, కృశించుట, దేహసంస్కారములు లేకుండుట, అధైర్యము మొదలగునవి యనుభావములు. చింతయను నీసంచారి భావమునకు ముందు వెనుకల వితర్కము కూడ జనియించును.

మందు మాకేమియు తానెరుగదని, కలకంఠుడు పలుకకపోవుటతో నేలపై కాళ్ళు నిలుచుట లేదని, అధైర్యముతో సంతాపముతో బెజ్జమహాదేవి దిగులు చెందినది. భక్తుల యిళ్ళలో 'కొలది తప్పిన కుడుపులు' కుడుచుటవలననే అట్లయ్యేనేమో యని వితర్కము కూడ ఆమెలో కలిగినది. భక్తుల యిళ్ళలో భుజించినందు వలననే భగవంతు డట్లయ్యెనని ఆక్రోశించినది కాని తానుకూడ భక్తురాలనను విషయము మరచినదా (భక్తురాలు) ముద్దరాలు.

'పెట్టినంత గుడిచి యట్టుండితేని
యెప్పాట నినుఁబొందునె తెవుల్లొప్పి?
నిప్పునఁజెదలంటునే నీకు నీవ
చేసికొనఁగఁదెవుల్సద్దించెఁగాక
యీ సంకటంబు నీకేలతావచ్చుఁ' బ.పు;పు. 69

చంటిబిడ్డ రూపమున నున్న చంద్రశేఖరుని సేవించుచున్న జ్ఞానము కలదయ్యు అతనిచే సృష్టింపబడి అతని నారాధించు భక్తులు ఆరగింపు చేయగా అరగక ఆరాటపడుచున్నాడు ఆశ్రిత పరాత్పరుడని తలచిన ముగ్ధురాలు బెజ్జ మహాదేవి.

పాల్కురికి సోమనాథుని భక్తిరసావేశము అతని కవితయందంతట ప్రతిబింబించినది. భక్తిరసపూరితములైన సన్నివేశములందు పఠితలకు కూడ రసావేశము కలుగుట సహజము.

వాత్సల్యభక్తికి ఒజ్జబంతియైన బెజ్జమహాదేవి వత్సలభక్తి పారవశ్యమున భగవంతుని సహితము దండించుటకు వెనుకాడలేదు. అతని బాధను చూడలేక కుమిలికుమిలి యేడ్చినది. తనవాత్సల్యముతో భక్తవత్సలుని బంధించలేక పోయెనని వాపోయెను. భక్తులందరు తనవంటివారేనను స్పృహను కోలుపోయిన దా క్షణమున. మారారి మరణము తథ్యమని తలపోసినదా మందబుద్ధి. దైన్యముతో విషాదముతో పలికిన బెజ్జమహాదేవి పలుకులు పఠితల హృదయ ములను కరగించక మానవు.

'చాలఁజూడంగ నీసంకటం బింక
జాలుఁడ! నీమీఁదఁ బ్రాణములీడుతు
నని తన శిరమున కలుగ నున్నంత' బ. పు. పు. 69.

మరొక మార్గమెరుగని మాతృమూర్తి ప్రాణములు విడుచుటకు సిద్ధపడగా నతిదయామయుడు, గిరిజారమణుడు ప్రత్యక్షమై, ఆమె యభిమతమును తీర్చెదననెను. ఈశుని తప్ప నితరమెరుగని ఆ నిర్మల మాతృహృదయము 'నీవు నిరోగివై సుఖవ్యాప్తినుండు నా కంతియ చాలు' నన్నది. ఇట్టి కపట మెరుగని తీపిమమకారపు భావపరంపరలు పఠితల హృదయముల నార్ద్రము గావించును. జగదాధారునకు జన్మ నీయకున్నను జననియైన ముదితముగ్ధభక్తికి మెచ్చిన మహేశ్వరుడు నిత్యత్వ మాయమ్మకు నొసగి చరితార్థురాలిని గావించెను.

## గౌణభక్తి భేదములు - ముగ్ధభక్తి

రూపగోస్వామి భక్తి రసమును ముఖ్య గౌణరసములుగా విభజించి వివేచించెను. ఆ మార్గము ననుసరించి వీరశైవమునందలి భక్తిని కూడ ముఖ్య గౌణ భేదములుగా భావించి అనుశీలించుటకు అవకాశము కలదు. నవవిధరసములలో శాంతము శృంగారము తప్ప మిగిలినవి గౌణభక్తి భేదములని రూపగోస్వామి పేర్కొనెను. ముఖ్య గౌణరసములు పరస్పర పోషకములనియు ఒక్కొక్క సారి ముఖ్య భక్తిరసములచేత పరిపుష్టమైనచో గౌణభక్తి భేదములు కూడ రసస్థాయిని పొందవచ్చునని రూపగోస్వామి అభిప్రాయము. దీని ననుసరించి ముగ్ధ భక్తి సంప్రదాయమునందు కూడ గౌణభక్తి వివేచనము చేయుటకు నిచ్చట ప్రయత్నము చేయబడుచున్నది.

బసవ పురాణము నందలి భక్తుల చరిత్రములను పరిశీలించినచో గౌణ భక్తులన్నింటిలో అద్భుత భక్తి విశేషముగా పోషింపబడినట్లు తెలియుచున్నది. ఆ తరువాతి స్థానము వీర రౌద్రరసములకు చెందుచున్నది. వీనితో పోల్చినచో మిగిలిన గౌణరసములు విశేషముగా పోషింపబడలేదని స్పష్టమగుచున్నది. కావున మొదట అద్భుత భక్తిరసము, ఆపైన వీర రౌద్ర భక్తి భేదముల నను శీలించి, అవి ముగ్ధ భక్తిరసమున కెట్లు పుష్టిని చేకూర్చు చున్నవో పరిశీలింప నగుచున్నది. ఆ పైన మిగిలిన వానిని అనుశీలించుట యగుచున్నది.

## వీరభక్తిరసము :

'లోకోత్తరేషు కార్యేషు స్థేయాన్ప్రయత్నః ఉత్సాహః' 82

అని ప్రతాపరుద్ర యశోభూషణకర్తయైన విద్యానాథుడు వీరరసస్థాయి యైన ఉత్సాహమును నిర్వచించినాడు. గౌణరసముగా చెప్పబడుచున్న రసము వీరరసము. భగవద్రతిని ప్రకటించుటయందు లోకోత్తరకార్యమును ప్రదర్శించెడి ఉత్సాహప్రవృత్తి వీరభక్తి రసమునకు స్థాయిగా నుండును. అచ్యుత రాయలు తన సాహిత్య సారమునందు వీర రసమును నిరువదియొక్క భేదములుగా విశ్లేషించెను. అందు భక్తివీరము చిట్టచివరిది. 83

భక్తివీర లక్షణమునకును వీరభక్తి లక్షణమునకును భేదమంతగా కానరాదు. దానికిని దీనికిని ఆలంబన ఉద్దీపనాదులు సమముగా నుండుటయు గమనింపదగినది. అయినను భక్తవీరమునందు భక్తిచే పుష్టమైన వీరము భాసించును. వీరభక్తి రసము వీరముచే పోషింపబడిన భక్తి ముగ్ధభక్తికి పరిపోషకముగా నుండును. భక్తివీరము నవవిధ భక్తులలో నొకటి కావున నదిముఖ్య భక్తివంటిదే. వీరభక్తిరసము గౌణభక్తిగా సంవదింపబడును. బసవపురాణము నందలి ముగ్ధభక్తుల కథలయందు వీరభక్తిరసము గౌణరసముగా పోషింపబడిన విధము స్పష్టముగా తెలియుచున్నది.

బసవ పురాణమునందు వీర భక్తి రసమునకు ఆలవాలమైన కథలను నీ క్రిందివానిని పేర్కొనవచ్చును.

## వీరముగ్ధ భక్తుల కథలు

### దీపదకళియారు కథ :

కాంచీపురవాసియైన దీవదకళియారు దృఢభక్తియుతుడు. పొరుగూరికి పోవుచు జీర్ణశివాలయము నొకదానిని గాంచెను. సర్వజగద్రక్షకుడైన ఆ సర్వేశ్వరుడు ఒంటరిగా వనములో జీర్ణాలయమునందు వసించుటను చూచి యాతడు సహింపలేకపోయెను. అతని విచారమునకు కారణము శివునిపైగల అత్యంతమైన భగవద్రతి. జగద్రక్షకుడైనవాడు జీర్ణాలయమునందు పడియుండెనని భావించుట యతని మౌగ్ధ్యము. హరుని సేవింపదలచిన దీపదకళియారు

శివునకు కోట కట్టించెను. అద్భుతమైన యాకోటను జనులు కీర్తించిరి. అప్పటి కతని ధనమంతయు తరిగిపోయెను పరమేశ్వరునికి నిత్య సేవ కావింపవలయు నన్నచో మార్గము దొరకలేదు. బహువిధముల యత్నించి కవదివియలనాటించి అందు జ్వాల చల్లారకుండ శివార్చనము సేయుచుండెను. కవదివియలార కుండ నుంచుటకొఱకై పుడకలను పూరిపుడకలను సహితము వెచ్చించెను. కచ్చడము మొదలైన వస్త్రములన్నింటిని వినియోగించెను. అన్నియు అయి పోయినవి. అతడు వెనుకాడక తలవెంట్రుకలను దీపపు వత్తిగా వెలిగించెను. జడకు వెలిగించిన అగ్గి తలకుకూడ నంటుకొనెను కాని దీపదకళియారు మాత్రము శివుని సేవించుటలో వెనుకాడలేదు. తలవెంట్రుకలను సహితము దీపముగా వెలిగించెడి లోకోత్తర కార్యనిర్వహణమునందు నాతడు ప్రకటించిన ఉత్సాహము. ఇందు గమనించవలసిన అంశ మేమనగా నతని ఉత్సాహము భక్తికంగము. దీపదకళియారు ముగ్ధమైన భక్తిని పోషించుట కొఱకై యింతటి యుత్సాహము వర్ణింపబడినది. కథ అద్భుతముగా ముగియును. శివుడు ప్రత్య క్షమై వరము కోరుకొమ్మనగా తాను నిర్మించిన కోటతోసహా కైలాసమునకు వెడలి సుఖముగా మహేశ్వరుడు నివసింప వలయునని కోరుకొనెను ముగ్ధ భక్తుని మౌగ్ధ్యమిందు స్పష్టమగుచున్నది. జీర్ణ దేవాలయమునందున్న శివుడే తన హృదయమునందు నిలిచిన పరమేశ్వరుడు. అతనికి కోట కట్టి, కాపు పెట్టి నాడు. మరి సాక్షాచ్ఛివుడే ప్రత్యక్షమైనపుడు-

'లోకాశ్రితుఁడ! భక్తలోక కుటుంబి
యేకాకివై యుండుటిది నీతిగాదు
అనయంబు రజితాద్రి యట్టి దుర్గంబు
మనకుఁగల్గఁగ వేఁతేమన్నెముల్ సేసి
కొనియుండనేల యీ వనదుర్గమందు' బ.పు; పు. 75,76.

అని శివుని వేడుకొనినాడు. శివుడు కైలాసమునందును కోటయందును కలడని భావించినచో నతని సర్వవ్యాపకత్వము గుర్తించుట యయ్యెడిది. ఒక చోట నున్నవాడు మరియొక చోట నుండలేడను లౌకిక ధర్మమునే భావించి విశ్వవ్యాపకుడైన మహేశ్వరుని సేవించి తన భక్తిని ప్రకటించుకొనుటలో ముగ్ధపిరభక్తశిఖామణి యయ్యెను. ఈ కథాశక్తి కంతయు జీవభూతమైనది

దీవద కళియారు మౌగ్ధ్యమే. మౌగ్ధ్యమయ్యును భక్తిచే కూడికొని యుండుటచే పరమేశ్వరుని హృదయమునకు హత్తుకొనినది అతడు ప్రకటించిన వీరమే పరమేశ్వరుని ప్రత్యక్షీకరింప జేసినది. ఈ క్రమమును గమనించినచో దీవద కళియారు ఉత్సాహము అతని ముగ్ధభక్తిని ప్రదీప్తము చేయుటకొరకై సంవదింపబడినదని స్పష్టమగుచున్నది. అనగా గౌణరసమైన వీరభక్తి ముగ్ధభక్తిని పరిపుష్టముచేసి అంగాంగి సమన్వయము సాధించినదనుటలో విప్రతిపత్తిలేదు. ఇట్లే ఈ క్రింది ముగ్ధభక్తుల కథలన్నింటిని సమన్వయించుట సులభము.

రుద్రపశుపతి, నక్కనైనారు, నాట్యనమిత్రాండి, ఉడుమూరి కన్నప్ప, చిఱుతొండనంబి. ఏణుమూర్తినైనారు, కడమలనంబి, గుగ్గులు కళయారు, అరివాళు నయనారు, ఏణాధినాథుడు, చేదివల్లభుడు, కరయూరి చోడుడు, ఇరువదాండారి, దంగుళి మారయ్య, కుమ్మర గుండయ్య, తేడర దాసయ్య, వీరశంకరుడు, జగదేవదండనాయకుడు, సవరద నాచయ్య మున్నగువారు బసవపురాణమునందలి వీరభక్తిని ప్రకటించిన ముగ్ధభక్తులు.

**రుద్రపశుపతి :** హరుని కంఠమందున్న హాలాహలము ఉదరము చేరక మానదని మృడుని మృతిని విని తాను బ్రతకలేనని ప్రాణత్యాగము చేయుట కుద్యుక్తుడయ్యెను. ప్రాణత్యాగము చేయుటకతడు చూపించిన యుత్సాహము భక్తికంగము. భగవత్ సాక్షాత్కారమునకు సహితము ప్రాముఖ్యమివ్వక హరుని యూరు పీఠమునందే నుండి కఱకంఠుని కంఠము కంటి రెప్పలిడక చూచుచుండగల స్థానమును బొందిన రుద్రపశుపతి వీరభక్తి పూర్వమే వివరింపబడినది.

**నక్కనైనారు :** చోడమండలమునందలి నక్కనైనారు భార్య యొక నాడు శివదేవునిపై నొక్కసెలది ప్రానుటగని 'శివశివ ప్రేలునో శివున'కని నోటితో నూదినది. నక్కనైనారదిగని ప్రాణవల్లభునిపై తుంపురులు పడుటకు సహింపలేక భార్యనింటినుండి వెడలగొట్టెను. సకల చరాచరముల సృష్టికర్తకు పురుగువలన నెట్టి హాని కలుగునోయని తలచుట ఆ పడతి మౌగ్ధ్యము. భగవంతుని రక్షించుటకైనను తుంపురులు పడునట్లుగా శివలింగముపైనున్న పురుగును ఊదివేసి భగవదపచారము గావించినదని కోపించి భార్యను వెడలగొట్టిన

నక్కనైనారు మౌగ్ధ్యమిందు స్పష్టమగుచున్నది. ఆ రాత్రి మృదు నపుడు కాంత తూపొడిచిన స్థలము తక్క మిగిలిన శివలింగమంతయు చూచినక్కనైనారు సతి పాదముల కతిభక్తితో సాష్టాంగుడై మ్రొక్కి ప్రక్క చూపి 'ఈ దిక్కు దూపొడ్చి యీ సంకటంబు- నా దేవునకు దయతోడ' యని కోరగా అంగన వచ్చి తన దోషమువలన శివునకు పె మిక్కుటమయ్యెనని తనను పెనిమిటి చంపిన చంపనిమ్మని తూపొడ టకు చింతించి, పినాకినికి కల్గిన కష్టము చూడజాలక ప్రాణత్యాగః బోయెను. భగవదపచారమున కోర్చుకొనలేక అర్ధాంగిని నిల్లువెడల క్తైన వెనుదీయని నక్కనైనారు ఉత్సాహము, తన తప్పువలనే ము ముప్పు కలిగినదని ప్రాణత్యాగమున కుద్యుక్తురాలైన నక్కనైన ఉత్సాహము వీరభక్తిరసమునకు పోషకమయ్యెను.

భవరోగవైద్యుడు పార్వతీకాంతుడు ప్రత్యక్షమై వారి మ మెచ్చి వరము కోరుకొమ్మనగా భగవత్ సాక్షాత్కారముకన్న కోర లేదని 'మీ పాద కమలాంతరంగ- భావసంపూర్ణ సంపద గృపసే కోరిరి. ఆ దంపతు లిరువురి ఉత్సాహభక్తి వారి ముగ్ధ స్వభావము పరి టచే వీర ముగ్ధభక్తిగా నీ కథయందలి రసము భాసించుచున్నది.

**నాట్యనమిత్తాండి :** కంచిలోనున్న నాట్యనమిత్తాండియను ఓ వుడు ఏకామ్రనాథుని గుడికేగి తాండవమూర్తి అత్యద్భుతాకార నడుమగు పీగియున్నది చేతులు వంకరలు బోయినవని నదియొక ( తలచి తన సంపదనంతయు నర్పించి పూజారికడ తైలముగొని చేసియు గుణముకానరాక తన ప్రాణత్యాగమున కుద్యుక్తుడు కాగా, నాట గీర్వాణవంద్యుడు ప్రత్యక్షమై నాట్యనమిత్తాండిని కౌగిలించుకొని కారమును గురించి వివరించెను. తాండవమూర్తిని చూచి రోగి య మౌగ్ధ్యము. శివుడు సహితము తనవంటివాడని ఆ భక్తుని నమ్మకః వంతుని అనారోగ్యమును సరిచేయబూనుట ముగ్ధభక్తిపోషకమైన యుః శివుడు తాండవతత్త్వమును వివరించి యతనికి ముగ్ధభక్తి ఫలముః దించును. సఫలమైన ముగ్ధభక్తి పఠితకు సంతృప్తిని కలిగించును.

**ఉడుమూరి కన్నప్ప :** త్రినేత్రునకు నేత్రకమలమర్పించిన కన్నప్ప ముగ్ధభక్తి జ్ఞానులను సహితము ముగ్ధులను జేయును. దాస్యభక్తిని గురించి వివరించునెడ నీ భక్తుని గాథ వివరింపబడినది.

**ఇరువదండారి :** కరయూరిలో నివసించు ఇరువదాండరియను శివ భక్తుడు శివద్రోహరగండడు. ఒకనాడొక మదకరి తుండాగ్రమున శివభక్తునొకని బట్టి విసిరివేయగా ఆ భక్తుని యార్తనాదము విని యావేశపూరితుడై నిశిత కుఠార సన్నిహితుడై యాయేనుగును బట్టి యీడ్చి మావంతుని చంపెను. ఆ ఏనుగు దెబ్బకు భక్తుడును చనిపోయెను. శివభక్తుడు ప్రాణవియోగతపమున 'ప్రాణేశ! శివశివ! పరమాత్మ!' అని చేసిన యార్తనాదము ఇరువదాండారికి తీవ్రతాపమును కలిగించుటేకాదు ప్రాణములకు తెగించి సంహారుద్రునివలె మత్తకరీంద్రము పైకి దూకునట్లు చేసినది. శివద్రోహముగాని, శివభక్తుల కప కారముగాని సహించని శివభక్తులెట్టి వీరోచిత కార్యమునకైనను పూనుకొందు రనుటకిదొక నిదర్శనము. కరయూరి చోడభూపతి విషయము నెరిగి పరుగున నేతెంచి తాను ఏలికగాన తానే ద్రోహియని భావించి ఇరువదాండారి మ్రోల తల నరుకుకొనబోగా అక్షయుండపుడు ప్రత్యక్షమై మావటిని, భక్తుని, ఏనుగును, బ్రతికించి, రాజును ఇరువదాండారిని కైలాసవాసులుగా చేసి ననుగ్రహించెను. చోడభూపతి తన రాజ్యములో తన ఏనుగువలన నొక శివభక్తుని కపచారము జరుగుట కోర్చుకొనలేక తన ప్రాణములను త్యజించుటకు సిద్ధమయ్యెను. ఈకథ యందు వీరము భక్తికి అంగముగా పోషించబడినది. తనూత్యాగమున కుత్స హించుట వీరము. శివాపరాధమున కాగ్రహించుట రౌద్రము. రౌద్రగర్భితమైన వీరము ముగ్ధ భక్తికి పోషకమగుట ఈ కథయందలి శిల్పము.

**సిరియాలుడు :** (చిఱుతొండనంబి) సిరియాలుడు సంగళవ్వ సర్వ లక్షణ గుణ సంపూర్ణుడైన ఒక్కగానొక్క కుమారుని నిండారుమనమున నిహతు గావించి నానా ప్రకారంబుల శాకము లొడగూర్చి జంగమ రూపధారియై యేతెం చిన శ్రీ కంఠుని పూజించి వడ్డించి, వీరభక్తిని చాటుకొనిరి. కృతక తపోధన మూర్తి యానతి ననుసరించి సంగళవ్వ కొడుకును రమ్మని యెలుగెత్తి పిలువ అందరి కాశ్చర్యము కలుగునట్లు సీరాలుడేతెంచి ప్రత్యక్షమై నిలిచిన ఉగ్రాక్షు నకు సాష్టాంగ నమస్కారము గావించెను. సిరియాలుని యొక్కయు సంగ

శవ్వ యొక్కయు ధృఢభక్తి ముగ్ధభక్తికి మూలము. శివునికి తనయుని తరిగి వండి వడ్డించుట వారి యుత్సాహ శీలమునకు పరాకాష్ఠ. తనయుని తిరిగి పొందుట అద్భుతమున కాలవాలము. ఈ కథలో జన్యరసమైన అద్భుతము జనించున్నట్లు చిత్రించుట విశేషము.

**ఏణుమూర్తి నైనారు :** వీరభక్తుడైన ఏణుమూర్తి నైనారు త్రిభువనేశునకు త్రికాలంబులందు నర్పించు మేలిచందనమునకు ధనమెల్ల చెల్లిపోవ తనువెల్ల గంధముగా దిగిచి నర్పించదలచి 'వలవలి మోచేయి సానఁగదియించి తిగిచి శ్రీగంధము' వడసి శివున కర్పించి ఈశ్వరు మెప్పించి విమానమెక్కి కైలాసమున కేగెను. శరీరమును గంధముగా నరుగదీయుటయందు ముగ్ధభక్త్యుత్సాహముత్కటావస్థనందినది.

**గుగ్గులు కళియారు :** ప్రాణేశునకు మూడు సంధ్యల ధూపము సమర్పింప అలి మంగళ సూత్రమాదిగా ధనమంతయు సమసిపోవ ధరణిపాలుడు కోరినట్లు ముందుకు వ్రాలిన యురగేశ్వరుని చక్కగ నిలుపుదునని వలసినంత గుగ్గిలము పొంది వస్త్రము యొక్క యొక చివర ఈశవిగ్రహమునకుగట్టి మరొకచివర శస్త్రమునకుగట్టి ఆ శస్త్రమును గ్రక్కున తన కంఠమున గ్రుచ్చుకొని గుగ్గులు కళియారు తన వీర భక్తిని ప్రకటించెను. ప్రాణత్యాగమునకు సహితము వెనుకాడని యీ భక్తుని యుత్సాహము ముగ్ధభక్తికి పోషకము.

**అరివాళు నయునారు :** ప్రాణలింగమునకు త్రికాలనియమముగా రాజనములొసగు అరివాళునయునారు కూలి పుట్టక నిట్టుపవాసముండి యెట్టకేలకు దొరికిన బియ్యము నేలపాలుకాగా కొడవలియెత్తి మెడ నరుకుకొనబోగా కరుణాంతరంగుడు, పరమేశ్వరుడు ప్రత్యక్షమై యతని వీరభక్తికి మెచ్చి యనుగ్రహించెను.

**ఏణాధి నాథుడు :** ఏలాపురమునేలు ఏణాధినాథుడు భూతి రుద్రాక్షధారు లెల్లరను శివరూపులుగా భావించి పూజించుచుండెడివాడు. అజేయుడై అవనీశులను జయించి కప్పములను గొనుచుండెడివాడు. ఓడిన యాభూపతులు ఒక దళవాయిని శాసనధారి గావించి పంపగా ఏణాధినాథుడు యుద్ధభూమియందు వానిని చూచి భూతి రుద్రాక్ష ధారులని 'శివ శివ' యని కర

వాలము విడిచి సాష్టాంగ నమస్కారము గావించెను. యుద్ధ భూమితో శత్రు రాజులతో పోరాడునపుడు కూడ శివలాంఛన ధారులను గని నిశ్చల భక్తితో నిర్భీతితో మ్రొక్కగా ఏణాధినాథు వీరభక్తికి కరవాల మతని కంఠమున పూల మాలగా మారినది. శివరూపులని భావించిన శత్రువుల యెదుట ప్రాణ భయము లేక ఆయుధములను ఉపసంహరించిన ఏణాధి నాథుని భక్తివీరము ముగ్ధ భావమునకు జీవశక్తిగా భాసించు చున్నది. ఇందు భక్తి అంగి,వీరమంగమగుట స్పష్టము.

**చేదివల్లభుడు :** పంచ ముద్ర ధారులమ పరమేశ్వర స్వరూపులుగా భావించి పూజించు చేదివల్లభుని పరాక్రమముతో జయించలేక పరరాష్ట్ర భూవతులు పదముగ్వురిని కపట లాంఛనధారులను పంపగా అతి భక్తి వినమితుడై 'దారుణాంచిత నిశాతక్రూర శస్త్ర - ధారల జర్జితంబు సేయంగఁ బరికించియు నితర భావంబు లేక' గురు రూపులుగా భావించి మ్రొక్కగా పార్వతీ నాథుడు ప్రత్యక్షమై నిత్యత్వంబు నొసగి అనుగ్రహించెను. కపట లాంఛన ధారులు వంచకులు. కపటమెరుగని చేదివల్లభునకు వారు సాక్షాత్ గురు స్వరూపులు. శివ లాంచనధారులు శివస్వరూపులు. అంతియెకాని వారెట్టివారన్న ఆలోచనకు తావివ్వని ముగ్ధ హృదయుడు చేదివల్లభుడు. తన సర్వము కోలుపోయినను తాను చూచుచున్న శివమూర్తులయందే మనసు నిలిపిన చేది వల్లభుని నిశ్చల నిర్మల వీరభక్తికి వంచకుల కుచ్చితము ఇసుమంతయు నవకారము చేయలేక పోగా చేదివల్లభునకు పరమేశ్వరానుగ్రహము కల్గినది.

**కరయూరిచోడుడు :** శివభక్తులను తన ప్రాణలింగములని భావించు కరయూరి చోడుడు పరరాజుల సైన్యముపై వీరవిహారము చేయుచు ముప్పది వౌణకల తలలు అచ్చెరువుగ కొట్టితెచ్చు సమయమునందొక తల జడతల పోలికయుండ 'హరహర' యని యాక్షణమున తన తలతరిగి ఆ తలమీద పెట్టగా కంతుసంహారుడు ప్రత్యక్షమై అనుగ్రహించెను. శర్వునికొఱకై శిరము నైనను చేదించుకొనగలిగిన త్యాగోత్సాహమే యీకథలోని ముగ్ధభక్తికి జీవము.

**ఇరువదాంతారి :** ఇరువదాండారెయను సద్భక్తియుతుని పరీక్షించుటకు అంతకాంతకుడే భక్తాకృతిదాల్చివచ్చి బొంతయు కచ్చడము ధాచుటకిచ్చి,

వాని నదృశ్యముచేసి వానిని తిరిగి యిమ్మని కోరెను. ఎచటను వానిని కానక 'ఎత్తున కెత్తు' ఇత్తునని ఇరువదాండారి పలుకగా శివుడు వేఱొక బొంతయు, కచ్చడము తూచుటకిచ్చెను. ఇరువదాండారి యింటనున్న వస్త్రములెల్ల తూచినను దానితో సరితూగక పోవుటతో వీరభక్తుడు కాన తానే ఆ త్రాసునందు కూర్చుండి వరదుని మెప్పించెను శిబిచక్రవర్తి త్యాగోత్సాహమునకు దీటైన వీరగాథ యిది.

**దంగుళి మారయ్య :** దంగుళి మారయ్య గొప్పదాత జంగముల కొఱకై తన సకలార్థములను ఖర్చుపెట్టిన వితరణశీలి. అతడర్థములన్నియు అర్థుల కిచ్చి పేదపడి యుండగ శివుడొకనాటి నడిరేయి వానలో తడిసి యతని యింటికి వచ్చెను. చలిలో వడకిపోవుచున్న నాతనిగాంచి మారయ్య వెనుకాడక వరుసగా తన పాకను వ్రచ్చి కాల్చి యాతని చలిని బాపెను. మారువేష మందున్న శివు డాకొంటి నన్నము పెట్టుమని కోరెను. 'తొలునాడు వీకతో నలికిన విత్తులు నీళ్ళ విదిలించుకొని తెచ్చివేపి దంపించి' వానిని వండి వడ్డించుటకు సతీసాయమున ప్రయత్నించెను. అతని ముగ్ధ వీరభక్తికి మెచ్చి శివుడు మోక్షము నిచ్చెను. పరమేశు నర్చించుటలో తన సంపద సర్వస్వమును కానుకగా పెట్టెడి ఉత్సాహ భక్తియే మారయ్య ముగ్ధభక్తికి ఊపిరి.

**కుమ్మర గుండయ్య :** తిరునీలకంఠ దేవరగుడికేగి తిరిగి వచ్చుచున్న కుమ్మర గుండయ్యపై వెలది యొకతె చల్లిన యెంగిలి నీరు మీదపడుటతో 'హర హర! ప్రాణేశ!' యని భగవంతుని స్మరించగా నా మానిని విని మిక్కిలి చింతించి యతనిని తన యింటికి పిలిచి అభ్యంగనము చేయించి క్షమను వేడికొని, పంపగా తడవయ్యెనని కులాంగన వారాంగన యింటినుండి వచ్చుచున్నాడని తలచి 'తన్ను ముట్టినచో దిరునీలకంఠ దేవరయాన' యని పలుకగా వీరభక్తుడు కాన యెనుబదియేండ్లాసతి నంటక యుండెను. ధర్మార్థకామ మోక్షములను సహితము భగవదర్పితము గావించువారు వీరభక్తులు. వారి ననుగ్రహించుటకు పరమ పావనుడే భక్తుడై వచ్చి ఒక కప్పెరను దాచుటకు నిచ్చి ఆపై దానినదృశ్యముచేసి లోతైన నీటిలో దిగి సతీపతులను కప్పెర కొనలేదని శపథము చేయుమని కోరెను. గుండమున మునిగి తేలగా సతీపతులు యౌవనవంతులైరి. వారి వీరభక్తికి పరవశుడై పార్వతీశుడే వారి ననుగ్రహించెను.

ఎనుబదేండ్లు సతిని తాకక బ్రహ్మచర్యము నాచరించిన గుండయ్య నియమో త్సాహమతని శీలమునుజ్జ్వలముగా ప్రకాశింప చేయుచున్నది.

**సుగ్గలదేవి (తేడరదాసయ్య శిష్యురాలు) :** పొట్టి చెఱువునేలు సింగ బల్లహుడు జైనుడు. అతని యతివ సుగ్గదేవి తేడర దాసయ్య శిష్యురాలు. ఆమె తన గురువు నాహ్వానించి భర్తకు బుద్ధులు చెప్పింప దలచెను. శివభక్తు డేతేర అధిపు డత్యంత కుపితుడై పురుషునకొక దైవము సతికొకదైవము సరి కాదని తేడరదాసయ్యను పంపివేయమని పలికెను. వీరభక్తురాలైన సుగ్గులదేవి 'మృడునిగానియెల్ల'నని పలికి రాజునొదలివేయుటకైనను సిద్ధమయ్యెను. కాదని వేదశాస్త్రాది వాద తర్కములందు వాద ప్రతివాదములందు గురువునోడించ మని పలికెను. తేడర దాసయ్య జైనుల నోడించి వారికి శివదీక్ష యొసగెను. పరమేశ్వరారాధనకాటంకము కలుగునేని పతిని వదలివేయుటకైనను వెనుకాడ లేదు సుగ్గలదేవి.

**వీరశంకరుడు :** మారారి చరిత్రమును తప్ప పరదైవములను తలపని, ముట్టని, పలుకని వీరశంకరుడొకనాడు బౌద్ధునొకనినంటినట్లు కలగని-

'కుక్కముట్టిన కడ్వకును విధియేమి
చక్కనఁగాల్చినఁజూలున కాదె' బ.పు.పు.197.

యని తలచి భగ భగ మండుచున్న అగ్నిపై నున్న పెనముపై కూర్చుండి మదనారి మెప్పించి మహిత సాయుజ్య పదవి నొందెను. కలనైన పరమతస్థులను తాకిన దోషమునకు తనకుతానే ప్రాయశ్చిత్తము గావించుకొనిన ముగ్ధవీరభక్తి వీరశంకరునిది.

**జగదేవ దండనాయకుడు:** జగదేవ దండనాయకుడు బసవన మంత్రిని విందారగించుట కాహ్వానించెను. బసవన్న తాను రాకముందే బ్రాహ్మణుల కాళ్ళు కడుగుట పరిచారకులవలన విని మలహరుభక్తులు పల్లుత్రోవల పోవుట పాడియేనాయని కోపించి యతులనిష్ఠాగ ష్ఠులగు శివభక్తుల మహిమలను నిశ్చలభక్తిని వివరించెను. తన తప్పు నెరిగిన వీరభక్తుడైన జగదేవ దండ నాయకుడు శివద్రోహుల నడతునని వీరతాంబూలము గ్రహించెను.

**సవరద నాచయ్య :** సవరద నాచయ్య సతికి కవలలుదయింప ముందు పుట్టిన బాలుని లింగధారిగచేసి వేరొక బాలునకు లింగము సిద్ధముగ లేకపోవుట వలన వ్రతహీనుడయ్యెనని నాబాలుని పారవేయుమని భార్య నాజ్ఞాపించెను. శైవ మతాచార నియమముల కనుగుణముగా లేకపోయిన కన్నకుమారుని ముక్కుపచ్చలారని పసిగందును పారవేయుటకైనను వెనుదీయని వీరభక్తికిదొక మచ్చుతునక. ఇట్టి మతాచార విధులకు సంబంధించిన కథలనన్నింటిని ముగ్ధ వీరభక్తి గాథలుగా పరిగణించుట బసవపురాణ సంప్రదాయము.

బసవ పురాణ భక్త గాథలందు ముగ్ధవీరభక్తి ప్రధానములైన కథల తరువాత పేర్కొనదగినవి అద్భుత ముగ్ధభక్తి గాథలు. అద్భుతమున కాశ్చర్యము స్థాయిభావము. పరమేశ్వర లీలలుకాని, పరమేశ్వరభక్తి ప్రభావమున భక్తులు ప్రకటించెడి మహిమలుకాని వినెడివారికి ఆశ్చర్యము కలిగింపజేయును. బసవపురాణమునందు పైరెండు రకములైన అద్భుత వీరభక్తి విశేషములు కానవచ్చు కథలు పెక్కులు కలవు. ఆ కథలలోని యద్భుత విశేషములన్నింటిని రుద్రాక్షదామములోని పూసలవలె మనము చదువుకొన్నచో ఆ పూసలలో దారమువలె ముగ్ధభక్తి పోషకమైన అద్భుతము సంతతము సామాజికుని హృదయమున స్ఫురించుచుండును. దానిని సంవదించుకొనుటయే గౌణభక్తి భేదమైన యద్భుతము ముగ్ధభక్తికి పోషకముగా ననుశీలించుట. ఈ క్రింది గాథలను ఈ సమన్వయమున కనుగుణముగా సమీక్షించుట యగుచున్నది.

## అద్భుత ముగ్ధభక్తుల గాథలు

బసవన్న జ్ఞాని, శాంతభక్తుడు. మహిమలు చూపించుటతని యాశయము కాదు. అతని నిత్యవిధులలో ముఖ్యమైనది జంగమార్చనలు. లింగవంతులు కానివారతని యంగణమున యడుగిడరాదన్న దతని నియమము. మోసగించ దలచిన దొంగలు వంకాయలు గట్టుకొంగున నుంచుకొని లింగధారులవలె బసవన్న యిల్లుచేరి ఈశ్వరార్చన చేయునట్లు కూర్చుండిరి. వచ్చినవారు వంచకులు. బసవన దండనాయకుని మోసగించుటకే వంకాయలను కట్టుకొంగున ధరించిరి. కపటమెరుగని స్థిరభక్తి వంచకుల వంకాయలను అద్భుతముగా లింగములుగా మార్చినది

**బల్లేశు మల్లయ్య :** బల్లేశు మల్లయ్య అద్భుత భక్తియు నిట్టిదే. వీరశైవ భక్తశిఖామణులెవ్వరు లింగార్చనలు సేయక, లింగార్పితముకాక భుజింపరు. వ్యవహారమునకై పరస్థలమేగిన బల్లేశుమల్లయ్య లింగాలయములు లేక భుజించ కుండుట చూచి వెంటనున్నవారు పూరి గుడిసెలో కుంచెనుంచి కొండగోగులతో పూజించి, కళకంఠుని గుడియని చెప్పిరి. మల్లయ్య మల్లికార్జునుని ఆలయమని నమ్మి ముమ్మారు మ్రొక్కివచ్చి భుజించెను. 'కుంచెకు మ్రొక్కి కుడిచె' మల్లయ్య యని యపహాస్యముచేయ మిక్కిలికోపించి 'ఛాకుంచెయె' సాక్షాల్లింగ మూర్తికాక యని వారినచటకు కొనిపోయెను. బల్లేశు మల్లయ్య స్థిరభక్తి కుంచెయె లింగరూపమునొంది శివుడు వసించెడి యద్భుతరూపము నొందెను.

బసవన్న భక్తుడొకడు బసవన్ననుచేరి కదలక మెదలక యాక్షణమున పదిపుట్లు ముత్యములిమ్మని కోరెను. లింగపసాయిత శస్త్రధరుడైన బసవన్న భక్తిమహిమచేత నెదుటనున్న జొన్నలరాశిని చూడగనే యవి ముత్యములుగా మారి చూపరుల కద్భుతము గావించెను.

**మొఱటద వంకయ్య :** కళకంఠు భక్తుడొకడు మొణటద వంకయ్య యింటికర్ధరాత్రి పోయి లింగావసరము సెల్లింప పాలును మారేడు పత్త్రియు కావలెనని హరభక్తులూర లేరుకాన మరెవ్వరి నడుగనని పొరుగూరికి పోవుటకు సమయము కాదని పలికెను. జంగమదేవరను సాక్షాల్లింగమూర్తిగా భావించు వంకయ్య గొంకక గొడ్డునాక్షణమున కొనివచ్చి పిదుక కుండనిండ పాలు అద్భుతముగా కురిసెను. ఆ గొడ్డు కొఱటనే పత్రియంకురితమై యొప్పెను. ముగ్ధభక్తుడయిన మొఱటద వంకయ్య స్థిరభక్తి తపస్సంపన్నులు సాధించలేని మహిమలను చూపినది.

**బసవన్న :** భక్తుల కోరికలను తీర్చుట నియమముగా పెట్టుకున్న బసవన్నను పరీక్షింప సంగమేశ్వరుడొకనాడు జంగమ రూపముదాల్చి వచ్చి మూడవ కన్నునిమ్ము అని యడిగెను. లింగపసాయిత హస్తుడైన బసవన్న యద్భుతముగా నద్దములో ఫాలాక్షము చూపి జంగమ వేషధారియైన మహేశ్వరుని పారిపోవునట్లు చేసెను. అజసురేంద్రాదుల కలవికాని పరమేశ్వర మాయను కనుగొనగల యుక్తిశక్తి బసవన్న భక్తికే కలదని తెలియుచున్నది.

కపిలేశ్వరమునందు తపసి యొకడు నిత్యము నాలుపుట్ల లింగమునకభిషేకము చేయుచుండ నావీధియంతయు బురదతో నిండిపో అటుపోవు గొల్లెత జారి చల్లకడవ పడిపోవుచుండ 'బసవరో' యని స్మరి కటకమందు నిండుకొలువున నున్న బసవన్న 'ఓడకోడకు' మనుచు చాపి అద్భుతముగా రక్షించెను. హేళన చేసిన రాజు గొల్లెత యిల్లు, రూపము బసవన్న చెప్పగా పిలిపించి నిజము తెలిసికొని యతని కబ్బురపడెను.

తిరు చిట్టంబలుడను శ్రీకంఠ భక్తుడొకనాడు హరపూజార్థము కోసికొని వచ్చుచు వనధి తీరమున జారి పువ్వులు పడకుండా కాపా 'చిట్టంబలాధీశ' యని పిలువ బసవన్న యద్భుతముగా భక్తుని పడ కాపాడెను.

**సిద్ధ రామయ్య :** సొన్నలిక పురమందున్న సిద్ధరామయ్యయన భక్తిపుంగవుడు లక్షయు తొంబదివేల శివలింగములను భూమిపై ప్రతి టయే కాక యద్భుతమైన మహిమలను ప్రకటించెను. అతని మే భూమిపై పడెడిదికాదు. పాదముల గుర్తు పడకుండ నేలపై నడిచెడి అమిత సమాధి యోగాంతరంబున ప్రమథలోకమున కేగి కైలాస దర్శించుకొని వచ్చెడివాడు.

**బసవన్న :** ఒకనాడు మిండజంగమము కోరినంత ధనము బ యిచ్చుటచూచి మంత్రులు రాజుతో చెప్పగా రాజు కోపించి బసవన్న 'లెక్కలు సూడుమని' చూపగా లెక్కకు మించిన ధనము కోశాగారము పించెను. బసవన్న భక్తి యిట్టి మహిమలను, అద్భుతముల నెన్నింటినో టించినది.

**మధురపాండ్యుని మంత్రి :** మధుర పాండ్యుని మంత్రి రాజు కిచ్చిన ధనము గుఱ్ఱములను కోని తెచ్చుటకుపయోగించక జంగమార వ్యయము చేసెను అతిభక్తియుతుడైన మంత్రి.

'పొలమునక్కల నెల్లఁబిలిచి తెప్పించి
నలిఁబాండ్యభూనాథునకుఁబొడసూపఁ
జొక్కనైనారుల మిక్కిలి కరుణ
నక్కజం బంద నానక్కలన్నియును
నిలఁగంకణముల తేజులునయ్యెఁగాదె.' బ.పు.

మలహరు భక్తుల మహిమలు తెలుప మహిలో సాధ్యమా యని భక్తులు కొనియాడిరి. భగవంతుడెట్లు మహిమలు ప్రకటించునో భక్తులు కూడ నట్టి మహిమలు ప్రకటించుటయే అద్భుత భక్తి.

**బసవన్న :** వేశ్యకోరిక తీర్చను జంగమదేవరయొకడు బసవన్న యాస్థానమునకు వచ్చి బసవన్న సతి గంగాంబ కట్టిన పట్టు వస్త్రము వెంటనే యిప్పించమని కోరెను. వెంటనే బసవన్న సతి నాస్థానమునకు పిలిపించి-

"పుట్టుసావెఱుఁగనియట్టి మహాత్ముఁ
డిట్టలంబుగ నీదువుట్టమడ్గెడిని
పుట్టమీవేగ మీ పుట్టమిచ్చినను
బుట్టము మన"మని బ.పు.పు. 57

పలికి సిగ్గు లజ్జయు తలపక అరిమురి ఆజలజాక్షి వలువలుపట్టి యొలువంగ అద్భుతముగ గంగాంబ శరీరము పాయక చీరలు వచ్చుట బసవన్న గంగాంబల యద్భుత భక్తికి నిదర్శనము కాగలదు. ఈ సన్నివేశము ద్రౌపది వస్త్రాపహరణ ఘట్టము గుర్తుకు తేక మానదు. అందు ద్రౌపది నవమానించ దలచిన దుశ్శాసనుని పైశాచిక ప్రవృత్తి, ద్రౌపది పాతివ్రత్య మహిమ, భక్తి కాననగును. ఇందు ముగ్ధ భక్తుల కోరిక తీర్చవలెనన్న తొందరపాటు, ఆలస్యమైన భక్తులు కినుక వహింతురేమో నన్న ఆతురత గంగాంబ బసవన్నల దృఢ నిశ్చల భక్తి మహిమ కాననగును.

**బాణుడు :** బాణుడు లింగమూర్తికి నిత్యము వేయి మాఱులు పూజలు చేయుచు దేహధర్మములకు తెరపిలేక యుండుటతో నేణాంక ధరుడతని సద మల భక్తికి మెచ్చి బాహుసహస్రం బిచ్చెనట. బాణుని బాహుసహస్రము చూడ వలెనను కోరికతో భక్త సందోహము చనుదెంచు చుండగా లింగావసరము సెల్లించి కుడుచుటకు కూడ బాణునకు సమయము లేకపోవుటతో భక్త వత్సలుడైన యా పరమేశ్వరుడు అతని యింటి కాపువాడై బాణుడు లింగావసరములు సెల్లించి భుజించునంత కెవ్వరిని లోపలకు పోనివ్వక దాస్యము చేసెనట. బాణుని స్థిరభక్తి అద్భుతముగ బాహు సహస్రము పరమేశ్వరు నను గ్రహమున పొందుటయేకాక ఈశుడే తన యింటి కాపువాడై నిలుచునట్లు చేసినది.

**పిట్టవ్వ :** పెట్టవ్వ భక్తికి ముగ్ధుడైన పినాకి యామెకొఱకై వెట్టికిపోవుట పాఠకులకాశ్చర్యము కలిగించక మానదు.

**కిన్నెరబ్రహ్మయ్య :** కిన్నెరబ్రహ్మయ్య యొకనాడు త్రిపురాంతక దేవు గోపురాంతమున కూర్చొని యుండగ వారాంగనార్థము కొనిపోవుచున్న మిండజగమము పట్టితెచ్చు గొఱియ ఆలయము లోపలకు వచ్చెను. శివాలయము చేరిన ఆ గొఱియను బ్రహ్మయ్య వేయి మాడలిచ్చి విడిపించెను. కాని, వేశ్య గొఱియనే కోరుటతో ఆ మిండజంగమ మెంత చెప్పినను వినక ఆ గొఱియనే పట్టుకొనుటకు వచ్చెను. ఉగ్రుడై రుద్రునివలె కిన్నెర బ్రహ్మయ్య వాని తల నరికి రాజు, ప్రజలందరు వినునట్లు నిటలాక్షునితో సాక్ష్యము పలికించెను. కిన్నెరబ్రహ్మయ్య భక్తి యొక్క అద్భుత శక్తి ఫాలాక్షునిచే సాక్ష్యము పలికించినది.

**కలకేత బ్రహ్మయ్య :** కలకేత బ్రహ్మయ్య సన్నిధిని విశ్రాంతి తీసికొనుచు భక్తుడొకడు తన దారిద్ర్యము పోగొట్టుకొనుటకు కిన్నరబ్రహ్మయ్యను దర్శించబోవుచున్నట్లు తెలిపెను. కలకేత బ్రహ్మయ్య జాలి తలచి చేతి కర్రతో రాలప్రోకను తాకించి వలసినంత ధనము కొనుమని పలికెను. తంగెడుపూల రాశివలె ధరణిపైనున్న ధనరాశిని చూచి యా భక్తు డచ్చెరువొంది, బసవన్న మంత్రికడ కేగి ఆ ధనమును మోసికొనిపోవుటకు పరిచారకు నాకని యడిగి తెచ్చుకొనెను. కలకేత బ్రహ్మయ్య భక్తి అద్భుతముగ రాలను ధనరాసులుగా చేసినది.

**మోళిగ మారయ్య :** మోళిగ మారయ్య యను మారారి భక్తుడు నిత్య మడవికేగి కట్టెలు కొట్టి తెచ్చి అమ్మి వచ్చిన ధనముతో 'తూమెడు' ఆహారము వండి జంగమ కోటిని సంతృప్తులను చేయుచుండెడివాడు. అట్టి రుచికరమగు భోజనము బసవన్న యింట కూడ లభించదని భక్తులు పలుక మిక్కిలి ఆశ్చర్యమును బొంది బసవన్న మారయ్య యింటి కేగి సహాయము చేయవలెనన్న తలపుతో రెండు వేల మాడలెవరికి చెప్పక పెట్టివచ్చెను. నాటి నుండి మారయ్య భోజనము పెట్టిన తరువాత ఒక్కొక్క భక్తున కొక్కొక్క మాడ నిచ్చి మ్రొక్కి సేవించెడివాడు. మోళిగ మారయ్య కాయక లబ్ధితో జంగమ కోటిని నిత్యము సంతుష్టులను చెయు టద్భుతము. మోళిగ మారయ్య ముగ్ధ భక్తియే యిట్టి మహిమను ప్రకటించినది.

**కన్నడ బ్రహ్మయ్య :** కన్నడ బ్రహ్మయ్య యను శివభక్తుడు దొంగిలించి తెచ్చిన ధనముతో నిత్యము జంగ మార్చనలు చేయువాడు. కన్నము వేసిన యిల్లు శివ భక్తులదైన వారిని లేపి వారి పాదములకు నమస్కరించి ప్రసాదము కొనువాడు. కన్నడ బ్రహ్మయ్య యొకనా డెదురైన బసవన్నను బిజ్జలుని భాండారము చూపుమని కోరెను. శివ భక్తులకు 'ప్రత్యుత్తరంబీని బాస' గాన బసవన్న వెంట పోయి బ్రహ్మయ్యకు బండారు సదనము చూపి ధనము దోచుకొనుటకు సహాయపడెను. అది విని బిజ్జలు డుగ్రుడయ్యెను. రాజా ధనాగారమునకు పోయి చూడగ కన్నడ బ్రహ్మయ్య తాకిన చోటు ఆశ్చర్యకరముగా పసిడియై యుండెను. కన్నడ బ్రహ్మయ్య ముగ్ధ భక్తి అతడు ముట్టిన త్రవ్విన మెట్టిన స్థలములు పట్టినకైదువు పసిడిమయములై చూచువారలకు విస్మయము కలిగించినది ఈ విస్మయ జనితమైన ఆశ్చర్యము బ్రహ్మయ్య ముగ్ధ భక్తికి పోషకము.

**ముసిడి చౌడయ్య :** ముగ్ధ భక్తు లందరిలో ముసిడి చౌడయ్య ప్రదర్శించినట్టి మహిమలు, ప్రకటించినట్టి యద్భుతములు మరే భక్తులు ప్రకటించినట్లు కానరాదు. ముసిడి చౌడయ్య వివాహ కార్యార్థమై పోవుచు దారిలో తవ రాజు శవముగాంచి రాజును బ్రతికించి అందరి కాశ్చర్యము కలుగునట్లా రాజును పెండ్లికి తీసుకొని పోయెను. దారిలో రెండాబోతులు పోరి ఏడు దినముల తర్వాత నందొకటి చనిపోగా దానిని పాతిన చోటును బసవని మట్టియని పిలుతురని చెప్పగా ముసిడి చౌడయ్య యద్భుతముగా నా వృషభేంద్రమును బ్రతికించెను. ముసిడి చౌడయ్య పోవు దారిలోనున్న ఏరు రెండు పాయలుగా చీలి యతడు నడచిపోవుటకు దారి నిచ్చినది. అతని మహిమలత్యంతము విస్మయము గొలుపుచుండెను. ఒకనాడొక రమణి చౌడయ్య పాదములకు నమస్కరింప 'శతాయుష్య' మనుచు చౌడయ్య దీవించెను. కాని మరునాడా కన్య మరణించుటతో నామెతండ్రి మిక్కిలి దుఃఖించుచు చౌడయ్య కడకుపోయి యతని దీవన తప్పినదని పలికెను. వెంటనే చౌడయ్య అచటకేగి 'శివా! లె'మ్మని పలుకగా నిద్రలేచినట్లాకన్య తెలివినొంది సంభ్రమాశ్చర్యములతో చౌడయ్య పాదములకు నమస్కరించెను. చౌడయ్య చందము నూతమను దుర్బుద్ధులు కృతకశవము నొకదాని గుడికడవైచి చౌడయ్యతో తాపసి శవమని పలికిరి. జ్ఞానియైన చౌడయ్య విషయము నెఱిగియు నెఱుగని వానివలె నచట

కేగి 'తపసీ లేలె'మ్మని పిలువ నాక్షణమున జీవాంగుడై లేచివచ్చి ముసిడి చౌడయ్య ముందు నిలిచెను.

అడగకయే తవరాజును పునర్జీవింజేసిన నత్యంత కరుణామయుడు ముసిడి చౌడయ్య. భగవంతుడే మరణించిన వారిని తిరిగి జీవింపచేసిన సంఘ నలే తక్కువ. భక్తులు చనిపోయిన వారిని పునర్జీవింపజేసిన సంఘటన లత్య ల్పము. కోరకయే కరుణించి యెదురువచ్చిన రాజు శవమును బ్రతికించినట్టి అద్భుత సంఘటన లెచటను జరిగినట్లు కానబడదు. ఎదుటనున్న శవమునుకాక యెప్పుడో చనిపోయిన నందిని బ్రతికించినట్టి మహిమ మరే భక్తుడు ప్రకటించ లేదు. అద్భుతములలోకెల్ల అత్యద్భుతము కృతకపు శవమును చూపి దుర్మ దులు తాపసీ శవమని పలుక చౌడయ్య నిజమైన తాపసి నొకని సృష్టించి చూపెను. ముసిడి చౌడయ్య ముగ్ధభక్తి మహిమ లెన్నింటినో ప్రదర్శించి వరి తలకు విస్మయము కలుగునట్లు చేసినది.

**సురియ చౌడయ్య :** కళ్యాణమందున్న సురియ చౌడయ్య కారణ పురుష రత్నమని, త్రిభువన పూజ్యుడని పేరు పొందిన శివభక్తుడు. మూడు ప్రొద్దుల జంగమ కోటికతదర్చనలు చేయువాడు. ప్రతి దినము తన ప్రాణ లింగమునకు పళ్ళెరమున నెల్లపదార్థములను వడ్డించి పదార్థముల పేర్లు చెప్పుచు వెంట వెంట నందించుచుండ భక్త వత్సలుడగు పరమేశ్వరుడు వ్యక్తిగా వచ్చి చేతకొని అరగించెడివాడు.

భగవంతుని సేవించి ప్రతిదినము ఆరగింపుచేయగల భాగ్యమెందరి భక్తులకు కలుగును? సురియ చౌడయ్య ముగ్ధభక్తి పరమేశ్వరుడే వచ్చి నిత్యము విందారగించునట్టి మహిమను ప్రదర్శించగల్గినది.

**తెలుగు జొమ్మయ్య :** శివానందుడను శివయోగి శ్రీశైలప్రాంతమున సమాధి స్థితి యందుండంగా వినోదార్థము వచ్చిన గాంధర్వులతిగా పెరిగిన నఖముల కేశములచే కప్పబడిన ఆ తపస్సంపన్నుని చూచి శిలయో వృక్షమో, ముదియెల్గోయని వితర్కించుచుండగా నతని శిష్యుడు వచ్చి మిక్కిలి కోపించి 'మృగములు కమ్ము'అని వారిని శపించెను. భయభ్రాంతులైన యాగంధర్వులు శాపవిమోచనము వేడుకొనిరి. కల్యాణకటకమున జన్మించు శూలిభక్తుడైన

తెలుగు జొమ్మయ్యచేత మరణము సిద్ధించెనేని వారికి శాపవిమోచనము కలుగు నని శివానందుని శిష్యుడు పలికెను. ఆ గంధర్వులు కల్యాణకటక సమీపమున నున్న యరణ్యమునందు మృగములై పుట్టి యొకనాడు తెలుగు జొమ్మయ్య ఆ ప్రాంతమునకు రాగా శాపవృత్తాంతము నెరిగించి తమను చంపి శాపవిమోచ నము గావింపుడని వేడుకొనిరి. అతి దయామతి తెలుగు జొమ్మయ్య దివ్యదృష్టి వీక్షించి తనవలన కాగల కార్యమెరిగి తన బాణపరంపరలచే నా జంతువులను చంపెను. జొమ్మయ్య బాణహతిచేత మరణించిన మృగము లద్భుతముగా పూర్వపుగంధర్వ రూపములను పొంది అతనికి నమస్కరించి కనక విమానము లందు అందరు చూచుచుండగా తమ నెలవులకు పోయిరి. తెలుగుజొమ్మయ్య భక్తి ప్రకటించిన మహిమ అందరికి విస్మయము కలిగించినది.

**ఇరుత్తాండి :** ఇరుత్తాండియను శివభక్తుడంధుడు, గుడి ముందొక కొలను శివుని మజ్జనార్థము త్రవ్వుచుండగా జైనులు పెక్కు విఘ్నములు గావించుచుండిరి. పట్టువదలని ఇరుత్తాండి యెప్పటియట్లు త్రవ్వుచుండగా మరల జైనులు విఘ్నములు కలిగించుటకు యత్నించగా కఱకంఠుడే కరుణించి యాభక్తునకు కన్నుల నొసగెను. ఇరుత్తాండి ముగ్ధ భక్తియే ఇట్టి మహిమను చాట గలిగినది.

**నమినంది :** చెల్లతిరువాలూరిలోన నున్న నమినంది నిత్యము భర్గునకు వేయి దీపములు వెలిగించు నియమము కలవాడు. జైనులతనికి యూర నెయ్యి లభించకుండునట్లు చేసిరి. దీపములారిన ప్రాణములే విడుతునని దీనముగా నమి నంది యాదేవదేవుని ప్రార్థించగా బావిలోని నీటితో దీపములను వెలిగించమని ఈశుడే ప్రత్యక్షమై పలికెను. ఆ కొలనులోని నీటితో కోట దీపములను వెలి గించి నమినంది సంతోషించుచుండగా ఆ కొలనులోని నీటిని త్రాగిన జైనుల పశువులన్నియు మరణించినవి. తప్పు తెలుసుకున్న జైనులు నమినందికి నమ స్కరించి, స్తుతించి క్షమాభిక్ష వేడుకొనిరి. ఘనకృపామూర్తి నమినంది వారి పశువులకు ప్రాణమిచ్చి వారికి శివదీక్షనొసగి యనుగ్రహించెను.

**సాంఖ్యతొండడు :-** చోడమండలమున శాంతమంగయను పురమున సాంఖ్యతొండడను శివభక్తుడు తాను బౌద్ధుని కడుపున జన్మించినందుకు మిక్కిలి వగచి జైన బౌద్ధ చార్వాకులను నిర్మూలనము చేయు వరకు రాలతోనే

పూజింతునని ప్రతి దినము మూడు రాలను వేయుచుండెను. ఎన్ని రాలను వేసినను శివుడు చలించకపోవుటతో పెద్దరాయినిగొని వేయబోయెను. భక్త వత్సలుడు భర్గుడంత హసితాస్యుడై వరము కోరుకొమ్మనగా సర్వేశ్వరుని స్తుతియించి ఆ రాయిని పూరాయిగను, శివుని తలపై నది అలంకరించునట్లు చేయుమని కోరెను. భగవంతుడు కోరునది భక్తి. భక్తుని భావమే ముఖ్యము. భక్తుడొసగునవి రాలయినను పూలయినను ఒక్కటే. సాంఖ్యతొండని ముగ్ధభక్తి రాలతో పూజించినను అద్భుతముగా భగవత్ సాక్షాత్కారము పొందునట్లు చేసినది.

**గోవూరి బ్రహ్మయ్య :** గోవూరి బ్రహ్మయ్యను కలికంటు భక్తుడు జైనులను వాదమున నోడించెను. జైనులచటనున్న వట వృక్షమును చూపి కాల్చెదవా? తిరిగి పడయుదువా? యని పలికిని బ్రహ్మయ్య దానిని కాల్చి వేసిన తిరిగి బ్రతికింతుననెను. వారావృక్షమును కాల్చిన బ్రహ్మయ్య భసితము సల్లి అద్భుతముగా నా మఱ్ఱిలి యెప్పటియట్లు నిలిపెను. గోవూరి బ్రహ్మయ్య భక్తికట్టి శక్తి కలదని నిరూపించినది.

**సోమన్న :** శూలి భక్తుడయిన సోమన్న కన్నుల నొప్పితో నొకనాడు గుడికి పోలేక భుజించకయున్న జైనులతని శివాలయమునకు గొనిపోవుదుమని జినుని గుడికి తీసికొనిపోయి సోమన్నను మ్రొక్కుమనిరి. సోమన్న జినుని తలపై చెయ్యిపెట్టి లింగాకృతినుండుట వలన ముమ్మారు మ్రొక్కెను. అంత వారు చాలుచాలు జినుడు ప్రసన్నుడగుననిరి. సోమన్న పట్టరాని ఆగ్రహముతో కంటికున్న కవణము విప్పి బలవంతముగా కన్నులు విప్పిచూడగా పటపటమని జిన విగ్రహము పగిలి అద్భుతముగా లింగోద్భవమయ్యెను, ముగ్ధభక్తుడై సోమన్న కంటిమంటకు జిన విగ్రహము విచ్ఛిన్నమయ్యెను, మనసులోని మనసి హరుడచట వెలసెను.

**వైజకవ్వ :** వైజకవ్వ శివ భక్తురాలు, ఆమె భర్త జైన మతావలంబి ఒకనాడామెభర్త జైనులను విందునకాహ్వానించగా వైజకవ్వహరమూర్తి యొ దైన రాలేదని పాయసాన్నములు పరులపాలగునని చింతించుచుండెను, తప వేషధారియై ఆ పరమేశ్వరుడే యేతెంచి ఆరగించుచుండ జైనులదిచూ వైజకవ్వ భర్తకు తెలిపిరి. ఆగ్రహోదగ్రుడైన యామె భర్త చాటుచాటు

వైజకవ్వను కొట్టసాగెను. వైజకవ్వ లెక్కసేయక శివుని స్మరించినది. అద్భుతముగ నా దెబ్బలన్నియు జైనులకే తాకినవి. ఆ దెబ్బల కోర్వలేక చివరకు వారు వైజకవ్వను కొట్టకుండ యడ్డగించిరి. వైజకవ్వను భర్త యింటినుండి వెడలగొట్టగా నామె శివాలయమని తలచి జినాలయము చేరి నమస్కరించినది. ఆ ముగ్ధురాలి వందన మహిమకు జినుని విగ్రహము పగిలి లింగోద్భవమయ్యెను.

**షోడ్డల బాచయ్య :** సర్వేశు భక్తుడయిన షోడ్డల బాచయ్య ప్రతి సంవత్సరము శివరాత్రికి సౌరాష్ట్రమునకేగి జాగారము సేయుట నియమముగా గలవాడు. బిజ్జలుడొక సంవత్సరము శివరాత్రికి షోడ్డల బాచయ్యను సౌరాష్ట్రి మేగుటకు వీలులేదని వారించెను.

"దీనఁదప్పినదేమి నా నిజవ్రతము
తానెట్లు శివునకుఁ దప్పింపవచ్చు"

అనుచు నిశ్చితాత్ముడై యుండెను. శివరాత్రికి ముందు దినమే పరిచారకు నొకని పంపి శివరాత్రికి సోమేశుడే షోడ్డల బాచయ్యకు దర్శన మిచ్చుట కేతెంచెను. షోడ్డల బాచయ్య ముగ్ధ భక్తి సౌరాష్ట్రి సోమేశ్వరుని శివరాత్రి నాడు తానున్న స్థలమునకు రప్పించుకొనెను. ఇట్టి యద్భుతములు ముగ్ధ భక్తులు మాత్రమే ప్రకటించగలరు.

**శివలెంక మంచయ్య :** శ్రీకాశిలోనున్న శివలెంక మంచయ్యయను శివభక్తుడు ప్రతి దినము మూడు పూటలయందు తన పద ప్రేళ్ళర్పించి, అద్భుత ముగ నపుడే పొందువాడు. వీరమహేశ్వర పదమే యుత్తమమని, ఈశ్వరు డొకడె కర్తయని బోధించుచు గదాధరుని గుడి సమీపమున కూర్చుండి పరవాదులను వాదమున నోడించి విష్ణువుతోనే విశ్వేశునకు మ్రొక్కింతునని పలికి 'విశ్వేశునకు మ్రొక్క వెడలి రమ్మ'ని విష్ణువును పిలిచెను. పాద చారియై వచ్చి హరి హరునకు నమస్కరించెను. ముగ్ధ భక్తుల మహిమలు పాత కుల కతఁ(గు)తనుగా శోభను

**కల్లి దేవయ్య :** హావినహాళయను పురమునందు నివసించు క
య్యాయను ముగ్ధ భక్తుని పరదేశీయుల నెపుడు చంపు పాము కఱచి
చనిపోయెను. అతని యింటి దాసి యొకనాడు ద్విజుని చేయి తాకినదని
బిందె పాఱవేసి భసితాంగియై మరొక కడవ తెచ్చుకొనెను. ఆ యూ
బ్రాహ్మణులాగ్రహించి యావిషయమడుగ కల్లి దేవయ్య వారి ముంద
యింటి శునకముతో వేదాధ్యయనము చేయించెను. జంతువులతో వేదాధ్య
చేయించగలిగినట్టి యద్భుతములను ముగ్ధ భక్తులు మాత్రమే చూపగలర

**బిబ్బ బాచయ్య :** గొబ్బూరిలో బిబ్బ బాచయ్య యను శివ
డుండెను. శివ గణముల నత్యంత భక్తితో పూజించువాడు. తద్గణ ప్ర
లను నేలపైబడకుండ గంపలకు పోసి బండిలో తెచ్చి శివభక్తులతో నాన
వాడు. ఒకనాడట్లు ప్రసాదము గొనివచ్చుచున్న బండి నాపి విప్రులు
భక్తుల యిండ్ల యెంగిళ్ళ'-బండి నిండుగబోసి పై చీర కప్పి ఒక వి
పలుకుచున్నాడని హేళన చేసిరి. అంత బిబ్బ బాచయ్య భక్తుల
పరమామృతమని, భక్తిహీనులకది ప్రళయానలంబని పలికి ప్ర
పైనున్న వస్త్రము తొలగించెను. వెంటనే భగభగమని మంట
బ్రాహ్మణాలయములన్ని దహించివేసెను. బ్రాహ్మణులు భయపడి
పరుగెత్తి చివరకు బాచయ్యను శరణు వేడిరి. దయామయుడైన బిబ్బ
యా ప్రాసాదమునకు చేతులెత్తి నమస్కరించగా ఆ మంటలన్నియు చ
బాచయ్య భక్తికి గల శక్తి యట్టిది.

**మాదర దూడయ్య :** మాదర దూడయ్య యను శివ భక్తుని
కమువలన నేర్పడిన బురదయం దొక బ్రాహ్మణుడు పడి లేచి
ముందున్న కుష్ఠవ్యాధి నుండి విముక్తుడయ్యెను. వ్యాధులను పోగొట్ట
ముగ్ధ భక్తుల పాదోదకములకే కలదన్న, వారి భక్తికి గల శక్తి
తెలియుచున్నది.

**భాసన భీమయ్య :** భాసన భీమయ్య యను శివభక్తు డద్భు
రోగములచే బాధపడుచున్న బ్రాహ్మణులను ఆరోగ్యవంతులుగా చేసెన

**శ్వపచయ్య :** శ్వపచయ్యను నీశ్వరభక్తుడొకనాడు వంటచేయు
సామవేదులు ఆకాశమార్గమున పోవుటచూచి వాని దృష్టులు ఆ

పడునేమోయని పాత్రపై మూత పెట్టెను. శ్వపచయ్య మాంసము వండుచున్నా డని తనను చూచి పాత్రపై మూత పెట్టెనని తలచెను. వెంటనే యతని మంత్ర శక్తి నశించి శ్వపచయ్య సన్నిధిని క్రిందపడెను. శ్వపచయ్య చరణాంబు జములకు మ్రొక్కి యతనిచే శివ దీక్షనుగొని ముక్తి పొందెను సామవేదులు.

**ఉద్భటుడు :** పల్లకి యను పురమున ఉద్భటుడను ఉమాపతిభక్తు డుండెను. అతడా పురమునేలు రాజునకు శివదీక్షనొసగిన గురువు, ఉద్భటుడు శివ సాయుజ్యమునొంద దహన క్రియలు చేయగా సమీపముననున్న మట్టిభూత ములు ఏడుమార్లు ఆ పొగతాకగనే కైలాసమున కరిగినవి. అందొక భూతము ఆహారార్థము పోయి తిరిగివచ్చి పండ్రెండువేల యేండ్ల నుండి యద్భటుని మరణమునకే యెదురు చూచుచు అదృష్టము కోల్పోయి ఆ సమయమున నచట యుండలేదని వాపోయెను. రాజు వెంటనే మలయజ కాష్ఠము పేర్చి దివ్యాంబర ములు, నెయ్యివేసి దరికొల్ప ఆశ్చర్యకరముగా మట్టితో కూడ అ భూతము కైలాసమునకేగి చూచువారల కాశ్చర్యము గొలిపెను

**భోగయ్య :** కెంబాగినున్న భోగయ్యయను కలకంఠభక్తుడు నిత్యము జంగమార్చనలు సేయుచుండెడివాడు. ఒకనాడు మహేశుడే భక్తుని పరీక్షింప చనిపోయిన దూడను తెచ్చి వండిపెట్టమని భోగయ్యను కోరెను. భోగయ్య దానితో పెక్కు శాకపాకంబులు చేసి భద్రమూర్తి కారగింపు చేసెను. అంత నాగ్రహముతో నగ్రహారములోని విప్రులతని వెలివేసిరి. పరిపరివిధముల దూషించిరి. శివదూషకుల నంటరాదని, చూడరాదని, మాటాడరాదని భోగయ్య యా వూరు వదలిపోయెను. వెంటనే యా వూరిలోని శివలింగములన్నియు స్థాన ములను వదిలెను. ఆ పురమంతయు నంధకార బంధురమయ్యెను. ఉత్పాతములు పుట్టెను. వెంటనే సంతాపచిత్తులై ద్విజులు భోగయ్య శరణుజొచ్చి సాష్టాంగ నమస్కారములు చేసి క్షమాభిక్ష వేడుకొనిరి. కరుణామయుడైన భోగయ్య తిరిగి ఆ వూరు చేరగానే లింగములన్నియు ఆయా స్థానములకు చేరినవి. ప్రకృతి శాంతించినది. భోగయ్య ముగ్ధభక్తి మహిమకు ఊరిలోని లింగము లన్నియు నతని వెంటనే నడిచినవి.

**గుడ్డవ్వ :** గుడ్డవ్వయను నీశభక్తురాలు కుష్ఠరోగముతో బాధపడు చుండగా ఆ పురమున గల విప్రులు అగ్రహారమునకు రావలదని శాసించిరి. గుడ్డవ్వ సౌరాష్ట్రమునకు పోవుచు నడువలేక నడచుచు పాదములు చిట్లి నడువ

లేక మోకాళ్ళతో ప్రాకుచు, చేతులు కాళ్ళు నిలువకపోవుటతో పట్టుదలతో పొర్లుచు పోవుచుండ మేనంతయు చిట్టిపోగా కరుణాంతరంగుడైన కళకంఠుడు సాకారుడై వచ్చి యామె దేహము దివ్యాంగముగ మార్చి వరము కోరు కొమ్మనగా నాయూరిలోనే ఈశునినెలవై యుండుమని కోరినదా ముగ్ధభక్తురాలు.

**బసవన్న విషమారగించుట :** కల్యాణ కటక మందున్న బోయలు బిజ్జళుని కడకు పోయి బసవన్నతో వచ్చు బోయలు లింగవంతులని వారే ప్రసాదము కొనుచున్నారని తమ కిచ్చుటలేదని వాపోయిరి బిజ్జళుడు బసవన్నను పిలిపించి యడుగ బసవన్న బహేశ్వరునకు కాలకూట విష మర్పింతునని దానిని కొనుటకు రమ్మనెను. ఆ బోయలు శివునకు విషమర్పించి బసవన్న దానినే ప్రసాదముగా గైకొన్న నాటినుండి ఈశుని ప్రసాదమడుగము అనిరి. అందరి కాశ్చర్యము కలుగునట్లు బసవన్న కళకంఠున కారగింపు చేసిన కాల కూట విషము నమృతమువలె నారగించెను.

**ఏలేశ్వరు కేతయ్య :** ఏలేశ్వరు కేతయ్య యను వీరశైవుని పుత్ర మిత్ర కళత్ర గోత్రవర్గములేకాక, పరిచారకులు, పశువులు, పెంపుడు జంతువులు కూడ మాహేశ్వర భక్తులై ప్రాణలింగార్చనయం దత్యంతనురక్తులై యుండిరి. భవులను తలపనైన తలపనివారు. అతని నియమములకు భంగము కలిగించవలెనని తలచిన కొందరు దుర్మదులు కేతయ్య విత్తనములున్న గాదెకు నిప్పు పెట్టిరి. ఏలేశ్వరు కేతయ్య తొణకకు పొణకలలో నీరు తీసికొని పోయి పొలమంతయు విత్తించి పంట పండించెను.

విత్తనములు లేకయే పంట పండించగల శక్తి ముగ్ధ భక్తులకే కలదు. దుర్మార్గులకది యామోదముకాక ఏలేశ్వరు కేతయ్య పశువులను పొలమునుండి తీసికొనిపోయిరి. నాటినుండా పశువులు గడ్డిమేయక నీటిని ముట్టక కన్నీటి తోనే నేడు దినములు గడిపినవి. ఆ చోరులు పశువులు చనిపోవునని భయపడి వదలివేసిరి. ఆ పశువులు వెంటనే పరుగెత్తిపోయి ఏలేశ్వరు కేతయ్యయింట లింగముతో తలలు తాకించి కేతయ్య యింట లింగముతో తలలు తాకించి కేతయ్య పాదముల కొక్కింత వంగి మ్రొక్కి సంతోషముతో పోయి గడ్డిమేసి నీటిని త్రాగినవి. ఏలేశ్వరు కేతయ్య యింటి పశువులు కూడ లింగధారులు కాని వారింట గడ్డి మేయక నీరు త్రాగకుండుట పాఠకుల కత్యంతాశ్చర్యము కలిగించక మానదు.

# రౌద్ర ముగ్ధ భక్తుల కథలు

రౌద్రమునకు క్రోధము స్థాయి భావము. 'శత్రు కృతాపచారేణ మనః ప్రజ్వలనం క్రోధః' అని ప్రతాపరుద్ర యశోభూషణమునందు క్రోధమునకు లక్షణము చెప్పబడినది. (కా.సం.పు. 326) బసవపురాణమునకు శైవభక్తులకు శత్రువులు శైవేతరులు లేక శివాపరాధులు. వారు చేసెడి యపచారములు శివునకు జంగములకును చేయు నపచారములే. వానిని చూచి, విని, మనఃప్రజ్వలనము పొందు భక్తుని భావమే క్రోధము. అది ప్రకృష్టముగా పోషింపబడినచో రౌద్రరస మనబడును. ముగ్ధ భక్తుల కథలయందు చాలవరకు శివాపచారముల నొనరించినవారి పట్ల వీరశైవులు ప్రదర్శించెడి క్రోధమే యెక్కువగా కానబడు చుండును. ఆ కోపమునకు కారణము వారి శివభక్తియే. ఆ శివభక్తికి మౌగ్ధ్యము మూల లక్షణము. అట్లగుటచే ముగ్ధ భక్తి పోషకమైన రౌద్రము గౌణ భక్తి భేదముగా నీ క్రింది కథలయందు కానబడుచున్నది.

**కాటకోటడు :** కాటకోడను గొల్లవాడు ఏటపెంట్రుక తనకీశ్వరుడని పాలతో నభిషేకము చేయగా తండ్రి వచ్చి దానిని కాలితో తన్ని వేసెను. కాలరుద్రుడై కాటకోటడు వెనుకముందాలోచించక గొడ్డలిచే తన తండ్రి తలను నరికెను శివభక్తులు శివాపచారము సహించలేరు తన కీశ్వరరూపము, తన తండ్రికది ఏటపెంట్రుక. తన ఆరాధనకు బావన కాటంకము కలిగించినవాడు తండ్రియైన మరొకడైన లెక్కపెట్టని స్వభావము కాటకోటనిది. అతని రౌద్ర భక్తికి కైలాసమే కదలిపోయినది.

**మడివాలు మాచయ్య :** మడివాలు మాచయ్యయను చాకలి వీరవ్రతాచారయుతుడు దాటిలోనెట్టి బలవంతులెదురైనను తొంగడు. సత్త్వము, ఏనుగు, బంటియైనను నతనిని చూసి వెరచును. పరమతస్థు లెదురైనచో పొడిచి మీదకి నెగురవేయువాడు. పొరుగూరి వాడొకడా విషయము తెలియక యెదురుపడగా మాచయ్య వానిని చంపి శవము నెగురవేసెను వాని శవము కూడ కనిపించ లేదు. అన్యమతస్థులను చూచి పలుకకుండుట, తాకకుండుట, మాట్లాడకుండుట వీరశైవుల నియమము వారి నియమములకు భంగము కలిగెనని వారు ప్రళయ రుద్రులే యగుదురు. బిజ్జలుడు బసవన్న చెప్పినను వినక మాచయ్యను చంపుటకు ఏనుగును పంపెను. ఆగ్రహోదగ్రుడై మాచయ్య మావటి వానిని మద

గజమును చంపి విసిరివేసెను. బసవన్న చెప్పిన భక్తుల మహిమలు విని పశ్చాత్తాపముతో బిజ్జలుడు మాచయ్యను శరణు వేడెను. దయా స్వభావముగల మాచయ్య భసితము చల్లి ఏనుగును, మావటి వానిని, తొలినాడు చంపిన తెరువరిని బ్రతికించెను. ఇందు అంగి రౌద్రము అంగ మద్భుతము.

**శంకరదాసి :** ముక్కంటి కంటిమంటకు భస్మమైన మన్మథుని చరిత్ర సర్వజన విదితము. శంకరుని వలన మూడవ కన్ను బొందిన శంకరదాసి ఆగ్రహమునకు విష్ణువు ప్రతిమ నుగ్గయ్యెను. కల్యాణపురమందు జగదేక మల్లుడను హరిభక్తుడు ఉక్కుతో గోవిందు ప్రతిమను చేయించి దానిపై పంచలోహములు పోయించి ప్రతిష్ఠించి పూజించుచుండ శంకరదాసి యచటకేగి మూడవ కంటితో వీక్షింప నా విగ్రహము పటపటమని పగిలిపోయెను. వీర శైవులకహితము కలుగజేయునవి ప్రాణులైన అప్రాణులైన వాని నంతమొందించుటే వారి నియమము. శైవాపరాధము నోర్చుకొనలేరు. పరదేవతారాధన సహించలేరు. వారి క్రోధమునకు మూలము ముగ్ధభక్తి.

**నిమ్మవ్వ :** నిమ్మవ్వ భక్తిశ్రద్ధలు చూపి చిఱుతొండని గర్వమణచ దలచి పరమేశ్వరు డతనిని వెంటనిడుకొని నిమ్మవ్వ ఇంటికి పోయెను. శివయోగుల కుచితసత్కారములు చేసి నిమ్మవ్వ పంచభక్ష్య పాయసాన్నంబులు వండి నీరు తెచ్చుటకై పోయెను. గోవులను గాచి అలసి వచ్చిన నిమ్మవ్వ కుమారుడు బూరె నొకదానిని తీసికొని తినుచుండగా నిమ్మవ్వ యేతెంచి 'ఛీ కుక్క' యని నిందించి శివద్రోహి యని రౌద్రముతో వాని తలను పగుల గొట్టి శవమును గాడిలోపల వేసి పైన కసపు వేసి వారిని భోజనమునకు పిలిచినది. ఈశు డేమియు నెఱుగనట్లు కుమారుని పిలువుమని పలికెను. వెంటనే నిమ్మవ్వ "కఱకంఠ! యిది యేల కథలు పన్నెదవు? నను జూచి సిరియాలుండని తలంచితివో?" యని పలికి తన ద్రోహమున తానే పోయెనని శివద్రోహిని గూర్చి తలంచ వద్దని ఖచ్చితముగా చెప్పినది. కాంతలు కరుణామయులు. సంతాన సంపదకు మించిన సౌభాగ్యము కోరరు. బిడ్డలకై ప్రాణములనైన నర్పింతురు. సంతానమైన, సౌభాగ్యమైన భర్గుని పూజకు, శైవమతాచారముల కాటంకము కలుగనంతవరకే నన్నది ముగ్ధభక్తుల తత్త్వము. శివద్రోహము జరిగితే ముగ్ధభక్తులు రుద్రులే యగుదురని నిమ్మవ్వ కథ నిరూపించుచున్నది.

**నరసింగనయనారు :** నరసింగనయనారను రాజు పట్టమహిషితో గూడ నాయూరి పరమేశ్వరాలయమునకు పోయెను. పూజార్థమైన పువ్వొకటి కొని రాణి వాసన చూచినదని పూజారి యామె ముక్కు కోసెను. దాని రాజు కా విషయము చెప్పగా కోపించిన ఱేడు రాణిని పిలిపించి క్రొవ్వి ఈశ్వరార్థమై యున్న పువ్వును తాకినట్టి యంగుళులు చాచినట్టి చెయ్యిని నరికెను. అతని ముగ్ధభక్తికి ముగ్ధుడై మారారి ముక్తినిచ్చి నరసింగనయనారు ననుగ్రహించెను. శివాపచారము గావిందినది యర్ధాంగియైనను భక్తు నాగ్రహమునకు గురికాక తప్పలేదు.

**కొట్టరువుచోడుడు :** కొట్టరువునందు నారచోడుడను శివభక్తుడుండెను. గర్భవతియైన రాణి భగవంతుని ప్రసాదము కుడుచుట కాగ్రహించి రాజు అర్చక సహితముగా నామెను చంపెను. భగవదపచారము ముగ్ధభక్తులు సహించరనుట కిదొక చక్కని యుదాహరణము.

**మిండనైనారు :** మిఱుమిండనైనారను శివభక్తుడు జంగమారాధన యందత్యంతనురక్తుడు. ఒకనా డతడు వాల్మీకేశుని ఆలయమున కేగు సమయమున ఒడయనంబి యనువాడు సద్భక్తగణములకు మ్రొక్కక చేతులు జోడింగక చక్కనవచ్చి గుడిచొచ్చుట చూచి మిక్కిలి యాగ్రహించెను. భక్తుని యాగ్రహము భగవంతునికే భయము కొల్పినది. ఒడయనంబి గర్వమునకు మిఱుమిండడు మండిపడి యతనిని వెలిపెట్టెను. వాల్మీకేశుడు సాకారుడై వచ్చి ఒడయనంబిని చాటుగాకొని పారిపోయెను.

'భక్తైకదేహుండ భక్తవత్సలుండ
భక్త సత్రాణుండ భక్తాశ్రితుండ
భక్త పరాధీన యుక్తుండ'-బ.పు;పు. 132.

నని భగవంతుడు ఒడయనంబికి తన తత్త్వమెఱుక పరచెను. భక్తుడైనను శైవాచారధర్మములను నిరసించిన భక్తులుగ్రులగుదురనుట కిదొక నిదర్శనము

**కళియంబనైనారు** : పనిచేయుటకోవని బానిసకొడుకు లింగధారియై భక్తుడయిన కళియంబనైనారింటి కేతెంచెను. భక్తులు, లింగధారులు పరమేశ్వర స్వరూపులుగా భావించు కళియంబనైనారు కాళ్ళుకడుగను నీరు తెమ్మని భార్యను కోరెను. బానిస కొడుకని యామె జలము పోయలేదు. హరమూర్తిని గేలి చేసెనని ఉగ్రుడై భార్య రెండు చేతులను నరికి కళియంబనైనారు మలహరు కరుణ బడసెను.

**గణపాలుడు** : పుడమిపై ప్రజలందరిని శివభక్తులను చేయవలెనను తలపుగల గణపాలుడు వేదార్థములను తెలిపి, అడిగినంత యర్థమిచ్చి సర్వోపాయముల శర్వభక్తులుగా చేయుచుండెను. ఒకనాడు తన కడకు వచ్చినవానితో 'ధనమిత్తు, మనమిత్తు, రాజ్యమిత్తు'నని పలు విధముల నాశ చూపినను ఈశభక్తుడగుట కంగీకారము తెలుపకుండుటతో కత్తితో వెంటనే వాని తల తెగ నరికెను. వాని రౌద్రభక్తికి మెచ్చి హరుడు వరము కోరుకొమ్మనగా 'వరమూర్తి! నీయిచ్చు వరము లేనొల్ల నంగద భక్తుండవగు''మనెను.

**కిన్నర బ్రహ్మయ్య** : కిన్నర బ్రహ్మయ్య యను భక్త పుంగవుడొకనాడు త్రిపురాంతకుని ఆలయమందు కూర్చొనియుండగా వారాంగనార్థము వధించుటకు కొనిపోవుచున్న గొఱియ యొకటి మిండ జంగమము నుండి తప్పించుకొని ఆలయమందు ప్రవేశించినది. కిన్నర బ్రహ్మయ్య దేవుని గుడి సొచ్చినది గాన దానిని వదలివేయుట కిష్టపడక వేయి మాడలు వాని కిచ్చి దానిని భగవంతునకని వదలివేసెను. కాని యా వేశ్య ఆ గొఱియనే కోరుటతో వాడు మరల వచ్చి యెంత చెప్పినను వినక యా గొఱియను పట్టబోయెను. ప్రళయరుద్రునివలె ఉగ్రుడై కిన్నర బ్రహ్మయ్య కత్తితో వాని తల నరుకగానతని శిరము గుడి వెలుపల పడినది. భగవంతుని శరణు జొచ్చిన జంతువునైన రక్షించడము వీరశైవధర్మము. వేయి మాడలయిన నిచ్చి ఆ గొఱియను రక్షించుట తన ధర్మమని భావించెను బ్రహ్మయ్య. కాని భగవంతుని పేరుతో వదలివేసిన నా గొఱియను పట్టి వధించుటకు వచ్చిన ఆ మిండ జంగమను చంపుటకైనను జంకలేదు బ్రహ్మయ్య.

**ఏకాంత రామయ్య** : కటకమందున్న ఏకాంతరామయ్య జైనుడొకడు చెప్పులు వదలకయే శివాగారము సొచ్చుటగని చెప్పులు వదలి మృడునకు సాష్టాంగ నమస్కారము చేయుమని, లేకపోయిన నతనిని నరికి వేయుదునని

మిక్కిలి కోపముతో పలికెను. ఆ జైనుడు ఏకాంత రామయ్య నిక్కంపు భక్తుడయిన తన తలను తానే నరుకుకొని మరల మలహరుతో బడయుమని పలికెను. రౌద్ర మూర్తియైన ఏకాంత రామయ్య రాజును ప్రజలను పరవాదులను పిలిపించి తనతల నరకుకొని ఏడు దినములకు మరల పొందెను. వీరమాహేశ్వరుడైన ఏకాంత రామయ్య వసుధలోన 'జినులనువారి నందరిని నేలపాలు చేసెను. తమ భక్తి విశ్వాసములను హేళన చేయుట భరించలేరు ముగ్ధభక్తులు. రౌద్ర మంగము భక్తి అంగి.

**పిళ్ళనైనారు :** పిళ్ళనైనారు ఆజన్మ భక్తి యుతుడు. పసిబాలుడుగానున్నపుడే గౌరీదేవి వాత్సల్యముతో శాంభవదీక్షితు జేసి పాలిచ్చి పునీతుని గావించినది. కులోత్తుంగ చోడుని పిళ్ళనైనారు శివభక్తి పరుని గావించెను. జైనులను జయించి సర్పదష్టుడైన వెలమని తిరిగి బ్రతికించెను. పదునెనిమిదివేల మంది జైనుల నోడించెను. వారు తనపై పంపిన చిచ్చును మండలేశ్వరుని యంగనను ఘనతర జ్వర రూపమున కాల్చుమని పంపి విభూతి మంత్రించి సగము భాగము జ్వరము పోవునట్లు చేసెను. జైనులెట్టి మంత్రతంత్రముల వలనను ఆ రాణి మిగిలిన సగము భాగము తాపము చల్లార్పలేకపోయిరి. జనపతి వేడుకొనగా పిళ్ళనైనారు భసితము చల్లిపూర్తిగా ఆమె తాపమడచెను. జినమంత్రలేఖతోపాటు శివమంత్ర లేఖను నిప్పులో వేయించెను. శివమంత్ర లేఖను అగ్ని కాల్చలేకపోవుట నిరూపించెను. కావేరి నదిలో వేసినను శివమంత్ర పత్రము ఏటికెదురీదెను. జినమంత్ర పత్రము వరద పాలయ్యేను. ఇన్ని మహిమలు చూపిన పిళ్ళనైనారు అన్యమతస్థులను హింసించుటలో వెనుకాడలేదు. శివాపరాధమునకు పదునెనిమిదివేల మంది జైనులను కాలియున్న యినుప శూలములకు గుచ్చించి చంపించెను. ఎన్ని మహిమలు ప్రకటించగల వారైనను, చనిపోయిన వారిని తిరిగి బ్రతికించగల వారైనను వీరశైవులు అశైవులను గాంచిన ఆవేశముతో అపరరుద్రులై వారి నంతమొందింతురు. వారి ముగ్ధభక్తియే ఆ ఆవేశమునకు, ఆ రౌద్రమునకు మూలము.

**నిడుమారుడు :** నిడుమారుడను నిఖిలేశ్వరుడు వీరమహేశ్వరుడు. పిళ్ళనైనారు పాండభూభాగముపై జిన బౌద్ధసమయములనెల్ల తుడిచివేసెనని విని తన దేశమునందందరిని —

'కొల్వుండు మాశ్రీనీలగళుని
గానినాఁడిందఱ్రగాఁగిన కొర్ర
ఖవీఁదలక్రిందుగాఁ దివియింతు'— బ.పు:పు. 178

అని భయపెట్టి శివభక్తులయిన జినమునులను గాంచి మిక్కిలి సంతోషించెను.

**హిరియ నాచయ్య :** మారుడిగను పురియందున్న హరభక్తుడు హిరియ నాచయ్య. ఆ యూరనున్న వెయ్యి యేడువందల జైనులను చూచి భరించలేక ఆ పురము వదలి పది దినములలో పంద్రెండువేల శివభక్తమండలి తాను పదిహేడువందల శివలింగములను బళ్ళకెత్తించి మారుడిగపై విడిసి, జైనులను తప్ప మిగిలినవారి నాయూరు వదలిపొమ్మని చాటించెను. జైనులతో తలపడి కరముల కరవాలములు ఝళిపించి యరచుచు జైనులను భీతితో మూర్ఛిల్లునట్లు చేసి జినరూపముల తలలు ముక్కలు ముక్కలు చేసి యొక్కొక్క లింగము నిల్పిరి. శైవమత ప్రాశస్త్యమును తెలుప వీరశైవులు తమ తలలు నరుకుకొనుటకైన అశైవుల తలలు నరుకుటకైన వెనుకాడరు.

**అరియమ :** మహేంద్రమంగళమను పురమందు నివసించు అరియమ యను హరభక్తుడు పరదైవమును స్మరించిన వారి తలలు నరికెడి నియమము కలవాడు. ఒకనాడొక బ్రాహ్మణుడు శివుని నుతించుచు వచ్చి భిక్షమడుగ అరియమ భిక్షము వేసెను. అందొక మెదుకపనిపై బడగ నా బ్రాహ్మణుడు పరదైవమును స్మరించెను. మిక్కిలి కోపముతో అరియమ ఆ బ్రాహ్మణుని పొట్ట చీల్చి చంపెను. అది విని ధరణీశ్వరుడు అరియమను చంపుమని తలవరులను పంపెను. అరయమ వరదయామతి కరుణవలన లింగ గర్భము చొచ్చెను. శివస్తుతి విన్న తమకున్న దంతయు నిత్తురు. అన్యదైవమును కొలిచిన వారి ప్రాణములనైన తీయుదురు ముగ్ధభక్తులు. రుద్ర శబ్దము తప్ప మరే శబ్దము విన్నను ముగ్ధభక్తులు రుద్రులే యగుదురు.

**కక్కయ్య :** కక్కయ్య యను ముక్కంటి భక్తుడు పురాణము చెప్పు భట్టు హరిహరులను గూర్చి చెప్పుచు హరి మాహాత్మ్యములను గూర్చి నెక్కువగా చెప్పి హరుని గూర్చి యతని మహిమలను గూర్చి చక్కగా చెప్పలేదని, యతని పక్షపాత వైఖరికి మండిపడి భట్టు తల తరిగి పొట్టలో పెట్టెను. కక్కయ్య క్రోధమునకు కారణ మతని ముగ్ధ భక్తియే.

**జగదేవదండనాయకుడు :** బిజ్జలు డొకనాడు తప్పేమిలేకయే అల్లయ్య మధుపయ్యలను శివభక్తుల కన్నులు తీయించెను. బసవన్న కటకము పాడగునని శపించి మడివాలు మాచయ్య చౌడరాయ, ఏకాంతరామయ్య, కిన్నరబ్రహ్మయ్య,

కన్నడ బ్రహ్మయ్య, మాది రాజయ్య యను పరమ భక్తాగ్రేసరులతో కప్పడి సంగమేశ్వరమునకు పోయెను. శివద్రోహము సహించనని శివద్రోహులను చంపుదునని వీరతాంబూలము గొన్న జగదేవుడు తల్లిదండ్రుల వలన విషయము విని, వారిచే ప్రేరితుడై బిజ్జలుని కొలువునకు పోయి బిజ్జలుని తల కోసి పొట్టలో పెట్టి, భక్తుల కహితము చేయువారందరా విధముగా శిక్షింపబడుదురని పలికి తల్లిదండ్రుల కడకు పోయెను. శివద్రోహమునకు ప్రతీకారము చేసితినని చెప్పి ఆ శివద్రోహి నపుడే చంపక ఆలసించుటకు దండనమని జగదేవు తన శిరము నరుకుకొనెను. శివభక్తుల కపకారము చేసినవాడు రాజైనను దండనార్హుడే. శివ ద్రోహులను హతమార్చుటలో ఆలస్యము చేసిన తనపై తనకే కోపము వచ్చినది జగదేవునకు. శివద్రోహిని చెండాడి శివాపచారమునకు ప్రతీకారము చెల్లించుటలో ఆలస్యమగుటకు తనను తానే శిక్షించుకొను రౌద్ర భక్తి ముగ్ధభక్తులలోనే కాననగును.

గౌణభక్తిరసములలో వీరాద్భుత రౌద్రములు కాక మిగిలినవి బసవ పురాణ భక్తుల కథలయందు మృగ్యము. వంకాయలు, ఏటపెంట్రుక లింగము లయ్యెడి ఘట్టములందు హాస్యము స్ఫురించును కదా యని కొందరు భావింప వచ్చును. కాని శివరూపములుగా భావించెడి యా వస్తువులు వికృతికాలంబనములై హాస్యము పొలగుట విజ్ఞులు మెచ్చరు. అందువలన నట్టి యనుశీలనము నిందు పాటించలేదు.

గౌణభక్తిరసములు ప్రధాన భక్తిరసములకు పోషకములు కావచ్చును. అన్నియు కలసి ముగ్ధభక్తికి బలము నేకూర్పవచ్చును. బసవపురాణమునందు భక్తుల గాథలే భావతరంగములు. ఆ తరంగముల విలాసములందు భాసించు భక్తి భావైక్యమే పురాణములందలి ప్రధాన రసము. ప్రబంధ ధ్వని నాశ్రయించి బసవపురాణమునందు ముగ్ధభక్తి ప్రధాన రసమనియు, మిగిలిన వన్నియు తత్పోషకములనియు నిశ్చయింపనగుచున్నది.

వైష్ణవ శైవ సంప్రదాయములందు రెండింటను కానవచ్చు నవవిధభక్తి వివేచనము భాగవతమునకెట్లు వర్తించునో బసవపురాణమునకును నట్లే వర్తింపచుటకు వీలగుచున్నది. మధురభక్తియందు నవవిధ భక్తులెట్లు ప్రవర్తితమగునని పూర్వాధ్యాయమునందు పరిశీలించుటయైనదో ముగ్ధభక్తియందును నవవిధ భక్తులు ప్రవర్తిల్లుటకు వీలున్నదని ఈ యధ్యాయమునందు నిరూపించుటకు వీలగుచున్నది.

# నవ విధ భక్తులు

'శ్రవణం కీర్తనం శంభోః స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్॥'84

భగవంతుడే ప్రతిపాదించిన నవవిధ భక్తి మార్గముల ననుసరించిన ముగ్ధ భక్తులు బసవపురాణమునందు కలరు.

## శ్రవణ ముగ్ధ భక్తి

భగవంతుని రూపగుణ మహిమలను పాటల వలన పురాణ పఠనము వలన కథలవలన దృశ్య శ్రవ్య కావ్యముల వలన విని ఉత్తేజితులై మనసు భగవదర్పితము చేసి ముక్తి పొందినవారు శ్రవణ భక్తులు. శౌనకాది మునుల శ్రవణ భక్తి విఖ్యాతమే. ముగ్ధ భక్తులలో కొంత విలక్షణత కనిపించక పోదు. వీరశైవుల కావేశమధికము. ఉత్సాహ మపరిమితము.

రుద్రపశుపతి శ్రవణ భక్తుల కోవకు చెందినవాడే. పౌరాణికుడు చెప్పిన శివపురాణము విని హరుడు హాలాహలము మ్రింగెనని తెలిసిన క్షణములో తన ప్రాణములు విడుచుట కుద్యుక్తుడై శ్రీకంఠు ననుగ్రహము బడసెను.

కక్కయ్య కూడ శ్రవణ భక్తుడే. హరి హరులను గూర్చి చెప్పుచున్న పౌరాణికుడు హరిని గూర్చి అధికముగా చెప్పి, హరుని గూర్చిన వర్ణన నల్ప ముగా బల్కుట కోర్చుకొనలేక పోయెను.

'బ్రహ్మాద్యైర్మలిన ప్రాయైర్నిర్మలే పరమేశ్వరే
సామ్యోక్తిం యోన సహతే సవై మాహేశ్వరాభిధః'85

'బ్రహ్మ విష్ణు రుద్రేంద్రాస్తే సంప్రసూయంతే' అను శ్రుతి వాక్యము బట్టి జనన మరణములచే పీడింపబడి అణవాది మలములతో కూడినట్టి బ్రహ్మా దులతో పరమేశ్వరునకు సామ్యము చెప్పుట యోర్వలేనివాడే మాహేశ్వరుడు.

పౌరాణికుని పలుకులు విని ఓర్చుకొనలేని కక్కయ్య యీ విధ
పలికెను:

'బ్రహ్మ కపాలమునుబట్టి హరుడు భిక్షించెనని' పలికెనుగాని
'వరశూలమున విష్వక్సేనునిఁ బొడిచెనని' పలుకలేదు
'నరసింహరూపమై హరి హిరణ్యాక్షు హరియించెననెను' గాని
'శరభము రూపము దాల్చి నరసింహాంద్రుంచి హరుడు
దిత్తొలిచిన యది'
'సర్వం విష్ణుమయమని' చెప్పెనుగాని
'అసమలోచనుడు సర్వ సంహారంబు చేయ 'హరియు సర్వము

'హరికర్త జగముల కనియెడిఁగాని - హరికిని భర్త యీశ్వ

'హరి విశ్వనామాంకుడనియె' కాని 'హరు విశ్వేశ్వరుండని' చ
హరి పరాశక్తి దాననియెడిఁగాని హరుడు పరాపరుఁడని పలుక
హరిహరుఁడనెడిశబ్దార్థ మార్గమిని - హరిహరుడన్న నొకడు అని
హరిని హరించుట యదికారణముగ - హరిహరుఁడనుమార హరు
డనడని యలిగి యా పౌరాణికుని తల తరిగి పొట్టలో పెట్టిన
ఆ శ్రపణభక్తుడైన కక్కయ్య. (కక్కయ్య కథ. బ. పు
పు. 220,

## కీర్తన ముగ్ధభక్తి

భగవత్కీర్తన చేయుచు భక్తుడు తాదాత్మ్యము చెంది ఆధ్యాత్మి
చములో నడుగుపెట్టి భగవద్భావనలో మనసు లయింపజేసి ధన్యుడగు
క్షయమునకు, ప్రాపంచిక విషయ విస్మరణకు, భగవంతునిపై చిత్త
పుటకు, భగవదనుగ్రహమునకు, భగవంతు నాకర్షించుటకు భ
భక్తులు కీర్తింతురు. భగవంతుని ప్రసన్నునిగ చేసికొనుటకు కీర్త
మించిన సాధనము లేదు.

బసవపురాణమునందు నందీశ్వరుడు చేయు తపమునకు భవ
మేశ్వరానుగ్రహమునకై సకల దేవతలు కీర్తించిన విధము గమనిం

'దేవ! దేవేశ్వర! దేవతారాధ్య!
దేవచూడామణి! దేవాధిదేవ
పరమ భట్టారక! పరమస్వతంత్ర!
పరమేశ! పరమాత్మ! పరమ! పరుండ!
శంకర! పంకజ సంభవాద్యమార!
శంకర! దురితభయంకర! యభవ!
యక్షయ! సర్వజ్ఞ! యఖిలలోకైక
రక్షక! దక్షమఖక్షయ! దక్ష' — బ. పు. పు. 10

భక్తులు భగవంతుని కీర్తించుట సర్వసామాన్యము. కాని భగవంతుడే భక్తుని గుణకీర్తనము గావించు టసామాన్యము. భక్తుడైన బసవని శక్తిని మహిమను కొనియాడుచు తనంతవాడని యీశుడే కీర్తించుట బసవపురామునందు కానగును. పార్వతితో పరమేశ్వరుడు బసవని గూర్చి పలికిన పలుకులివి.

'లోకాధిపతి నేను లోలాయతాక్షి
ప్రాకటంబుగ లోకపావనుఁడితఁడు
కారణలోక సంహారుండ నేను
కారణలోకోపకారి యితండు
భక్తవత్సలుఁడ నేఁబర్వతపుత్రి!
భక్తరత్నములకు బండారియితఁడు
భక్తైకదేహుండ భావింప నేను
భక్తజనప్రాణి బసవఁడీక్షింప
ముక్తికి రాజఁజూ ముద్దియనేను
భక్తికి రాజుసూ బసవఁడీక్షింపఁ
బసరింపనే లింగపట్టబద్ధుండ
బసవండు సద్భక్తి పట్టబద్ధుండు
అచరలింగంబనే నచలేంద్రతనయ
నచరాచిర క్షోణిఁజరలింగ మితఁడు
సనునాది నా పేరు శంభుండనంగఁ
బొనర ద్వితీయ శంభుండు వీనిపేరు
స్థిరభక్తిమమ్ముఁ గొల్చినఁగానిలేదు
ధర వీనిఁదలఁచినంతనె ముక్తిగలదు'-బ.పు.పు 51.

బసవన్న మంత్రిని తనకన్న అధికునిగా గిరిజారమణుడు కీర్తిం గమనార్హము. సాక్షాత్ భగవంతునిచే కీర్తింపబడిన బసవన్న తన గీతః విని మండిపడిన మడివాలు మాచయ్యను ప్రసన్నునిగ చేసికొనుట క కీర్తించిన విధము గమనించదగినది. తా నజ్ఞానియనియు, మాచయ్య యనియు, తాను పశుజీవి కాగా, మాచయ్య పశుపతి యని తా నధమా డయినట్లు మాచయ్య ఉత్తమోత్తము డయినట్లు కీర్తించెను. మాచం శాంతింప చేయుటకు నత నను గ్రహము బడయుటకు కీర్తనను వి సాధనము లేదని బసవన్నకు బాగుగా తెలియును. బసవన్న మాచయ్య గానము నొనర్చిన విధము:

'నీ మహత్త్వముఁ జూడ నేనెంతవాడ
ధీమణీ! సంగయ్య! దేవ! సర్వజ్ఞ!
నీవు శంకరుఁడవు నేను గింకరుఁడ
నీవు నిర్మలుఁడవు నేను దుర్మలుఁడ
నీవు విజ్ఞానివి నే నవిజ్ఞాని
నీవమృతాంగుండ వేవిషాంగుండ
నీవు మహాదాత వేఁగృపణుండ
నీవు పశుపతివి నేఁ బశుజీవి
స్వామి! త్రైలోక్య చూడామణి వీవు
భూమి నిర్భాగ్య చూడామణి నేను
బోరినిట్టి దుర్గుణంబుల ప్రోఁకలోన
నరయంగఁ గలదె నాయందు సద్గుణము
రక్షింపు మిట్టి గర్వప్రాప్తునన్ను
శిక్షింపవేయయ్య! జియ్యనాద్రైన
యపరాధ శతసహస్రావలిసైఁచి
విపరీత మహిమాఢ్య! వేయునునేల'-బ.పు. పు. 110.

బసవన్న మడివాలు మాచయ్యను సాక్షాత్ భగవత్స్వరూపునిగ చెను. తాను చేసిన మహాపరాధమున కుగ్రుడయిన మాచయ్య కోపము టకు కీర్తించుటయేగాక తనయందు సద్గుణమే లేదని తనను రక్షిం

గర్వించిన తనను తగు విధముగా శిక్షించుమని అతి వినయముగా ప్ర
పడెను. వీరశైవులు లింగధారులను శివస్వరూపులుగా భావించుట నియ
తాను నమ్మిన సిద్ధాంతములను జీవితములో నాచరించిన ధన్యజీవి బ
తనపై కోపముతో చిందులు వేయుచున్న మాచయ్యను కీర్తించి 
యతని యనుగ్రహము బడసెను.

## స్మరణ ముగ్ధభక్తి

మృదుమధురములైన పదములతో భగవంతుని నామ రూప
మహిమలను గానము చేయుట కీర్తనము. ఇది వాక్కునకు సంబంధి
స్మరణభక్తి మనసుకు సంబంధించినది.

భగవంతుని స్మరించుట వలన సర్వ పాపములు హరించును.
సాగరము నుండి దరి చేర్చగల శక్తి భక్తికే కలదు. భగవంతుని స్మ
వలన క్లేశముల నుండి విడివడుటయేకాక శుభములను పొందుదురు.

'మనో మహేశ శ్రవణం బాహ్యాభ్యంతరముచ్యతే
మనో మహేశ ధ్యానాఢ్యం నాన్య ధ్యానరతం మనః॥'

'శివనామరతా వాణీ వాఙ్మవాచైవనేతరా
లింగైశ్శివస్య చోద్దిష్టైస్త్రి పుండ్రాది భిరంకతః
శివావచార నిరతః కాయః కాయోనచేతరః॥'86

శివధ్యానము నందే మనసు ఆసక్తమై యుండవలయును. అ
ధ్యానమం దాసక్తి కలది మనసే కాదు. శివనామోచ్చరణమందే
యుండవలయును కాని యితర దేవతా నామోచ్చరణము గావించున
కాదు. భస్మత్రిపుండ్రములు, రుద్రాక్షములు, లింగధారణము మున్న
శాస్త్రోక్తముగా ధరించి లింగార్చనకే శరీర మర్పితము చేయువాని
దేహము కాని అన్య దేవతా చిహ్నములతోకూడి పరదేవతా పూజయం
మైన దేహము దేహము కాదని వీరశైవ సిద్ధాంతము.

భగవంతుడే సర్వ రక్షకుడని స్మరించుటవలన భక్తుడు 
డగును. భారము భగవంతునిదేనని నమ్మిన భక్తైకదేహుడైన ప
భక్తులకే యాపద రానియ్యడు. బసవపురాణమునందు వైజకవ్వ స్మ
ప్రత్యేకముగా చెప్పకొనదగినది.

పరమేశ్వరు సమరక్తితో నిత్యము కొలుచు వైజకవ్వ తన భర్తయు, పురజనులందరును జినమార్గవర్తనులగుటకు మిక్కిలి వ్యథ నొందినది. భర్త యొకనాడు జైనులను విందునకాహ్వానించగా హరమూర్తి యొకడైన రాలేదని తాను చేసిన పాయసాన్నంబులు పరులపాలగుచున్నవని మిగుల దుఃఖించు చుండగా తపోవేషియై మృడుడేతెంచి ఆమెకానందము కలిగించెను. జంగమదేవర భుజించుట చూచి వచ్చిన జినులు వెను తిరిగిపోవుటకు వైజకవ్వ భర్త కోపించి-

"సమ్మెటఁ గొని చాటు చాటున వ్రేయ
నతివయు లెక్కసేయక శివుఁదలఁపఁ
బతివ్రేయువ్రేల్లెల్ల సతిమీఁదబడక'-బ. పు. ప్ర. 189.

జినులకు తాకగా 'వాయెత్తియేడ్చు'వారు 'సందులకేఁగుచుఁ గ్రింద సొచ్చుచును' 'చెఱువుల మునుఁగుచుఁ జెట్లఁ బ్రాకుచును' 'వేట్లకు నులుకుచు' 'వచ్చెఁజావనుచు' 'తలలుగుండుతోడ తాకించుకొనుచు' 'చొరజోటులేదంచు సొమ్మసిల్లుచు' 'హరుకృత్యమో' కాకయనుచు, తల్లడిల్ల యొక బుద్ధిమంతుడు వీక్షించి—

'చాటున నొకవ్రేటు సతివ్రేయఁ జూటు
చాటున నీజైనకోటిఁ దాఁకెడిని'-బ. పు. పు. 189.
అనుచు అతివ కడ్డంబు వచ్చి వారించెనట.

భగవంతుని స్మరించుట వలన వైజకవ్వ తాను పొందవలసిన బాధల నుండి విముక్తురాలగుటయేగాక దన దైవము నపహసించినవారికి బుద్ధి వచ్చునట్లు చేయగలిగినది. ఈ కథ అంబరీషుని కథను గుర్తుకు తెచ్చును. బసవ పురాణమునందు భగవంతుడేకాదు - బసవన్న కూడ తనను స్మరించిన భక్తుల నాదుకొనినట్లు నిదర్శనములు కలవు.

పూజకై పూవులు కోసికొనిపోవుచు బురదలో జారి పడబోవు సమయమున చిట్టంబలుడను శివభక్తుడు 'చిట్టంబలాధీశ' యని స్మరించగనే బసవన్న భక్తుని జారిపడకుండ కాపాడెను.

చల్ల కడవ తీసికొనిపోవుచున్న గొల్లెత బురదలో జారిపడబోయి 'బసవా' యని స్మరించినంత మాత్రముననే నిండుకొలువులోనున్న బసవన్న 'ఓడకుమోడకు' మనుచు చేతులెత్తికాపాడినట్లు బసవపురాణమున వర్ణింపబడినది.

# పాదసేవన ముగ్ధభక్తి

భగవంతుని పాదపద్మములు సేవించి తరించవలెనని తలంచని భక్తు లుండరు. శైవులు భగవంతుని రెండు రూపాలలో పూజింతురు. నిర్గుణ బ్రహ్మము లింగాకారముగను, సగుణ బ్రహ్మము శివరూపముగను ఆరాధింతురు. జంగమదేవరను వ్యక్తలింగముగా భావింతురు. జంగమదేవుని సాక్షాత్ భగవ త్స్వరూపునిగా భావించి పూజించుట వీరశైవుల యాచారము, విధి.

మ॥ "పలు తీర్థంబులఁ గ్రుంకుకంటె మహిలో భక్తాంఘ్రి పానీయముల్
తలమీఁద జిలికించుకోఁదగును దీర్థంబాడ బారంబు త
త్ఫల మత్యల్పము భక్త పాద యుగళాంభ స్స్పర్శ నిర్భారమై
యలరున్ శాశ్వత భుక్తి ముక్తి ఫలదంబై యుండు సర్వేశ్వరా![187]
(అనుభవసారము)

ఇట్టి ఆచార నిరతిగల బసవన్న భక్తుల పాద సేవనము పాల్కురికి సోమనాథుడీ విధముగా వర్ణించెను. మహాత్ముల పాదసేవనమున కతని యాత్మ యుప్పొంగిపోయెడిది. భక్తుల పాదధూళిలో పొర్లి పొర్లి బసవన్న ఆనందసాగర మున తేలియాడేడివాడు.

'మంగళహర్షోదితాంగ విక్రియల
సంగతి నాత్మనుప్పొంగి యుప్పొంగి
భయభక్తియుక్తిఁ దద్భక్తాంఘ్రి చయము
పయిఁ జక్కఁ జాగిలఁబడి మ్రొక్కిమ్రొక్కి
పటుతర సద్భక్త పాదాబ్జ రేణు
పటల పర్యంకంబుపైఁ బొర్లి పొర్లి
హర భక్తని కరదయామృతవృష్టి
పరిగొని కురియఁ దొప్పఁగఁ దోఁగి తోఁగి
యొడయల దివ్య పాదోదక వార్ధి
నడునీటఁ గడువేడ్కబడి తేలి తేలి' — బ.పు.పు. 33.

బసవన్న భక్తులను సేవించినట్లు తెలియుచున్నది. ముగ్ధ భక్తులందరికి పాదసేవనమునందత్యంతాను రక్తియను విషయము బసవ పురాణము ధ్రువ పరచుచున్నది. చిఱుతొండనిగొని మారు వేషమున పరమేశ్వరుడు నిమ్మవ్వ యింటికి పోగా,

'పదఁతియు బిట్టుల్కిఁపడి సంభ్రమమున
నడుగుల కెరఁగి పాదాబ్జముల్ గడిగి
యంగన ప్రచ్ఛన్న లింగమూర్తులకు
సాంగోచిత క్రియాభ్యర్చనల్ సేసి' బ.పు;పు 118

తరించినది. సాక్షాత్ పరమేశ్వరుని, పరమేశ్వర స్వరూపునిగా భావించి అతి సంభ్రమమున సేవించి ముక్తినొందిన భాగ్యశాలి నిమ్మవ్వ.

ముగ్ధ భక్తుల ప్రవృత్తులు కొన్ని యెడల విలక్షణముఁగా కాననగును. వీరశైవులకు శివభక్తులందరు శివస్వరూపులే, తానావిధముగా భావించి పూజించుటే కాదు, తనవారు కూడ శివభక్తు నట్లే కొలువవలెనని శైవులు తలంచుట కద్దు. భక్తులకెట్టి యపచారము కలిగినను సహించలేరు. శివలాంఛన ధారులందరు వారికి పూజనీయులే. జాతి వివక్షత వీరశైవులకు లేదు.

'సుకృతీ దుష్కృతీ వాపి బ్రాహ్మణోవాఽన్త్యజోఽపివా
శివైక భావయుక్తానాం సదృశో భవతి ధ్రువమ్॥'88

సర్వము శివమయమను భావము కలవారికి పుణ్యాత్ముడు, పాపాత్ముడు; బ్రాహ్మణుడు, కడజాతికి చెందినవాడను భేదముండదు, అందరు సమానులే.

'పూజనాచ్ఛివభక్తస్య పుణ్యాగతి రవాప్యతే
అవమానాన్మహా ఘోరోనరకో నాత్రసంశయః'89

శివభక్తుని పూజించుట వలన పుణ్యగతులు కలుగును. శివభక్తు నవమానించిన ఘోర నరకమే యబ్బుననుటలో సందియము లేదు.

దృఢ విశ్వాసము, నిశ్చల భక్తిగల ముగ్ధ భక్తులు శివాపచారము భక్తాపచారము సహించరు. కళియంబనైనారను ముగ్ధ భక్తుడు పని చేయ నోపని బానిస కొడుకు లింగధారియై తన యింటికి వచ్చుట చూచి సాక్షాత్ పరమేశ్వరునిగా భావించి పూజించెను.

'అఘోరాఽపాపకాశీతి యతే రుద్ర శివాతనూః
యజుషాగీయతేయస్మాత్తస్మాచ్ఛైఽఘ వర్జితః॥'

'యో లింగధారీ నియతాంతరాత్మ
నిత్యం శివారాధన బద్ధ చిత్తః
సధారయేత్సర్వమలాప హత్యై
భస్మ మలంచారు యథా ప్రయోగమ్॥'

'యతే రుద్ర శివాతనూర ఘోరాఽ పాపకాశినీ! తయానస్తనువా శంతమయాగిరిశం తాభి చాకశీషా'90_ అని యాజుష మంత్రముకూడ లింగధారణనుగ్గడించుచున్నది. లింగధారియైన శైవుడు పాపరాశివలన విముక్తుడగును.

కళియంబనైనారు లింగధారియైన దాసి కొడుకును చూచి పాపరాశివలన ముక్తుడయిన పుణ్యాత్ముడనియు అతని పాదములు కడుగుటకు నీరు తెమ్మని భార్యను కోరెను కానియామె దాని కొడుకని యాతని పూర్వపుస్థితిని తలచి జలము పోయలేదు. అంత 'నాలిచేసితి గదా హరమూర్తి' ననుచు భార్యచేతులు నరికి ముగ్ధభక్తిచే ముక్కంటిని మెప్పించెను.

వీరశైవులు భక్తులకెట్టియపచారము, అవమానము జరిగినను సహించరు, భరించలేరు. వారిది ఆవేశపూరితమైన భక్తి. అత్యధిక వేగముతో ఎత్తైన కొండలనుండి పరవళ్ళు త్రొక్కుచు ప్రవహించు జలపాతమువంటి వారి భక్తికి యేది యాటంకమైనను సమూలముగా కొట్టుకొని పోవలసినదేకాని యెదురు నిలువలేదు.

## అర్చన ముగ్ధభక్తి

చిత్తము శివునిపై నిలుపుటకు భక్తు డొనర్చు ప్రక్రియలలో అర్చన ముఖ్యమైనది. వీరశైవులకు లింగార్చనకన్న ముఖ్యమైనది, ప్రాణప్రదమైనది, మక్కువకలది మరొకటిలేదన్న అతిశయోక్తి కాదు.

'బ్రహ్మాదయ స్సురా స్సర్వేమునయ శ్శౌనకాదయః
శివలింగార్చనాదేవస్వంస్వం పదమవాప్నువాన్'91

బ్రహ్మాది దేవతలు, శౌనకాది మునులు శివలింగార్చనముచేతనే తమతమ స్థానముల నందియున్నారు.

శివరూపము నర్చించువారు కొందరు, లింగార్చన సల్పెడివారు కొందరు. ధూపదీపములతో, పూలుపళ్ళతో వివిధములైన సేవావిధులతో నర్చించుట సర్వసామాన్యము.

'ఆత్మభోగాయ నియతం యద్ద్రవ్యం సమాహితం
త తత్పరమదేవాయ భుంజీతాతః విశుదయే'92

వీరశైవులు తా మనుభవించేది వస్తువైనను భగవంతున కర్పించి చిత్త శుద్ధికై తాము భుజించవలెనని సిద్ధాంత శిఖామణి నుడువుచున్నది.

'ఆకునుఁ బువ్వునుఁ గాయయు(ఁ), బ్రాకటముగ
నన్నపాన భక్ష్యాషధముల్

శ్రీకంఠు నకర్పించక, చేకొనుటలు మద్యమాంసన సేవనగాదే'93
అని శివతత్త్వసారము తెలియజేయుచున్నది.

కల్యాణమునందున్న కారణజన్ముడైన సురియ చౌడయ్య నేడు నాడనక ముప్పొద్దులు జంగమ కోటికర్చనలు చేయుచు దివ్యాన్నపానములతో వారి నానందింప జేసెడివాడు. తన ప్రాణలింగమునకు——

'పశ్చెరమున నెల్ల పద పదార్థములు
పెల్లుగా వడ్డించి పేరు పేరునను
నరుదొందఁ గడిగడి కందిచ్చుచుండఁ
గరమర్థితోఁ గడిగడి కందుకొనుచు
భక్తవత్సలుఁడగు పరమేశ్వరుండు
వ్యక్తిగాఁజేసేత నారగించుడును
ముప్పొద్దుఁ బ్రాణలింగ ప్రసాదంబు
సుప్రసన్నత జంగమ ప్రసాదంబు
గూడ భోగించుచు రూఢివెంపార — బ.పు; పు. 165.

వేడుక చౌడయ్య విహరించుచుండెడివాడట. పరమేశ్వరుడే వచ్చి అర్చనలు గొన్నడన్న నా భక్తునకు కావలసినదేమున్నది? అతని జీవితము సఫలమైనది. వంశము ధన్యమైనది.

ముగ్ధ భక్తుల అర్చన విధానములో కొంత విలక్షణత లేకపోలేదు.

'శివలెంక మంచయ్య శ్రీకాశిలోనఁ
దవిలి విశ్వేశ్వర స్థానంబునందుఁ
దప్పక శివునకుఁ దన పది వ్రేళ్ళు
ముప్పూఁట బూజించి యప్పడ పడయు' — బ. పు. 197 (పు.)

వీరశైవులకు శివార్చనమునం దుత్సాహమధికము. భగవంతుని సంతోష పెట్టుటకు సర్వము నర్పించువారు. శివలెంక మంచయ్య భగవత్ప్రీతికై మూడు పూటల తన పది వ్రేళ్ళ నర్పించి పరమేశ్వరానుగ్రహమున మరల పొందు వాడు. భగవంతునకు మనసునే యర్పించినవారు కనక తనువునర్పించుటకు ప్రాణము నర్పించుటకు వెనుకాడనివారు ముగ్ధభక్తులు. పూజకు ఒక్క పువ్వు తక్కువైన తన నేత్రకమలమర్పించిన దోచమాంబను గురించి బసవపురాణమున పేర్కొనబడినది.

'నిరతిశయ ప్రీతినిత్యంబునైదు
కరవీరపుష్పముల్ హరునకర్పింప
నొక్కనాఁడొకఁడందుఁ దక్కువయైనఁ
గ్రక్కునఁదన నేత్రకమల మర్పించి
భవునిచే నసదృశాంబకమబ్ధ పడసి
ధ్రువకీర్తిఁ బేర్కొన్న దోచమాంబయును'-బ. పు. పు. 3.

భక్తులందరు భగవంతున కర్పించిగాని భుజించరు. ఇది సామాన్యముకాని పశువులు సహితము భగవంతు నర్పించక నీటినికూడ ముట్టని సంఘటనలు బసవపురాణమునందు కలవు.

ఏలేశ్వరు కేతయ్యయను శివభక్తుని బాధించుటకు పంచకులు పొలము నుండి యతని పశువులను తీసుకొనిపోగా నవి నీటిని కూడ ముట్టకయుండెను.

'నిండినకొలఁకుల నీర్గలచోట
మఱచియైనను బులు గఱవక నీరు
దఱియుచో మూతులు దడియంగనీక
యేడునాళ్ళనుగూడ నిటు సనుచుండ
చూడ నక్కజమైనఁ జోరులూహించి'-బ. పు. పు. 138.

గడ్డి మేయక నీరు ముట్టకయున్న యా పశువులను చూచి దొంగలు మరి రెండు దినము లట్లేయున్న తప్పక చనిపోవునని తలచి వదలివేసిరి. ఏలేశ్వరు కేతయ్య పశువులు ప్రాణములు విడుచుటకైనను సిద్ధపడినవికాని నిత్యలింగ స్పర్శ నియమము సలుపక మేయుట కిష్టపడలేదు. ఆకలితో నలమటించు ఆ పశువులు వదలివేయగానే-

ిలివేగమున వచ్చివచ్చి యొండొండ
ూ(కరల్గొట్టుచు నుత్తలపడుచు
(క( గన్నులు విచ్చివిచ్చి చూచుచును
ులు లింగంబుతో(దా(కించికొనుచు
ుగొని వచ్చుచు వడి మూరుకొనుచు
ట లింగవిముఖులై యే(గుట(గోలె
ప వూరికఱ్ఱయు నంటకుండుటకు
త్యమీలింగంబు సాక్ష్యమన్నట్లు
త్యలింగస్పర్శ నియమముల్సలిపి
గక్కున కేతయ్యగారి పాదముల
ిక్కింత వంగుచు మ్రొక్కి తత్క్షణమ
ుప్పిరిగొని పాటి చొప్పయు గసువు
ప్పుడు దమ కడుపార మేయుచును'- బ.పు;పు 139.

ంగావసరములు సెల్లింపక భుజించని భక్తు లనేకులు కలరు. లింగా
ుకు నిత్యమేగి యర్పించు భక్తులు కొందరు. ఇంటనే లింగపూజలు
ించువారు కొందరు. యుక్తాయుక్త విచక్షణగల మానవులు భగవదను
వలన బడసిన వానిని భగవంతున కర్పించి భుజింతురు. కాని,
కేతయ్య పశువులు లింగస్పర్శ నియమములు సలిపిగాని గడ్డిని
ట్టకపోవుట ఆశ్చర్యకరమైన విషయము.

## వందన ముగ్ధభక్తి

ందనము ద్వారా భగవదారాధనయందలి ఆసక్తి వ్యక్తమగును. భగవ
పము కనిన భగవత్ సంకీర్తనము వినిన నామస్మరణము చేసిన భక్తుడు
మూసికొని యా భగవద్రూపమును మనసున సాక్షాత్కరింప చేసికొని
ంద పారవశ్యముతో వందనమాచరించి పునీతుడగును. వందన మాచ
ుడు భక్తుని మనసు భగవద్రూపమయమగును. పరిసరములను మరచి
ురునియందే లీనమగును. భక్తుని కవియే మధుర క్షణములు. తనను
గవంతున కర్పించుకొనిన ఆ మధుర క్షణములో భక్తుడు భగవంతునకు

అతులనిష్ఠాగరిష్ఠులయినవారు వీరశైవ ముగ్ధభక్తులు. ఇలలో కలలో పరమేశ్వర భావము తప్ప పరభావ మెరుగని నిర్మల నిశ్చల హృదయులు. పరదేవతా విగ్రహములందు సహితము పరమేశ్వర సాక్షాత్కారము కలుగునట్లు చేసికొనగల శక్తి ముగ్ధభక్తుల వందనమునకే కలదని బసవ పురాణము నందలి కథలు నిరూపించుచున్నవి.

వ్యవహారమున కేగిన బల్లేశు మల్లయ్య లింగాలయముల సేవించి కాని శివు నర్చించి పూజించిగాని భుజించని నియమము కలవాడు కాన భుజించ కుండుట చూచి వంచకులు కుంచెమునకు కొండ గోగులతో పూజచేసి, కఱకంఠుని గుడియని మల్లయ్యను గొనిపోయి పూజ చేయించిరి. బల్లేశు మల్లయ్య 'శివాయ నమోనమో'యని యందంద మ్రొక్కి వచ్చి భుజించెను. వంచకులు 'కుంచెమునకు మ్రొక్కి కుడిచె'నని హేళన చేసిరి. 'సాక్షాల్లింగమూర్తి కాక కుంచెమె నమ్మరేని రండు చూపెద'నని పలికి వారిని కొనిపోవ అతని భక్తికి కుంచె లింగమయ్యె.

'యద్యత్పశ్యతి సామోదం వస్తులోకేషు దేశికః
శివ దర్శన సంపత్తిస్తత్ర తత్ర మహాత్మనః
యద్యంచ్చింతయతే యోగమనసా శుద్ధ భావనః
తత్తచ్ఛివమయత్వేన శివధ్యాన ముదాహృతమ్'94

శివలింగైక్యుడు ఏ వస్తువును ప్రేమపూర్వకముగా చూచుచున్నను, ఆ మహానుభావునకు ఆయా వస్తువులన్నిటను శివదర్శనమగును.

నిర్మలాంతఃకరణుడైన శివయోగి యే వస్తువును మనసున భావించిన యవి యన్నియు శివ స్వరూపములుగానే తోచును. మల్లేశు వందన మహిమకు కుంచె లింగమయ్యెను.

వైజకవ్వ జైనాలయముగని శివాలయముగా తలచి లోపల ప్రవేశించి 'ముక్కంటి శరణ'ని మ్రొక్కగా నట ముందున్న జిన ప్రతిమ పగిలి యందొక అద్భుత లింగమూర్తి ఉదయించెను. వైజకవ్వ ఏ పరమశివుని తలచి నమస్కరించినదో ఆమె వందన మహిమకు ముందున్న జిన విగ్రహము ముక్కలై అద్భుత లింగమావిర్భవించినది.

మనసున స్మరించిన లింగరూపము మహిలో సాక్షాత్కరింపచేసికొనగల శక్తి సోమన్న వందనమునకు కలదని యీ క్రింది కథ నిరూపించుచున్నది.

సోమన్న యను శూలి భక్తుడు త్రికాలమునందు లింగ స్పర్శనము నియమముగా కలవాడు. ఒకనాడు కన్నులు నొవ్వ గుడికి పోనేరకయున్న, జైనులతనిని జిన మందిరమునకు గొనిపోయి 'మ్రొక్కుము వీఁడె మీ ముక్కంటి' యనిన లింగాకృతినున్న జినుని తలను చేతులుపెట్టి స్పృశించి ముమ్మారు సాష్టాంగ నమస్కారము చేయగా నా వంచకులు చాలుచాలు జినుడనుగ్రహించెనని పలికిరి. 'జినునికి గినునికిఁ జేతులెత్తుదునె చా, వన్నలార! సాక్షాల్లింగమూర్తి, జూపెద రండ'నుచు కంటికి కట్టిన కవణము పుచ్చి కన్నులు తెరువగా అంతకు ముందటనున్న జినరూపము పటపట పగిలి నిటలలోచనుచట నిలిచెను.

'నార్చయే దన్యదేవాంస్తునస్మరేన్నచ కీర్తయేత్
నతన్నైవేద్య మశ్నుయాచ్చివ భక్తో దృఢవ్రతః'95

దృఢవ్రతుడైన వీరశైవుడు పరమేశ్వరుని తప్ప ఇతర దైవములను పూజించరాదు; స్మరించరాదు; కీర్తించరాదు ఇతర దైవమునకు నివేదించిన వస్తువులను భుజించరాదు.

సోమన్న దృఢభక్తితో భగవంతు నే రూపమున భావన చేసి నమస్కరించెనో, ప్రసన్నుడైన పరమేశ్వరు డా రూపముననే అతనికి ప్రత్యక్షమయ్యెను.

## దాస్య ముగ్ధభక్తి

అనుక్షణము ఆ పరమేశ్వరునికి సేవలు చేసి తరించవలెనని తపనతో భగవత్సేవనలో ప్రపంచమే మరచి పరమానందము ననుభవించుటయే దాస్య భక్తి.

భగవంతునకు తెరపిలేక దాస్యము చేయు భక్తులు కలరు. కాని భగవంతుడు భక్తులను సేవించిన విధము బసవపురాణమునందు కాననగును.

వీరమహేశ్వర భక్తి పరాయణుడు వినిశ్చలాత్మకుడు బాణుడను శివభక్తుడు 'లింగమూర్తికి సాంగముగను వేయుమారులు నిత్యవిధి నేమముగను బాయక పూజలు సేయుచుండ' దేహధర్మములకు తెరపిలేకున్నదని ఎరిగిన

పరమేశ్వరుడు బాహుసహస్రంబతనికిచ్చెనట. ఆ వింతను వినిన పురజనులు సందర్శనాసక్తి చనుదెంచుచుండగా లింగాపసరము చెల్లించి ప్రసాదము భుజించు నంతవరకు పరమేశ్వరుడే బాణుని వాకిట కాపువాడై యతనిని సేవించుట అనితర సాధ్యమైన బాణుని ముగ్ధభక్తివలననే కలిగినది. పిట్టవ్వ భక్తికి మెచ్చి శివుడు వెట్టికి పోవుటయు నిట్టిది.

భగవంతుడు భక్తసులభుడు, భక్తలోలుడు. భక్త పరాధీనుడు. వాల్మీకే శుడే ఒడయంబితో పలికిన పలుకులీ విషయమును స్పష్టము చేయుచున్నది.

'భక్తైకదేహుండ భక్తవత్సలుఁడ
భక్త సత్ప్రాణుండ భక్తాశ్రితుండ
భక్తపరాధీనయుక్తుండ నటు
భక్తికేఁగూర్చుట ప్రఖ్యాతిగాదె' — బ.పు.పు. 132

భక్తవత్సలుడు కాన భగవంతుడు భక్తుడైన ఒడయనంబి కోరిన పను లెల్ల చేసెను. కాని, యుక్తాయుక్త విచక్షలేని ఒడయనంబి భగవంతునితో చేయరాని పనులనే చేయించెను. అవివేకియైన ఒడయనంబి పరమేశ్వరుని వేశ్య యింటికి రాయబారమునకు పంపెను. అది విని కలికామదేవుడు మండి పడెను.

'అక్కటా! స్వామి దివ్యాంఘ్రికంజంబు
లొక్కింతయును గందునో యనకిట్లు
పంచిన మర్మమేలంబున నొడయ
నంబియన్వాఁడు భయంబింతలేక
వెడపనుల్వంపఁగ వేశ్యయింటికిని
నెడయును బుచ్చంగ నిట్లెటింగియును
వారక యత్తిరువాలూర భక్తు
లూరక చూచుచున్నారుగాని
తారొండె శివుఁబంపఁదగదన్న వారు
గారొండె నంబికి వేఁటొక్కఁభృత్యుఁ
బనిపాటుసేయ నేర్పడ నియమింప
రననేలవేయును'-బ.పు పు. 133.

భగవంతునకు దాస్యము చేయుటలో నమితానందము పొందు భక్తులు భగవంతుడు మరొక భక్తునకైన ఊడిగము చేయుట భరించలేరు.

## సఖ్య ముగ్ధ భక్తి

సాకార బ్రహ్మమును పుత్రమిత్రాదులుగా భావించి రమించుటే ముగ్ధ భక్తుల ముఖ్య లక్షణము. భక్తులు భగవంతుని కారగింపు చేయుట ఔపచారికమే యైనను గొడగూచి ఋజుభక్తి కనరాని కైలాసవాసుని కనులవిందుగ దర్శనము పొందుటయె కాక కుంచెడుపాలు కడకంతు డారగించునట్లు చేసినది. తల్లిదండ్రులు మనసార నమ్మిన లింగమూర్తిని కనులారగాంచి చేతులారంగ నర్చించి పాలారగింపుచేసి తద్విషయము నమ్మని తండ్రి తనను చంపబోగా తాను నమ్మిన శుభకరుని ఆశ్రయము పొంది తరించిన ధన్యచరిత గొడగూచి సాత్త్విక నిష్కామ సఖ్య భక్తి శాఖలోని క్రొత్త చిగురు.

గొడగూచి తల్లిదండ్రులు పొరుగూరి కేగుచు నిత్యము కుంచెడు పాలు బడయున కారగింపు చేయుమని పూనిన వ్రతమునకు భంగము కలుగ నివ్వకుము అని కోరిరి. వారు కోరినట్లే గొడగూచి కుంచెతో పాలుకొనిపోయి శివాగారమున జొచ్చి 'ఆరగింపవే దేవ' అని వేడినది. పాలారగించుటకు పరమేశ్వరుడు రాకపోవుటతో తల్లడిల్లిపోయినదా అమాయక హృదయము. ఆమె మనసులో ఉవ్వెత్తుగ లేచిన సందేహ పరంపరలను ప్రశ్నల రూపమున కురిపించినది. ఫాలాక్షుడు పాలారగించుటకు రాలేదన్న ఆవేదనతో ఒక స్నేహితుని మందలించినట్లు పలికిన గొడగూచి పలుకులు సఖ్యభక్తికి ఉదాహరణములు కాగలవు.

'కుడుపున కియ్యెడ గుడగుడలేల
కుడి కేఁడు దెత్తు నా గుజ్జు నోగిరము
మూలపన్నారుల యాలోవిలోనఁ
బోలెలున్నవి పంపు వోయి తెచ్చెదను
ఉట్టిపై బానలో నున్నది నెయ్యి
యిట్టున్నఁ దెచ్చెద నిష్టమె తెచ్చెదను
కుండెఁడున్నది వోయి కొనివత్తుఁ బుల్ల
కండంబు వలెనేని గ్రక్కునఁ జెపుమ
అచ్చనయెల్లి మాయయ గారినగరఁ
తెచ్చెరఁ బిల్వావచ్చెద నారగింపు
మా శివసోదరి మఠమునఁ గలదు
పాసెంబు దెచ్చెదఁ బాలుమున్నాఱివు'-బ. పు. పు. 71.

ఆ మారారికి లంచమిత్తునని ఆశ చూపినది. తనవలెనే గుజ్జనోగిరము నకు, పాయసమునకు, పోలెలకు పతితపావనుడు పరుగులు పెట్టుచు వచ్చునన్న అపోహతో ఆశ చూపినది. చిత్రమైన స్నేహ వాత్సల్యములను చిన్నారి పాప తన మాటలలో వ్యక్తము చేసినది.

'పాప యీశ్వరునకుఁ బలుమారు మ్రొక్కుఁ
గోపించు భంగించుఁ గుప్పించు నఱచుఁ
గటకట వాపోవుఁ గరములు విఱుచుఁ
దటతట నేలతోఁ దాఁకిఁచుఁగాళ్ళు
ధారుణిఁ బడి బయల్దన్నుచు నేడ్చుఁ
గోర దిక్కును జూచు మారారిఁ జూచు
బుజ్జగించును వెడ్లుబుడ్లను బెట్టు
నిర్జివిక్రియఁ బడు నివ్వెఱఁ గందు'-బ. పు. పు. 71.

తనకన్న చిన్నారి పాపలను బుజ్జగించినట్లు బుజ్జగించినది. కోపముతో చేతులు విరిచినది. చివరకు తలబాదుకొని చనిపోవుటకు సిద్ధమయ్యెను. ఆమె ముగ్ధభక్తికి మెచ్చి పశుపతి హసితాస్యుడై వచ్చి పాలారగించెను. వచ్చుటకు ఆలస్యము చేసెనని మరల బాలేందుధరునిపట్ల పాప కోపించుట గమనించ దగినది.

'నన్నింతయేఁచితి పిన్నగాఁ జేసి
మిన్నకపోదు మాయన్నకుఁ జెప్పి
మఱికదాయున్నది మాటలింకేల
కఱకంఠ! యింతయు మఱవకు' మనుచు (బ. పు. పు. 72)

చిలిపితనముతో చిన్నారి పాపల నుడికించుట కొందరికి పరిపాటి. చంద్ర శేఖరుడు సహితము చిన్నదానినిగా చేసి తన నేడిపించెనని తండ్రితో చెప్పి శివుని శిక్షింపజేయుదునని ఉత్క్రోషముతో పలికినది. అజసురేంద్రాదుల కలవికాని దివ్యమంగళరూపము కనులార గాంచుట తన పూర్వ జన్మఫలమని యెఱుగని బాల క్షితిదుర్లభమైన పరమేశ్వర సాక్షాత్కారమునకు ప్రాముఖ్య మీయక రోషముతో గిత్తకుడక నిమ్మ అని పుచ్చుకొనియెను. తిరిగి వచ్చిన తండ్రి

నమ్మక తనముందు పతితపావనుడు వచ్చి పాలారగించెనేని నమ్ముదుననెను. కాని అనాడు గొడగూచి యెంత ప్రాధేయపడినను చంద్రశేఖరుడు రాక పోవుటతో తండ్రి చంపబోగా గొడగూచి శివునివేడి యతని యనుగ్రహమున దివ్యలింగాంగము తనకొరకే తెరచుకొనగా నందుచేరి శివైక్యమయ్యెను. స్నేహ ప్రధానమైన ముగ్ధభక్తిలో సఖ్యభక్తి యను శాఖకు గొడగూచి కథ చక్కని యుదాహరణము.

## ఆత్మనివేదన ముగ్ధభక్తి

భాగవతము నందలి నవవిధ భక్తులలో ఆత్మనివేదనము కడపటి దైనను అన్నింటిలో శ్రేష్ఠమైనది. అట్లే శైవమునందు పేర్కొనబడిన నవవిధ భక్తులలో కూడ ఆత్మనివేదనము ఉత్తమమైనది. ఆత్మనివేదనము అను సమాసమునకు రెండు మూడు విధములుగా అన్వయము చెప్పుకొనవచ్చును.

1. తనను తాను నివేదించుట. ఇది శారీరకమైనది కూడ కావచ్చును. మహేశ్వరుని సేవలో శరీరము పూజా కుసుమముగా సమర్పించుట లేదా శరీర భాగములను మహేశ్వరుని కొరకై సమర్పించుట. యీ విధమైన ఆత్మనివేద నమునకు సంబంధించినది.

2. భక్తుడు తన హృదయమును నివేదించెడి భక్తి ప్రతిపత్తిని కూడ ఆత్మనివేదనమని పేర్కొన వచ్చును. అన్యదేవతలకు సంబంధించిన విక్షేప ములు మాని అనన్యచింతతో ఈశ్వరునే భావించుచు అతనియందే చిత్తము లయింపజేసి దృఢభక్తిని పచరించుట ఆత్మనివేదనము.

మొదటి విధము భౌతికము కాగా రెండవ విధము భావ సంబంధమైనది.

3 ఆత్మయే బ్రహ్మమని భావించి యీ రెండింటికి భేదము లేదను జ్ఞానము అనుభవమున సాధించుట కూడ ఆత్మనివేదనమగును. ఇది బ్రహ్మ జ్ఞానులకు గాని సాధ్యము కాదు.

ఆత్మనివేదనమునే ఆత్మార్పణయనియు చెప్పుట కలదు. అందును పై మూడు భేదములు వివేచించుటకు వీలు కలదు. శరణాగత భావము వలన పై మూడు విధములైన ఆత్మ నివేదనము సాధ్యమగును. వీరశైవమునందును ఐక్య

స్థలమను భక్తావస్థ కలదు. శివానంద రూపుడైన పరమేశ్వర స్వరూపవే అని అనుభవమును పొందుట ఐక్యస్థల మనబడుచున్నది.

'విషయానంద కణికానిః స్పృహేనిర్మలాశయః
శివానంద మహాసింధౌ మజ్జనాదైక్యముచ్యతే॥'96

అత్యల్పములైన విషయానందులనెడి నీటితుంపురులయందు ఆ వాడై శివానందమనెడి మహాసముద్రమునందు మునుగుటయే ఐక్యమన అనగా శరణుడు తన జీవునియొక్క అస్తిత్వమును పరమేశ్వరునికం ముగా భావింపకుండుటయే ఐక్యమని చెప్పబడుచున్నది. దానినే అద్వై యనియు పేర్కొనుట కలదు.

'అద్వైత భావభావనా జాతం క్షణమాత్రేఽపి యత్సుఖమ్
తత్సుఖం కోటి వర్షైస్తు ప్రాప్యతే నేవభోగిభిః'97

యోగి పుంగవులచే ననుభవింపబడు అద్వైత భావనాజాతమైన దము క్షణమాత్రమైనను ఉత్తమమైనది. భోగపరాయణులకది కోటి స ములకైనను లభించదు.

ఈ యంశముల వలన అద్వైతానందసిద్ధిని సమకూర్చెడి అ నము శివశరణులైన భక్తుల కసాధ్యము. ఎవరు తాము శివునికంటె భి కాము అని తలంతురో వారు అట్టి భక్తికి ఉదాహరణ ప్రాయులు. నిట్టివారుండుట సహజము. ముగ్ధభక్తులయ్యు అట్టి స్థితిని పొంది కలరు. కాని అరుదు. ముగ్ధభక్తులలో పైన పేర్కొనబడిన రెండు తె విశేషముగా కానవత్తురు. ఇందులో మొదటివారు భగవంతుడైన శివుని భౌతికమైన శరీరము కలదనియు, అతని శరీరము తమ శరీరము ననియు, అతనికి వలసినచో తమ శరీర భాగములను అర్పించవచ్చు తలంచెడి కన్నప్పవంటివారు కానవచ్చుచుందురు. వలసినచో ప్రా రూపముగా శరీరమునే ఆత్మార్పణ భావముగా అజునకు సమర్పింపగ కూడ కలరు. ఈ ఆత్మ నివేదనము భౌతికమయ్యును ముగ్ధ భక్తి పరిపూతమై ఆత్మనివేదనమని గౌరవింపదగినది. ఇక రెండవ భావగతమైనది.

ఏకాంత రామయ్య, తెలుగు జొమ్మయ్య వంటి భక్తులు పర సాలోక్య, సామీప్యము, సాహచర్యము, సామీప్యము, సారూప్యము

నవి సమాహిత భక్తియోగమున భావించి తమ అంతః ప్రవృత్తిని ఆత్మ నివేదనముగా పరమేశ్వరునకు సమర్పించిన భక్తులు. వీరి జీవితములందు కాన వచ్చెడి సామీప్య సారూప్యాద్యనుభవావస్థలు ఆత్మ నివేదరూప భక్తి భేదము నకు సంబంధించినవని నిస్సంశయముగా చెప్పవచ్చును.

బసవ పురాణమునందలి భక్తులలో ఆత్మ నివేదన భక్తిప్రవృత్తులను ప్రతిఫలింపచేసికొనిన ఘట్టములను సంగ్రహముగా సమీక్షించినచో ఈ యంశము స్పష్టము కాగలదు.

భగవంతుని సేవలో తమ తనువులను పూజా పుష్పములుగా సర్పించిన వారు బసవ పురాణము నందలి ముగ్ధభక్తులలో పలువురు కలరు. ఉడుమూరి కన్నప్ప, నాట్య నమిత్తాండి, ఎఱుమూర్తి నయనారు మొదలగువారు ఈ కోవకు చెందినవారు.

ముక్కంటి కన్నీటిని ఆపుటకు తన నేత్రకమలము సర్పించి భగవదను గ్రహము పడసిన ముగ్ధభక్తుడు ఉడుమూరి కన్నప్ప. ఆ పరాత్పరుడు 'వరమిత్తు నడుగుము వాంఛితార్థమ్ము'లన మందస్మిత వదనారవిందుడై కన్నప్ప-

'ఎఱుఁగ మోక్షముల పేరెఱుఁగ వాంఛితము
లెఱుఁగవేఁడెడు మార్గ మెఱుఁగ
ఎఱుఁగుదు నెఱుఁగుదు నెఱుఁగుదు మఱియు
మఱియును మఱియు ముమ్మాటికి నిన్న
కావునఁ గోరిక కడమయుఁ గలదె?
దేవ! మూలస్తంభ దివ్యలింగాంగ!
నీ యతులిత దయాన్వితదృష్టి యిట్లు
నాయందు నాఁటి కొనలు వసరింప
నాదగు సంస్పృహోపాదిత దృష్టి
నీ దృష్టిలోనన నెక్కొనిపొదలఁ
గరుణింపు దక్కిన వరములేనొల్లఁ
పరమాత్మ!' (బ. స. పు. పు. 88)

అని విన్నవించుకొనెను. మోక్షముల పేరుగాని, వేడెడు మార్గముగాని ఎఱుగని కన్నప్ప ఎరిగినది పరమాత్మునకు తనను తాను నివేదించుకొనుటయే.

నాట్య నమిత్తాండి యను భక్తుడు శ్రీ యేకామ్రనాథుని గుడికేగి మూర్తిని అత్యద్భుతాకారుని గని ఈశ్వరుని నడుమటు పీగియున్నది దెసకు', 'మలహరు శిరమును నిలువక యొక్క వలసిక యంతయ యున్నది,' 'కెంజెడ ముడి పీడినదియు' కడు చోద్యమయ్యెనని నడిగెను. ఆ శివబ్రాహ్మణుడు నవ్వి అది వాయుదోషమని, వారి కాయజహరునకు కడు ప్రమాదమని పలికెను. నాట్యనమిత్తాండి తన నంతయు పూజారి కిచ్చి మారారి రోగము మాన్పుటకు తైలము హరుని మూర్తికి మర్దన చేసి ఎన్ని దినములకు గుణము కనిపించక మిక్కిలి ఆవేదనచెంది ప్రాణత్యాగము చేయబోయెను. నాట్యలోలుం నమిత్తాండి ముగ్ధభక్తికి మెచ్చి ప్రత్యక్షమై కరుణించెను. మారారి వంకరలు పోయినదని గీర్వాణవంద్యున కే ప్రమాదము వాటిల్ల భయభ్రాంతుడై పూజారితో 'మారారిరోగంబు మాన్చితేనియును నా నేను నా సుతుల్నీకు' - దాసులమయ్యెద మని ఆసక్తితో పలికి నీవింత వట్టుపుణ్యంబు గట్టుకోవే' అని సర్వసంపద లతనికి సమర్పిం లాడి యత డిచ్చిన తైలముతో మృడుని శరీరము చక్కబడక తనను తానే అర్పించుకొనుటకు నాట్యనమిత్తాండి సిద్ధపడెను. అ కిదొక చక్కని యుదాహరణము.

భగవంతుని త్రికాల చందనమునకు ధనమంతయు సమసిపో శరీరమునే సానగదియించి దిగిచి శ్రీగంధము వడసి శివున కర్పిం మూర్తి నైనారువంటి ముగ్ధభక్తులు బసవ పురాణమునందు పలువురు దనము చేసికొన్నవారు కలరు.

శరీరమును శరీర భాగముల నర్పించి ఆత్మ నివేదనము భక్తులు కొందరు. శరీరస్పృహలేక భావనలో భగవంతు నర్పించిన మ కొందరు బసవపురాణమున ప్రసిద్ధముగా గలరు. అతిశయ వీరభద్ర దసి పేరుబడసిన ఏకాంత రామయ్య నిరంతరము శివపూజానంతరమ కోరికతో-

'ప్రమథ లోకమున కుద్యమలీల నరిగి
విమలాత్మ వీరక వీరభద్రాద
గణ నికాయములకు బ్రణమిలి వారి

గుణకీర్తనలు సేసి కోర్కిదైవాఱ
శివభక్తి తత్త్వానుభవసదేకాంత
సవిశేష సుఖ ధౌశరథి నోలాడి
యెప్పటియట్టిలకెలమినేతెంచి
ముప్పూఁట నిమ్మార్గమున-' (బ.పు.పు. 170.)

చరించెడివాడు. ఏకాంత రామయ్య నిర్మల నిశ్చలభక్తి కనరాని కైలాస వాసుని కనులారా గాంచి జన్మ ధన్యమగునట్లు చేయుటయేకాక పరమేశ్వరునితో తన సందేహములనే నివృత్తి చేసికొనగలిగెను.

ప్రమథలోకమున బసవడు కలడను విషయము ధ్రువపరచుకొనుటకు సిద్ధరామయ్య కైలాసమున కరుగుటయు నిట్టిదే.

"ప్రవిమల గతి నేఁడు ప్రమథలోకమున
నరసివచ్చెద నంచు నాక్షణంబునను
నరిగి కైలాసనగాగ్రహర్మ్యమున' (బ.పు.ప్ర. 48)

ప్రమథగణములు సకల దేవతలు కొలుచుచుండ తుంబుర నారదాదులు సుగీతామృతమును కురిపించుచుండ అంబికాసహితుడై ఆస్థానమంటపమున నిండు పేరోలగంబున నున్న పార్వతీ పతినిగాంచి సందేహ నివృత్తి చేసికోని తిరిగి వచ్చినట్లు కలదు.

అనన్యచింతతో ఈశ్వరునే ధ్యానించుచు అతనియందే చిత్తమును లయింపజేసిన ధ్రుఢభక్తివలన సిద్ధరామయ్య యట్టిస్థితిని పొందగలిగెను.

భగవంతుని భౌతికరూపమున కత్యంత ప్రాధాన్యము నిచ్చి ఆత్మ నివేదనము చేసికొనినవారు కొందరు. భావమున కత్యంత ప్రాధాన్యము నిచ్చిన వారు కొందరు. బ్రహ్మజ్ఞానులు రెండింటికిని భేదము పాటించరు.

శివుడు నందికేశ్వరుని మర్త్యలోకమున బసవేశ్వరుడుగా జన్మించుమని పంపు ఘట్టమునందు కేల్మోడిచి నందీశ్వరుడు.

తా విన్నపము చేసె దేవదేవునకు
మీ యాజ్ఞఁదలమోచి మెయికొని పనులు
సేయుదు నన్నింత సెప్పంగనేల?
మర్త్యలోకమునకు మఱి వేఱెయొకఁడు

గర్తయున్నాఁడె లోకత్రయ వరద!
ఇందున్న నేమి? నాకందున్న నేమి?
యెందున్న నేమి? నీయంద నా యునికి' (బ పు. ప్ర. 12, 13.)

ఏ లోకమున నున్న, ఏమి పని చేయుచున్న భగవంతునియందే తన యునికి యని భావించిన నందీశ్వరుడు జ్ఞాని. ఇట్టి ఆత్మనివేదనము ఉత్తమోత్తమమైనది.

సర్వవిధ ఉత్సాహముచేత పోషింపబడుచున్న భగవద్రతి త్రిగుణాత్మకముగా విశ్లేషించుట కవకాశము కలదు. ఉత్సాహదీప్తమైన భక్తితో భగవంతుని నుండి కృపను, వరాలను, శక్తులను సాధించెడి ప్రవృత్తి వీరభక్తి.

భక్తివీరమునకు మూలము మౌగ్ధ్యము. ముగ్ధభక్తి వీరభక్తిగ కూడ రూపొందుచున్నది. ఉత్సాహము స్థాయియైన భక్తివీరమునందు వారివారి ప్రవృత్తులనుబట్టి భక్తులను సాత్త్వికోత్సాహ పూరితులుగను, రాజసోత్సాహ పూరితులుగను, తామసోత్సాహ పూరితులుగను చెప్పుటకు వీలగుచున్నది. ఉత్సాహమురకలు వేయు భక్తికి శక్తి మౌగ్ధ్యము.

సాత్త్వికోత్సాహమునందు అమాయకత్వము, మౌగ్ధ్యము సామాన్య లక్షణములు. నిరహంకారము, హింసారాహిత్యము, నిర్మలభావము, మృదు స్వభావము, భూతదయ, పూనిన వ్రతము నెట్టి పరిస్థితులలో వదలని పట్టుదల, శివప్రీతి, సేవాభావము, మృదుభాషణ, నిర్మలప్రవృత్తి సహజ లక్షణములు.

బసవపురాణమునందు సాత్త్వికోత్సాహమును ప్రదర్శించిన భక్తులనేకులు కలరు. కళియంబ నైనారు. అడిభక్తు వీణాదినాథుడు, చేది వల్లభుడు, ఇరువ దాండారి, దంగళి మారయ్య, కుమ్మర గుండయ్య, పూసల నయనారు, మోళిగ మారయ్య, తేడర దాసయ్య, తెలుగు జొమ్మయ్య, ఏలేశ్వరు కేతయ్య వంటి సాత్త్విక భక్తులు పలువురు కలరు.

నిర్మలుడు, నిరాడంబరుడు, నిరహంకారి, అమాయకుడు, అనునిత్యము శివభక్తులను సేవించుటయం దత్యంతానురక్తుడగు కళియంబ నైనారు శివ భక్తులను సర్వించుటే నియమముగా కలవాడు. భక్తులను 'సర్వించుచు నవిరళ భక్తి జనిత సుఖామృతవనధిఁ దేలుచు' నుండెడి సాత్త్వికోత్సాహ భక్తి సంపన్నుడుగా కళియంబ నైనారు బసవపురాణమునందు వర్ణింపబడినాడు.

పూనిన వ్రతము నెట్టి పరిస్థితులలో వదలని పట్టుదల కల అదిభర్తు శివ ప్రీతికై సర్వము నర్పించువాడు. అదిభర్తు ప్రతిదినము చేపలు పట్టుటకు పోవు నపుడు వలలో పడిన మొదటి చేపను 'శివప్రీతి' యని విడిచెడి నియమము కలవాడు. తన కాయిక లబ్ధితో జంగమారాధనలు నిత్యము సలుపు శివభక్తి తత్పరుడు. ఒకనాడు వలలో తొలుత పడిన బంగారు చేపను 'శివప్రీతి' యని వదలివేసి తిరిగి వల వేయగా మరల మరల నదియే వలలో చిక్కుకొనెను. 'ఆత్మేశునకుఁ బ్రియంబన్న మత్స్యంబు - నాత్మార్థమై కొను టనుచితం'బని రాత్రి యింటికి పోయి మరునాడు ఆ యేటికి పోక తూర్పు దీర్ఘికను వలయెత్తి వేయగా తొలినాటి మీనమే వలలో చిక్కెను. ఆ చేప తనను వదలకుండుట చూచి చిరునవ్వు నవ్వి యీశ్వరు మీన మరుదెంచిన వల చేతబట్టుకొనసని, అదియే వ్రతమని తలచి వల వేసెను. వలలో వరదయామతి ఉమాపతి యేతెంచి అదిభర్తు భక్తికి మెచ్చి ప్రమథేంద్ర పదవినిచ్చి అనుగ్రహించెను.

అకుంఠిత నిర్మల నిశ్చల భక్తి తత్పరుడైన ఏణాదినాథుడు భూతి రుద్రాక్షధారణులను తన ప్రాణలింగముగా భావించి విశ్వసించు చుండెడివాడు. యుద్ధ భూమిలో శత్రువులు భూతి రుద్రధారణులగుట చూచి కరవాలము విడిచి జాగిలపడి మ్రొక్కెను. శత్రువుల కరవాలము అతని కంఠమున పూలమాలగా మారినది. అక్షరుం డపుడు ప్రత్యక్షమై ఏణాధినాథు ననుగ్రహించెను.

'విశుద్ధేషు విరక్తేషు వివేకి మహాత్మసు
శివస్తిష్ఠతి సర్వాత్మా శివలాంఛన ధారిషు'98

విశుద్ధులు, వైరాగ్యసంపన్నులును, మహాత్ములునైన విభూతి రుద్రాక్షాది శివలాంఛనధారు లందు సర్వాత్ముడైన పరమేశ్వరుడుండును, అను విషయమును నమ్మి ఎట్టి సంశయము లేక శివ లాంఛన ధారిని కనగానే మిత్రుడా, శత్రువా అను విషయము కూడ గుర్తుతెచ్చుకొనక సాక్షాత్ శివుని చూచినంత సంభ్రమపడి సాగిలబడి మ్రొక్కి ఈశుని మెప్పించెను.

బసవ పురాణము ననుసరించి ముగ్ధభక్తిని నిరూపించిన ఈ అధ్యాయము నందు ఫలితాంశములుగా నీ క్రిందివానిని పేర్కొనవచ్చును : భగవద్రతి స్థాయిభావముగా రసస్థితి నొందెడి భక్తిరసము మౌలికముగా నొక్కటియే. భగవద్రతిని వ్యక్తము చేయుటలో ముఖ్యముగా కానవచ్చు రెండు ప్రవృత్తుల నాశ్రయించి మధుర భక్తి యనియు, ముగ్ధ భక్తి యనియు భక్తిరసమునే

భావించుట యగుచున్నది. అలౌకికముగా శృంగారస్పర్శను సంపదించుకొని ఆధ్యాత్మికముగా ననుభవమునకు వచ్చెడి భగవద్రతి రూపమైన భక్తియే మధురభక్తి. అలౌకికమైన వీరరౌద్రాదులను సంపదించుకొని ముగ్ధప్రవృత్తితో భగవద్రతిని భజించునది ముగ్ధభక్తి. ఒక విధముగా భగవద్రతికి మధురత్వము, ముగ్ధత్వము, పార్శ్వద్వయము వంటిది. తత్వతః ఈ రెండును భక్తి శబ్దవాచ్యములే. వైష్ణవ, శైవమత సంప్రదాయములలో పుష్టిపెరిగిన ప్రవృత్తులగుటచే వానియందా రూపభేదములు భాసించుచున్నవి. ముగ్ధభక్తి విశ్వరూపముగా మన తెలుగు సాహిత్యమున బసవ పురాణము ప్రత్యక్షమగుచున్నది. పాల్కురికి సోమనాథ కవి సహజముగా మహాభక్తుడగుటచే ఆ పురాణములందలి పాత్రల చిత్తవృత్తులలో భక్తి ఉత్కంఠావస్థను భజించి రసానుభవము నందించుచున్నది. తత్పురాణ కథాహారమున సూత్రముగా శోభిల్లు ముగ్ధభక్తిని వివేచించుటయే ఈ అధ్యాయ తాత్పర్యము.

# మలి పలుకులు

భక్తియొక్క రసస్థితిని నిస్సంశయముగా ప్రతిపాదించిన ఆంధ్రరచనలలో మొట్టమొదటి వరుసలో పేర్కొనదగినవి పోతన భాగవతము, సోమన బసవపురాణము. సాధారణముగా రసప్రసక్తి చేయునెడ కావ్యములు పేర్కొనుట సహజము. కాని పైరెండు గ్రంథములు పురాణములు. పురాణములలో రసచర్చయేమి? అను ప్రశ్న రావచ్చును. ఒక్కొక్క సాహిత్య ప్రక్రియకు ఒక్కొక్క ముఖ్య స్వభావముండుట ప్రసిద్ధమే. కావ్యమునందు నాయకునాశ్రయించి స్థాయి భావము పోషింపబడుచుండును కావున నాయకాశ్రితమైన స్థాయిని నిరూపించి రసము నిర్దేశింపవచ్చును. పురాణము కావ్యముకంటె భిన్నమైనది. ఇందులో అనేకములైన కథలు, ఆఖ్యానములు, ఉపాఖ్యానములు, ఇతిహాసములు, శాస్త్ర విషయములు కలసిమెలసి యుండును. వానిలో పురాణస్వభావములను బట్టి ఒక ఏకవాక్యత గోచరించును. అనగా కొన్ని పురాణములు జ్ఞాన ప్రధానములు, కొన్ని కర్మ ప్రధానములు, కొన్ని భక్తి ప్రధానములు. భక్తి ప్రధానములలో అవతార పురుషులకును, ఆచార్యులకును, క్షేత్ర మాహాత్మ్యములకును, వ్రతాదులకును, భక్తి మహిమలకును, ప్రాముఖ్యముండును. తెలుగులో వెలసిన పురాణములలో భక్తి ప్రధానములని చెప్పదగినవి భాగవతము, బసవపురాణము. కాలక్రమముగా నెన్నినచో బసవపురాణము ముందు, భాగవతము తరువాత వెలువడినవి. కాని పోతన భాగవతమునకు మూలమైన శ్రీ మద్భాగవతము బసవపురాణముకంటె ప్రాచీనమైనది. లాక్షణికుల దృష్టికెక్కిన మధురభక్తిని మొదట పరిశీలనమున కెన్నుకొనుటచేత ఈ సిద్ధాంత వ్యాసమునందు భాగవతమును మొదట గ్రహించుటయైనది. ఆపై బసవపురాణము ననుశీలించుటయైనది. ఇందు చారిత్రక దృష్టికంటె రసానుశీలన దృష్టియే ముఖ్యమని మనవి.

వైష్ణవమునందు ప్రచురముగానున్న పంచవిధ ముక్తులకు సంబంధించిన ఆధ్యాత్మిక ప్రస్థానము పురాణ భక్తుల కథల రూపమున రసోదంచితముగా వ్యక్తీకరింపబడుటచే వైష్ణవ సాహిత్యమునందును, భాగవతమునందును, మధుర

భక్తికి ఒక వ్యాప్తియు, ప్రయోగ ప్రతిపత్తియు నేర్పడినవి. గోపికా శ్రీకృష్ణుల మధురభక్తియు, రాధాకృష్ణుల మధురభక్తియు, ఆళ్వారుల ఆధ్యాత్మిక భక్తియు, వైష్ణవ భక్తి సాహిత్యమునకు తరుగని సంపదలుగా నేర్పడినవి. ఈ వాఙ్మయ శాఖలన్నింటిలో భాగవతపురాణము శిరోమణి. భక్తిని నిరూపింపదలచుకొనిన భాగవతమునందలి మధురభక్తిని, అందలి కథలయందు పోషింపబడిన ఏకవాక్యతను ఆలంబనముగా చేసికొని నిరూపించుటయైనది.

ఇట్లే విష్ణుభక్తిని ప్రతిపాదించు కావ్యములందు కాని ప్రబంధములందు కాని నాటకములందు కాని తదితర ప్రక్రియలందుకాని మధురభక్తి నిరూపణము చేయుటకు యత్నింపవచ్చును. ప్రక్రియలను బట్టి అనుశీలన విధానము కూడ మారుచుండును. అట్లగుటచే ఆంధ్ర సాహిత్యమునందు వివిధ ప్రక్రియలలో వెలువడిన భక్తిరస రచనలయందు కల మధుర భక్తిని వివేచించుట ఒక ప్రత్యేకమైన పరిశోధనయే కాగలదు. అందువలన ఈ సిద్ధాంత వ్యాసమునందు ఆ ప్రయత్నమును చేపట్టుట జరుగలేదు.

తెలుగులో రాధామాధవ కావ్యములు కొన్ని కలవు. వానియందు మధుర భక్తికంటె శృంగారమే మిక్కుటముగా పోషించుటయైనది. ఎడనెడ భక్తి భావములున్నను శృంగారమున కంగములే కాని భక్తి నంగిగా నంగీకరించునవి కావు.

ఆముక్తమాల్యదవంటి ప్రబంధములలో గోదాదేవి విరహమునందు మధురభక్తి ఛాయలు కలవని విమర్శకులు పేర్కొని యున్నారు. మధురభక్తి పోషణము ఆంధ్ర ప్రబంధములలో కంటె పదసాహిత్యమునందు కొంత వైశిష్ట్యమును సంతరించుకొన్నది. తాళ్ళపాకవారి సంకీర్తన సాహిత్యము నందును, వచన సాహిత్యమునందును, త్యాగయ్య క్షేత్రయ్య మొదలైన పద కర్తల సాహిత్యమునందును మధురభక్తి ననుశీలించుటకు వీలున్నది. ఆధునికి యుగమునందు శతకములలో మార్మిక కవిత్వశాఖలో మధురభక్తి ఛాయలు మనకు కనబడుచున్నవి. వాని నన్నింటిని ఆ ప్రక్రియలయొక్క స్వభావమును దృష్టియందుంచుకొని భాగవతానుశీలమునందు అనుసరించిన మధురభక్తి వివేచనములను అనువర్తింప చేయవచ్చును.

మధురభక్తి రసానుశీలనము ననుసరించి ముగ్ధభక్తిని వివేచించుటకు కూడ ఒక అనుశీలన పద్ధతిని యీ సిద్ధాంత వ్యాసమునం దేర్పరచుటయైనది.

